# NAA JEEVITHA KATHA

Telugu

**Jalagam Vengala Rao**

| | | |
|---|---|---|
| Cover Design | | New Triangle Communications |
| D.T P | | Sreekari Graphics |
| Printed by | . | Kala Jyoti Process Ltd |
| Copies | . | 1,000 |
| Price | : | Rs. 250.00 |
| Publishers | | V.J. Financial Services Pvt. Ltd., 1-8-165, Ushakiran, Sarojini Devi Road, Secunderabad - 500 003. |
| For Copies | | V.J. Financial Services Pvt. Ltd., 1-8-165, Ushakiran, Sarojini Devi Road, Secunderabad - 500 003. |

# సంకల్పం

నేను రాజకీయాల నుంచి దూరంగా వుంటూ ప్రశాంత జీవితం గడపాలని 1991 మే నెలలో నిర్ణయం తీసుకున్నాను

నేను ముఖ్యమంత్రిగా వున్నప్పుడూ, తరువాతా కూడా చాలామంది అధికారులు, అనేక మంది మిత్రులు, నన్ను కలిసినప్పుడు, నా రాజకీయ జీవితంలోనూ, ఆయా పదవులు నిర్వహించినప్పుడూ జరిగిన ముఖ్య సంఘటనలూ, అనుభవాలూ, జ్ఞాపకాలూ కలిపి ఒక జీవిత చరిత్రలాంటిది వ్రాస్తే బాగుంటుందని చెబుతూ వుండేవారు సమయం వచ్చినప్పుడు తప్పక ఆ ప్రయత్నం చేస్తానని వారికి నేను చెబుతూ వుండేవాడిని.

నా రెండవ కుమారుడు వెంకటరావు కూడా 'మీరు మీ జీవిత కథ తప్పకుండా వ్రాయాలని' చెప్పినప్పుడు 'అలాగే వ్రాస్తాను' అని చెప్పేవాడిని కాని ఆయన పట్టుదలతో, ప్రతిరోజూ సాయంకాలం ఒక గంటసేపు నేను చెబుతూ వుంటే, నా కోడలు శ్రీమతి వాణి వ్రాస్తుందని చెప్పి, కావలసిన బైండింగ్ చేసిన తెల్ల కాగితపు పుస్తకాలు అవి తీసుకునివచ్చి, పని ప్రారంభించవలసిందిగా కోరడం జరిగింది అప్పటి నుంచి ఈ పనికి ప్రతిరోజూ ప్రత్యేకంగా ఒక గంట సమయం కేటాయించడం జరిగింది

అప్పటి నుండి ప్రతిరోజూ సాయంకాలం 4 గంటల నుండి 5 గంటల వరకు శ్రీమతి వాణి పుస్తకంతో సహా వచ్చి నా ప్రక్కన ఉన్న సోఫాలో కూర్చుండేది. నేను ధారావాహికంగా చెబుతుంటే వ్రాస్తూ వుండేది. ఈ విధంగా మూడు మాసాలు నేను చెబుతూ వుంటే ఆమె వ్రాస్తూ ఇది పూర్తి చేయడం జరిగింది.

ఆ వ్రాత ప్రతులను ముద్రణకు కావలసిన విధంగా తయారు చేసే బాధ్యత సమాచార శాఖ డైరెక్టర్‌గా పనిచేసి అనుభవం వున్న శ్రీ భండారు పర్వతాలరావు గారికి, ప్రచురణకు కావలసిన మిగతా పనిని పూర్తి చేసే బాధ్యత నేను అధికారంలో వున్నప్పుడూ లేనప్పుడూ కూడా నాకు జాయింట్ కార్యదర్శిగా పని చేస్తూ వున్న శ్రీ బి.వి. యస్. ప్రకాశరావు గారికి, ప్రయివేటు కార్యదర్శిగా పనిచేస్తూ వుండిన శ్రీ యస్.యస్.మూర్తి గారలకు అప్పగించడం జరిగింది. వీరందరి సహకారంతో ఈ రచన పూర్తి కావస్తుండగానే ఆలపాటి దేవేంద్రనాథ్, కళాజ్యోతి

ప్రాసెస్ లిమిటెడ్, హైదరాబాద్ వారు ఈ పుస్తకాన్ని ప్రచురించేందుకు ముందుకు వచ్చారు న్యూ ట్రయాంగిల్ కమ్యూనికేషన్స్ వారు అందమైన ముఖచిత్రాన్ని డిజైన్ చేసి ఇచ్చారు నా స్నేహితుడు కీర్తిశేషులు కె ఎల్ ఎన్ ప్రసాద్ గారి కుమారుడు శ్రీ కానూరి జగదీష్ ప్రసాద్ ఈ పుస్తక ప్రచురణలో విశేషంగా తోడ్పడ్డారు ఈ పుస్తక రచనలో, ప్రచురణలో ఇంకా అనేక మంది తమ అమూల్య సహాయ సహకారాలనందించారు వారందరికీ నా కృతజ్ఞతలు.

**-జలగం వెంగళరావు.**

# అంకితం

భారతదేశం 1947 ఆగస్టు 15న స్వతంత్రం కాగానే జవహర్‌లాల్ నెహ్రూ నాయకత్వంలో తొలి జాతీయ మంత్రివర్గం ఏర్పడింది ఆ మంత్రివర్గంలో సర్దార్ వల్లభాయి పటేల్ ఉప ప్రధానిగా ఉండేవారు.

సర్దార్ పటేల్ ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు ఉక్కు మనిషిగా పేరొందిన పరిపాలనా దక్షుడు దేశంలో 600కు పైగా వున్న సంస్థానాలను ఒక్క నెత్తురు బొట్టు రాల్చకుండా భారత్‌లో విలీనం చేసిన ఘనత భారతదేశపు తొలి హోం మంత్రి సర్దార్ పటేల్‌దే.

వాస్తవాలను గమనించక మొండితనం చూపిన నిజాం నవాబు నిరంకుశ పాలన నుండి 'పోలీస్ చర్య'తో హైదరాబాదు సంస్థానాన్ని విముక్తి చేయడంలో కీలక పాత్ర సర్దార్‌దే అందుకాయనకు యావద్భారత దేశం - ముఖ్యంగా పూర్వ హైదరాబాదు సంస్థాన ప్రజానీకం ఎంతో ఋణపడి వుంది.

సర్దార్ పటేల్ నా అభిమాన నాయకుడు. ఆయన జీవితం నుండి నేనెంతో స్ఫూర్తిని పొందాను. చిరస్మరణీయుడైన సర్దార్ పటేల్ దివ్య స్మృతికి అందుకే నా జీవిత కథను అంకితం చేస్తున్నాను.

**జలగం వెంగళరావు**

# ఇందులో...

# నా బాల్యదశ

శ్రీకాకుళం జిల్లా రాజాం దగ్గర సోపేరులో 1922 మే 4న నేను జన్మించాను. మా తల్లిదండ్రులు కృష్ణాజిల్లాలో నివసిస్తూ వున్నప్పటికీ, మా మాతామహులు సోపేరులో వుండటం చేత మా అమ్మగారు అక్కడికి పురిటికి వెళ్లడం, నేనక్కడ జన్మించడం జరిగాయి.

మా తండ్రిగారు కృష్ణా జిల్లాలో జమీందారీ వుద్యోగం చేస్తుండే వారు. ఆ కారణంగా కృష్ణాజిల్లా కేసరపల్లిలోనే నా బాల్యదశ గడిపాను. తరువాత, గన్నవరం తాలూకా హైస్కూలులో నేను 5వ తరగతిలో ప్రవేశించి, ఎస్. ఎస్. యల్. సి. వరకు అక్కడే చదివాను. ఈకాలంలోనే నా భావిజీవితానికి మంచి పునాదులు పడ్డాయి. ఆ రోజులలో భారతదేశం రవి అస్తమించని బ్రిటీషు సామ్రాజ్యంలో భాగంగా బానిసత్వంలో మ్రగ్గుతోంది. తెల్లవారి పాలన నుండి విముక్తి పొందాలనీ, మన దేశానికి స్వాతంత్ర్యాన్ని సంపాదించాలనీ భారత జాతీయ కాంగ్రెస్ నాయకత్వంలో సుదీర్ఘ పోరాటం సాగుతోంది.

## జాతీయోద్యమం :

బ్రిటీషు సామ్రాజ్యంతో తలపడి, దేశానికి స్వాతంత్ర్యాన్ని సాధించు కోవడం నిజానికి అంత తేలికయిన పనికాదు. తెల్లదొరల అపార సైనిక శక్తిని ఎదుర్కొని సాయుధపోరాటాన్ని సాగించటం సులభం కాదు. అది అనవసర రక్తపాతానికే దారి తీస్తుంది. దానికన్న, ఆత్మబలం ద్వారా సత్యం, అహింసలు ఆయుధాలుగా, సత్యాగ్రహవిధానంలో పోరాడటం మినహా మార్గాంతరం లేదని మహాత్మాగాంధీ గ్రహించారు. శాంతియుతంగా సాగే యీ పోరాటం వల్ల, కొంత ఆలస్యం అయినా, బ్రిటీషు వారిని దేశం నుండి వెళ్లగొట్టి స్వాతంత్ర్యాన్ని సాధించాలని ఆయన లక్ష్యంగా పెట్టు కొన్నారు. మహాత్మాగాంధి నాయకత్వంలో అనేకమంది నాయకులు, లక్షలాది ప్రజలు సత్యాగ్రహ సమరంలో పాల్గొన్నారు. జైళ్లకు వెళ్లారు. లాఠీ దెబ్బలు తిన్నారు. తుపాకి గుండ్లకు గుండెలనెదురొడ్డారు. 'ఇంక్విలాబ్ జిందాబాద్' అంటూ చిరునవ్వుతో ఉరికంబాల నెక్కి ప్రాణాలను దేశంకోసం సంతోషంగా త్యాగం చేశారు. అనేకమంది న్యాయ వాదులు గాంధీజీ పిలుపు నందుకొని లక్షల రూపాయల సంపాదనను వదిలేసి కోర్టులను బహిష్కరించారు. విద్యార్థులు చదువులకు స్వస్తి చెప్పారు. జాతీయ పోరాటంలో దూకారు.

సామాన్య కార్యకర్తలు కూడ అసమాన ధైర్యసాహసాలతో అశేష త్యాగాలు చేశారు. మట్టినుంచి మహావీరులను తయారు చేసిన ఘనత మహాత్మాగాంధీ గారిదే. అప్పటి తరానికి చెందిన మా బోటివాళ్లం యిప్పటివరకూ, ఆ జాతీయోద్యమ స్ఫూర్తితో పనిచేస్తున్నామంటే, అది ఆ మహానాయకునిచలవే. నాటినుంచి నేటివరకు అనేకరకాల మార్పులు ఈ దేశంలో కలగటాన్నిచూసే అవకాశం మాకు కల్గింది.

దేశమంతా గాంధీజీ నాయకత్వంలో అలా స్వాతంత్ర్యం కోసం ప్రాణాలొడ్డి పోరాడుతూవుంటే, నిజాం నవాబులాంటి వాళ్లూ, రాజులూ, జమిందారులూ, పెద్ద ధనవంతులూ కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా పనిచేస్తూ బ్రిటీషు సామ్రాజ్య వాదులకు మద్దతునిస్తూ వచ్చారు. కాగా, మరి కొందరు యువకులు ఉడుకురక్తంతో బ్రిటీషువారికి వ్యతిరేకంగా పోరాడేందుకు ఆయుధాలను సమకూర్చుకొని విప్లవ పంథాను అనుస రించారు. చంద్రశేఖర ఆజాద్, భగత్ సింగ్, ఖుదీరాంబోస్, అరవింద ఘోష్ (వీరే తరువాత ఆధ్యాత్మిక మార్గంలోకి వెళ్లి, యోగ సాధన చేసి అరవింద యోగిగా ప్రసిద్ధులయినారు.) మొదలయిన మహావీరులు భారతమాత పాదాలముందు రక్త తర్పణం చేశారు. తెలుగు బిడ్డ 'మన్యం పులి' అల్లూరి సీతారామరాజు అటువంటి యోధుడే. ఆస్తులు జప్తయి పోయినా, సంసారాలు చెల్లాచెదరయినా, చదువులు ఆగిపోయినా, జైలు జీవితం వల్ల ఆరోగ్యాలు దెబ్బతిన్నా లక్ష్యపెట్టక, లక్షలాది కార్యకర్తలు ధృఢచిత్తంతో, పట్టుదలతో పోరాడుతూ తప్పక మనం స్వాతంత్ర్యాన్ని సంపాదించుకోగలమన్న గట్టి నమ్మకం కలిగి వుండేవారు.

## తెల్లదొరల దోపిడీ :

పరాయి పాలనవల్ల మనదేశం పొందిన నష్టం అంతా, యింతా కాదు. మన దేశ సంపద నంతా తెల్లవారు కొల్లగొట్టి ఇంగ్లాండుకు తరలించారు. ఒకప్పుడు మన గ్రామాలు కుటీర పరిశ్రమలతో కళకళలాడుతూ వుండేవి. బ్రిటీషువారు మన గ్రామీణ పరిశ్రమలను బాగా ఆలోచించి వేసుకున్న ఒక పథకం ప్రకారం నాశనం చేస్తూ వచ్చారు. ఒక దశలో భారతదేశం నుండి దిగుమతి చేసుకున్న నేత వస్త్రాలను ఇంగ్లాండులో ఎవరయినా ధరిస్తే, అది శిక్షార్హమైన నేరంగా ప్రకటించారు! ఈ పరిస్థితులలో మన గ్రామీణ ఆర్థిక వ్యవస్థను నాశనం చేసి, మన పల్లెపట్టులను బీద పరచిన పరాయి పాలనను వ్యతిరేకించాలనీ, మహాత్మాగాంధీ నాయకత్వంలో, కాంగ్రెస్ పార్టీ ఆధ్వర్యంలో కలిసి కట్టుగా పోరాడాలనీ ప్రజానీకం

అంతా నిర్ణయించు కోడంలో ఆశ్చర్యం లేదు. ఎన్ని కష్టాలయినా భరించి కాంగ్రెస్ సంస్థకు బలం చేకూర్చాలన్న నిర్ణయానికి వారంతా రావటం జరిగింది.

నేను గన్నవరం హైస్కూలు విద్యార్థిగా వుంటూనే, రాజకీయాల పట్ల ఆసక్తి చూపిస్తుండే వాడిని. దేశంలోని పరిస్థితులను తెలుసుకుంటూ, విద్యార్థులు కూడా స్వాతంత్ర్య పోరాటంలో తమ వంతు కర్తవ్యాన్ని తాము నిర్వర్తించాలన్న నిర్ణయానికి వచ్చాను. అప్పటి నుండి కూడ కాంగ్రెస్ పార్టీతో నాకు సన్నిహిత సంబంధాలుంటూ వచ్చాయి. ప్రజల వద్దకు వెళ్లి, వారికి దేశంలో జరుగుతున్న సంఘటనల గురించి వాస్తవాలను వెల్లడించే అవకాశం నాకు కల్గింది.

## పెద్దల చరిత్రలు :

ఎనిమిదవ తరగతి చదివే రోజులనుండి కూడ నాకు మహనీయుల జీవిత చరిత్రలు చదవటంపై ఎంతో ఆసక్తి వుండేది. ఒక ప్రక్క నా చదువు దెబ్బతినకుండా చూసుకుంటూ, మరోప్రక్క అటువంటి పుస్తకాలు తెచ్చుకొని చదువుతుండే వాడిని. ఆ రోజుల్లో మహానాయకుల జీవిత చరిత్రలను చిన్న, చిన్న పుస్తకాలుగా వేసి బెజవాడ (తరువాత విజయవాడగా మార్చారు) రైలు స్టేషన్‌లో అమ్మేవారు. అందులో బ్రిటీషు ప్రధాన మంత్రులు చాంబర్లేన్, చర్చిల్; అమెరికా అధ్యక్షుడు రూజ్‌వెల్ట్, రష్యా నియంత స్టాలిన్ వంటి వారి చరిత్రలేకాక జర్మనీ నియంత హిట్లర్, ఇటలీకి చెందిన ముస్సోలినీ వంటి వారి చరిత్రలుకూడా దొరికేవి. మన జాతీయ నాయకులు మహాత్మాగాంధి, సర్దార్ వల్లభాయి పటేల్, పండిట్ జవహర్ లాల్ నెహ్రూ, సుభాష్ చంద్రబోస్, రాజగోపాలాచారి, టంగుటూరి ప్రకాశం, డ్యాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య వంటి నాయకుల జీవిత చరిత్రలను కూడా నేను తీరిక సమయాలలో చదువుతూ వుండేవాడిని. నేను ఎనిమిదవ తరగతిలో వుండగా, మాకు కొడాలి సుబ్బారావు గారనే ఉపాధ్యాయుడు వుండే వారు. ఆయన సాయం కాలం పూటా, సెలవు రోజుల్లోనూ ఆసక్తివున్న నావంటి విద్యార్థులను కూర్చోపెట్టి దేశ, విదేశాలలో జరుగుతున్న సంఘటనలను చక్కగా వివరిస్తుండేవారు. ఆయన ద్వారా అనేక సంగతులను తెలుసుకొనే అవకాశం కలుగుతుండేది. జవహర్‌లాల్‌నెహ్రూ, రాజేంద్ర ప్రసాద్ వంటి వారు పెద్ద పెద్ద పట్టణాలలో జరిగే సభలలో ఉపన్యాసాలు యిస్తుండేవారు. ఆ సభలకు హాజరయి, వారు చెప్పే విషయాలన్నీ విని తెలుసుకొంటుండే వాళ్లం.

## పై చదువులకు ఆటంకం :

1939 మేలో నేను యస్.యస్. యల్.సి. పాసయ్యాను. ఆ తరువాత కొద్ది నెలలకే రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది. నా కింకా పైచదువులు చదువుకోవాలని ఎంతో కోరికగా వుండేది. అయితే అందుకు మా కుటుంబ ఆర్థిక పరిస్థితులు అనుకూలించ లేదు. అదిగాక నేను రాజకీయాల్లో ఎక్కువ ప్రమేయం పెట్టుకుంటున్నానన్న భయం మా తండ్రి గారికుండేది. ఏతా వాతా నా చదువుకొనసాగటానికి అంతరాయం కలిగింది.

పై చదువులకు పోయేందుకు అవకాశం కలగక పోయినా, వివిధ విషయాలను తెలుసుకుంటూ వుండాలనే ఆసక్తి మాత్రం నాలో తగ్గలేదు. ఆ రోజుల్లో మద్రాసునుంచి తెలుగు దిన పత్రిక ఆంధ్రపత్రిక, ఇంగ్లీషు పత్రిక హిందూ వస్తుండేవి. వాటి ద్వారానే ప్రపంచంలో ఎక్కడ ఏం జరుగుతుందో తెలుసుకొనేందుకు వీలు కలిగేది.

## రెండవ ప్రపంచ యుద్ధం :

అప్పటికే హిట్లర్, ముస్సోలినీలు ప్రపంచ యుద్ధాన్ని ప్రారంభం చేసి ఐరోపా ఖండానికి చెందిన రాజ్యాలను వరసగా ఆక్రమించుకొంటూ వచ్చారు. రష్యామీదికి దండెత్తటానికి కూడా జర్మనీ వెనుదీయలేదు. జపాన్ ఆసియాలోకెల్లా శక్తివంతమైన దేశంగా వుంది. జర్మనీ, ఇటలీలతో జపాన్ చేతులుకలిపి యుద్ధంలో ప్రవేశించింది. అమెరికాకు చెందిన పెరల్ హార్బరు పైన జపాన్ విమానాలు అకస్మాత్తుగా దాడి చేసి బాంబులు వేయటంతో, అమెరికా కూడ రంగంలోకి దిగింది. జపాన్, జర్మనీలకు వ్యతిరేకంగా పోరాటాన్ని నిర్వహించటానికి అమెరికా అధ్యక్షుడు రూజ్‌వెల్ట్, బ్రిటీషు ప్రధాని చర్చిల్, రష్యా ప్రధాని స్టాలిన్ పరస్పరం కలిసి చర్చిస్తూ వుండేవారు. జర్మనీ, జపాన్‌లతోటి యుద్ధంలో బ్రిటన్ సతమత మౌతున్నప్పుడే, భారతదేశం స్వాతంత్ర్యంకోసం గట్టిప్రయత్నం చేయాలి అనే భావం మన వారిలో కొందరికి వుండేది.

## నేతాజీ సాహసం :

కాంగ్రెస్ నాయకులలో ఒకరయిన శ్రీ సుభాష్ చంద్రబోస్ బ్రిటీషు అధికారుల కన్నుగప్పి మారువేషంలో కలకత్తానుండి బయలుదేరి ఆఫ్ఘనిస్థాన్

మీదుగా జర్మనీ చేరుకున్నారు. బోస్ సాహసయాత్ర ఆ రోజుల్లో గొప్ప సంచలనం కలిగించింది. సుభాష్‌బోస్ హిట్లర్‌ను కలిసి, బ్రిటీష్ వారి కబంధ హస్తాలనుంచి మనదేశాన్ని విముక్తి చేయటానికి సహకరించమని కోరారు. ఆ తరువాత ఆయన జర్మనీ నుండి జపాన్ చేరుకున్నట్లు వార్తలు వచ్చాయి. జపాన్ ప్రభుత్వ నాయకులతో బోస్ చర్చించి దేశ విముక్తికోసం సాయుధ పోరాటం జరపాలన్న నిర్ణయానికి వచ్చారు. ఆయున రాసబిహారీ బోస్ వంటి పెద్దల ఆశీస్సులు అందుకొని ఆజాద్ హింద్ ఫౌజ్ పేరుతో ఒక సైన్యాన్ని ఏర్పరచారు. జపాన్‌కు పట్టుబడిన యుద్ధ ఖైదీలలో వున్న భారతీయులను సుభాష్ చంద్రబోస్ ఉత్తేజపరిచి, వారిని బ్రిటీషువారికి వ్యతిరేకంగా పోరాడేందుకు తాను స్థాపించిన ఆజాద్ హింద్ ఫౌజ్‌లో చేర్చుకున్నారు. 'జైహింద్', అనీ, 'ఢిల్లీ చలో' అనీ ఆయన నినదించారు. జపాన్ ఆక్రమణ లోనికి వచ్చిన అండమాన్ దీవులలో సుభాష్‌బోస్ భారత జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశారు. అక్కడ ఆయన భారత పతాకాన్ని ఎగురవేశారు. 1942 ఏప్రిల్ 8న జపాన్ విమానాలు విశాఖపట్నంపై బాంబులు వేశాయి. ఆ సంఘటన ఎంతో సంచలనాన్ని కల్గించింది

రెండవ ప్రపంచ యుద్ధంలో మిత్రరాజ్యాలు జర్మనీ, ఇటలీలను ఓడించాయి. కాని జపాన్ మాత్రం పోరాటాన్ని కొనసాగిస్తూనే వుంది. అప్పుడు అమెరికా తాను కొత్తగా కనుగొన్న అణుబాంబును మొదట హిరోషిమా నగరం పైనా, తరువాత నాగసాకి పట్టణం పైనా ప్రయో గించింది. ఆ రెండు పట్టణాలు తుడిచి పెట్టుకొని పోయాయి. కనివిని యెరుగని రీతిలో భారీ జన నష్టం కలిగింది. దానితో జపాన్ కూడ లొంగిపోక తప్పలేదు.

## క్విట్టిండియా :

ప్రపంచయుద్ధం కొనసాగుతుండగానే, గాంధీజీ 1942 ఆగస్టులో బొంబాయిలో కాంగ్రెస్ వాదులను ఉద్దేశించి ప్రసంగిస్తూ 'విజయమో, వీరస్వర్గమో' (డూ ఆర్ డై) అన్నపిలుపునిచ్చారు. తెల్లవారిని 'క్విట్టిండియా' ('భారత దేశాన్ని వదిలి వెళ్లిపోండి'!) అని హెచ్చరించారు. అప్పుడు బ్రిటీషు ప్రభుత్వం గాంధీజీతో సహా కాంగ్రెస్ అగ్రనాయకులందరినీ అరెస్టు చేసి జైలుకు పంపింది. అదే చరిత్రాత్మకమైన క్విట్టిండియా ఉద్యమానికి నాంది పలికింది. ఆ మహోద్యమ జ్వాలలలో ఆసేతు హిమాచలం అట్టుడికినట్లు ఉడికిపోయింది. ఆ వుద్యమ తీవ్రతను చూసి బ్రిటీషు పాలకులు బెంబేలెత్తిపోయారు. యుద్ధం

పరిసమాప్తి అయి బ్రిటన్, అమెరికా, ఫ్రాన్స్, రష్యాల మిత్ర మండలి విజయం సాధించినా, బ్రిటన్ ఆర్థికంగా బాగా దెబ్బతిన్నది. బ్రిటన్‌లో జరిగిన ఎన్నికలలో ప్రధాని చర్చిల్ నాయకుడుగా వున్న కన్సర్వేటివ్ పార్టీ ఓడిపోయి, క్లెమెంట్ అట్లీ నాయకత్వంలోని లేబర్ పార్టీ అధికారంలోకి వచ్చింది. అట్లీ ప్రధాని అయ్యారు. అట్లీ మౌంట్ బాటన్‌ను మనకు గవర్నర్ జనరల్‌గా పంపారు. వివిధ రాజకీయ పక్షాల నాయకులతో చర్చలు జరిపి మౌంట్ బాటెన్ వారిని దేశవిభజనకు అంగీకరింపచేశారు.

## స్వాతంత్ర్య భానూదయం :

ఆగస్టు 14వ తేది అర్ధరాత్రి 12 గంటలు కొట్టగానే – అంటే ఆగస్టు 15 తొలిక్షణంలో భారతదేశం స్వతంత్రమయింది. స్వతంత్ర భారత తొలిప్రధానిగా జవహర్‌లాల్ నెహ్రూ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశారు. ఆయన ప్రజాస్వామ్యం మీద అమిత గౌరవమున్న వ్యక్తి. మతాలకూ, వర్గాలకూ అతీతమైన మనిషి. ఆయన భారత ప్రధానమంత్రిగా ఎన్నికై, దాదాపు 17 సంవత్సరాలపైగా రాజకీయ, ఆర్థిక, సాంఘిక, పారిశ్రామిక, శాస్త్ర సాంకేతిక రంగాల్లో నవభారత భవిష్యత్తుకి గట్టి పునాదులు వేసినటువంటి మహనీయుడు. ప్రపంచ శాంతికి అమూల్య కృషిని సాగించి అంతర్జాతీయంగా భారత దేశ గౌరవాన్ని ఇనుమడింప చేసిన నాయకుడు. నియంత కాగల అవకాశాలున్నా, అటువంటి ప్రలోభానికి లొంగిపోని ప్రజాస్వామ్య వాది. మానవతా విలువలకు ప్రాధాన్యాన్నిచ్చే మహోన్నత వ్యక్తి.

నెహ్రూ మంత్రి వర్గంలో ఉక్కు మనిషిగా పేరొందిన సర్దార్ పటేల్ ఉపప్రధానిగానూ, హోం మంత్రిగానూ ఉండేవారు.

## సంస్థానాల విలీనం :

దేశ విభజన ఫలితంగా దారుణమైన మతకలహాలు చెలరేగాయి. వేలాది మంది మరణించారు. లక్షలాది జనం కాందిశీకులైనారు. పురుటి నొప్పులు తీరకముందే, భారతదేశం ఆ హింసాకాండ కారణంగా కాందిశీకుల పునరావాస కల్పన సమస్యను ఎదుర్కోవలసి వచ్చింది. ఈ గొడవలిలా వుండగా, బ్రిటీషు పాలనా కాలంలో దేశంలో 600కు పైగా స్వదేశీ సంస్థానాలుండేవి కదా! బ్రిటీషు వారు వెళ్లిపోతూ వాళ్లు ఇటు ఇండియాలోగాని, అటు పాకిస్థాన్‌లోగాని కలిసి పోవచ్చని ప్రకటించారు. ఫలితంగా దేశం ముక్కచెక్కలయ్యే ప్రమాదంలో

పడిపోయింది. అయినా సర్దార్ పటేల్ రాజనీతి చతురత వల్ల నైజాం సంస్థానం మినహాగా మిగిలిన సంస్థానాల నన్నిటినీ ఒక్క రక్తపుబొట్టయినా చిందించకుండా దేశంలో విలీనం చేయటం జరిగింది.

కాశ్మీర్‌పైకి కొందరు కిరాయి మూకల్ని పంపి పాకిస్థాన్ దురాక్రమణ చేయాలన్న ప్రయత్నం చేసింది. అయితే వెంటనే కాశ్మీర్ రాజు హరిసింగ్ అభ్యర్థన మేరకు భారత సైన్యం జోక్యం చేసుకొని ఆ దుండగులను తరిమికొట్టి కాశ్మీర్ సన్థానాన్ని రక్షించింది. మహారాజా సంస్థానాన్ని భారతదేశంలో విలీనం చేస్తూ ఒడంబడికపై సంతకం చేయటంతో కాశ్మీర్ భారత్‌లో అంతర్భాగమైంది. అయినా కొంతభాగం పాక్‌దురాక్రమణలో వుండి పోయింది. నాటి నుంచి రావణాసురుడి కాష్ఠంలా ఆ సమస్య నేటికీ ఐక్యరాజ్య సమితిలో నలుగుతూనే వుంది.

## మరోమలుపు :

పరిస్థితులిలావుండగా, కృష్ణాజిల్లా మాధవరానికి చెందిన వెలుగులేటి మాధవరావుగారి కుమార్తె మంగాయమ్మతో నాకు వివాహం జరిగింది. ఆ తరువాత నా జీవితం అనుకోని మలుపుతిరిగింది. మాధవరావుగారు కాంగ్రేస్ అభిమాని కావటం వల్ల ఆయన నాకు మంచి ప్రోత్సాహం యిచ్చారు. నైజాం రాష్ట్రంలోని వరంగల్ జిల్లా మధిర తాలూకా చోడవరం గ్రామంలో వారికి భూములుండేవి. (అప్పటికి ఖమ్మంజిల్లా ఏర్పడలేదు). ఆయనకు కలప వ్యాపారం కూడ వుండేది. ఆయనతో కలిసి నేను కూడ నైజాం ప్రాంతానికి వచ్చి, బయ్యన్న గూడెం గ్రామంలో భూములు కొనుక్కొని స్థిరపడి కాపురంపెట్టి నివసించటం జరిగింది.

ఆ రోజుల్లో నైజాం గ్రామాల్లో వున్న పెద్ద భూస్వాములు నైజాం ప్రభుత్వ అధికారులనూ, పోలీసులనూ తమ కనుకూలంగా చేసికొని, వారి మద్దతుతో ప్రజలను నానా యిబ్బందులు పెడుతుండేవారు. వారు ఆడింది ఆటా, పాడిందిపాటగా వుండేది. జనంతో వాళ్లు వెట్టిచాకిరీ చేయించు కొనే వారు. అంటే ఏ కూలీ లేకుండానే అంతా వచ్చి వాళ్లకు పనిపాట్లు చేసి పెట్టిపోవాలి - అన్నమాట! అప్పటికి నా వయసు 22 సంవత్సరాలు. ప్రజలను సంఘటితంచేసి, వాళ్లు ఎదుర్కొంటున్న సమస్యల పరిష్కారానికి పోరాడేలా చేయటంకోసం నిజాం సంస్థానంలో హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ అనే సంస్థ ఏర్పడింది. దానికి స్వామి

రామానందతీర్థ నాయకులు. ఆసంస్థలో నేనూ ఒక సభ్యుడిని. ఒక ప్రక్క మా వ్యవసాయం చేయించు కుంటూ, రెండో ప్రక్కన కాంగ్రెస్ సంస్థ ఆధ్వర్యంలో గ్రామాలు తిరుగుతూ ఆయా వూళ్లలో రైతుకూలీ సమస్యలను పరిష్కరిస్తుండే వాడిని.

ప్రజలలో కాంగ్రెస్ ప్రాబల్యం పెరిగి పోతుండటం చూసి నిజాం నవాబు హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్‌పై నిషేధం విధించాడు. అయితే ఆంధ్ర మహాసభ అన్న పేరుతో మరొక సంస్థను హైదరాబాద్ సంస్థానం లోని తొమ్మిది తెలుగు జిల్లాలకు చెందిన నాయకులు **1930**లోనే ఏర్పాటుచేసికొన్నారు. రాజకీయ సంస్థకాక పోయినా, జాతీయోద్యమ కార్యకలాపాలను సాగించటానికీ, ప్రజలను సంఘటితపరచి జాతీయోద్యమానికి బలం చేకూర్చటానికీ కాంగ్రెస్‌ను నిషేధించిన తరువాత ఆంధ్ర మహాసభ బాగా ఉపయోగపడింది.

కుటుంబ సభ్యులతో వెంగళరావు, ఎడమ నుంచి వరుసగా పెద్ద కోడలు
శ్రీమతి లక్ష్మీకాంత శ్రీకుమారి, పెద్ద కుమారుడు ప్రసాదరావు, తల్లి శ్రీమతి
సూరాయమ్మ, అర్ధాంగి శ్రీమతి మంగాయమ్మ, చిన్న కుమారుడు
వెంకట్రావు. మనుమడు వినోద్‌కుమార్, మనుమరాలు సునిత

# నిజాం సంస్థాన

# స్వాతంత్ర్య పోరాటం

**1947** ఆగస్టు **15**న దేశమంతా స్వతంత్రమైనా, నిజాం సంస్థానం మాత్రం ఇంకా విముక్తికి నోచుకోలేదు. దాశరథి చెప్పినట్లు 'అటు విముక్తాంధ్రభూమి తీపెక్కుచుండ, ఇటు విషాకాంధ్ర సీమ చేదై జ్వలిస్తూ' నే వుంది. రజాకార్ల నాయకుడైన కాశిం రజ్వీ మద్దతుతో అప్పటి హైదరాబాదు సంస్థాన పాలకుడు ఏడవ నిజాం నవాబు మీర్ ఉస్మాన్ ఆలీఖాన్ హైదరాబాదును భారత దేశంలో విలీనం చేయకుండా కావాలని తాత్సారం చేయసాగాడు. తన సంస్థానాన్ని మరో స్వతంత్ర దేశంగా చేయాలని ఆయన కలలుకన్నాడు. ఒక దశలో తన సంస్థానాన్ని ఆజాద్ హైదరాబాదుగా ప్రకటించు కున్నాడు కూడ. నిజాం సంస్థానంలో మహమ్మదీయులు పదిశాతం లోపే; అయినా నవాబు ముస్లిం కనక సైనిక బలం, అధికారం అంతా ముస్లింల చేతుల్లోనేవుండేవి. ప్రజానీకం అంతా భారతదేశంలో విలీనాన్ని కోరుతుండేవారు. కాని, నిజాంకు 'ఆజాద్ హైదరాబాదు' ఆలోచన రావటంతో మజ్లీస్ వారు పోలీసుల సహాయంతో స్థానిక ప్రజలను హింసాకాండకు గురిచేసి, అణగదొక్కి, భయభ్రాంతులను చేసి, తమ చెప్పుచేతల్లో వుంచుకొనే ప్రయత్నాలు చేశారు. కనుక హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస నిజాంకు వ్యతిరేకంగా సంస్థాన విముక్తికోసం పోరాటాన్ని ప్రారంభించాల్సి వచ్చింది.

## మరోదారి :

ఈ పోరాటం రెండు రకాలుగా జరిగింది. కొందరు కాంగ్రెస్ వారు గాంధేయ పద్ధతులలో సత్యాగ్రహం చేసి జైలుకు వెళ్లారు. ఆ విధంగా జైలుకు వెళ్లినవారిలో స్వామీ రామానంద తీర్థ, జమలాపురం కేశవరావు వంటి నాయకులున్నారు. వేలాది కార్యకర్తలు వారి ననుసరించారు. వారంతా పోలీస్ చర్య అయిందాకా కారాగారాల్లోనే వున్నారు. మరొక వర్గం వారు మనమందరం వెళ్లి జైళ్లలో కూచుంటే ఉద్యమాన్ని నిర్వహించటం ఎలా? అని ఆలోచించారు. సరిహద్దు గ్రామాలలో కార్యకర్తల శిబిరాలు నెలకొల్పుకొని పోరాటం సాగించారు. వీరు ఆత్మ రక్షణకు ఆయుధాలను ధరించారు. సత్యాగ్రహంతో సంస్థాన

విముక్తిసాధ్యం కాదని, సాయుధపోరాటానికి సిద్ధమయ్యారు. ఉద్యమం నానాటికీ తీవ్రతరం గాజొచ్చింది. దానితో కంగుతిన్న నిజాంప్రభుత్వం సాయుధపోలీసు దళాలను ప్రయోగించి క్రూరంగా అణచివేత చర్యలకు పూనుకొంది. రజాకార్లు చెలరేగి అమాయక ప్రజల ధనమాన ప్రాణాలను హరిస్తూ ప్రజాజీవనాన్ని అల్లకల్లోలం చేయసాగారు. గ్రామాలపైబడి దోచుకొని, వూళ్లకు వూళ్లే తగలబెట్టటం వారికి నిత్యకృత్యమై పోయింది. అందువల్ల వారి బారి నుండి ప్రజలను రక్షించే బాధ్యత కాంగ్రెస్ కార్యకర్తలపై బడింది. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో వున్న ఆంధ్రప్రాంతంలోనేగాక, మైసూరు, (తరవాత కర్ణాటక) బొంబాయి, (తరవాత మహారాష్ట్ర) మధ్య భారత్‌లలో (తరవాత మధ్య ప్రదేశ్) స్టేట్ కాంగ్రెస్ ఇలాటి శిబిరాలను నెలకొల్పింది. అప్పుడు నేను తిరువూరులో ఒక పెద్దశిబిరాన్ని నెలకొల్పి, దాదాపు వందమంది కార్యకర్తలకు నాయకత్వం వహించి పోరాటాన్ని నిర్వహిస్తుండే వాడిని. ఆ రోజుల్లో నిజాం సంస్థాన సరిహద్దుగ్రామాలలో 'శాయిరి నాకా'లని (కస్టమ్స్ చెక్‌పోస్టులు) వుండేవి. నిజాం సంస్థానంలోకి ఎవరు ప్రవేశించినా వారి సామాన్లన్నీ ఈ నాకాలలో సోదా చేసి, సుంకాలు విధించేవారు. ప్రజలపై శాయిరీ వుద్యోగుల జులుం దుర్భరంగా వుండేది. మా వుద్యమ తొలిదశలో, ఈ నాకాలపై బాంబులతో దాడి చేయటం, వాటిని పట్టుకొని, అందులోని రికార్డు వగయిరాలను తగల బెట్టటం, ఆ శాయిరి నాకాలను కూలగొట్టి ధ్వంసం చేయడం ఒక ముఖ్య కార్య క్రమంగా వుండేది. వెంటనే నిజాం ప్రభుత్వం రెచ్చిపోయి పెద్దయెత్తున సాయుధ దళాలను దింపి విచక్షణా రహితంగా ప్రజలను హింసిస్తూ వచ్చింది. నేనూ, నాతోటి సాయుధ కాంగ్రెస్ కార్యకర్తలు గ్రామాలలో పర్యటిస్తూ ప్రజలకు ధైర్యం చెబుతుండేవారం. నిజాం ప్రభుత్వానికి ప్రజలు పన్నులు చెల్లించకుండా వారికి నచ్చజెప్పి నిరోధించటం జరిగేది. ప్రభుత్వం ప్రజల ఆస్తులను జప్తుచేసి వేధించినా, ప్రజల అభిమానం స్టేట్ కాంగ్రెస్ ఉద్యమం పట్లనే వుండటంతో మాకెంతో మద్దతు లభించేది.

## పరీక్షా సమయం :

సంస్థాన విముక్తి ఉద్యమం వూపందు కొంటున్న తరుణంలో, దురదృష్టవశాత్తు జాతిపిత మహాత్మాగాంధీ **1948** జనవరి **30** సాయంకాలం హత్య చేయబడ్డారు. ప్రార్థనా సమావేశానికి వెళుతుండగా ఢిల్లీలోని బిర్లామందిరంలో హిందూ మతతత్వవాది నాథూరాం గోడ్సే పిస్తోలుతో ఆయనను

కాల్చివేశారు. ఆ వార్తవిని యావత్ప్రపంచం నిర్ఘాంత పోయింది. భారత ప్రజ దుఃఖ సాగరంలో మునిగిపోయింది.

అది భారతజాతికే కఠోర పరీక్షా సమయం. ఈ దారుణ వార్తవిని అంతా ఎంతో బాధపడ్డారు. కాని క్రమంగా ప్రజలందరిలోనూ గాంధీజీ ఆశయాలను నెరవేర్చాలన్న దీక్షా, భారత దేశాన్ని సమైక్యంగా వుంచు కోవాలన్న పట్టుదలా పెరిగాయి. పిడుగుపాటు వంటి ఆ దుర్ఘటన తరువాత ఆవేశకావేశాలకు లోనుగాకుండా భారత ప్రజ నిబ్బరం చూపి మరింత సమైక్యంగా నిలవటం విశేషం.

## సంస్థాన విముక్తి ఉద్యమం :

హైదరాబాదు సంస్థానంలో కూడ ప్రజలు మరింత సమైక్యంగా నిలిచి, గట్టి పట్టుదలతో నిజాం ప్రభుత్వాన్ని ఎదిరించాలనే నిర్ణయానికి వచ్చారు. సరిహద్దు రాష్ట్రాల ప్రభుత్వాలు కూడా స్టేట్ కాంగ్రెస్ ఉద్యమం పట్ల విశేషంగా సానుభూతి చూపిస్తూ సహకరిస్తుండేవి. నిజాం సంస్థానం నుండివచ్చిన కాంగ్రెస్ కార్యకర్తలు బెజవాడలో స్టేట్‌కాంగ్రెస్ కార్యాలయాన్ని నెలకొల్పుకొని, నిర్వహించేవారు. శ్రీ హయగ్రీవాచారి, శ్రీ బొమ్మకంటి సత్యనారాయణ ప్రభృతులు ఆ కార్యాలయ కార్యక్రమాన్ని పర్యవేక్షిస్తూ, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల నాయకులతో సత్సంబంధాలు నెలకొల్పుకొని పనిచేస్తుండేవారు. మదరాసులోకూడ ఒకకార్యాలయాన్ని శ్రీ మాడపాటి రామచంద్ర రావుగారు నెలకొల్పారు. వారక్కడ మకాం చేస్తూ అక్కడి కాంగ్రెస్ నాయకులతో స్టేట్ కాంగ్రెస్ కృషిని సమన్వయం చేస్తుండేవారు. నిజాం ప్రజలు పడుతున్న బాధలను, నవాబు ప్రజల హక్కులను ఎలా కాలరాస్తున్నదీ, స్టేట్ కాంగ్రెస్ ఉద్యమ తీరు తెన్నులనూ వారు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల నాయకులకు ఎప్పటికప్పుడు తెలియ జేస్తుండేవారు.

## మా అరెస్టు :

క్రమంగా మా తిరువూరు శిబిరం కార్య కలాపాలను నేను కృష్ణా, పశ్చిమగోదావరి జిల్లాలలోని సరిహద్దు ప్రాంతాలకు విస్తరింప జేశాను. నేనూ, మా కార్యకర్తలూ ధైర్యంగా నిజాం గ్రామాలలోకి చొచ్చుకొని వెళ్లి ప్రజలను కలిసి ధైర్యం చెప్పివస్తుండే వారం. అనుక్షణం ప్రమాదమే అన్నట్లుండేది అప్పటి స్థితి. రజాకార్లూ, నిజాం సాయుధపోలీసులూ అనుకోకుండా ఏ రాత్రో మాతో

తారసపడినప్పుడు మాకూ, వాళ్లకూ సాయుధ పోరాటాలు జరిగేవి.

**1948** మే నెలలో కొంత మంది సహచరులతో నేను పశ్చిమ గోదావరి జిల్లా చింతలపూడి దగ్గర సరిహద్దులలో సంచరిస్తుండటం తటస్థించింది. మా వద్ద రైఫిళ్లున్నాయి. రజాకార్ మూకలతో తారసపడి పోరాటం సాగించి తప్పించుకొని మద్రాస్ రాష్ట్రంలో వున్న ఆంధ్ర ప్రాంతం చింతలపూడి వేపు వచ్చిపడ్డాం. ఇంతలో మాకు స్థానిక పోలీసు లెదురయ్యారు. మేము జీపులో ఆయుధాలతో వెళుతుండటం గమనించి, మమ్మల్ని ఆపారు. మా జీప్‌నూ, ఆయుధాలనూ వశపరచుకొని మమ్మల్ని అరెస్ట్ చేసి సబ్ జైలులో నిర్బంధించారు. మేము ఫలానా అనీ, మా కార్యక్రమం యిదనీ మేమెంత వివరించినా ఫలితం లేకపోయింది. అది మండుటెండాకాలం. నాతోపాటు, పదిమంది కార్యకర్తలు ఆ వేసవిలో ఏలూరు సబ్‌జైలులో పదిహేను రోజుల పాటు నిర్బంధంలో వుండాల్సి వచ్చింది. పోలీసులు అంతతో ఆగక మాపై కోర్టులో కేసు దాఖలు చేశారు.

ఈ విషయాలన్నీ పత్రికలలో వచ్చాయి. అప్పుడు స్టేట్ కాంగ్రెస్ నాయకులు అప్పటి మద్రాస్ రాష్ట్రప్రధాని (అప్పుడు రాష్ట్ర ముఖ్యమంత్రిని కూడా ప్రధాని అనేవారు. రాజాజీ, ప్రకాశం, కుమారస్వామి రాజా వీరంతా మదరాసు రాష్ట్ర ప్రధానులుగా పనిచేసినవారే) శ్రీ ఓమండూరు రామస్వామి రెడ్డియార్ దగ్గరకు వెళ్లి విషయమంతా వివరించారు. స్టేట్ కాంగ్రెస్ కార్యకర్తలను పోలీసులు అరెస్ట్ చేసి కేసుపెట్టి వేధిస్తున్నారని వినగానే ఆయన వెంటనే అప్పుడు రెవెన్యూ మంత్రిగా వున్న కళా వెంకట్రావుగారిని ఏలూరు వెళ్లి పరిస్థితి చక్కదిద్దమని పంపించారు. శ్రీ వెంకట్రావుగారు జిల్లా కలెక్టర్, తదితర అధికారులను పిలిచి 'నైజాం సంస్థాన విముక్తికోసం పోరాడుతున్న వాళ్లు వీరు. వీళ్లను జైలులో పెట్టి వేధించటం సరయిన పనికాదు. వెంటనే వారిని విడుదల చేయండి'! అని ఆదేశించారు. ఆయన మాతో మాట్లాడుతూ 'మీరింకా పట్టుదలతో మీ పోరాటాన్ని సాగించండి ! ఇక్కడి పోలీస్ వారు చేసిన పొరపాట్లను మరిచిపోండి; తొందరలోనే నైజాం ప్రజలు కూడ స్వేచ్ఛా వాయువులు పీల్చే అవకాశం వస్తుంది' అని ప్రోత్సహించి పంపారు.

సరిహద్దు శిబిరాలలో స్టేట్ కాంగ్రెస్ కార్యకర్తలు సాగిస్తూ వచ్చిన పోరాటం కేంద్ర నాయకుల ప్రశంసలను పొందింది. సర్దార్ పటేల్ హైదరాబాదులో

కె.యం.మున్షీగారిని భారత ప్రభుత్వ ఏజెంటుగా నియమించారు. 'ప్రజా ఉద్యమాలను ఇలా దారుణంగా అణచి వేస్తుంటే, భారత ప్రజల వ్యతిరేకస్పందనను ఎదుర్కోవలసి వస్తుందని' సర్దార్ నిజాంని హెచ్చరించారు. కాని, రజాకార్ నాయకుడు రజ్వీ వొత్తిడికి లోనయిన నిజాం మీర్ ఉస్మాన్ ఆలీఖాన్ ఆ సలహాను పాటించక పోగా, దమననీతిని ఉధృతం చేస్తూవచ్చాడు. భారత ప్రభుత్వం ఎంత వోపిక పట్టినా ప్రయోజనం కలగలేదు.

## పోలీస్ యాక్షన్ :

ఇక తప్పని సరి పరిస్థితులలో భారత ప్రభుత్వం నిజాం సంస్థానంపై 'పోలీస్ యాక్షన్' తీసుకోవలసివచ్చింది. కేంద్ర ప్రభుత్వ ఆదేశంపై భారత సైన్యం నిజాం సంస్థానంలోకి ప్రవేశించి ముందుకు చొచ్చుకొని పోసాగింది. నేను తిరువూరు వైపునుండి వెళ్లే సైనిక దళాలతో కలిసి వారి కారులోనే వెళ్లాను. కల్లూరు పోలీస్ స్టేషన్‌ను సైనిక దళాలు వశపరచుకొని ముందుకుసాగాయి. నిజాం సైన్యం యిచ్చిన ప్రతిఘటన దాదాపు నామమాత్రం కావటంతో భారత సైన్యం నిరాఘాటంగా హైదరాబాదు దిశగా పరుగుతీసింది. ఊరూరా, ప్రజలు ఆనందోత్సాహాలతో భారత సైనికులకు ఎదురేగి ఆహ్వానించటం, స్వాగత సత్కారాలు చేయుటం మరపురాని మధురానుభూతి. ఒక ప్రక్క ప్రజావెల్లువ, మరో ప్రక్క భారత సైన్యం – ఈ పరిస్థితిలో నిజాం నవాబు కళ్లు తెరిచి వాస్తవాలను పరికించక తప్పలేదు. **1948** సెప్టెంబరు **23**న, అంటే పోలీస్ చర్య ప్రారంభమైన అయిదు రోజుల్లోనే నిజాం సంస్థాన సైన్యాధిపతి ఎల్. ఎడ్రూస్ భారత సైనికాధికారి మేజర్ జనరల్ చౌధురీ వద్దకు వచ్చి లాంఛనంగా లొంగి పోవటంతో పోరాటం జయప్రదంగా ముగిసింది. ఆనాటి నుండే హైదరాబాదు సంస్థానం భారత దేశంలో అంతర్భాగ మయింది. బ్రిటీషు వారు పోతూ పోతూ మిగిల్చిన సంస్థానాల సమస్యను ఎంతో చాకచక్యంతో పరిష్కరించి, సమైక్య భారతావనిని తీర్చిదిద్దిన ఘనత నాటి హోం మంత్రి సర్దార్ వల్లభాయి పటేలుదే.

కాశ్మీర్‌పై పాకిస్తాన్ దురాక్రమణ చేసినప్పుడు, వారిని తరిమి కొట్టేందుకు వెళ్లిన భారత సైన్యం తన పని పూర్తిగావించక ముందే, సమస్యను ప్రధాని నెహ్రూ ఐక్య రాజ్యసమితికి నివేదించారు. అందుకు అప్పటి బ్రిటీషు గవర్నర్ జనరల్ లార్డ్‌మౌంట్‌బాటన్ నెహ్రూపై తెచ్చిన వొత్తిడి కారణం అనవచ్చు. ఏదయినా,

అప్పుడు సమితికి వెళ్లటం వల్ల, యిప్పటికీ కాశ్మీర్ సమస్య పరిష్కారం కాకుండా వుండిపోయింది.

## కమ్యూనిస్టు ఉద్యమం :

సైనిక దళాలు హైదరాబాదు సంస్థానాన్ని వశపరచుకొన్న తరువాత జనరల్ చౌధురీని మిలిటరీ గవర్నర్‌గా భారత ప్రభుత్వం నియమించింది. రజాకార్ సమస్య పరిష్కారం అయిందనుకుంటే, వెంటనే కొత్త సమస్య వొకటి వొచ్చి పడింది. రజాకార్లతో పోరాటం కోసం సాయుధులైన కమ్యూనిస్ట్ కార్యకర్తలు పోలీస్ చర్య తరువాత ఆయుధాలను విసర్జించ లేదు. పైగా తెలంగాణాలో సాయుధ పోరాటానికి పూనుకొన్నారు. గ్రామాలలో భూస్వాములను హత్య చేయటం, దోపిడీలు చేయటం, అరాచకాన్ని సృష్టించటం - ఇదీ ఆనాడు వాళ్ల ముఖ్యకార్యక్రమం. మిలిటరీ గవర్నరు ఎదుర్కోవలసి వచ్చిన సమస్యలలో యిదొకటి.

హైదరాబాదు సంస్థాన పరిపాలనా యంత్రాంగాన్ని పటిష్ఠం చేయాల్సిన అవసరాన్ని కూడ జనరల్ చౌధురీ గుర్తించారు. మదరాసు, మహారాష్ట్రాల నుండి పోలీస్, రెవెన్యూ అధికారులను రప్పించి, పరిపాలనను సక్రమ పద్ధతిలో పెట్టటానికి కృషి చేశారు.

## మామగారి హత్య :

సంస్థాన విముక్తి తర్వాత కాంగ్రెస్ పార్టీని పటిష్ఠం చేయటానికి గట్టి చర్యలు తీసికోడం జరిగింది. జిల్లా, తాలూకా స్థాయిలలో కాంగ్రెస్ యంత్రాంగాన్ని ఏర్పాటు చేశారు. అప్పుడు నేను మధిర తాలూకా కాంగ్రెస్ అధ్యక్షుడుగా వుంటూ గ్రామస్థాయి నుంచి కార్యకర్తలతో సంబంధాలు పెట్టుకొని పార్టీని పునర్వ్యవస్థీకరించటం మొదలు పెట్టాను. ఊరూరా కాంగ్రెస్ వ్రేళ్లూనుకోడం గమనించి కమ్యూనిస్టులు కాంగ్రెస్ కార్యకర్తలను హత్య చేసి భీతావహాన్ని సృష్టించేందుకు పూనుకున్నారు.

ఆ రోజుల్లోనే - అంటే, **1949** మార్చి **23**న వా పెద్దకుమారుడు ప్రసాదరావు గన్నవరం తాలూకా కేసరపల్లిలో జన్మించాడు. తరువాత కొద్దికాలానికి మా అత్తవారు నాభార్యను, చంటి పిల్లవాడిని తీసుకొని వాళ్ల స్వగ్రామం మాధవరం (తిరువూరు తాలూకా) వచ్చారు. నేను అప్పుడప్పుడు

జీపు వేసుకొని మాధవరం వెళ్లి వాళ్లను చూసి వస్తుండే వాడిని. నన్ను హత్య చేయాలని కాచుకొని వున్న కమ్యూనిస్టులు యీ సంగతి గమనించి 1949 డిసెంబరు 29న మా అత్తవారింటిపై దాడి చేశారు. అయితే వారను కున్నట్లుగా, ఆ రోజు నేను అక్కడకు వెళ్లలేదు. హైదరాబాద్‌లో ఏదో మీటింగ్ వుండి నేను అనుకోకుండా పట్నం వెళ్లాను. మాధవరంలో మా మామగారు, ఆయన తమ్ముడు నరసింహా రావుగారు నా భార్య, మా అత్తగారు, యింకో యిద్దరుఆడవాళ్లు వున్నారు. నరసింహారావు గారు గోడదూకి, ఎలాగో తప్పించుకొని పోయారు. కమ్యూనిస్టులు యింట్లో వున్న వెండి, బంగారం దోచుకొని, మా మామ గార్ని వూరు బయటకు తీసుకొని పోయి తుపాకితో కాల్చి చంపారు. ఈ దుస్సంఘటన తరువాత అప్పటివరకు బాగావున్న ఆ కుటుంబం చితికి పోయింది.

ఈ సంగతి తెలియగానే నేను హైదరాబాదునుండి కారులో బయలుదేరి మాధవరం చేరుకున్నాను. మా మామగారి భౌతిక కాయానికి అంత్యక్రియలు జరిపించాను. అక్కడ ఆరు మాసాలపాటు పోలీస్ కాపలా ఏర్పాటు చేసి వాళ్లు భయపడకుండా చేశాను.

## తప్పుడు కేసు :

కాంగ్రెస్ వాళ్లకు ఒక ప్రక్క కమ్యూనిస్టులతో ఇబ్బందులే కాక, మరో ప్రక్క యింకో కొత్త సమస్య వచ్చింది. మదరాసు రాష్ట్రం నుండి వచ్చిన రెవెన్యూ, పోలీస్ అధికారులనుండి అనేక చికాకులు కలిగాయి. ఆ అధికారులలో కొంతమంది మంచివాళ్లున్నప్పటికీ, మిగతావాళ్లు 'సందులో సడేమియా' అని దొరికినంత బొక్కే తొందరలో వుండేవారు. ఒక ప్రక్కన కమ్యూనిస్ట్ అరాచకత్వం, మరో ప్రక్క అధికారుల అవినీతి మధ్య సామాన్య ప్రజానీకం అడకత్తెరలో పోకలాగా నలిగి పోయారు. అప్పుడు నేను, నా తోటి కాంగ్రెస్ కార్యకర్తలూ ధైర్యంగా నిలబడి ప్రజలకు అండగా నిలవాల్సి వచ్చింది. కాంగ్రెస్ నాయకుడుగా ఆ బాధ్యత నాపై పడింది.

మా మామగారి మరణానంతరం నేను నా కుటుంబాన్ని బయ్యన గూడేనికి మార్చాను. అక్కడ సాయుధ పోలీస్ క్యాంప్ వుండేది. నేను పెనుబల్లిలో వ్యవసాయం చేయిస్తూ, కాంగ్రెస్ వ్యవహారాలను కూడ చూస్తుండేవాడిని. నా దృష్టికి వచ్చిన అధికారుల అవినీతిని నిర్భయంగా బయటపెడుతూ వుండటంతో

వాళ్లు సహజంగా నాపై కక్ష బూని వుండేవారు. 1950లో ఒకసారి వాళ్లు నన్నూ, యింకా పదిమంది కాంగ్రెస్ కార్యకర్తలనూ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పనిచేస్తున్నామనీ, కమ్యూనిస్టుల మనీ ఆరోపించి, తప్పుడు కేసులు బనాయించి అరెస్టు చేశారు. వరంగల్లు సెంట్రల్ జైలుకు పంపారు. హైద్రాబాద్‌లో వున్న కాంగ్రెస్ నాయకుల జోక్యం వలన మేము నిర్దోషులమని తేలి, మమ్మల్ని విడుదల చేశారు. ఈ లోగా ఆ యేడు వేసవి మూడు నెలల పదిహేను రోజులకు పైగా మేము నిష్కారణంగా జైలులో మగ్గాల్సి వచ్చింది. అయినా నేను జంక లేదు. నేను జైలు నుంచి విడుదలయిన తరువాత కూడా అటు కమ్యూనిస్టుల తోనూ, యిటు అవినీతి పరులైన అధికారుల తోనూ నా పోరాటం ఇంకా ఉధృతంగా కొనసాగించాను.

## సార్వత్రిక ఎన్నికలు :

1950 జనవరి 26న భారతదేశం రిపబ్లిక్‌గా అవతరించింది. నూతన రాజ్యాంగం అమలులోకి వచ్చింది. రాజ్యాంగాన్ననుసరించి దేశవ్యాప్తంగా వయోజన ఓటింగ్ పద్ధతిలో మొదటి సారి 1952లో సార్వత్రిక ఎన్నికలు జరిగాయి. భారత దేశంలో దాదాపు అన్ని రాష్ట్రాల లోనూ కాంగ్రెస్ గెలిచింది. కేంద్రంలో జవహర్‌లాల్ నెహ్రూ నాయకత్వం లో కాంగ్రెస్ ప్రభుత్వం అధికారంలో కొనసాగింది. కాని గ్రామాలలో పోలీసులు సాగించిన దౌర్జన్యాల వలన ఖమ్మం, వరంగల్, నలగొండ వంటి తెలంగాణా జిల్లాల్లో కాంగ్రెస్ నాయకులంతా ఓటమిని రుచి చూశారు. అయితే మిగతా ప్రాంతాలలో కాంగ్రెస్ గెలవటంతో హైదరాబాద్ రాష్ట్రంలో కాంగ్రెస్ మంత్రివర్గమేర్పడింది. బూర్గుల రామకృష్ణారావుగారు ముఖ్యమంత్రి అయ్యారు. ఒకప్పుడు గవర్నర్ జనరల్‌గా పనిచేసిన రాజగోపాలాచారిగారు ముఖ్యమంత్రిగా ఉమ్మడి మదరాసు రాష్ట్రంలో కాంగ్రెస్ మంత్రి వర్గాన్నేర్పరచారు.

తరువాత కొంతకాలానికి శ్రీ పొట్టి శ్రీరాములు ఆత్మ బలిదానం ఫలితంగా కర్నూలు రాజధానిగా ఆంధ్ర రాష్ట్రం ఏర్పడింది. కేంద్రం రాష్ట్రాల పునర్విభజన సంఘాన్ని ఫజల్ ఆలీ అధ్యక్షతన నియమించింది. భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు జరగటంతో 1956లో నవంబరు 1న హైదరాబాదు రాజధానిగా ఆంధ్రప్రదేశ్ అవతరించింది.

# నిజాం పాలనలో

# ప్రజల స్థితిగతులు

పూర్వపు హైదరాబాదు సంస్థానంలో అన్ని ప్రాంతాలూ నిజాం నవాబు ప్రత్యక్ష పాలనలో వుండేవి కావు. కొన్ని ప్రాంతాలను, నిజాం తాబేదారులైన రాజాలు, జాగీర్దారులు పాలించేవారు. మిగిలిన ప్రాంతాలలో సుబేదారుల ద్వారా నిజాం పాలన జరిగేది. సంస్థానంలో వేలాది ఎకరాల ఆస్తిగల పెద్ద పెద్ద భూస్వాములూ, బంజరుదార్లూ, దేశముఖ్‌లూ, దేశ పాండ్యాలూ వుండేవారు. వాళ్లంతా ప్రజలను పీడించి వసూళ్లు చేసు కొంటూ, అందులో కొంత నిజాం నవాబుకు నజరానాగా సమర్పించు కొనే వాళ్లు. సంస్థానానికి సొంత సైన్యం, పోలీస్ బలగమేకాక, సొంత తపాలా సర్వీసు, కరెన్సీ వుండేవి. హైదరాబాదు సంస్థానంలో రైల్వే, బస్ సౌకర్యాలు ప్రభుత్వ పరంగా వుండేవి.

## వెట్టిచాకిరీ :

పోలీస్ చర్య తరువాత హైదరాబాదు సంస్థానాన్ని హైదరాబాదు రాష్ట్రంగా మార్చారు. సంస్థానంలోని రాజ్యాలనూ, జాగీరులనూ రద్దుచేసి రాష్ట్రంలో విలీనం చేశారు. ఈ రాజాలుగాని, జాగీర్దారులుగాని తమ హయాంలో గ్రామాలలో రహదారి సౌకర్యాలపైగాని, విద్యా సౌకర్యాలపై గాని ఒక్క రూపాయి అయినా ఖర్చు చేసిన పాపాన పోలేదు. నాకు గుర్తున్నంతవరకు చాలా గ్రామాలలో ఒక్కరైనా చదువుకున్న మనిషి కనపడేవాడుకాదు. పేద రైతులు ఎంతో కష్టపడి వ్యవసాయం చేసి పంటలు పండించుకుంటే, అధికారులు వాళ్లను పీడించి శిస్తు పేరిట ఇష్టమొచ్చి నంత వసూలు చేసేవారు. ఇంతేకాక వెట్టి చాకిరీ చేయించుకొనేవారు. వూరూరా పటేలు (మునసబు), పట్వారీ (కరణం) వుండేవారు. కొన్ని వూళ్లలో మాలీపటేల్ (రెవెన్యూ చూసే మునసబు), పోలీస్ పటేల్ (లా అండ్ ఆర్డర్‌కు సంబంధించిన మునసబు) వేరు వేరుగా వుండేవారు. వీళ్లు ప్రజలపై బాగా జులుం సాగించేవారు. జనమంతా వారి అదుపాజ్ఞలలో వుండి, వారు చెప్పినట్లు చేయాల్సి వుండేది. ఎవరయినా ఎదురు చెబితే వారిని పోలీస్, రెవెన్యూ అధికార్ల సాయంతో నానా యిబ్బందులు పెట్టేవారు. ఎవరయినా ప్రభుత్వాధికారి గ్రామానికి 'దౌరా' (టూర్) వస్తే, ఆయనగారికి కావలసిన వసతి,

భోజనం మొదలయిన ఏర్పాట్లన్నీ గ్రామాధికారులు చేసేవారు. వారి తిండి కింద ఖర్చయే కిరాణా మొత్తం వూళ్ళోని దుకాణదార్లు వూరికే యిచ్చుకోవాలి. గ్రామ తలారులు వారికి కావలసిన కట్టెపేళ్లు, కుండలు, మంచాలు, కూరలు, కోళ్లు, మేకలు, గొర్రెలు మొదలైనవన్నీ వూరికే లాక్కొచ్చేవారు. రజకుడు, క్షురకుడు మొదలయిన గ్రామీణ వృత్తి పనివాళ్లంతా వచ్చి వూరికే పనులు చేసిపెట్టాలి. ఇదీ వెట్టిచాకిరి విధానం. అప్పటి 'ఫర్మానా' (ప్రభుత్వ వుత్తరువు) ప్రకారం వీటన్నిటికీ మకాం చేసిన అధికారులు మూల్యం చెల్లించాలనే నియమం వుండేది కాని అది కాగితాలపైనే గాని వాస్తవంగా అమలయ్యేది కాదు.

## నాగు :

గ్రామాల్లో సాంఘిక, ఆర్థిక పరిస్థితులెంతో అధ్వాన్నంగా వుండేవి. వ్యవసాయం చాలాభాగం వర్షాధారంగా వుండేది రెక్కలు ముక్కలు చేసికొని ఏవో నాలుగు గింజలు పండిస్తే, అందులో ఎక్కువభాగం అప్పుల కింద షాహుకార్లు (ఋణదాతలు) కట్టుకొనేవారు. ఇందుకు వాళ్లు 'నాగు' అనే పద్ధతి పాటించేవాళ్లు. బస్తా ధాన్యం బదులు తీసుకొంటే, పంట రాగానే రెండు బస్తాలిచ్చుకోవాలి. 'నాగు' అనేది ఒక రకమైన వడ్డీ లాటిది. నాగులకూ, శిస్తులకూ పోను రైతుకేం మిగిలేది కాదు. యిల్లు గడవటానికీ, వ్యవసాయం సాగటానికీ 'నాగు' మళ్లీ తప్పనిసరయ్యేది. అప్పు తీర్చలేని వాళ్లు అది తీరిందాకా వూరికే (జీత భత్యాలు లేకుండా) పని చేయాల్సి వుండేది. అప్పు తీసుకొన్న వ్యక్తి చనిపోతే అతని భార్యా కొడుకూ వెట్టిచాకిరీ చేయాల్సి వుండేది. ఇలా తర తరాలుగా ఆ అప్పు తీరేదికాదు, వీడి చాకిరీకి అంతం వుండేదికాదు.

## నిర్విరామ కృషి :

ఆ పరిస్థితులలో ప్రజలను చైతన్య వంతులను చేసి, ఆ పద్ధతులకు స్వస్తి చెప్పే కార్యక్రమాన్ని కాంగ్రెస్ కార్యకర్తలుగా మేం స్వీకరించాల్సి వచ్చింది. మేం వూళ్లకు వెళ్లి అక్కడ కాంగ్రెస్ కార్యకర్తలను ఏర్పాటు చేసి, వారి ద్వారా అక్కడి విషయాలను తెలుసుకొంటూ వుండేవాళ్లం. ఇందు కోసం ఒక్కోసారి కాలినడకన మైళ్లకు మైళ్లు పోవాల్సి వచ్చేది. బాట సరిగావుంటే, రైతులు మమ్మల్ని ఆపి ఎద్దుల బండి కట్టి పంపేవారు. వర్షాకాలమైతే బండ్లు సాగేవికావు. ఏరులూ, వాగులూ దాటుకొంటూ బురదలో కాలినడకనే వెళ్లాల్సి వుండేది. కాని మమ్మల్ని చూస్తే గ్రామాలలోని ప్రజలకు చాల ధైర్యం వచ్చేది. భూస్వాముల దౌర్జన్యాన్ని ఎదుర్కొనే

సాహసం కనిపించేది. ఆ పరిణామాలను చూస్తే, మా కెంతో ఆనందం కలిగి, మా ప్రయాణాయాసాన్ని మరిచి పోయేవాళ్లం.

ఇలా మూడు, నాలుగు సంవత్సరాల పాటు శ్రమించగా, పరిస్థితులు కొంత మెరుగు పడ్డాయి. ప్రజల్లో చైతన్యం కనిపించసాగింది. ఊళ్లలో పాఠశాలలు పెట్టాలంటే గ్రామ పెద్దలు సహకరించేవారు కారు. చదువు కుంటే జనం తెలివి మీరి పోతారనీ, తమ పెత్తనం సాగదనీ వాళ్ల భయం. అందుకని, మేము పట్టుదలగా వూళ్లలో పాఠశాలలు పెట్టించేవాళ్లం. పెద్ద వూళ్లలో హైస్కూళ్లు ఏర్పాటు చేసేవాళ్లం. ఎన్నికలు జరిగి కాంగ్రెస్ ప్రభుత్వం రాకముందే వూళ్లలో కాంగ్రెస్ ఆధ్వర్యంలో నేను, నా అనుచరులం కలిసి ఈ కార్యక్రమాలను అమలు జరుపుతుండే వాళ్లం.

బూర్గుల ప్రభుత్వ కాలంలో వరంగల్ జిల్లాను విభజించి, ఖమ్మం కేంద్రంగా 1953లో ఖమ్మం జిల్లాను కొత్తగా ఏర్పాటు చేశారు.

## భూస్వాముల జులుం :

అప్పటి ఖమ్మం జిల్లాలో పెద్ద పెద్ద భూస్వాములంతా ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావుగారికీ, ఆయన బావమరిది మందుముల నరసింగరావు గారికీ, చాలదగ్గర బంధువులు. ఒక్కొక్క భూస్వామికి నాలుగయిదుగ్రామాల్లో పది పదిహేనువేల ఎకరాల దాకా భూములుండేవి. ఎవరో కొద్ది మంది రైతులకు తప్ప సొంత కమతం అంటూ వుండేది కాదు. అంతా ఈ భూస్వాముల దగ్గర పొలాలు కౌళ్లకు తీసికొని సాగు చేసికొనేవారు. కౌలు గింజల రూపంలోనో, డబ్బురూపేణానో వుండేది. భూస్వాములకు ఎప్పుడు కోపం వస్తే అప్పుడు కౌలుదార్ని తీసేసేవాడు. కాదు కూడదంటే దౌర్జన్యం చేసేవాడు.

## భూసంస్కరణలు :

బూర్గుల రామకృష్ణారావుగారి నాయకత్వంలో కాంగ్రెస్ మంత్రి వర్గం ఏర్పడగానే కౌలుదార్ల సమస్యను పరిష్కరించే కృషి ప్రారంభమైంది. కౌలుదార్ల రక్షణకై శాసన సభలో బిల్లును ప్రవేశపెట్టి కౌలుదార్లకు చట్టపరమైన రక్షణ కల్పించారు. కౌలు దారీ చట్టాన్ని మొట్టమొదట ఖమ్మం జిల్లాలోనే అమలు చేయ ప్రారంభించటం ఒక చరిత్రాత్మక సంఘటన. ఈ శాసనం ప్రకారం భూస్వాములు తమ చిత్తం వచ్చినప్పుడు కౌలుదార్లను తొలగించకుండా రక్షణ కల్పించారు.

భూమిని పట్టాచేసి కొనేందుకు కూడా కౌలు దార్లకు వీలు కల్పించారు. భూస్వాములు ఒక పరిమితికి మించి భూమిని వుంచుకొనే వీలు లేకుండా చేశారు.

ఈ శాసనం కాగితాలపైన మిగిలిపోకుండా చూసే బాధ్యతను నేనూ, నా అనుచరకార్యకర్తలంతా స్వీకరించాం. ఊరూరా వెళ్లి కౌలు దార్లకు గల హక్కులేమిటో వివరించాం. కొద్ది మొత్తాన్ని చెల్లించి చట్ట ప్రకారం వాళ్లు తాము కౌలుకు తీసుకొన్న భూములకు పట్టాదార్లు కావచ్చున్న సంగతిని తెలియచెప్పాం. నా ఉద్యమం ఫలితంగా కౌలుదార్లు ఎందరో నేడు రైతులుగా మారి తమ భూములను కష్టపడి అభివృద్ధి చేసికొని ఫలసాయం తీసుకోగల్గుతున్నారు. తాము కడుపునిండా తినటమేగాక, తమ పిల్లలను చదివించుకోగల్గుతున్నారు. లక్షలాది కటుంబాలకు శాశ్వత ప్రయోజనం కల్గించిన కౌలుదారీ చట్టం సరిగా అమలయ్యేందుకు జరిగిన మహాయజ్ఞంలో ఆధ్వర్యం వహించే అవకాశం ఆనాడు నాకు లభించటం నా అదృష్టం. ఇప్పటికీ ఆ ప్రాంతాల్లోని రైతులు నన్నుకలిసినప్పుడు ఇదంతా మీ చలవే అని తాము పొందిన అభివృద్ధిని గురించి చెబుతుంటే నాకెంతో ఆనందం కలుగుతూ వుంటుంది. ఒకనాడు స్వేచ్ఛలేక, ఎంత కష్టపడ్డా ఫలసాయం తనకు దక్కుతుందనే హామీలేక అలమటించిన కుటుంబాలు యీనాడు స్వేచ్ఛగా, హాయిగా జీవిస్తున్నారు. పొలాలకు సొంత దారులయ్యారు. ఇతరులతో పాటు సమానంగా మానవులుగా చూడబడుతూ సంతోషంగా సంసారాన్ని నడుపుకోగల్గుతున్నారు. ఇందుకు ఆనాడు మేం సాగించిన ఉద్యమం ఎంతో దోహదం చేసింది. ఈ ఉద్యమంలో నా వెంట ఎందరో కార్యకర్తలు వూరూరు తిరిగి పాటుబడ్డారు. అనేక కష్టనష్టాలకోర్చి మా నాయకత్వానికి అండగా నిలిచారు. ఆ విషయాలను తలచుకుంటే ఎంతో ఉత్సాహం, తృప్తి కలుగుతుంటాయి.

## కాంగ్రెస్‌కు కొత్తవూపు :

1957వ సంవత్సరంలో నేను ఖమ్మం జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నికయ్యాను. జిల్లాలో తమ ప్రాబల్యాన్ని పెంచుకొన్న కమ్యూనిస్టుల నెదుర్కొని, కాంగ్రెసును పటిష్ఠం చేసే బాధ్యత నా మీదా, నా తోటి కార్య కర్తల మీదా పడింది. మా కృషి ఫలితంగా జిల్లాలో మెజారిటీస్థానాల్లో కాంగ్రెస్ అభ్యర్థులను 1957లో జరిగిన శాసన సభ ఎన్నికల్లో గెల్పించుకో గలిగాం. నేను జిల్లా బాధ్యత తీసికోడం వల్ల వేంసూరు నియోజకవర్గం నుండి నా తమ్ముడు కొండలరావును పోటీ చేయించి, కమ్యూనిస్ట్ అభ్యర్థిపై గెలిపించటం జరిగింది.

# ఆంధ్రప్రదేశ్ - ఆ తరువాత

**1956**లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పుడు, నూతన రాష్ట్ర తొలి ముఖ్యమంత్రిగా శ్రీ నీలం సంజీవరెడ్డిగారు ఎన్నికయ్యారు. ఆయన మంత్రి వర్గంలో కళా వెంకట్రావు, బెజవాడ గోపాలరెడ్డి వంటి పెద్దలు పని చేశారు. సంజీవరెడ్డిగారి హయాంలో రాష్ట్రంలో అనేక అభివృద్ధి పథకాలు ప్రారంభించ బడ్డాయి. ముఖ్యంగా నాగార్జునసాగర్, శ్రీ శైలం, పోచంపాడు వంటి పెద్ద ప్రాజెక్టుల నిర్మాణం ప్రారంభించారు. ఈ ప్రాజెక్టులకు జవహర్‌లాల్ నెహ్రూగారు శంకుస్థాపన చేశారు. అప్పుడు కాంగ్రెస్‌లో అంతా ఐకమత్యంగా వుండి రాష్ట్రాన్ని అన్ని విధాలా ముందుకు తీసుకొని వెళ్లాలన్న పట్టుదలతో పని చేయటం జరిగింది.

## పంచాయతీ రాజ్ :

సంజీవ రెడ్డిగారు ముఖ్యమంత్రిగా వుండగా రాష్ట్రంలో పంచాయతీ రాజ్‌ను ఏర్పాటు చేశారు. అందుకోసం ప్రత్యేకంగా ఒక శాసనాన్ని తెచ్చారు. అంతకు ముందు ఆంధ్ర ప్రాంతంలో బ్రిటీషు వారు పెట్టిన జిల్లా బోర్డులూ, కొన్ని గ్రామాలలో పంచాయతీ బోర్డులూవుండేవి. తెలంగాణా జిల్లాల్లో వెనుకటి నిజాం ప్రభుత్వం ఏర్పాటు చేసిన స్థానిక స్వపరిపాలనా సంస్థలున్నా, అభివృద్ధేమీ జరగలేదు.

నూతన పంచాయతీరాజ్ వ్యవస్థలో జిల్లా పరిషత్‌లు, పంచాయతీ సమితులు, గ్రామపంచాయతులు అని మూడు తంతెలున్నాయి. చట్ట బద్ధంగా ఎన్నికలుజరిపి వీటినిఏర్పరచారు. ఫలితంగా **1959** నవంబరు**1**న పంచాయతీరాజ్ ఆవిష్కరణ జరిగింది. ఖమ్మం జిల్లాలో నూతనంగా ఏర్పడిన జిల్లా పరిషత్ తొలి అధ్యక్షునిగా నేను ఎన్నికయ్యాను. అయిదు సంవత్సరాలపాటు ఆ పదవిలో వుండి జిల్లా ప్రజలకు సేవ చేసే అవకాశం నాకు లభించింది. అప్పుడు ఖమ్మం జిల్లా అన్ని రంగాల్లోనూ బాగా వెనుకబడి వుండేది. జిల్లా అంతటికీ కలిపి రెండో మూడో హైస్కూళ్లుండే వంటే పరిస్థితి ఎంత దారుణంగా వుందో అర్థం అవుతుంది.

నేను అధ్యక్షుడిగా వున్న కాలంలో దాదాపు ప్రతి గ్రామంలోనూ ఒక పాఠశాల నెలకొల్పాము. **130** ఉన్నత పాఠశాలలు ఏర్పాటు చేశాము. ఇంకా జూనియర్ కాలేజీలు, డిగ్రీ కాలేజీలు స్థాపించటం జరిగింది.

విద్యా రంగంతోపాటు రహదార్లపరిస్థితికూడా ఎంతో అధ్వాన్నంగా వుండేది. కనుక గ్రామీణ రహదారుల పరిస్థితిని మెరుగు పరచే ప్రయత్నం చేశాము. జిల్లాలో చాలా భాగం ఏజెన్సీ ఏరియా కావటంతో రహదారి సౌకర్యాలు నామమాత్రంగా వుండేవి. పల్లెలకు రోడ్లు వేసే కార్యక్రమాన్ని జయప్రదంగా కొనసాగించాము.

అలాగే పల్లె ప్రజలకు వైద్య సౌకర్యం ఎంతో అవసరం. కాబట్టి ప్రతి పంచాయతీ సమితిలోనూ ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను ఏర్పాటు చేయటంజరిగింది. తాలూకాకేంద్రాలకూ, కొన్నిముఖ్యమైన గ్రామాలకు విద్యుత్ సౌకర్యం ఏర్పాటు చేయబడింది. నీటిపారుదల వసతుల గురించి శ్రద్ధతీసికోడం జరిగింది. ఖమ్మం పట్టణంలో జిల్లా కలక్టర్ కార్యాలయభవనాన్ని, జిల్లా పరిషత్ భవనాన్నీ జిల్లా ఆసుపత్రి భవనాన్నీ నూతనంగా నిర్మించుకోవటం విశేషం.

**1962**వ సంవత్సరంలో రాష్ట్రశాసన సభకు నేను ఎన్నికయ్యాను. అప్పటి నుండీ జిల్లారాజకీయాల్తోపాటు రాష్ట్ర రాజకీయాల్లో కూడ నేను చురుకుగా పాల్గొంటూ వచ్చాను.

## సంజీవయ్య :

నేను జిల్లా పరిషత్ అధ్యక్షుడుగా వున్న రోజుల్లోనే - అంటే **1960**లో సంజీవరెడ్డిగారు అఖిల భారతకాంగ్రెస్ అధ్యక్షులుగా వెళ్లారు. అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షుడుగా సంజీవరెడ్డిగారు వెళ్లే సమయంలో అంత వరకూ ఆయనకు అల్లూరి సత్యనారాయణ రాజు ముఖ్య స్నేహితులుగా వున్నారు. ఎందుకో సంజీవరెడ్డిగారు తన తర్వాత అల్లూరి ముఖ్యమంత్రి కారాదని పట్టుపట్టారు. ఆంధ్రప్రదేశ్ అవతరణ సమయంలో గోపాలరెడ్డిగారు ముఖ్యమంత్రి కాకుండా సంజీవరెడ్డి గారు ఆ పదవికి ఎన్నికయ్యేలా చేయటంలో ముఖ్యపాత్ర వహించినది అల్లూరే. అటువంటి అల్లూరిని కాదని సంజీవరెడ్డిగారు కాసు బ్రహ్మానందరెడ్డిని తన వారసుడుగా ఎంచుకొనటం అందరికీ ఆశ్చర్యం కల్గించింది. నిజానికి ఒకప్పుడు కాసు బ్రహ్మానంద రెడ్డిగారిని సంజీవరెడ్డిగారు తన మంత్రి వర్గంలో చేర్చుకొనడానికి కూడా యిష్టపడలేదు!

అల్లూరి ముఖ్యమంత్రి కారాదని సంజీవరెడ్డిగారు మంకు పట్టు పట్టటం రాష్ట్రరాజకీయాలలో తీవ్ర సంక్షోభానికి దారి తీసింది. ఏ.సి. సుబ్బారెడ్డి గారు,

తదితర నాయకులు బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రి కావడాన్ని ఏ పరిస్థితులలోనూ ఒప్పుకోమని తెగేసి చెప్పారు. అప్పుడు రాజీ అభ్యర్థిగా సంజీవయ్యగారి పేరు ప్రతిపాదించటం, సంజీవరెడ్డిగారు వ్యతిరేకించినా నెహ్రూ, ఇందిరా గాంధీల ఆశీస్సులతో సంజీవయ్యగారు ముఖ్యమంత్రికావటం జరిగిపోయాయి.

సంజీవయ్యగారు తొలి హరిజన ముఖ్యమంత్రి. అప్పటికీ యిప్పటికీ రాష్ట్ర ముఖ్యమంత్రి పదవిని అతి తక్కువ వయసులో అధిష్ఠించిన వ్యక్తి ఆయనే. సంజీవయ్యగారు నిరాడంబరుడు. నీతి, నిజాయితీలకు పేరుగాంచిన వ్యక్తి ఆంధ్ర, ఆంగ్ల భాషలలో చక్కని వక్త. సాహిత్యాభి రుచి, సంగీత పరిచయం కలిగిన సరసుడు, సహృదయుడు. గొంతెత్తి రాగయుక్తంగా, భావగర్భితంగా పద్యాలు చదవటం ఆయనకు సరదా. ఆయనకు కల్లా, కపటం తెలియదు. సాఫీ అయిన వ్యక్తి. అందుకే ఆయనతో నాకు మంచి స్నేహ సంబంధాలుండేవి.

## మళ్లీ సంజీవరెడ్డి :

కాని దురదృష్ట వశాత్తు సంజీవయ్య గారిని ఎక్కువ కాలం ముఖ్య మంత్రిగా వుండనీయలేదు. బ్రహ్మానందరెడ్డి వర్గం ఆయనకు వ్యతిరేకంగా పని చేస్తూ వచ్చింది. సంజీవయ్య ముఖ్యమంత్రిగా వుండగా, **1962** ఎన్నికలలో కాంగ్రెస్ విజయం సాధించింది. అందువల్ల సహజంగా ఆయన తిరిగి ముఖ్యమంత్రి కావాల్సి వుంది. అయినా సంజీవరెడ్డిగారు ఢిల్లీలో జవహర్‌లాల్ నెహ్రూ గారితో మాట్లాడి ప్రయత్నం చేసుకొని తిరిగి తానే ముఖ్యమంత్రిగా రావటం జరిగింది.

సంజీవరెడ్డి గారిని రెండవ సారి ముఖ్యమంత్రిగా తిరిగి పంపే సమయంలో జవహర్‌లాల్ నెహ్రూ ఆయనతో సంజీవయ్యగారినీ, ఆయన సూచించే యిద్దరు వ్యక్తులనూ మంత్రి వర్గంలోకి తీసుకో వలసిందిగా చెప్పారు సంజీవయ్యగారి మంచి తనాన్నిబట్టి నెహ్రూ ప్రత్యేకంగా యీ సూచన చేశారు. సంజీవరెడ్డిగారు నెహ్రూ చెప్పినమాట తప్పి సంజీవయ్య గారి నొక్కరినైతే మంత్రి వర్గంలోకి తీసుకుంటానుగాని మిగిలిన యిద్దరినీ తీసుకోనని చెప్పారు. దానిపై సంజీవయ్య గారు సంజీవరెడ్డిగారి మంత్రి వర్గంలో చేరేందుకు నిరాకరించారు. ఈ సంగతి ఇందిరాగాంధి గారికి తెలిసింది. ఆమె తన తండ్రి జవహర్‌లాల్ దగ్గరకు వెళ్లి సంజీవరెడ్డిగారు ఆడిన మాట తప్పారని చెప్పింది. జవహర్‌లాల్ నెహ్రూకు ఆగ్రహం వచ్చింది. వెంటనే సంజీవయ్యగారిని సంజీవరెడ్డిగారి స్థానంలో అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షులుగా నియమించారు. ఆ విధంగా ఆయన అఖిల

భారత కాంగ్రెస్ సంస్థకు మొదటి హరిజన అధ్యక్షు లయ్యారు.

## పంచాయతీ రాజ్ ఛాంబర్ :

జిల్లా పరిషత్ అధ్యక్షుడుగా నేను అయిదు సంవత్సరాల పదవీకాలం పూర్తి చేసిన తర్వాత మళ్లీ పంచాయతీ ఎన్నికలు జరిగాయి. నా సోదరుడు కొండలరావు ఖమ్మం జిల్లా పరిషత్ అధ్యక్షుడుగా ఎన్నికయినాడు. సంజీవరెడ్డిగారు ముఖ్యమంత్రి అయిన తర్వాత 1963లో నన్ను రాష్ట్ర పంచాయతీ ఛాంబర్ అధ్యక్షులుగా ఉండవలసిందిగా కోరారు. ఆ హోదాలో నేను రాష్ట్రమంతటా పర్యటించి పంచాయతీ రాజ్ సంస్థల కృషిని సమన్వయం చేయటానికి శ్రద్ధ తీసికోగలిగాను. రాష్ట్రంలో అన్ని జిల్లాల నాయకుల తోను సత్సంబంధాలు ఏర్పరచుకొనేందుకు నాకు అప్పుడుచక్కనిఅవకాశం లభించింది. తరువాతనేను రాష్ట్ర ముఖ్యమంత్రిగా వున్నప్పుడు ఆ పరిచయాలూ, సంబంధాలూ బాగా ఉపకరించాయి.

సంజీవరెడ్డిగారు 1962లో (రెండవసారి) ముఖ్యమంత్రిగా వచ్చినప్పుడు బ్రహ్మానందరెడ్డిగారి సలహాపై ఎక్కువ ఆధారపడుతూ వచ్చారు. మంత్రి వర్గనిర్మాణంలోనూ, తరవాతా బ్రహ్మానందరెడ్డి గారి ప్రభావం సంజీవరెడ్డిగారిపై స్పష్టంగా కనుపించింది. దాని వల్ల అంతకు ముందు ముఖ్యమంత్రిగా సంజీవరెడ్డి గారు సంపాదించుకొన్న మంచి పేరు దెబ్బతిన్నది. సంజీవరెడ్డి గారి కీర్తి ప్రతిష్ఠలు దెబ్బతినటానికే కాక రాష్ట్ర రాజకీయాలు కలుషితం కావటానిక్కూడా బ్రహ్మానందరెడ్డే కారకుడనక తప్పదు. ఎవరికి కష్టం కలిగినా సరే ఈ యదార్థం రాయక తప్పదు.

## దొడ్డిదారి :

ఇంతలో సంజీవరెడ్డిగారిని వ్యక్తి గతంగా ప్రస్తావించి ఆక్షేపిస్తూ కోర్టు తీర్పు రావటంతో ఆయన తన పదవికి రాజీనామా యివ్వవలసివచ్చింది. తరువాత సంజీవరెడ్డి గారు తన అనుచరులను ఢిల్లీ పంపించి రాజీనామా ఆమోదించబడకుండా ఆపాలన్న ప్రయత్నం చేసినా, అప్పటి ప్రధాని నెహ్రూ ఆ సూచనకు అంగీకరించలేదు. పార్టీ హైకమాండు ఆయన రాజీనామాను ఆమోదించి వైతొలగేందుకు అనుమతించింది. ఈ సారి కూడా సంజీవరెడ్డిగారు తన తర్వాత బ్రహ్మానంద రెడ్డిగారినే ముఖ్యమంత్రి చేయాలనే నిర్ణయానికి వచ్చారు. బ్రహ్మానంద రెడ్డి పోటీ చేస్తే, ఎ.సి. సుబ్బారెడ్డి గార్ని పోటీకి నిలపాలని మెజారిటీ

సభ్యుల అభిప్రాయంగా కనుపించింది. ఈ పరిస్థితినుండి మర్యాదగా బయట పడటానికి తాను శాసనసభాపక్ష నాయకుడిగా వుంటూ, బ్రహ్మానందరెడ్డిని ముఖ్యమంత్రి పదవీ స్వీకారం చేసే ఏర్పాటు చేయవలసిందిగా ఆయన గవర్నరును కోరారు. ఫలితంగా బ్రహ్మానందరెడ్డి దొడ్డిదారిన ముఖ్యమంత్రయ్యే వీలు చిక్కింది. ప్రజాస్వామ్య వ్యవస్థలో సంజీవరెడ్డిగారి వంటి నీతులు చెప్పేటటువంటి నాయకులు చేయాల్సిన పని యిది కాదు.

## లాల్‌బహదూర్ :

**1964** మే **27**న ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ దివంగతు లయ్యారు. వెంటనే సంజీవరెడ్డి గారిని ఢిల్లీ రావలసిందిగా వర్తమానం అందింది. అప్పటి కాంగ్రెస్ అధిష్ఠానవర్గం కామరాజ్ నాడార్ అధ్యక్షతన సమావేశమై నెహ్రూ తరవాత శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి గారిని ప్రధానిగా ఎన్ను కోవాలని నిర్ణయించింది. లాల్‌బహదూర్ నెహ్రూకు ఆంతరంగిక సహచరుడు. అత్యంత నిరాడంబరుడుగా పేరొందిన వ్యక్తి. నీతి, నిజాయతీలకు పెట్టిన పేరు. ఆయన ప్రధానిగా ఏర్పరచిన మంత్రివర్గంలో సంజీవరెడ్డిగారిని పౌర, విమానయాన శాఖామంత్రిగా నియమించారు. ఫలితంగా సంజీవరెడ్డిగారు శాసనసభా సభ్యత్వానికి, శాసనసభా కాంగ్రెస్ నాయకత్వానికీ రాజీనామా చేయవలసి వచ్చింది. అప్పుడు బ్రహ్మానందరెడ్డి గారు ముఖ్యమంత్రిగా వుండటం వల్ల ఆయనే కాంగ్రెస్ శాసనసభా పక్ష నాయకునిగా ఎన్నికయ్యారు.

## జైజవాన్ ! జైకిసాన్ ! :

లాల్ బహదూర్ శాస్త్రిగారు ప్రధానిగా వుండగా వ్యవసాయ రంగానికి ఇతోధికంగా ప్రోత్సాహం లభించింది. అధికోత్పత్తి సాధించ టానికి పునాదులు పడ్డాయి. సైనికంగా కూడ దేశాన్ని పటిష్ఠం చేయటం జరిగింది.- **1968**లో పాకిస్తాన్ మనదేశంపై దురాక్రమణ చేసినప్పుడు లాల్ బహదూర్ శాస్త్రి సాహసోపేతమైన నిర్ణయాలు తీసుకొని విజయం సాధించగలిగారు. అప్పుడు పాకిస్తాన్ అధ్యక్షుడుగా నియంతృత్వం చెలాయిస్తోంది జనరల్ ఆయూబ్ ఖాన్. భారత సైన్యం అంతర్జాతీయ సరిహద్దును దాటి పాకిస్తాన్‌లో ప్రవేశించేందుకు లాల్ బహదూర్ అనుమతిస్తారని ఆయన వూహించలేదు. విమాన బలాన్ని వుపయోగించి పాకిస్తాన్‌లోని సైనిక స్థావరాలపై బాంబులు వేసేందుక్కూడా లాల్ బహదూర్ సాహసించడని ఆయన అనుకొన్నాడు. అయితే ఆయూబ్ ఖాన్

అంచనాలను తలకిందులు చేశారు లాల్ బహదూర్. ''జై జవాన్! జై కిసాన్!'' అన్న నినాదం శాస్త్రిగారిదే. మన సైన్యం విజయోన్ముఖంగా సాగిపోతున్నా కూడ, శాంతిని పరిరక్షించాలన్న వుద్దేశంతోనే లాల్ బహదూర్ యుద్ధ విరమణకు అంగీకరించి, చర్చలకు సిద్ధమయ్యారు.

## శాస్త్రి అస్తమయం :

అప్పటి రష్యా ప్రధాని కోసిగిన్ పిలుపుపై భారత ప్రధాని లాల్ బహదూర్, పాకిస్తాన్ అధ్యక్షులు ఆయూబ్‌ఖాన్ రెండు రోజులపాటు తాష్కెంట్‌లో సుదీర్ఘ చర్చలుజరిపారు. చివరకు ఇద్దరూ ఒక ఒప్పందానికి వచ్చి కొసిగిన్ సమక్షంలో దానిపై సంతకాలు చేశారు. ఆ ఒప్పందం క్రింద భారత సైన్యాలు తాము పాకిస్తాన్‌లో ఆక్రమించిన భూభాగం నుండి ఉప సంహరించు కొంటాయి. అలాగే పాక్ సేనలు భారత భూభాగం నుండి వెనక్కుమళ్లుతాయి. సమస్యల పరిష్కారానికి రెండు దేశాలూ పరస్పర సంప్రదింపులు జరుపుతాయి.

కార్యక్రమం ప్రకారం లాల్ బహదూర్ శాస్త్రి ఆ రాత్రి తాష్కెంటు లో వుండి మరునాడు ఉదయాన్నే ఢిల్లీకి తిరిగి రావాల్సి వుంది. కాని దురదృష్ట వశాత్తు ఆయనకు ఆ రాత్రి తీవ్రంగా గుండె పోటు వచ్చింది. డాక్టర్లు ఆఘమేఘాలపై వచ్చి ఎంత ప్రయత్నం చేసినా ఫలితం దక్కలేదు. ఆ మహనీయుడు అలా హఠాన్మరణం పాలవటం ప్రపంచాన్నే దిగ్భ్రాంతిలో ముంచింది.

లాల్‌బహదూర్ భౌతికకాయాన్ని విమానంలో ఢిల్లీకి తీసుకొని వచ్చారు. ఆయన మృతదేహం వున్న పేటికను పాకిస్తాన్ నియంత ఆయూబ్‌ఖాన్, రష్యా ప్రధాని కొసిగిన్‌లు విమానం నుండి స్వయంగా మోసుకొని వచ్చారు. లాల్ బహదూర్ శాస్త్రి ఉన్నత వ్యక్తిత్వం ఆ అగ్రనాయకులను ఎంతగా ఆకట్టుకొందో దీనిని బట్టి తెలుసుకోవచ్చు. లాల్ బహదూర్ శాస్త్రి గారి శరీరానికి అంతిమ సంస్కారాలు జరిగిన స్థలాన్ని 'విజయఘాట్' అని పిలుస్తున్నారు. భారత దేశాన్ని తుది శ్వాసదాకా విజయపథాన నడిపించిన ఆ మహానాయకుని సమాధికి ఆ పేరు పెట్టటం సముచితంగా వుంది.

లాల్ బహదూర్ శాస్త్రిగారు నిప్పులాంటి మనిషి. ఆయన చనిపోయే సరికి ఆయన భార్యా పిల్లలు వుండటానికి సొంత యిల్లు కూడ లేదు !

## ప్రధాని ఇందిర :

లాల్ బహదూర్ వారసుని ఎన్నికల్లో కాంగ్రెస్ అధిష్ఠాన వర్గం ఇందిరాగాంధి పేరును సూచించగా మొరార్జీ అంగీకరించక ఎన్నిక జరగాలని కోరారు. ఎన్నికల్లో ఆయనకు మెజారిటీ రాక, ఇందిర ప్రధాని అయ్యారు. ఇందిరా గాంధి ప్రధాని అయితే అన్ని పనులూ తమతో సంప్రదించే చేస్తుందనీ, మొరార్జీ అయితే ఎవరి మాటా లెక్కచేయడనీ ఆలోచించి అప్పుడు కాంగ్రెస్ అధ్యక్షుడుగా వున్న కామరాజనాడార్, ఆయనకు సన్నిహితులుగా వున్న అగ్రనాయకులు నిజలింగప్ప, యస్.కె. పాటిల్, అతుల్య ఘోష్, సంజీవరెడ్డి మొదలయిన వారు ఇందిరాగాంధీని బలపరచారు. ఆ రోజు నేను ఢిల్లీలో సంజీవరెడ్డి గారింట్లో వుండటం తటస్థించింది. ఇందిరాగాంధి తన మంత్రి వర్గ సభ్యుల జాబితాను ఖరారు చేసి రాష్ట్రపతికి సమర్పించిన తరువాత కామరాజ నాడారుకు చూపించింది. ఆ జాబితా తయారు చేయటంలో ఆమె నాడారునుగాని, ఆయన అనుచరులను గాని సంప్రదించలేదు. ఆమె చూపించిన జాబితాలో సంజీవరెడ్డిగారి పేరు లేదు. వెంటనే వారందరూ కలిసి సంజీవరెడ్డి గారి పేరు చేర్చవలసిందిగా కోరినప్పటికీ ఆమె వినలేదు. ఇందిరాగాంధి మంత్రి వర్గ ప్రమాణస్వీకారం అయింతర్వాత సంజీవరెడ్డి గారిని లోక్‌సభ స్పీకర్ చేయటానికి అంగీకరించింది. తీరా నామినేషన్ వేసే సమయానికి సంజీవరెడ్డిగారిపై వ్యక్తిగత కోపం కొద్దీ యింకొక వ్యక్తి కూడా నామినేషన్ వేయటం జరిగింది. తరువాత కాంగ్రెస్ నాయకులంతా కలిసి ఆ వ్యక్తిని వొప్పించి.పోటీనుంచి విరమింప చేయటంతో సంజీవరెడ్డి గారు ఏకగ్రీవంగా స్పీకర్‌గా ఎన్నికయ్యారు.

ఇందిరాగాంధీ విషయంలో కామరాజనాడార్ ప్రభృతుల అంచనాలు తప్పని తేలిపోయింది. అప్పటిదాకా కాంగ్రెస్ సంస్థపై పెత్తనం చలాయించిన నాడార్ ప్రభృతులకూ, ఇందిరాగాంధీకి మనస్పర్ధలు ఏర్పడటం జరిగింది. మొరార్జీదేశాయ్‌ని ఇందిరాగాంధి తన మంత్రి వర్గంలో ఉపప్రధానిగా తీసుకొని ఆర్థికశాఖ నప్పగించింది.

## బ్రహ్మానంద వ్యూహం :

ఇంతలో **1967**లో సార్వత్రిక ఎన్నికలు వచ్చాయి. పార్లమెంటుకు, అసెంబ్లీలకు కాంగ్రెస్ అభ్యర్థులను నిర్ణయించేటప్పుడు ఇందిరాగాంధి

తనకనుకూలమైన వారికే ఎక్కువ ప్రాధాన్యాన్నిచ్చింది. దానిని అవకాశంగా తీసుకొని బ్రహ్మానందరెడ్డి ఇందిరాగాంధి అండన చేరాడు. ఇందిరాగాంధి సంజీవరెడ్డి మనుష్యులకు ప్రాతినిధ్యం దొరక్కుండా బ్రహ్మానందరెడ్డికి సంపూర్ణమైన మద్దతునిచ్చి ఆయన చెప్పినవారికి టికెట్లివ్వటం జరిగింది.

## కక్షసాధింపు :

సంజీవరెడ్డిగారు కేంద్రంలో మంత్రయినా, స్వరాష్ట్రంలో ఆయన పలుకుబడి చిత్రంగా సడలిపోయింది. సంజీవరెడ్డిగారి దయవలన ముఖ్యమంత్రి పదవిని సంపాదించుకొన్న బ్రహ్మానందరెడ్డిగారు ఆ మేలును మరచిపోయి, సంజీవరెడ్డిపైనా, ఆయన అనుచరులపైనా కక్షసాధింపు రాజకీయాలకు పూనుకొన్నాడు. బ్రహ్మానందరెడ్డిగారు ముఖ్యమంత్రిగా వున్నకాలంలోనే రాష్ట్రంలో కాంగ్రెస్ రెండువర్గాలుగా చీలిపోయింది. ప్రభుత్వ వ్యవహారాల్లో, పార్టీ వ్యవహారాల్లో బ్రహ్మానందరెడ్డి కాలంలోనే అవినీతి, లంచ గొండితనం ప్రారంభమయ్యాయి. తన అధికారాన్ని నిలుపుకోడానికి నీతి నియమాలు వదిలి ఏ పని చేయటానికైనా వెను దీయని మనిషి బ్రహ్మానందరెడ్డి.

బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రికాగానే ఏరుదాటి తెప్పతగలేసే ప్రయత్నాలు చేశాడు. సంజీవరెడ్డికి వ్యతిరేకంగా రాష్ట్రంలో తన స్థానాన్ని పటిష్ఠం చేసుకొనే ప్రయత్నాలు ప్రారంభించాడు. అప్పటి ప్రధాని ఇందిరాగాంధీకి సంజీవరెడ్డిపై వున్న వ్యతిరేకతను అందుకు తెలివిగా వుపయోగించుకొన్నాడు. ప్రధాని మద్దతు సంపాదించి, రాష్ట్రంలో తనకు వ్యతిరేకంగా, సంజీవరెడ్డికి అనుకూలంగా వున్న కాంగ్రెస్ నాయకులను అణగ దొక్కేయత్నం చేశాడు. ప్రతి జిల్లాలో తన సొంత ముఠా ఏర్పాటు చేసికొని తనకు వ్యతిరేకంగా వున్నవారిని బలహీన పరచాలని ప్రయత్నం చేశాడు.

ఖమ్మం జిల్లాలో నేను ప్రజల అభిమానాన్ని సంపాదించుకొని బలంగా వుండటం, వరుసగా నేనో, మా తమ్ముడో జిల్లా పరిషత్ అధ్యక్షులుగా గాని, ఎం.ఎల్.ఏ.గా గాని ఎన్నిక కావటం ఆయనకు మింగుడు పడలేదు. ఏదయినా సమస్యవస్తే నిర్మొహమాటంగా మొహాన అడిగే నాబోటి వాళ్లంటే ఆయనకు పడేది కాదు. అందుచేత కొందరు పనికిరాని వాళ్లను మాకు వ్యతిరేకంగా ప్రోత్సహించి, మమ్మల్ని బలహీన పరచాలని విశ్వప్రయత్నం చేశాడు. అదే సమయంలో దురదృష్టవశాత్తు రాష్ట్రంలో ఆలపాటి వెంకట్రామయ్య, ఎ.సి.సుబ్బారెడ్డి, మంతెన

వెంకట్రాజు వంటి నాయకులు చనిపోవడం జరిగింది. వారంతా తమ తమ ప్రాంతాల్లో గట్టి పలుకుబడి కలవాళ్లు. సంజీవరెడ్డిగారు లోక్‌సభ స్పీకర్‌గా వుంటూ మొదటి నుంచి రాష్ట్ర రాజకీయాల్లో ఏం జరుగుతుందో గమనించక సరయిన శ్రద్ధ తీసికోలేదు. ఆ సమయంలో కీ. శే. దామోదరం సంజీవయ్యగారి వంటి వాళ్లు మాకు అండగా వున్నా రాష్ట్రంలో బ్రహ్మానంద రెడ్డికి వ్యతిరేకంగా సంజీవరెడ్డి వర్గానికి నేను నాయకత్వం వహించక తప్పలేదు. సంజీవ రెడ్డిగారి అల్లుడు, శాసన సభ్యుడూ అయిన చల్లా రాంభూపాల్‌రెడ్డి నాకు తోడుగా వుండేవాడు.

ఇందిరాగాంధి మద్దతుతో ఎన్నికలలో తన వాళ్లకు టిక్కెట్లు సంపాదించుకోగల్గిన బ్రహ్మానందరెడ్డి **1967** ఎన్నికలలో పూర్తి మెజారిటీ సంపాదించి తిరిగి ముఖ్యమంత్రి అయ్యాడు. దానితో ఆయనలో అహంకారం బాగా పెరిగిపోయింది.

# వేర్పాటు ఉద్యమాలు

1967వ సంవత్సరం ఏప్రిల్ 18న నా రెండవ కుమారుడు వెంకట్రావు జన్మించాడు. అప్పటికే నేను ఎం.ఎల్.ఏ.గా తిరిగి గెలవటం, రాష్ట్ర పంచాయతీ రాజ్ ఛాంబర్ అధ్యక్షుడిగా వుండటం జరిగింది. అప్పటికింకా నేను ఎక్కువగా ఖమ్మం లోనే వుంటూ మధ్య మధ్య నా కుటుంబాన్ని హైదరాబాద్‌కు తీసికొని వచ్చి ఎం. ఎల్. ఏ. క్వార్టర్స్‌లో వుంటూ వుండే వాళ్లం. నా పెద్దకుమారుడు ప్రసాదరావు బయ్యనగూడెం లో వుండి వ్యవసాయం చేయిస్తుండేవాడు.

## తెలంగాణా ఉద్యమం :

బ్రహ్మానందరెడ్డి రెండవసారి ముఖ్యమంత్రి అయిన తరువాత రాష్ట్రంలో తెలంగాణావుద్యమం వచ్చింది. తెలంగాణా తొమ్మిది జిల్లాలను (అప్పటికి రంగారెడ్డి జిల్లా ఏర్పడలేదు.) ప్రత్యేక తెలంగాణా రాష్ట్రంగా ఏర్పాటు చేయాలన్నదే ఆ ఆందోళన లక్ష్యం. ఆ ఉద్యమానికి డాక్టర్ మర్రి చెన్నారెడ్డి నాయకత్వం వహించారు. క్రమంగా ఉద్యమం అదుపుతప్పి తీవ్రస్థాయిని చేరుకొంది. తెలంగాణా ఉద్యోగుల సమ్మె, విద్యా సంస్థలలో సమ్మె, రోజు రోజుకూ బందులతో జనజీవనం అల్లకల్లోలమైంది. శాంతి భద్రతలు క్షీణించాయి. నానాటికీ తీవ్రతర మౌతున్న ఉద్యమ ధాటిని చూసి బ్రహ్మానందరెడ్డి భయభ్రాంతుడైనాడు. అదలా వుండగా శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాలను కేంద్రంగా చేసికొని నక్సలైట్లు ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాయుధ పోరాటాన్ని ప్రారంభించారు. అనేకమందిని హత్య చేశారు. అనేక గ్రామాలను దోపిడీ చేశారు. క్రమంగా నక్సలైటు ఉద్యమం కొన్ని సర్కార్ జిల్లాలకూ, తెలంగాణాకు కూడ విస్తరించసాగింది.

## హోం మంత్రిత్వం :

1969 మే నెలలో నా పెద్ద కుమారుడు ప్రసాదరావు వివాహం విజయవాడలో జరిగింది. రాష్ట్రంలోని కాంగ్రెస్ నాయకులనేకులు ఆ వివాహానికి హాజరయ్యారు. అప్పటివరకు నేనూ, బ్రహ్మానందరెడ్డి సన్నిహితంగా మెలగినవాళ్లం కాదు. అయినా, నన్ను మంచి చేసుకోవడానికి బ్రహ్మానందరెడ్డి తన భార్యతో సహా ఆ వివాహానికి వచ్చాడు. ఆ పెండ్లి తరువాత బ్రహ్మానందరెడ్డి

నన్నొకనాడు పిలిచి 'మీరు రాష్ట్ర హోంమంత్రిగా మా మంత్రి వర్గంలో చేరి ఇటు తెలంగాణా ఉద్యమాన్ని, అటు నక్సలైటు ఉద్యమాన్ని అదుపులోకి తీసుకొనిరావాలి. అందుకు మీరొక్కరే సమర్థులు', అని నన్ను ప్రోత్సహించటం జరిగింది. 1969 జులైలో నేను బ్రహ్మానందరెడ్డి మంత్రి వర్గంలో చేరాను. హోంమంత్రిగా వున్న అధికారాలకు తోడు ముఖ్యమంత్రికి వుండే లా అండ్ ఆర్డర్ అధికారాలను కూడ ముఖ్యమంత్రి నాకప్పగించారు. చాలమంది మిత్రులు 'యీ క్లిష్ట పరిస్థితిలో మీరీ బాధ్యత తీసికోడం మంచిది కాదు' అని నన్ను హెచ్చరించారు. అయినా మన సమర్థత యిలాటి క్లిష్ట పరిస్థితులలోనే ఋజువు చేసికోవాలి అని నేను సాహసించి ఆ బాధ్యతను స్వీకరించాను. దానికై రాత్రింబవళ్లు కష్టించి పనిచేయవలసి వచ్చింది.

తెలంగాణా ఉద్యమం తీవ్రరూపం దాల్చిన తరువాత తెలంగాణా ఉద్యమకారులు బస్సులు తగల బెట్టటం వంటి విధ్వంస కాండకు తలపడటం ప్రారంభించారు. హైదరాబాదులో ఆంధ్రప్రాంతానికి చెందినవారి యిండ్లపై ఉద్యమకారులలో కొందరు దాడులు జరపటం వల్ల ఆంధ్రప్రాంతం వారు కొందరు భయపడి యిళ్ళూ, యిళ్ల స్థలాలు చాల తక్కువ ధరకు అమ్మేసుకొని వెళ్లిపోవడం జరిగింది. అప్పుడు పట్నంలో ఆస్తులను కొందరు కారుచౌకగా సంపాదించుకోగలిగారు. నేను హోం మంత్రిగా బాధ్యత తీసికొన్న తరువాత క్రమంగా పరిస్థితి మెరుగు పడింది. ఉద్యమాన్ని చాలవరకు అదుపులోకి తేగల్గాము. మామూలు పరిస్థితులు నెలకొనడం వల్ల ఆంధ్ర ప్రాంతానికి వెళ్లిపోయిన వారు చాలా మంది తిరిగి వచ్చి ప్రశాంతంగా తమవృత్తి, వ్యాపారాలను సాగించుకొనే వీలు కలిగింది.

## తీవ్రవాద ఉద్యమం :

హోం మంత్రిగా నేను ప్రాధాన్యం యిచ్చిన రెండవ సమస్య తీవ్రవాద ఉద్యమం.

## హోం శాఖ మంత్రిగా :

నక్సలైటు ఉద్యమం శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాలలో (అప్పటికి విజయనగరం జిల్లా ఏర్పడలేదు) బాగా ఎక్కువగా వుండేది. అసలక్కడ ఏం జరుగుతుందో స్వయంగా తెలుసుకోవాలని నేను హోం శాఖను చేపట్టగానే ఆ

రెండు జిల్లాలలోనూ విస్తృతంగా పర్యటించాను.

నక్సలైటు ఘాతుకాలు జరిపిన గ్రామాలకు వెళ్ళి బాధితుల కుటుంబాలను పరామర్శించటం నా కార్యక్రమాలలో భాగం. ఆ ప్రదేశాలన్నీ చాలా లోపలికి ఉండేవి. రోడ్డు సౌకర్యం బొత్తిగా లేని గ్రామాలవి. చాలా వూళ్ళకు జీపుకూడా పోదు. కాలినడకనే వెళ్ళాల్సి వచ్చేది. మధ్య మధ్య అడవులూ, లోయలూ దాటుతుంటే అకస్మాత్తుగా నక్సలైట్లు దొంగ దెబ్బ తీసేందుకు బాగా అవకాశం వున్న ప్రదేశాలవి. కాబట్టి పర్యటన కార్యక్రమం విరమించుకోలసిందని ఎందరో చెప్పారు. సెక్యూరిటీ కారణాల వల్ల కార్యక్రమాన్ని రద్దు చేసికోవలసిందిగా పోలీస్ వారు కూడా చెబుతూ వచ్చారు.

అయితే కార్యక్రమాన్ని రద్దు చేసికొంటే స్థానిక ప్రజలలో ఇంకా అధైర్యం పెరుగుతుంది. కనుక నేను ఆరు నూరైనాసరే పర్యటించటానికే నిర్ణయం తీసికోవటం జరిగింది.

నేను వెళ్ళిన వూళ్ళలో ఉద్దానం ప్రాంతంలోని బొడ్డపాడు వొకటి. అది సముద్రతీరంలో వుంది. నక్సలైటు ఉద్యమానికి ఇక్కడే అంకురార్పణ జరిగింది. గణపతి అనే నక్సలైటు నాయకుడు స్థానికంగా వున్న ఒక దేవాలయంలోని దేవతల విగ్రహాలను తెచ్చి గ్రామం నడిబొడ్డున ఉరితీసినట్లు వేళ్లాడ దీశాడు. పక్కవూరు కరణాన్ని చంపి, అతని తలను నరికి తెచ్చి, ఒక కర్రకు గుచ్చి ఊరి బొడ్రాయి దగ్గర నిలబెట్టారు. జనంలో భీతావహం కల్గించటానికే నక్సలైట్లు ఆ పని చేశారు. ఆ ప్రాంతంలో జీడి మామిడి పెంపకం జాస్తి. కనుక బాగా వున్న వాళ్లున్న ప్రాంతమే. ఆ గ్రామాలలో యింకా ఉద్రిక్తత బాగా వుంది. నేను పర్యటన చేయటం వల్ల అక్కడి వారిలో కొంత ధైర్యం, ఉత్సాహం కలిగాయి. ఆ వూరి వాళ్లు నేను నిజంగా వస్తాననుకోలేదు. అంతకు ముందురోజే నేనక్కడికి వస్తే తీవ్రపరిణామాలు కలుగుతాయని హెచ్చరిస్తూ అక్కడ కరపత్రాలు పంచారు.

ఆ పర్యటనవల్ల నక్సలైట్లను ఎదుర్కొనే పనిలో పోలీసు సిబ్బంది ఎదుర్కొంటున్న సాధక బాధకాలను, ప్రజల కష్టసుఖాలను అనుభవ పూర్వకంగా తెలుసుకోగలిగాను. ఈ ప్రాంతపు సమస్యలకు పరిష్కారం వెదకడంలో ఈ అనుభవం నేను ముఖ్యమంత్రినైన తరువాత ఎంతగానో ఉపకరించింది.

నక్సలైటు ఉద్యమం బాగా వేళ్లూనుకొని వున్న ప్రాంతాలకు నేను ధైర్యంగా కాలినడకన వెళ్ళి ప్రజలకు ధైర్యం చెప్పడంతో ఆ ప్రాంతంలో చాలా

మార్పువచ్చింది. ముఖ్యంగా పోలీసు సిబ్బందికి కొత్త వూపు వచ్చింది. ప్రభుత్వం తన వెన్ను తట్టి నిలబడుతుందన్న నమ్మకం వారిలో కలిగింది.

## సాంఘిక, ఆర్థిక అభ్యున్నతి :

నక్సలైటుల హింసాత్మక చర్యలను అణచివేయటానికి గట్టిగా వ్యవహరించక తప్పదని నేను అభిప్రాయపడ్డాను. అయితే నక్సలైటు ఉద్యమాన్ని కేవలం లా అండ్ ఆర్డర్ సమస్యగా మాత్రమే అనుకోడం కూడా సరికాదని నేను భావించాను. అక్కడి ప్రజలలో దాదాపు అంతా షెడ్యూల్యాలు తెగలవారే. దాదాపు అంతా పూటకు ఠికాణా లేనివారే. కనుక ముందు వారిని ఆర్థికంగా, సామాజికంగా ముందుకు తీసుకుపోవటం చాల అవసరమని తేలింది. వారి పిల్లలకు విద్యాబుద్ధులు చెప్పించటం కోసం ఆశ్రమ పాఠశాలలను స్థాపించే పద్ధతికి ఆనాడే నాంది పలికాము. పోడు పద్ధతి వ్యవసాయాన్ని సాగించకుండా కొండ జాతివారిని చైతన్య వంతుల్ని చేయటం అవసరం. గృహవసతి కల్పించి, సంచారజాతులుగా వున్నవారిని స్థిరంగా ఒక చోట ఉండేట్లు చేయటం కూడా అవసరమే. ఆ ప్రాంతంలో రాకపోకల సౌకర్యాలు బొత్తిగా లేవు. రోడ్లు వేయటం, నీటి పారుదలకు, మంచినీటి వసతికి ఏర్పాట్లు చేయటం కూడా ముఖ్యమే. ఈ విధంగా కృషి చేసి క్రమంగా వారిని జాతి జీవన స్రవంతిలోకి తీసుకొనిరావాలి. అందుకే ఒక ప్రక్క బందోబస్తు చర్యలు కొనసాగిస్తూ, మరోప్రక్క ప్రజల సాంఘిక ఆర్థిక స్థాయిని పెంపొందించే కృషిని సాగించాల్సివుంది.

## కాబినెట్ నోట్ :

నేను నక్సలైటు ప్రాంతాలను పర్యటించి రాగానే కాబినెట్‌కు దానిపై ఒక పేపర్ సమర్పించాను. అందులో ఈ సమస్యను క్షుణ్ణంగా చర్చించటం జరిగింది. ముఖ్యంగా పోలీసు సిబ్బంది చురుకుగా కదలి వెళ్లే ఏర్పాటు అవసరమని నేను సూచించాను. ప్రతి పోలీస్ స్టేషనుకు ఫోను, జీపు యిచ్చేందుకూ, సబ్ ఇనస్పెక్టర్లకు మోటారు సైకిళ్లను ఇవ్వటానికీ, ఆ ప్రాంతంలో వైర్‌లెస్ సెట్లను ఏర్పాటు చేయటానికీ ప్రతిపాదనలు చేశాను. ఈ కార్యక్రమాలను అమలు చేసేందుకుగాను రు.50 కోట్లు యిచ్చేందుకు కేంద్ర ప్రభుత్వాన్ని వొప్పించాను కూడా.

## పోలీసు సంక్షేమచర్యలు :

పోలీసుసిబ్బంది సంక్షేమాన్ని కూడా చూడటం ఎంతో అవసరమని నాకు అనిపించింది. కొత్తగా వారికి పోలీస్ క్వార్టర్స్ కట్టించటం, పాత క్వార్టర్స్‌కు కావలసిన సౌకర్యాలు నేర్పరచటం పట్ల ప్రత్యేక శ్రద్ధ వహించాను. ట్రైబల్ సబ్ ప్లాను తయారు చేయడం మొదటి సారిగా అప్పుడే మొదలయింది.

నేను తరువాత ముఖ్యమంత్రిని కాగానే నా అభిప్రాయాలను అమలు చేయటానికి గట్టిగా ప్రయత్నించాను. ఎందుకంటే, శ్రీకాకుళం జిల్లాలో గాని, మరి ఏ జిల్లాలలో గానీ నక్సలైట్ల ఉద్యమ తీవ్రతను అదుపు చేయటానికి పోలీసు అధికారులూ, సిబ్బందీ మనసారా సహకరించటం అవసరం. అందుకు వారిలో తగిన స్ఫూర్తిని కలిగించాల్సిన అవసరం వుంది. ప్రమాదకర పరిస్థితులలో కారడవులలోకి వెళ్లి పోరాడుతున్న పోలీసులకు ప్రభుత్వం పూర్తి మద్దతు యిస్తుందనే భరోసా వుండాలి. మొదటగా వారిలో అట్టి విశ్వాసాన్ని కల్పించటానికి నేను ప్రయత్నం చేశాను. ముఖ్యంగా పోలీసు సిబ్బంది సంక్షేమం పట్ల శ్రద్ధ తీసికోవాల్సిన అవసరం ఎంతయినా వుండేది. పోలీస్ సిబ్బంది జీత భత్యాలను పెంచటమే కాక వాళ్ల కుటుంబ సంక్షేమం కోసం ప్రత్యేక నిధిని ఏర్పాటు చేశాము. వాళ్ల పిల్లల చదువు, తీరిక వేళల్లో పోలీసు కుటుంబాలలోని స్త్రీలకు ఆదాయం వొనగూర్చే వ్యాపకాలను కల్పించటం, వారికి వైద్య సౌకర్యాలు ఏర్పాటు చేయటం వంటి కార్య క్రమాలను కూడా చేపట్టటం జరిగింది. విధి నిర్వహణలో పోలీసు అధికారులు గాని, సిబ్బంది గాని ప్రాణాలు కోల్పోతే, వారు మామూలుగా రిటయిరయే తేదీవరకు వచ్చే జీత భత్యాలను వారి కుటుంబాలకు యిచ్చే ఏర్పాటు చేశాము. అంతే కాక మరణించిన వారికి అంతిమ సంస్కారాలు చేయటానికి వెంటనే రు.**500** వారి కుటుంబాలకు చెల్లించేందుకు ఉత్తరువులు జారీ అయ్యాయి. దానికి తోడు మరణించిన ఉద్యోగి కుటుంబానికి రు.**10,000/-** తక్షణ సహాయం అందించాలనీ, వారి కుటుంబంలో వొకరికి ఉద్యోగం యివ్వాలనీ నిర్ణయించబడింది.

## పోలీస్ హౌసింగ్ కార్పొరేషన్ :

పోలీసులకు గృహవసతి కల్పించటం కోసం పోలీస్ హౌసింగ్ కార్పొరేషన్ ఏర్పాటు చేయాలని కూడా నేను మంత్రి వర్గానికి ప్రతిపాదించాను.

అప్పటివరకూ పోలీస్‌శాఖకు సంబంధించిన గృహ నిర్మాణ కలాపాలను పి.డబ్ల్యు.డి.కి చెందిన భవనాల శాఖ నిర్వహిస్తుండేది. పని మరింత చురుకుగా సాగటానికి ఈ కార్యక్రమంపై ప్రత్యేక శ్రద్ధ చూపించటం అవసరమనిపించింది. అంతేకాక, ఇన్‌స్టిట్యూషనల్ ఫైనాన్స్ (ఆర్థిక సంస్థలనుండి సాయం పొందటానికి) కోసం కూడా కార్పొరేషన్‌ను ఏర్పరచటం తప్పని సరి. పోలీస్ హౌసింగ్ కార్పొరేషన్‌ను ఏర్పాటు చేసుకొన్న మొదటి రాష్ట్రం మన రాష్ట్రమే. ఆనాడు స్థాపించుకున్న సంస్థ ఆధ్వర్యంలో ఇప్పటికి దాదాపు 90 శాతం పోలీస్ సిబ్బందికి గృహవసతి కల్పించగలిగిందన్న సంగతి తెలిసినప్పుడు నాకెంతో సంతోషం కలిగింది.

ఈ విధంగా చేయటం వల్ల పోలీసు సిబ్బందిలో నిరాశ, నిస్పృహ తగ్గి నూతనోత్సాహం కలిగింది. పోలీసు అధికారులు, సిబ్బంది ఎంతో అంకిత భావంతో పనిచేసి శాంతి భద్రతలను కాపాడటంలో కృతకృత్యు లయ్యారు. భారత దేశం మొత్తంలోనూ ఆంధ్రప్రదేశ్ పోలీస్ శాఖ బాగా పనిచేసే శాఖ అన్న మంచి పేరు తెచ్చుకోగలిగారు.

నక్సలైటు ఉద్యమాన్ని 90 శాతం దాకా అదుపు చేయగలిగాము. పోలీస్ సంక్షేమం కోసం యిన్ని సౌకర్యాలు మొదటిసారి కల్గించిన పోలీస్ శాఖ భారత దేశంలో కెల్లా ఆంధ్రప్రదేశ్ పోలీస్ కావటం, అది నేను హోం మంత్రిగావుండగా నా ఆధ్వర్యంలో జరగటం నా కెంతో ఆనంద దాయకం.

## రాష్ట్రపతి ఎన్నిక :

ఇంతలో రాష్ట్రపతి ఎన్నిక వచ్చింది. కాంగ్రెస్ అభ్యర్థిని నిర్ణయించటానికి కాంగ్రెస్ పార్లమెంటరీ బోర్డ్ బెంగుళూరులో సమావేశమయింది. ఇందిరాగాంధి వ్యతిరేకించినప్పటికీ మెజారిటీ సభ్యులు - మొరార్జీ దేశాయ్, ఎస్.కె.పాటిల్, వైబి.చవాన్, అతుల్య ఘోష్ - సంజీవరెడ్డి అభ్యర్థిత్వాన్ని నిర్ణయించారు. అప్పుడావిడకు వాళ్లందరిపైనా ఆగ్రహం కలిగింది. అప్పుడు ఉపాధ్యక్షులుగా వున్న వి.వి.గిరిగారు ఇండిపెండెంట్ అభ్యర్థిగా సంజీవరెడ్డి గారికి పోటీగానిలబడ్డారు. ఇందిరాగాంధి సంజీవరెడ్డి గారి నామినేషన్ పత్రంపై సంతకం చేసి కూడా ఆయనను బహిరంగంగా వ్యతిరేకించింది.

తాను ఆంధ్రప్రదేశ్‌లో బ్రహ్మానందరెడ్డిని బలపరచి ముఖ్యమంత్రిని చేసింది కనుక ఆయన తనకు గట్టి మద్దతు యిస్తాడన్న విశ్వాసం ఆమెకుండేది. కాని ఆయన ఆమె పక్షాన గట్టిగా నిలబడకుండా అటు ఆమెకూ, యిటు కాంగ్రెస్ అధిష్ఠాన వర్గానికీ మధ్య నాటకం ఆడటం ప్రారంభించాడు. ఇది ఇందిరాగాంధి కనిపెట్టింది. బ్రహ్మానందరెడ్డి తన మంత్రి వర్గంలో కొందరిని సంజీవరెడ్డిని బలపరచవలసిందని కోరాడు కాని సంజీవరెడ్డికి వ్యతిరేకులయిన రాయలసీమ రెడ్లను, తెలంగాణా రెడ్లను గిరిగారికి పని చేయవలసిందని చెప్పాడు.

ఇందిరాగాంధి చాల తెలివైనది. శత్రువును దెబ్బకొట్టడంలో దయా దాక్షిణ్యం, నీతి, నియమాలు పాటించేది కాదు. కాంగ్రెస్ పార్టీ అభ్యర్థిని ఓడించటానికి ఆమె అన్ని పార్టీల వాళ్లతో చేతులుకలిపింది. అప్పుడు చెన్నారెడ్డి వగయిరా నాయకులు కొందరు రాజమండ్రి జైలులో వున్నారు. వాళ్లతో కూడ రహస్య మంతనాలు జరిపి వాళ్ల వోట్లు కూడ గిరిగారికి వేయించటం జరిగింది. నేను ప్రభుత్వంలో మంత్రిగా వుంటూ కాంగ్రెస్ అధికార పార్టీ అభ్యర్థికే ఓటు వేయటం జరిగింది.

కాని సంజీవరెడ్డి గారు కొద్దితేడాతో ఓడిపోయారు. దానికి కారణం సంజీవరెడ్డి గారి గర్వమే. ఆయన అందరినీ స్వయంగా కలిసి ఓట్లు అడగకపోవడం, రాష్ట్రాలకు తిరగకుండా ఢిల్లీలోనే కూర్చొని తాను అధికార అభ్యర్థి అవడం వల్ల గెలుస్తానన్న అహంభావంతో వుండటం వల్ల ఆయన దెబ్బతిన్నారు.

## పార్టీలో చీలిక :

ఎన్నికయిన వెంటనే నాడార్ అధ్యక్షులుగా వున్న కాంగ్రెస్ కార్యవర్గం సమావేశమై ఇందిరాగాంధీని కాంగ్రెస్ పార్టీ నుంచి అయిదేళ్లపాటు బహిష్కరించటం జరిగింది.

ఇందిరాగాంధి గారు దేశానికి ప్రధానమంత్రి. ఆవిడ చేతిలో అధికారం వుంది. ఆమె సాహసంతో కాంగ్రెస్ పార్టీని చీల్చి తన మద్దతు దారులతో వెంటనే వేరే కుంపటి పెట్టింది. తనదే అధికార కాంగ్రెస్ అని ఆమె ప్రకటించటంతో దేశంలోని కాంగ్రెస్ వారంతా అధికార వ్యామోహంతో ఆమె పార్టీలోనే చేరారు. అగ్రనాయకులైన మొరార్జీ, నాడార్ వంటి వారు కూడా ఏమీ చేయలేక నిస్పృహాయులై చూస్తూ వుండిపోయారు.

రాష్ట్రపతి ఎన్నికలలో బ్రహ్మానందరెడ్డి ఇందిర అభ్యర్థి గెలవటానికి చిత్త శుద్ధితో సహకరించలేదనీ, రెండు వేపులా పనిచేసినట్లు నాటకం ఆడాడనీ ఇందిరాగాంధికి ఒక అభిప్రాయం ఏర్పడింది. ఇందిరాగాంధిపేరు చెప్పుకొని, ఆమె దయవల్లే బ్రహ్మానందరెడ్డి సంజీవరెడ్డిని ఎదురించి కూడా ముఖ్యమంత్రిగా కొనసాగగల్గుతున్నాడు. కాని అవసరానికి ఆమెకు సరిగా తోడ్పడలేదు. కనుక అతడిని సమయం వచ్చినప్పుడు తొలగించాలన్న అభిప్రాయానికి ఇందిర వచ్చింది.

తెలంగాణా ఉద్యమానికి నాయకత్వం వహించిన చెన్నారెడ్డి ప్రభృతులు ఇందిరాగాంధికి సన్నిహితమైనారు. వాళ్లకోరిక కూడ బ్రహ్మానందరెడ్డిని ముఖ్యమంత్రి పదవి నుండి తొలగించాలనే.

## పార్లమెంట్ ఎన్నికలు :

1971లో ఇందిరాగాంధి లోక్‌సభకు ఎన్నికలు ప్రకటించింది. అప్పుడు రాష్ట్ర శాసనసభకు కూడ ఎన్నికలు జరిపించాలనీ, తద్వారా తాను తిరిగి ముఖ్యమంత్రిగా కొనసాగాలనీ బ్రహ్మానందరెడ్డి ప్రయత్నం చేస్తే, ఇందిరాగాంధి అందుకంగికరించలేదు. తెలంగాణా జిల్లాల్లో తెలంగాణా ప్రజా సమితి అభ్యర్థులు ప్రత్యేక గుర్తుతో పోటీ చేశారు. ఎన్నికలలో తెలంగాణాలోని 14 స్థానాలలో తెలంగాణా ప్రజాసమితి 10 గెలుచుకోగా 3 కాంగ్రెస్‌కు లభించాయి. ఒక సీటు మార్క్సిస్ట్ కమ్యూనిస్ట్ పార్టీకి వచ్చింది. బ్రహ్మానందరెడ్డిని దెబ్బతీయటానికి తెలంగాణా ప్రజాసమితి అభ్యర్థులకు ఇందిరాగాంధి వెనుకనుండి ఆర్థిక సహాయం అందించారు. ఖమ్మంలో మేము తెలంగాణా ప్రజా సమితి అభ్యర్థిని ఓడించి వేశాము. ఎన్నికల తర్వాత బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రిగా వుండి కూడ కాంగ్రెస్ అభ్యర్థుల గెలుపుకు ఏమీ చేయలేకపోయాడన్న అభిప్రాయం ఇందిరా గాంధికి కలిగింది.

## వెన్నుపోటు :

అప్పుడు అఖిల భారత కాంగ్రెస్ అధ్యక్షులుగా దామోదరం సంజీవయ్య గారున్నారు. 1967లో సంజీవయ్యగారిని కర్నూలు పార్లమెంటు సీటుకు అభ్యర్థిగా నిర్ణయిస్తే, అప్పుడు కర్నూలు జిల్లా పరిషత్ అధ్యక్షుడూ, బ్రహ్మానందరెడ్డి అనుచరుడూ అయిన కోట్ల విజయభాస్కరరెడ్డి కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా బహిరంగంగా పనిచేసి సంజీవయ్య గార్ని ఓడించటం జరిగింది.

సంజీవయ్య గారిని ఓడించి నందుకు మెప్పుకోలుగా కోట్ల విజయభాస్కరరెడ్డి యం.యల్.ఏ.గాని యం.యల్.సి. గాని కాకపోయినప్పటికీ, బ్రహ్మానందరెడ్డి ఆయనను తన మంత్రి వర్గంలో చేర్చుకున్నాడు. దీనిపైకూడ ఇందిరాగాంధీకి బ్రహ్మానంద రెడ్డిపై ఆగ్రహం కలిగింది.

బ్రహ్మానందరెడ్డి మంత్రివర్గంలో విజయభాస్కరరెడ్డి ఆర్థిక మంత్రిగా వుండే వాడు. నేను హోంమంత్రిని. విజయభాస్కరరెడ్డి మొరటు మనిషి. రాజకీయాల్లో ఎలా మాట్లాడాలో ఏం మాట్లాడాలో ఎరగడు. ఒకసారి శాసనసభలో బడ్జెట్‌పై చర్చకు సమాధానం యిస్తూ 'మాకు అసెంబ్లీలో పెద్ద మెజారిటీ వుంది. బ్రహ్మానందరెడ్డిని ఎవరు తీసివేయ గలరు?' అని సవాలు విసిరినట్లు ఆయన మాట్లాడారు. ఈ విషయం కూడా ఇందిరాగాంధిగారి దృష్టికి వెళ్లింది. అప్పుడే బ్రహ్మానంద రెడ్డిని ముఖ్యమంత్రి పదవి నుండి తప్పించాలన్న నిర్ణయం తీసికోడం జరిగింది.

## సంజీవయ్య మృతి :

1969లో రాజ్యసభ ఎన్నికలు వచ్చాయి. సంజీవయ్యగారిని రాష్ట్రం నుంచి కాంగ్రెస్ అభ్యర్థిగా నిలబెట్టారు. లోగడ లోక్‌సభ ఎన్నికల్లో ఆయనను ఓడించిన బ్రహ్మానందరెడ్డి వర్గం యీసారి రాజ్యసభక్కూడా ఆయన ఎన్నిక కాకుండా చూడాలని విశ్వప్రయత్నం చేసింది. నాకు యీసంగతి తెలిసింది. సంజీవయ్యగారంటే అభిమానం వున్న మేమంతా రహస్యంగా ఆలోచించి సంజీవయ్యగారికే ఓటు వేయటం జరిగింది. వాళ్ల అధికారం, డబ్బు ఎంత ఎరచూపినా సంజీవయ్యగారు బహుకొద్ది మెజారిటీతోనే అయినా చివరకు ఎలాగోలా గెలిచారు. కేంద్ర మంత్రి వర్గంలో పరిశ్రమల మంత్రిగా పనిచేశారు. ఎంతో వృద్ధిలోనికి రావలసిన ఆయన కొద్ది వయసులోనే మరణించటం దురదృష్టం. రాష్ట్రానికీ, దేశానికీ ఆయన మృతి వల్ల ఎంతో నష్టం కలిగింది. వ్యక్తి గతంగా నాకు అది తీరని లోటు.

## బయటపడ్డ బండారం :

బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రిగా వున్నప్పుడు ఎన్నికల పేరుతో కంట్రాక్టర్ల నుండీ, రైస్ మిల్లర్ల నుండీ కొన్నికోట్లు వసూలు చేశారు. ఈ విషయం ఇందిరాగాంధీగారి దృష్టికి వెళ్లింది. ఆమె ఇన్‌కంటాక్స్ అధికారులను పంపించి

ఆంధ్రప్రదేశ్ యితర రాష్ట్రాలకు బియ్యం ఎగుమతి చేసేందుకు పర్మిట్లు సంపాదించిన మిల్లర్లపై ఒకే రోజున దాడి చేయించింది. వాళ్ల ఎకౌంట్లూ, రికార్డులూ అన్నీ పట్టుకొని చూస్తే, వాళ్లు బ్రహ్మానందరెడ్డికి ఎంతెంత మొత్తాల్లో సొమ్ము యిచ్చిందీ స్పష్టమయింది. అప్పుడు గుంటూరులో మద్ది సుదర్శనం అని పెద్ద వ్యాపారస్థుడున్నాడు. ఆయన పార్లమెంటు సభ్యుడు. బ్రహ్మానందరెడ్డి తన డబ్బును ఆయన వద్ద దాచాడన్న సమాచారం తెలిసి ఆయన యింటిపై కూడ ఇన్‌కంటాక్స్ వాళ్లు దాడి చేశారు. వారందరికీ అధికారులు నోటీసులు యిచ్చారు. దాంతో మిల్లర్లు బ్రహ్మానంద రెడ్డిని కలిసి 'ఇన్‌కం టాక్స్ వాళ్లు మాపై కేసులు పెడుతున్నారు. మేం ఇందిరాగాంధీని కలిసి ఉన్న యదార్థం అంతా చెబుతాం', అని చెప్పారు. అప్పుడు బ్రహ్మానంద రెడ్డి భయపడి తాను వసూలు చేసిన సొమ్ముతో ఢిల్లీకి వెళ్లి ఇందిరాగాంధి గారి దగ్గర ప్రాధేయపడి, తన పరువు కాపాడాలని కోరటం జరిగింది. అప్పుడామె ఆ డబ్బంతా అఖిలభారత కాంగ్రెస్‌కు అప్పగించమని చెప్పి ఆ కేసులూ అవీ ఎక్కడివి అక్కడ సర్దుబాటు చేసేయించింది.

## రాజీనామా :

ఈ సంఘటన తర్వాత రాష్ట్రంలో బ్రహ్మానందరెడ్డి పరువు ప్రతిష్ఠ మంటకల్సిపోయాయి. బ్రహ్మానందరెడ్డిని తీసివేయాలన్న నిర్ణయం తీసుకొని, ఆయనను కాంగ్రెస్ వర్కింగ్ కమిటీకి ఆహ్వానిస్తే ఆయన వెళ్లలేదు. అప్పుడు కాంగ్రెస్ అధ్యక్షులుగా వున్న దామోదరం సంజీవయ్య గారు నాతో సన్నిహితంగా వుండేవారు. నేను బ్రహ్మానంద రెడ్డి తర్వాత ముఖ్యమంత్రిని కావాలని ఆయనకు చాల గట్టికోరిక వుండేది. ఆయన నాకారోజు ఢిల్లీనుండి ఫోన్ చేసి 'బ్రహ్మానందరెడ్డిని ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేయాల్సిందిగా కోరాలని కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ నిర్ణయించింది. ఈ సంగతి రాత్రి 9 గంటలకు రేడియో వార్తల్లో వస్తుంది వినండి, అని చెప్పారు. బ్రహ్మానందరెడ్డికి యీ సంగతి తెలియదు. రవీంద్ర భారతిలో ఏదో కల్చరల్ కార్యక్రమాలకని ఆయన భార్యతో వెళ్లి వినోదంగా ఆ కార్యక్రమాలు చూస్తున్నారు. ఆరోజు రేడియో వార్తల్లో మొదటి హెడ్‌లైన్ బ్రహ్మానందరెడ్డి రాజీనామా వార్తే. ఈ వార్త తెలిసి బ్రహ్మానందరెడ్డి ఆయన కుటుంబ సభ్యులు, అనుచరులు చాల విచార పడ్డారు. బ్రహ్మానందరెడ్డికి కాంగ్రెస్ అధిష్ఠాన వర్గం ఆ రాత్రే ఆ నిర్ణయాన్ని తెలిపి ఢిల్లీకి రమ్మని కోరారు. ప్రొద్దునే విమానంలో ఆయన ఢిల్లీ వెళ్లి ఇందిరాగాంధీకి

రాజీనామా సమర్పించి తిరిగి సాయంకాలం హైదరాబాదు చేరుకున్నారు. ఆరోజు విమానం దగ్గర, బ్రహ్మానందరెడ్డి ఇంటి దగ్గర ఎవరో చనిపోయినట్లుగా ఆయన అనుచరులు ఏడవటం జరిగింది. ఎవరేమి చెప్పినా, బ్రహ్మానందరెడ్డి నిష్క్రమించక తప్పలేదు.

## పి.వి.కి అవకాశం :

బ్రహ్మానందరెడ్డి స్థానంలో ఎవరిని ముఖ్యమంత్రిని చేయాలన్న ఆలోచన వచ్చినప్పుడు ప్రధాని శ్రీమతి ఇందిర కాంగ్రెస్ అధ్యక్షులు సంజీవయ్య గారిని పిలిచి సంప్రదించింది. ఆయన వెంగళరావుగారిని ముఖ్యమంత్రిని చేస్తే అటు ఆంధ్ర, ఇటు తెలంగాణా రెండు ప్రాంతాల వారిని చక్కగా కలుపుకొని పోగలడని వివరించారు. హోం మంత్రిగా శాంతిభద్రతలను కాపాడిన సమర్ధుడుగా ఆయనకు మంచి పేరుందని కూడ సంజీవయ్య గారు చెప్పారు. ఈ సంగతి ఎలాగో తెలుసుకున్న బ్రహ్మానందరెడ్డి వర్గం నేను ముఖ్యమంత్రి కాకుండా చూసేందుకు నానాతంటాలు పడ్డది. ఉత్తరాది బ్రాహ్మణ రాజకీయ నాయకులు కమలాపతి త్రిపాఠి, ఉమాశంకర దీక్షిత్ వంటి వారు ఇందిరాగాంధి మీద బాగా పలుకుబడి కలిగివుండేవారు. వాళ్లు కూడ యీసారి పి.వి నరసింహా రావును ముఖ్యమంత్రిని చేయాలని పట్టుబట్టారు. వెంగళరావు ముఖ్య మంత్రి అయితే తమ ఆటలు సాగవనీ, పి.వి. అయితే కావాలను కున్నప్పుడు దించేయ వచ్చనే అభిప్రాయంతో బ్రహ్మానందరెడ్డి వర్గం కూడ పి.వి.నే బలపరచారు. **1952** నుండి **1967** వరకు ఖమ్మం జిల్లా నుండి ఎమ్.పి. గా వుంటున్న శ్రీమతి టి.లక్ష్మీ కాంతమ్మ నరసింహారావుకు దగ్గర స్నేహితురాలు. ఆమె అప్పుడు పార్లమెంటు సభ్యురాలుగా వుంటూ నరసింహారావును ముఖ్యమంత్రిగా ఎంపిక చేయించాలని విశ్వప్రయత్నం చేసింది. ఆవిడ మొదటి నుండి ఒక్కరూపాయి ఖర్చుపెట్టకుండా కేవలం నా పలుకుబడి వల్లనే ఎన్నికలలోగెలుస్తూ వచ్చింది. కాని అదంతా మరచి ఢిల్లీలో మాకు వ్యతిరేకంగా పనిచేసింది. ఇందిరాగాంధి గారు కూడ సంజీవయ్యగారి సలహాను పక్కకు పెట్టి పి.వి.నరసింహారావును ముఖ్యమంత్రిని చేసేందుకు నిర్ణయించారు. అప్పుడు నేను ఆయన మంత్రి వర్గంలో చేరటానికి అంగీకరించలేదు. ముఖ్యమంత్రి అయినప్పటి నుండి రాష్ట్రాభివృద్ధికి కృషి చేసేందుకు, పాపం ఆయనకు సమయమే దొరకలేదు. ఆయన పేరుకే ముఖ్యమంత్రి కాని పార్లమెంటు సభ్యురాలు లక్ష్మీకాంతమ్మ ఏపని చేయమంటే ఆ

పని మారుమాటాడక చేస్తుండేవారు. దాని వల్ల ప్రజలలో నరసింహారావు పేరు ప్రతిష్ఠలు దెబ్బతిన్నాయి.

## పరిశ్రమల మంత్రిగా :

**1972** ఎన్నికలలో కూడ కాంగ్రెస్ పార్టీ మెజారిటీ సాధించు కొన్నది. తిరిగి పి.వి. నరసింహారావే ముఖ్యమంత్రిగా కొనసాగాలని నిర్ణయం తీసికొన్నారు. అప్పుడు నరసింహారావు నన్ను తన మంత్రివర్గంలో చేరవలసిందిగా కోరారు. నేను ఢిల్లీవెళ్లి అప్పటి కాంగ్రెస్ అధ్యక్షులయిన సంజీవయ్యగారితో ముందుగా మాట్లాడి, తరువాత పి.వి. మంత్రి వర్గంలో చేరేందుకు అంగీకరించటం జరిగింది. పి.వి. మంత్రివర్గంలో నాకు పరిశ్రమల శాఖ అప్పగించారు.

వెనుకటి మాదిరిగానే పి.వి.నరసింహారావు లక్ష్మీకాంతమ్మ అదుపు, ఆధీనంలో వుంటుండటం వల్ల నరసింహారావు పట్ల ప్రజలలో తీవ్ర అసంతృప్తి ఏర్పడింది. ఆయనను ముఖ్యమంత్రి పదవి నుండి తొలగించటం మంచిదనే భావం కూడా కలగసాగింది.

## ప్రత్యేక ఆంధ్ర ఉద్యమం :

సర్కార్, రాయలసీమ జిల్లాలలో వున్న మంత్రులూ, శాసన సభ్యులలో మెజారిటీ సభ్యులు నరసింహారావుకు వ్యతిరేకంగా కనివిని ఎరుగని రీతిలో బ్రహ్మాండమైన ఉద్యమాన్ని తీసుకొని వచ్చారు. ఈ ఉద్యమంలో విద్యార్థులు, ఉద్యోగులు, స్త్రీలు, సామాన్య ప్రజానీకం పెద్దయెత్తున పాల్గొన్నారు. ఈ ఉద్యమాన్ని అణచటంకోసం పలు పట్టణాల్లో కర్ఫ్యూ విధించటం, పోలీసులు కాల్పులు సాగించటం అయ్యాయి. అప్పుడు వ్యవసాయ శాఖ మంత్రిగా వున్న కాకాని వెంకట రత్నంగారు విజయవాడలో ఉద్యమం నడుపుతూనే హఠాత్తుగా గుండె ఆగిపోయి మరణించారు. దానితో ప్రజలు ఆవేశ పూరితులు కావటం, ఉద్యమం ఉధృతం కావటం జరిగాయి. నరసింహారావు పట్ల వ్యతిరేకతే ఉద్యమానికి కారణమనీ, నరసింహారావును తొలగించనిదే ఉద్యమం ఆగదనీ పోలీస్ ఇంటెలిజెన్స్ ద్వారా ఇందిరాగాంధి తెలుసుకున్నారు. లక్ష్మీ కాంతమ్మ ప్రభావం ముఖ్యమంత్రిపై పని చేస్తుండటం కూడా ప్రజానీకానికి ఆశాభంగం కలిగించింది. ఫలితంగా పి.వి.ని రాజీనామా చేయించారు. **1973** జనవరి **1**న రాష్ట్రపతిపాలన విధించారు. గవర్నర్‌కు శ్రీ హరిశ్చంద్ర సరీన్, శ్రీ వి.కె.రావుగార్లను

సలహాదార్లుగా నియమించారు. వాస్తవానికి పరిపాలన అంతా సలహాదారులే చూసేవారు. సంవత్సరంన్నర కూడా ముఖ్యమంత్రిగా వుండకుండా పి.వి.నరసింహారావు ఆ విధంగా వైతొలగాల్సివచ్చింది. ఆయనే యిప్పుడు ప్రధానిగా వుండే దురదృష్టం భారత దేశానికి కలిగింది.

# ముఖ్యమంత్రిగా

అప్పుడు గవర్నరుగా కందూభాయి దేశాయి వున్నారు. ఆయన గుజరాత్‌కు చెందినవారు. మహాత్మాగాంధి, సర్దార్ పటేల్ వంటి వారి నాయకత్వంలో పనిచేసిన సిసలైన గాంధేయవాది. చాలా నిజాయితీ కలవాడు. అబద్ధం ఆడడం చేతకాని మనిషి. ఇక్కడున్న పరిస్థితులను ఆయన ఇందిరా గాంధీకి ఎప్పటికప్పుడు తెలియ చేస్తుండే వాడు.

## గవర్నర్ సూచన :

రాష్ట్రంలో కాంగ్రెస్‌కు మంచి మెజారిటీ వుంది. అలాటప్పుడు యిక్కడ కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడకుండా ఎక్కువ కాలం అధ్యక్షపాలనలో వుండటం మంచిది కాదని ఆయన కేంద్రానికి నివేదిక పంపారు. అప్పుడు ఇందిరాగాంధి 'ఈ రాష్ట్రానికి ఎవరిని ముఖ్యమంత్రిగా పంపాలి, ఎవరిని పంపుతే రాష్ట్రం ఛిన్నాభిన్నం కాకుండా వుంటుంది', అని ఆలోచించింది. లోగడ సంజీవయ్యగారు వెంగళరావును పెట్టమని యిచ్చిన సలహా ఆమెకు గుర్తుకు వచ్చింది. 'వెంగళరావైతే అటు ఆంధ్ర, యిటు తెలంగాణా ప్రాంతాలకు అంగీకారమైన వ్యక్తి', అని సంజీవయ్య గారు చెప్పిన మాటలు ఆమెకు తలపుకు వచ్చాయి. ఆమె గవర్నర్ సలహాదారు సరీన్‌ను ఢిల్లీకి పిలిపించి, ఆయన సలహా అడిగితే, ఆయన కూడ వెంగళరావు గారు హోం మంత్రిగా, పరిశ్రమల మంత్రిగా సమర్థతతో పనిచేసి, ప్రజల అభిమానాన్ని సంపాదించుకొన్న వ్యక్తి. ఆయనను ముఖ్యమంత్రి చేస్తేనే మంచిదని' చెప్పారు. అప్పుడు ఇందిరాగాంధీ నన్ను ఢిల్లీకి రమ్మని సరీన్‌తో కబురు చేశారు.

సరీన్ హైదరాబాదుకు తిరిగి రాగానే నన్ను డిన్నరుకు పిలిచి, ఆ సమయంలో అన్ని విషయాలూ చెప్పారు. 'మీరు వెంటనే ఢిల్లీకి వెళ్లండి! విమానాశ్రయంలో మీ కోసం కారుంటుంది. ఇందిరాగాంధి గారితో యింటర్వ్యూ నేను ఏర్పాటు చేస్తాను', అని సరీన్ నాకు చెప్పారు.

## ఇందిరతో భేటి:

నేను ఆ ప్రకారమే అక్టోబరు మొదటి వారంలో ఢిల్లీ వెళ్లాను. నేను ఢిల్లీ విమానాశ్రయంలో దిగగానే అప్పటి కేంద్ర హోంమంత్రి ఉమాశంకర్ దీక్షిత్‌గారి

పి.ఏ. ఆయన కారు తీసుకొని వచ్చి నాకోసం వేచివున్నాడు. నన్ను ముందు సరాసరి దీక్షిత్ గారి వద్దకు తీసుకొని వెళ్లాడు. అప్పుడు పార్లమెంటు సమావేశాలు జరుగుతూ వున్నాయి. పార్లమెంట్ భవనంలోని దీక్షిత్‌గారి గదిలోనే నేనాయనను కలిశాను. నన్ను చూడగానే ఆయన సంతోషం వ్యక్తం చేశారు. వెంటనే నన్ను పార్లమెంట్ భవనంలోని ప్రధాని గదిలోకి తీసికొని వెళ్లి ఇందిరా గాంధీకి పరిచయం చేసి తాను బయటకు వెళ్లిపోయారు. ఆమె నన్ను కూర్చోమని చెప్పి, పి.ఏ.తో తాను మళ్లీ చెప్పేదాకా గదిలోకి ఎవర్నీ రానియ్యవద్దని ఆదేశించారు.

తరువాత నాతో ఆమె మాట్లాడటం ప్రారంభించారు. ఆంధ్ర ప్రదేశ్‌లో రాష్ట్రపతి పాలన తీసివేసి తొందరలోనే ప్రజాప్రభుత్వాన్ని ఏర్పాటు చేయాలనుకుంటున్నానని ఆమె అన్నారు. తరువాత సంజీవయ్యగారు నా గురించి లోగడ తనతో చెప్పిన మాటలు చెప్పారు. ''బ్రహ్మానందరెడ్డిని తీసి వేసిన వెంటనే సంజీవయ్య గారు చెప్పిన ఆ మాటలింకా నా చెవుల్లో గింగురుమంటున్నాయి. ఈ క్లిష్ట పరిస్థితిలో మీరు రాష్ట్రం బాధ్యత తీసికొంటే, అందరినీ కలుపుకొని వెళ్లగలరని, రాష్ట్రాన్ని అభివృద్ధి చేయగలరనీ, రాష్ట్రానికి మంచి పరిపాలన యిచ్చే శక్తి మీ వొక్కరికే వుందని చాలామంది నాతోచెప్పారు. అందువల్ల మీరు యీ బాధ్యతను తీసి కోవాలని కోరటానికే మిమ్మల్ని పిలిపించవలసి వచ్చింది. మీరు ముఖ్య మంత్రి బాధ్యత వహించటానికి తయారుగా వుండాలి. నేను ఒకటి, రెండు మాసాలలో నిర్ణయం తీసుకొని మీకు తెలియచేస్తాను. అప్పటి దాకా, ముఖ్యమంత్రి అయింతర్వాత ఏం చేయాలో ఆలోచించుకొని సిద్ధంగా వుండండి!', అని చెప్పారు.

నేను ఆమె చెప్పిన మాటలన్నీ విన్న తరువాత ఆమె ఆజ్ఞ శిరసా వహిస్తాననీ, వెనుకాడననీ, కాని దీనికి కాసు బ్రహ్మానందరెడ్డి, పి.వి. నరసింహా రావులు వ్యతిరేకిస్తారనీ చెప్పాను. వెంటనే ఆమె 'ఆ సంగతంతా నేను చూసుకుంటాను. ఆ బాధ్యత నాది. సరేనా! మీరు మాత్రం రాష్ట్రం బాధ్యత తీసికోడానికి తయారుగా వుండండి!', అన్నారు. తరువాత 'బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రిగా వుండగా, రాష్ట్రాన్నీ, కాంగ్రెస్ పార్టీని ముఠాలుగా చీల్చివేసి లంచగొండిగా తయారై అంతా భ్రష్టు పట్టించారు. ఆయన మాటకు విలువనిచ్చే ప్రశ్నలేదని' నాతో చెప్పారు. 'ఇక పి.వి. నరసింహారావు విషయానికొస్తే ఇంత అసమర్థుడిని, ఏ విషయంలోనూ నిర్ణయం తీసికోలేనివాడిని ఎవరినీ నేనింత వరకు చూడలేదు. నేను యితడిని మొదట ముఖ్యమంత్రిని చేసినపుడు కందూభాయి, త్రిపాఠీ,

ఉమాశంకర్ దీక్షిత్‌జీల మాటలు విని యితడు బాగా పనిచేస్తాడని ఆశించాను. కాని అతను నా ఆశలకు తగినట్లు ప్రవర్తించలేక పోయాడు. లక్ష్మీకాంతమ్మ కూర్చోమంటే కూర్చోటం, లేవమంటే లేవటమే తప్ప ఏంచేసింది లేదు. ఎదిగిన పిల్లలు అయిదుగురు కుమార్తెలు, ముగ్గురు కుమారులను ఎదురుగా పెట్టుకొని ఆయన యిలా ప్రవర్తిస్తుండటం ఏం బాగాలేదు. వాళ్ల పెద్దబ్బాయి పి.వి.రంగారావు నా దగ్గరకు వచ్చి ఈ లక్ష్మీ కాంతమ్మ వల్ల వాళ్ల కుంటుంబం పడే బాధలన్నీ ఏడుస్తూ చెప్పు కుంటుంటే, నాక్కూడ ఎంతో బాధేసింది. ఒకసారి లక్ష్మీకాంతమ్మ నా దగ్గరకు వచ్చి 'తనను ముఖ్యమంత్రిని చేస్తే, పి.వి. నరసింహారావు రాత పూర్వకంగా అంగీకారం తెలియచేస్తాడు. మీరు అంగీకరిస్తే నేను ముఖ్యమంత్రినవుతాను' అని చెప్పింది. అప్పుడు నాకు ఆగ్రహం కలిగి 'ఛీ! యిక వీళ్ల మొహం చూడకూడదని' నిర్ణయించు కున్నాను. ఆ తరువాతనే నేను ఆలోచించుకొని ఒక నిర్ణయానికి వచ్చి మిమ్మల్ని రమ్మని కబురు పంపాను. ముఖ్యమంత్రి బాధ్యతలను వహించటానికి మీరు తయారుగా వుండాలన్న వుద్దేశంతో ముందుగా యీ సంగతి మీకు చెబుతున్నాను. బ్రహ్మానందరెడ్డి, నరసింహారావు సంగతులన్నీ దృష్టిలో వుంచుకొనే యీ నిర్ణయం తీసుకున్నాను. నేను అధికార పూర్వకంగా తెలియచేసేవరకు, యీ విషయాలన్నీ మీ మనసులో వుంచుకోండి! శాసనసభ్యులు, యితర కాంగ్రెస్ కార్యకర్తలతో స్నేహంగా వుంటూ వుండండి! మీరీ రోజు సాయంకాలమే హైద్రాబాద్ వెళ్లిపోండి ! ఇక్కడ వుంటే ఏదో నిర్ణయం జరిగిందనే అనుమానాలు కలుగుతాయి', అని చెప్పారు.

ఇదంతా అయి, నేను లేచి, ఆమెకు ధన్యవాదాలు తెలిపి బయటకు వచ్చేసరికి, గంటా పది నిమిషాలు గడచాయి. బయట చాలామంది ఆంధ్రా యం.పి.లూ, యితరులు నా దగ్గరకు వచ్చి 'ఇద్దరూ చాల సేపు మాట్లాడారు, ఏమిటి విశేషం ?, అంటూ అడిగారు. నేను ప్రధాని రమ్మన్నారని కాని, మిగతా సంగతులు కాని చెప్పకుండా దాటవేసి ఆంధ్రప్రదేశ్ గెస్టుహౌసుకు వెళ్లి భోజనం చేసి, విశ్రాంతి తీసుకొని, సాయంకాలం విమానంలో హైదరాబాదు తిరిగి చేరుకున్నాను.

'వెంగళరావు గారు ఢిల్లీలో ప్రధానితో గంటపైగా సమావేశమైనట్లు' తెల్లారేసరికి పత్రికలలో వార్తలు వచ్చాయి. చాల మంది ఆ వార్తలు చూసి నా వద్దకు వచ్చి ఏం జరిగిందో చెప్పండని అడగటం మొదలు పెట్టారు. 'ఆంధ్ర-తెలంగాణా ఉద్యమాల తర్వాత పరిస్థితులు తెల్సుకోడానికి నాతో మాట్లాడారు,

అంతేకాని మరేం లేదని' నేను చెబుతూ వచ్చాను. నన్ను కలిసిన కాంగ్రెస్ శాసనసభ్యులు, కాంగ్రెస్ కార్యకర్తలందరూ ఇందిరాగాంధి గారు ఏం చెబితే దానికే మనం కట్టుబడి వుందామని అంటుండేవారు. నేను కూడ 'ఆంధ్ర, తెలంగాణా ఉద్యమాలలో రాష్ట్రం బాగా నష్ట పోయిందనీ, అభివృద్ధి బాగా కుంటుపడిందనీ, దానిని సరిచేయాల్సి వుందనీ, అందుకు ప్రధాని ఏం చెబితే దానికి మనమంతా కట్టుబడి వుండాలనీ' చెబుతూ వచ్చాను.

## పదవికై పాట్లు :

దీని తరువాత బ్రహ్మానందరెడ్డి క్యాంప్‌లోనూ, నరసింహారావు క్యాంప్‌లోనూ ఢిల్లీలో వాళ్లకు ఏ మాత్రం విలువ లేకుండా పోయిందనే అనుమానం వచ్చింది. కాని ఆ సంగతి బయటకు పొక్కితే, ఉన్న నలుగురూ జారిపోతారేమోనన్న భయంతో వాళ్లు ఇందిరాగాంధి తాము చెప్పినట్లు వినకుండా యింకా ఏమీ చేయదనే తప్పుడు ప్రచారం చేసుకుంటూ వచ్చారు. కావాలని కొంతమంది శాసనసభ్యులను ఢిల్లీ పంపి వాళ్లతో అక్కడ కంట తడిపెట్టుకొని 'మాకు పి.వి.నరసింహారావే ముఖ్యమంత్రి కావాలనీ', 'బ్రహ్మానందరెడ్డే ముఖ్యమంత్రి కావాలనీ' యిలా చెప్పిస్తూ వచ్చారు. పార్లమెంటు సెంట్రల్ హాల్లో లక్ష్మీకాంతమ్మ ఇందిరాగాంధీకి వ్యతిరేకంగా మాట్లాడటం మొదలు పెట్టింది. ఆమె మూడుసార్లు కేవలం నా పలుకుబడితోనే ఎన్నికల్లో గెలిచింది. అయినా నరసింహారావుతో వున్న స్నేహ సంబంధాల కారణంగా నాకు వ్యతిరేకంగా ప్రచారం చేయటం జరిగింది.

ఇందిరాగాంధీ రాష్ట్రంలో ఎవరిని ముఖ్యమంత్రిని చేస్తుందనేది ఎవరికీ అంతు బట్టని విషయమై కూచుంది. ఎవరికి వారే అగమ్య గోచరస్థితిలో వున్నారు. బ్రహ్మానందరెడ్డి, మాకల రామచంద్రారెడ్డి చొక్కారావుని ముఖ్యమంత్రిగా బలపరుస్తామని చెప్పి, వాళ్లను వుపయోగించుకొనే ప్రయత్నం చేశారు. వాళ్లుకూడ తెలివి తక్కువగా ఇందిరాగాంధి ఆలోచనల తీరెలావుందో, కేంద్ర నాయకుల వైఖరేమిటో తెలియకుండానే తమ ప్రయత్నాలు తాము ప్రారంభించారు. పి.వి.నరసింహారావుకు కాంగ్రెస్ శాసనసభా నాయకత్వానికి రాజీనామా చేయాల్సిందని చెప్పినా, ఆ సంగతి ఆయన బయట పెట్టకుండా, తానే ముఖ్యమంత్రి కాగలనంటూ శాసనసభ్యులను చివరిదాకా మభ్యపెడుతూ వచ్చాడు.

## ఆరు సూత్రాల పథకం :

ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని రాష్ట్రంలో ఏర్పాటు చేసేందుకు ప్రాతిపదికగా, రాష్ట్రం సమైక్యంగా వుండాలంటే ఏం చేయాలి అన్న విషయం తెలుసుకొనే ప్రయత్నాలను కేంద్ర ప్రభుత్వం ప్రారంభించింది. ప్రత్యేక తెలంగాణా, ఆంధ్ర ఉద్యమాలకు నాయకత్వం వహించినవారిని దఫాలుగా ఢిల్లీ రప్పించి కేంద్రమంత్రి శ్రీ కె.సి.పంత్ చర్చలు జరిపారు. అన్ని వర్గాల నాయకులతోనూ చర్చలు జరిపిన తర్వాత ఆరుసూత్రాల పథకాన్ని రూపొందించారు. హైదరాబాదులో నివసించే ఆంధ్ర- తెలంగాణా ప్రాంతాల వారి పిల్లలకు చదువుకొనేందుకు యిబ్బంది లేకుండా ఏర్పాటు చేశారు. ఆయా ప్రాంతాలలోని కళాశాలలు విద్యా సంస్థలలో స్థానికులకు 85 శాతం దాకా సీట్లు కేటాయించారు. ఆంధ్ర - తెలంగాణా ప్రాంతాలలోని వెనకబడిన ప్రాంతాల అభివృద్ధి కోసం రు. 90 కోట్లు, హైదరాబాద్ - సికింద్రాబాదు నగరాల అభివృద్ధికి అదనంగా రు.10 కోట్లు కేంద్రం యిచ్చేందుకూ, ఆంధ్ర, రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలలో ప్రాంతీయకమిటీలను వేసి అభివృద్ధి కార్యక్రమాలు సరిగా అమలవుతున్నవా లేవా అన్న సమీక్షకు ఏర్పాట్లు చేశారు. అటెండరు నుండి తహసీలుదారు హోదా వరకు, (ఇతర శాఖలలో అయితే తాసిల్దారు హోదాకు సమానమైన పదవిగల) వుద్యోగులు జిల్లా / జోన్‌లో ఎక్కడి వారక్కడే పనిచేసే ఏర్పాటు; రాష్ట్ర ముఖ్యమంత్రి అధ్యక్షతన రాష్ట్ర అభివృద్ధి పరిశీలన కమిటీ ఏర్పాటు (అందులో ప్రాంతీయ కమిటీల అధ్యక్షులు సభ్యులుగా వుంటారు.) జరగాలని ప్రకటించారు. ఈవిధంగా రాష్ట్రంలో అభివృద్ధిని సాధించి అయిదు సంవత్సరాలలో అన్ని ప్రాంతాలు సమానంగా అభివృద్ధి అయ్యేలా చూసి ప్రాంతీయ తారతమ్యాలు నశించేలా చేయటం ఈ ఆరు సూత్రాల పథక ప్రధానోద్దేశం. దీనిని మూడు ప్రాంతాలకు చెందిన రాజకీయ నాయకు లంతా ఆమోదించారు. దీని అమలు బాధ్యతను కొత్తగా వచ్చే ముఖ్యమంత్రికి అప్పగించాలని నిర్ణయించారు.

## బ్లాక్ లిస్ట్ :

కొత్త ముఖ్యమంత్రి గురించి ఇందిరాగాంధిగారు ఒక నిర్ణయం తీసికొన్న సంగతి తెలియక, ఆయా గ్రూపులవారు ఢిల్లీలో తమ ప్రయత్నాలు తాము సాగిస్తూనే వున్నారు. 1972లో సార్వత్రిక ఎన్నికల సమయంలో కాంగ్రెస్ టిక్కెట్లు

యిచ్చే సందర్భంలో ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి, అప్పటి కాంగ్రెస్ అధ్యక్షుడు సంజీవయ్య కలిసి ఒక జాబితా తయారు చేశారు. ఎవరికి టిక్కెట్లు యివ్వరాదో తెలిపే బ్లాక్ లిస్ట్ అది. అందులో లోగడ బ్రహ్మానందరెడ్డి, పి.వి.నరసింహారావుల మంత్రి వర్గాలలో పనిచేసి, లంచగొండులుగా పేరు పడ్డ కొందరి పేర్లున్నాయి. అందులో సుమారు **11** మంది దాకా అంతా రెడ్లపేర్లే వున్నట్లున్నాయి. నాకు గుర్తున్నంతవరకు తిమ్మారెడ్డి; **1983**లోను, **1993**లోను రెండు సార్లు ముఖ్యమంత్రి చేసి కాంగ్రెస్ ఓటమికి కారకుడైన విజయం భాస్కరరెడ్డి; బ్రహ్మానందరెడ్డి సహచరులయిన రొండా నారపరెడ్డి, శీలం సిద్ధారెడ్డి, ఆనెం సంజీవరెడ్డి, జి.సంజీవరెడ్డి లాటి వాళ్లు పదకొండు మందిదాకా అందులో వున్నారు. వీరందరికీ **1972**లో టిక్కెట్లు నిరాకరించబడ్డాయి. వాళ్లలో కొందరు ఎమ్. ఎల్. సి.లుగా కొనసాగుతూ వచ్చారు. వీరంతా ఏకమై వెంగళరావు కాకుండా ముఖ్యమంత్రి ఎవరైనా సరేనంటూ ఢిల్లీ వెళ్లి పట్టుదలగా విశ్వప్రయత్నం చేశారు కాని ఫలితం దక్కలేదు. అలాగే పి.వి. నరసింహారావు కూడ ఒక ముఠాను కట్టుకొని, తానే తిరిగి ముఖ్యమంత్రి కావాలని ప్రయత్నాలు సాగించాడు. పి.వి నరసింహారావు ముఖ్యమంత్రిగా వుండగా ఆయునను తొలగించటానికి పెద్ద వుద్యమం వచ్చేందుకు ప్రోత్సాహం యిచ్చిన వారిలో మొదటి వాడు బ్రహ్మానందరెడ్డి. తరువాత వాడు విజయభాస్కరరెడ్డి. ఆ తరువాత పైన చెప్పిన టిక్కెట్లు నిరాకరించ బడ్డ వాళ్లు. వీరంతా నరసింహారావు పతనం కోసం ఎంతో పాటుబడ్డ వాళ్లే. కాని యిప్పుడు వీరంతా నరసింహారావు వర్గంతో చేతులు కలిపారు. నేను ముఖ్యమంత్రి నయితే తమ ఆటలు సాగవనే భయంతోనే వీరీ పనిచేశారు. ఈ సంగతులన్నీ గూఢచారి వర్గాలవారు ప్రధానికెప్పటికప్పుడు తెలియ చేస్తుండే వారు.

## అమోఘ చాతుర్యం :

ఇందిరాగాంధి వీళ్లకు బుద్ధి చెప్పటంకోసం, ఆంధ్ర ఉద్యమానికి నాయకత్వం వహించిన బి.వి.సుబ్బారెడ్డి గారినుండి, తెలంగాణ ఉద్యమానికి నాయకత్వం వహించిన చెన్నారెడ్డి గారినుండి 'వెంగళరావు గారు ముఖ్యమంత్రి అయితే మాకేం అభ్యంతరం లేదని' రాతపూర్వకంగా ఆమోదం తెప్పించుకున్నారు. ఇది రాసివ్వటంలో వారిద్దరికీ కొంత స్వార్థం లేక పోలేదు. ఆంధ్రోద్యమంలో ఇందిరాగాంధీని దూషించిన బి.వి.సుబ్బా రెడ్డి కొత్తగా ఏర్పడనున్న మంత్రి

వర్గంలో మళ్లీ స్థానం సంపాదించుకొని, ఉపముఖ్యమంత్రి కావాలన్న ఆశతో వున్నాడు. తెలంగాణా ఉద్యమ నాయకుడు చెన్నారెడ్డి గవర్నర్ పదవిని ఆశిస్తున్నాడు. అందుకే వారిద్దరూ అలా రాసిచ్చారు. ఈ విధంగా ఇందిరాగాంధి అమోఘమైన చాతుర్యంతో కొత్తమంత్రివర్గం ఏర్పడటానికి ఏ అడ్డంకీ లేకుండా చేశారు.

**1973** డిసెంబరు మొదటి వారంలో ఇందిరాగాంధి అప్పటి కాంగ్రెస్ అధ్యక్షులు డాక్టర్ శంకరదయాళ్ శర్మగారిని, అప్పటి కేంద్ర హోం శాఖమంత్రి ఉమాశంకర్ దీక్షిత్ గారిని, అప్పటి ఏ.ఐ.సి.సి. ప్రధాన కార్యదర్శి శ్రీమతి మరకతం చంద్రశేఖర్ గారిని హైదరాబాదుకు పంపారు. వారు కాంగ్రెస్ శాసనసభ్యులను ఒక్కొక్కరినే పిలిచి మాట్లాడి, వాళ్ల అభిప్రాయా లను తెలుసుకొన్నారు. కాంగ్రెస్ ఎం.ఎల్.ఏ.లు ఎవరు ఎవరి పేరు చెప్పినా, మొత్తం మీద అందరూ తాము ఇందిరాగాంధి నిర్ణయించిన వ్యక్తి ఎవరైతే వారిని బలపరుస్తామని చెబుతూవచ్చారు. ఆ విషయాన్ని రాత పూర్వకంగా తీసికోడం జరిగింది. అప్పటి మాజీ ముఖ్యమంత్రి పి.వి.నరసింహారావు దగ్గర కూడా రాతపూర్వకంగా తీసికోడం జరిగింది. బ్రహ్మానందరెడ్డి లోపల్లోపల ఎన్ని కుతంత్రాలు పన్నినా, చివరకు ఆయన కూడా ఇందిరా గాంధి చెప్పిన వ్యక్తినే బల పరచటానికి అంగీకరించక తప్ప లేదు. ముగ్గురు పరిశీలకులూ హైదరాబాదులో మూడురోజులపాటు ఉండి అందరి అభిప్రాయాలూ తెలుసుకొని అందరూ ఇందిరాగాంధి ఆజ్ఞ శిరసావహించటానికి అంగీకరించారని ఢిల్లీ చేరిన తరువాత ఇందిరాగాంధి గారికి నివేదిక సమర్పించటం జరిగింది. ఇందిరాగాంధి గారు చెప్పినట్లు వింటామని రాసిచ్చిన బ్రహ్మానందరెడ్డి, పి.వి.నరసింహారావులు నన్ను రాకుండా చేసేందుకు, తుదివరకు తమ ప్రయత్నాలు తాము చేస్తూనే వున్నారు. ఒక స్థాయిలో లక్ష్మీకాంతమ్మగారు పార్లమెంటు సెంట్రల్ హాల్‌లో మాట్లాడుతూ తమకువ్యతిరేకంగా నిర్ణయం తీసికొంటే హైదరాబాదులో రక్తపాతం జరుగుతుందని ప్రగల్భాలు పలికేదాకా పరిస్థితి చేరింది. ఈ విషయం వెంటనే ఇందిరాగాంధి దృష్టికి వెళ్లింది.

## 'హైదరాబాద్ ఎలా వుంది?' :

**1973** డిసెంబరు **8**న సాయంకాలం నాలుగు గంటలకు ఢిల్లీలో కాంగ్రెస్ పార్లమెంటరీ బోర్డు ఇందిరాగాంధి అధ్యక్షతన సమావేశమైంది. అందులో

'ఆంధ్ర ప్రదేశ్‌కు వెంగళరావుగారిని ముఖ్యమంత్రిగా చేయవాలన్న' నిర్ణయంతీసుకొన్నారు. ఢిల్లీలో ఈ నిర్ణయం చాలామందికి తెలియటంతో చాలమంది నాకు, యితరులకు కూడా యీ సంగతి ఫోన్ చేసి చెప్పారు. ఆ రాత్రి 9 గంటలకు పార్లమెంటరీ బోర్డు నిర్ణయాన్ని అధికార పూర్వకంగా నాకు తెలియ చేశారు. ఉదయమే ఢిల్లీ నుంచి ప్రత్యేక దూత వొకరు విమానంలో హైదరాబాదు వచ్చారు. ఆయన ఏ.ఐ.సి.సి. కార్యాలయం నుండి కాంగ్రెస్ పార్లమెంటరీ బోర్డు తీర్మానం ప్రతులను రెండు కవర్లలో విడివిడిగా తెచ్చారు. అప్పటికే యీ విషయం తెలిసి వేలాది జనం తండోపతండాలుగా మా యింటికి రావటం మొదలయింది. ఎందరో శాసన సభ్యులు, పార్లమెంటు సభ్యులు, నాయకులు, కార్యకర్తలు పూలదండలతో వచ్చారు. అధికారికంగా కబురు నా చేతికి చేరేదాకా పూలదండలు వేయకుండా ఓపిక పట్టాలని నేను వారందరినీ కోరాను. ఇంతలో ఢిల్లీనుంచి వచ్చిన వ్యక్తి ముందు గవర్నరు గారికి ఉత్తరం అందించి, తరువాత నా దగ్గరకు వచ్చి ఉత్తరం యిచ్చారు. వెంటనే కొన్ని వందల వేల దండలతో ప్రజలు, నాయకులు నన్ను ముంచెత్తటం జరిగింది. నేను ఆ ఉత్తరం తీసి చదువుకున్న తరువాత ఢిల్లీకి ఫోన్‌చేసి శ్రీమతి ఇందిరాగాంధి గారితో 'ఈ బాధ్యతను నాపై విశ్వాసం వుంచి నాకప్పగించినందుకు ధన్యవాదాలు' అని చెప్పాను. అప్పుడామె నవ్వుతూ 'ఇప్పుడు హైద్రాబాద్ ఎలా వుందని' అడిగారు. తమకు వ్యతిరేకంగా నిర్ణయిస్తే హైద్రాబాదులో రక్తపాతం జరుగుతుందని లక్ష్మీకాంతమ్మ పార్లమెంట్ సెంట్రల్ హాల్‌లో పలికిన ప్రగల్భాలను గుర్తుచేస్తూ ఆమె ఆ ప్రశ్న అడిగారు. 'నేడు రాష్ట్రమంతటా మీ నిర్ణయం పట్ల హర్షామోదాలు వ్యక్తం అయ్యాయని, మీ నిర్ణయం ప్రకారమే అంతా నడుచుకుంటు న్నారనీ' చెప్పాను. 'దానికి తార్కాణం మా యింటిముందు కూడిన వేలాది జనమేనని' కూడ చెప్పాను. తరువాత ఆమె నన్ను ఢిల్లీకి వచ్చి తనను కలవమని చెప్పింది.

జనం అలా ప్రవాహంలా వస్తూనే వున్నారు. నేను వారిని కొంచెం ఓపిక పట్టమని కోరి, గవర్నరుతో ఫోన్‌లో మాట్లాడి 'పదకొండు గంటలకు వారిని కల్సుకునేందుకు వస్తానని' చెప్పాను.

## కంగుతిన్న కాసు, పి.వి. :

గవర్నరుగారిని కలిసేందుకు పోతూ, మర్యాద పూర్వకంగా నా కన్న ముందు ముఖ్యమంత్రులుగా వున్న బ్రహ్మానందరెడ్డి, నరసింహారావులను కలుసుకొనేందుకు

ముందుగా ఫోన్ చేసి వెళ్లాను. ముందు బ్రహ్మానందరెడ్డి యింటికి పోగా ఆయన లేచి బయటకు వచ్చాడు. తెల్లవార్లూ నిద్రలేక పీక్కుపోయిన మొహం వేసుకొని వచ్చాడు. నన్ను ముఖ్యమంత్రి కాకుండా చేసేందుకు విశ్వప్రయత్నం చేసినవాడు కదా! ''నేను ముఖ్యమంత్రి బాధ్యత తీసికొంటున్నాను. మీ సంపూర్ణ సహకారం అందజేయమని' మర్యాద పూర్వకంగా అడిగాను. దాంతో ఆయన నిర్ఘాంత పోయి, 'పై వాళ్ల నిర్ణయం అయింతర్వాత మా సహకారం లేకుండా ఎలా వుంటుందని' నిరుత్సాహంగా మాట్లాడాడు. ఆయన నా ప్రమాణ స్వీకారోత్సవానికి కూడ హాజరు కాలేదు, అవమానాన్ని భరించలేక మొహం చెల్లలేదేమో!

అక్కడ నుండి పి.వి.నరసింహారావుగారి యింటికి వెళ్లాను. ఆయన లేచి వచ్చి నన్ను లోపలకు తోడుకొని వెళ్లారు. 'గవర్నర్‌ను కలిసేముందు మీ సహకారం కోరటానికి వచ్చానని' చెప్పాను. ఆయన కూడ, పాపం, చాల నిరుత్సాహంగా 'సహకారం లేకుండా ఎట్లా తప్పుతుంది?' అని అన్నారు. ఆ రాత్రివరకు బ్రహ్మానందరెడ్డి, పి.వి.నరసింహారావుల యింటి వద్ద మూగిన జనమంతా నా పేరు ముఖ్యమంత్రిగా ఖరారయిందని తెలియగానే ఒక్కమనిషి లేకుండా అంతా మా యింటికి రావటం జరిగింది.

ఆ పైన నేను రాజభవన్‌కు వెళ్లి గవర్నర్ కందూభాయి దేశాయిని కలిసి నేను మంత్రి వర్గం ఏర్పాటు చేసేందుకు సిద్ధంగా వున్నానని చెప్పాను. ఆయన ఎంతో సంతోషంతో నన్నభినందించి, అప్పటికప్పుడు నన్ను మంత్రి వర్గ నిర్మాణం చేయవలసిందిగా రాత పూర్వకంగా ఆహ్వానం అందచేశారు. అంతే కాదు, సంతోషం పట్టలేక ఆయన లేచి నన్ను కౌగిలించుకున్నారు. 'రాష్ట్రం మీరు ముఖ్యమంత్రిగా వుంటే ఎంతో అభివృద్ధి చెందుతుందని' నన్ను ఆశీర్వదించారు. ఆయన చాల నిష్కళంకమైన వ్యక్తి. నేను ముఖ్యమంత్రి అయితే రాష్ట్రం ప్రశాంతంగా వుంటుందని తాను లోగడ ఇందిరాగాంధి గారికి రాసిన సంగతి అప్పుడాయన నాతో చెప్పారు. 'మిమ్మల్ని ముఖ్యమంత్రిగా నా చేతులతో ప్రమాణ స్వీకారం చేయించటం నా కెంతో సంతోషంగా వుంటుంది', అని ఆయన అన్నారు.

## ముఖ్యమంత్రిగా :

నేను మర్నాడు అంటే 8వ తేదీ సాయంకాలం ఢిల్లీకి వెళ్లాను. ఇందిరాగాంధి గారిని, కాంగ్రెస్ అధ్యక్షుడు శంకర్‌దయాళ్ శర్మగారిని కలిసి నా మంత్రివర్గ జాబితా ఆమోదం పొంది, పది ఉదయం హైదరాబాద్ చేరుకున్నాను. విమానాశ్రయం నుండే సరాసరి రాజభవన్‌కు వెళ్లి గవర్నర్ గారిని కలిసి మంత్రివర్గ జాబితాను సమర్పించాను. ఆ రోజు సాయంకాలం నాలుగు గంటల ప్రాంతంలో రాజభవన్‌లో ప్రత్యేకంగా నిర్మించిన వేదికపై నేను ముఖ్యమంత్రిగా ప్రమాణస్వీకారం చేశాను. రాజభవన్ లాన్స్ మొత్తం జన సందోహంతో కిట కిటలాడిపోయాయి. హాజరైన వారిలో మాజీ ముఖ్యమంత్రి పి.వి నరసింహారావు, ప్రత్యేక తెలంగాణా ఉద్యమనాయకుడు డా.చెన్నారెడ్డి కూడ వున్నారు. మా అమ్మగారు, నా భార్య మంగాయమ్మ, నా కుమారుడు ప్రసాదరావు, ఆయన కుటుంబం, నా చిన్న కొడుకు వెంకట్రావు, యితర కుటుంబ సభ్యులు ముందు వరసల్లో కూర్చొని ప్రమాణ స్వీకారోత్సవాన్ని తిలకించారు. నా తరువాత వరుసగా 23గ్గురు మంత్రులను ప్రమాణస్వీకారం చేయించారు. తరువాత గవర్నరు మంత్రివర్గ సభ్యులతో ఫొటోదిగారు. ఆపైన గవర్నర్ నాకూ, నా మంత్రి వర్గ సభ్యులందరికీ, యితర ఆహ్వానితులకూ తేనీటి విందు చేశారు. మంత్రులకు అప్పగించే శాఖలను కూడా ముందుగా తయారు చేసి గవర్నరు గారికి సమర్పించి, ఆయన ఆమోదం తీసికొని వుండటం వల్ల ప్రమాణస్వీకారం కాగానే ఆలస్యం లేకుండా పత్రికలకు విడుదల చేశాను. సుమారు 11 మాసాల రాష్ట్రపతి పాలన అంతమయిన తర్వాత ప్రజా ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసే అవకాశం నాకా విధంగా లభించింది.

మంత్రి వర్గ ఏర్పాటు విషయంలో ప్రధాని ఇందిర నాకు పూర్తి స్వేచ్ఛనిచ్చారు. నా మీద పూర్తి విశ్వాసం వుంచి, నేను సమర్పించిన జాబితాను ఆమోదించి యిచ్చి వేశారు. 'వేర్పాటు వుద్యమాల వల్ల ఏర్పడిన అఖాతాలను బూడ్చివేసి, రాష్ట్రాన్ని సమైక్యంగా ప్రగతిపథంలో నడిపించే బాధ్యత నాపై పెడుతున్నానని ఆమె నాతో చెప్పిన విషయం నేను ఎప్పుడూ గుర్తుంచుకొని మెలిగేవాడిని. ఆమె కూడా తాను వాగ్దానం చేసినట్లు ప్రభుత్వ నిర్వహణలో నాకు పూర్తిస్వేచ్ఛనూ, సహకారాన్నీ, మద్దతునూ అందించారు. అప్పుడు దేశంలో వున్న 'ముఖ్యమంత్రులందరి లోనూ నా పట్ల ఎక్కువ నమ్మకం వుంచి, నాతో ఎన్నో జాతీయ సమస్యల పైన ఆమె సంప్రదిస్తుండేవారు. ఆమెకు పూర్తివిశ్వాసంవున్న ముఖ్య మంత్రులలో నేను ప్రథముడిగా వుండేవాడిని.

## అన్నీ సమస్యలే :

ముఖ్యమంత్రిగా నేను బాధ్యత తీసుకొన్న రోజున రాష్ట్రం పదికోట్ల ఓవర్ డ్రాఫ్టుతో తీవ్ర ఆర్థిక సంక్షోభంలో వుంది. విద్యుత్ కొరత, నీటిపారుదల ప్రాజెక్టులను పూర్తి చేసేందుకు నిధులు చాలకపోవడం వంటి సమస్య లున్నాయి. రాష్ట్రంలో వివిధ ప్రాంతాల మధ్య పరస్పర అవగాహన లోపించి, అనుమానాలు, విభేదాలు తలెత్తివున్నాయి. భావ సమైక్యతను, సామరస్యాన్ని సాధించి, కుంటుపడిన అభివృద్ధి కృషిని తిరిగి కొన సాగించటంపై దృష్టి సారించాల్సిన అవసరం వుంది. ఇవిగాక దివిసీమలో ఉప్పెనరావటం, గోదావరి ఆనకట్టకు గండిపడటం వంటి ప్రకృతి భీభత్సాలు నా పరిపాలనా కాలంలోనే సంభవించాయి. వీటిని గురించి సందర్భం వచ్చినప్పుడు వివరిస్తాను.

ముఖ్యమంత్రిగా బాధ్యత తీసుకోగానే నేను సచివాలయానికి వెళ్లి అధికార కార్యక్రమాలను ప్రారంభించాను. అప్పుడు ప్రధాన కార్యదర్శిగా భగవాన్‌దాస్‌వుండే వారు. నేనాయనను ఆ పదవిలోనే కొనసాగించటం జరిగింది.

## ఆర్థిక - ప్రణాళికాశాఖ :

అప్పటి వరకు ప్రణాళిక కార్యదర్శి, ఆర్థిక కార్యదర్శి వేరువేరుగా వుండేవారు. అభివృద్ధి తొందరగా జరగాలంటే ప్రణాళికను తయారు చేసేవ్యక్తి, దానికి ఆర్థిక పరంగా మంజూరు యిచ్చే వ్యక్తి ఒకరే వుండాలి. అలా కాకపోతే ఆలస్యం జరగటమే కాకుండా, అనుకొన్న పనులు అనుకొన్నట్లుగా జరగటం అసాధ్యం కనుక నేను ఈ రెండు శాఖలనూ కలిపి ఆర్థిక ప్రణాళిక శాఖగా చేసి, అప్పటి ప్రణాళికా కార్యదర్శి బి.పి. ఆర్. విఠల్‌ను ఆర్థిక ప్రణాళికా శాఖ ముఖ్య కార్యదర్శిగా నియమించాను. ఇందువల్ల ప్రణాళికాభివృద్ధి కార్యక్రమాలు వేగం పుంజుకొనేందుకు సౌలభ్యం కలిగింది.

## రావుసాహెబ్ :

ముఖ్యమంత్రి కార్యాలయానికి తగిన సిబ్బందిని ఎన్నిక చేయటం ముఖ్యంగా చేయవలసిన పని. అప్పటిదాకా రెవెన్యూ కార్యదర్శిగా వున్న కృష్ణస్వామి రావుసాహెబ్ అనే సీనియర్ ఐ.ఏ.యస్ అధికారిని ముఖ్యమంత్రి కార్యదర్శిగా నియమించుకొన్నాను.

ఆయన చాలా సమర్థుడైన అధికారి. వివిధ శాఖల కార్యదర్శులతో వివిధ అంశాలను గురించి తరచు చర్చిస్తూ ఎక్కడ ఏమి జరుగుతున్నదీ, పరిస్థితిని మెరుగు పరచటానికి యింకా ఏం చేయాలీ - యిటువంటి విషయాలను ఆలోచించి, ఎప్పటికప్పుడు అన్ని విషయాలనూ ఆయన నా దృష్టికి తెస్తుండేవారు. ప్రభుత్వం సమర్థ వంతంగా నడపటంలో నాకు ఆయన చక్కని తోడ్పాటు అందించారు.

# తొలి పరీక్ష

అందరి సహకారంతో నా మంత్రివర్గం చక్కని ఫలితాలను ఎన్నిటినో సాధించగల్గింది. నేనేంచేశానో నా కన్న బాగా ప్రజలే చెబుతారు. అవన్నీ నేనిక్కడ రాసుకోవాల్సిన అవసరం లేదు. అయినా ఉదాహరణగా కొన్ని సంగతులు మనవి చేస్తాను.

**వార్షిక ప్రణాళిక పెంపు :**

ముఖ్యమంత్రిగా పదవీ బాధ్యతలు తీసికొన్న తరువాత రాష్ట్ర ఆర్థిక పరిస్థితిని మెరుగుపరచి, అభివృద్ధి పథకాల అమలును శీఘ్రతరం చేసే ప్రయత్నాలను నేను ఆలస్యం చేయకుండా ప్రారంభించాను. అయిదవ ప్రణాళిక మొదటి సంవత్సరానికి వార్షిక ప్రణాళికను నిర్ణయించేందుకై అప్పుడే ప్రణాళికా సంఘం మమ్మల్ని ఢిల్లీకి ఆహ్వానించింది. ఢిల్లీ వెళ్లే సమయంలో ప్రణాళిక మొత్తం (ఔట్‌లే) పెంచాలనీ, అభివృద్ధి పథకాలకు- ముఖ్యంగా విద్యుదుత్పాదన, నీటిపారుదల పథకాలకు పెట్టుబడులను అధికం చేయాలనీ నేను గట్టి పట్టుదలతో వున్నాను. అది అంతసులభం కాదని నాకు తెలుసు. అప్పుడు కేంద్రంలో ప్రణాళికా శాఖమంత్రిగా, ప్లానింగ్ కమీషన్ డిప్యూటీ ఛైర్మన్‌గా శ్రీ డి.పి.ధార్ వుండే వారు. ఆయన సహకారం సాధించటం అవసర మయింది.

నేను ఢిల్లీ చేరగానే ముందుగా ప్రధాని ఇందిరాగాంధి గారిని కలిశాను. 'రాష్ట్రం వేర్పాటు వుద్యమాల వల్ల ఎంత దెబ్బతిన్నదో మీకు నేను చెప్పనవసరం లేదు. రాష్ట్రాన్ని తిరిగి ప్రగతి పథంలో నడిపించ వలసిందిగా ఆదేశించి, నాకు మీరు రాష్ట్రం బాధ్యత అప్పచెప్పారు. ప్రణాళికా వ్యయాన్ని పెంచి, అభివృద్ధి పథకాల అమలును శీఘ్రతరం చేయకుండా రాష్ట్రం కోలుకోలేదు. కనుక ప్రణాళికా మొత్తాన్ని (ఔట్‌లే) పెంచటానికి ప్రణాళికా సంఘం ఏ ఆటంకాలు పెట్టకుండా ఆమోదం యిచ్చేలా మీరు నాకు సహాయం చేయాలి', అని ఆమెను కోరాను. ఆమె నవ్వి, వెంటనే ధార్‌గారితో ఫోన్‌లో మాట్లాడారు. 'వెంగళరావుగారు యీ మధ్యనే ముఖ్యమంత్రి అయిన సంగతి మీకు తెలుసు. ఆయన అడిగిన వాటికి ఆటంకాలు పెట్టకుండా సహాయం చేయండి!', అని ఆమె ధార్‌తో నా ఎదుటనే చెప్పారు. నేను ప్రధానికి కృతజ్ఞతలు తెలిపి ధార్‌గారి యింటికి వెళ్లాను.

ధార్ నన్ను అభినందిస్తూ 'ప్రధాని నాతో మాట్లాడారు. మీకు సంపూర్ణ సహకారం అందించమని చెప్పారు. ఈ రోజు ప్రణాళికా సంఘం సమావేశంలో మీరు అడగదలచుకొన్నవన్నీ అడగండి! ప్రణాళికా సంఘ సభ్యులు అనేక రకాల ప్రశ్నలు వేసి, రకరకాల అభ్యంతరాలు లేవనెత్తుతారు. మీరు మీ సమాధానాలు గట్టిగా చెప్పండి! మీరా రాష్ట్రంలో నెలకొన్న ప్రత్యేక పరిస్థితులను వివరించండి! నా తోడ్పాటు మీకుంటుంది', అని ఆయన చెప్పారు. తరువాత ప్రణాళికా సంఘ సమావేశానికి నేనూ, ఆర్థిక, రెవెన్యూ శాఖల మంత్రి నూకల రామచంద్రారెడ్డి గారూ, మాతో వచ్చిన అధికారులూ అందరం హాజరయ్యాం. ప్రణాళికా సంఘ సభ్యులు 'మీది పెద్ద రాష్ట్రంకాని మీ పంచవర్ష ప్రణాళికావ్యయం మీకన్న చిన్న రాష్ట్రమయిన హర్యానా మాత్రం కూడా లేదు. మీరు సొంత వనరులు పెంచుకొని ప్రణాళికా మొత్తాన్ని అధికం చేయకపోతే రాష్ట్రం ముందుకు పోవటం కష్టం', అని చెప్పారు. నేను 'మేము సరిగ్గా అదే ఆలోచనతో యీ సమావేశానికి వచ్చాము. ఏమైనా సరే ప్రణాళిక అంచనాలను పెంచి రాష్ట్రాన్ని ముందుకు నడిపించాలన్న పట్టుదలతో వున్నాము. మీరు మాతో సహకరించాలి', అని చెప్పాను. ధార్‌గారు అన్నీ వింటూ కూర్చున్నారు. అప్పుడాయన 'వెంగళరావుగారు యీ మధ్యనే ముఖ్యమంత్రి పదవిని చేపట్టారు. వనరులను పెంచుకోడానికి ఆయన శక్తివంచన లేకుండా కృషి చేస్తారు. మనం కూడా ఆయనకు సహకరించి, తగిన సహాయం అందిద్దాం!' అని చెప్పారు.

అయిదవ ప్రణాళిక మొదటి వార్షిక ప్రణాళికను (1974-75) మేము అడిగినట్లుగా రు.150కోట్లకు పెంచటానికి అతికష్టంమీద వారంగీకరించారు. అయితే విజయవాడలో 440 మెగావాట్ల విద్యుదుత్పాదన చేసే థర్మల్ కేంద్రాన్ని నెలకొల్పే ప్రతిపాదనను మాత్రం అయిదవ ప్రణాళికలో చేర్చటానికి వీలులేదని పట్టుదలగా మాట్లాడారు. నేను వాళ్లతో మర్యాదగా మాట్లాడి, వారిని నొప్పించకుండా ఒక మధ్యేమార్గాన్ని సూచించాను. థెర్మల్ స్టేషన్ నిర్మాణాన్ని ప్రణాళికలో చేర్చటానికీ, మొదటి ఏడు నామమాత్రంగా ఒక కోటి రూపాయలు మాత్రం కేటాయించటానికీ వారంగీకరించాలని చెప్పాను. దానికి కూడ మొదట వారభ్యంతరం పెట్టారు. నేను అప్పుడు ధార్‌గారితో ''నేను రాష్ట్రంలో రెండు వేర్పాటు వుద్యమాలు జరిగిన నేపథ్యంలో ముఖ్యమంత్రి నైనాను. రాజకీయంగా ప్రాధాన్యం వుండి ఆంధ్ర ప్రాంతానికి నడిబొడ్డైన విజయవాడలో థెర్మల్ స్టేషన్ స్థాపించేందుకు మీరు సహకరించకపోతే, రాష్ట్రప్రగతి కుంటుపడుతుంది. నా

ప్రభుత్వానికి కూడా మీరు రాజకీయంగా యిబ్బందులు కలుగచేసిన వారౌతారు', అని చెప్పాను. దానితో ధార్‌గారు తనకు ప్రధాని ఇందిరాగాంధి చెప్పిన సంగతి గుర్తు తెచ్చుకొని, 'వెంగళరావుగారు పట్టుదలగల మనిషి. ఆయన వనరుల సేకరణపై చెప్పినవన్నీ చేసితీరతాడు. మనం అనుమానించవనిలేదు. కనుక వారి ప్రతిపాదనను అంగీకరిద్దామని', చెప్పారు. అప్పుడు నా మధ్యే మార్గాన్ని వారంతా ఆమోదించారు. ఆ విధంగా వార్షిక ప్రణాళికకు రు.150 కోట్లకు ఆమోదం పొందాము.

అయితే అమలు చేసేనాటికి రు.150 కోట్లేకాక, లక్ష్యాన్ని మించి, రు.200కోట్లకు ఆ ప్రణాళికను పూర్తి చేయటం జరిగింది.

## ఆర్థిక వనరుల పెంపు :

ప్రణాళికా మొత్తం పెంచాలంటే, రాష్ట్రప్రభుత్వం మీద అదనపు ఆర్థిక వనరులను పెంపొందించుకోవలసిన బాధ్యత వుంది. అప్పటికి ప్రభుత్వానికి రావలసిన బకాయిలు - రెవెన్యూ అయితేనేం, యితర పన్నులయితేనేం దాదాపు రు.250 కోట్ల దాకా వుండిపోయాయి. అందువల్ల నేను జిల్లా కలెక్టర్ల సమావేశాన్ని ఏర్పాటు చేసి ఆ సమావేశంలో కలెక్టర్లందర్నీ బకాయీల వసూలుకు గట్టిగా ప్రయత్నించ వలసిందిగా ఆదేశించటం జరిగింది. ఏ రైతైనా తాను చెల్లించాల్సిన బకాయిలను మార్చి 31లోగా చెల్లించినట్లయితే, అతని నుండి వసూలు చేయాల్సిన వడ్డీని, అపరాధపు వడ్డీని మాఫీచేస్తామని చెప్పాము. అందుకుగాను అంతకుముందే మంత్రి వర్గ సమావేశంలో చర్చించి విధాన నిర్ణయం తీసికోటం జరిగింది. వసూళ్ల విషయంలో మంత్రులెవరూ కలగజేసుకొని స్టే ఆర్డర్లు జారీ చేయరాదని కూడ మంత్రి వర్గంలో సమిష్టిగా నిర్ణయం తీసుకొనటం జరిగింది. ఈ కారణాల వల్ల కలెక్టర్లూ, వారి సిబ్బంది అంతా బాగా పనిచేసి దాదాపు రు.150 కోట్లవరకూ బకాయీలను వసూలు చేయగలిగారు.

## శాసనసభ, శాసనపరిషత్ సమావేశాలు :

ఆర్థికస్థితిని మెరుగు పరచుకొని నేను బడ్జెట్‌పై దృష్టి కేంద్రీక రించసాగాను. అప్పటికి సంవత్సరకాలంగా రాష్ట్రం రాష్ట్రపతి పాలనలో వుండటం మూలంగా శాసనసభ, శాసనపరిషత్తు సమావేశాలు జరగలేదు. నేను ముఖ్యమంత్రి అయిన తరువాత మొదటిసారి జరిగే సమావేశాలు బడ్జెట్ సమావేశాలు కావటం వల్ల

ఫిబ్రవరి నుండి సమావేశాలు జరపాలని నిర్ణయించాము. ఉభయ సభల సంయుక్త సమావేశంలో గవర్నరు ప్రసంగంతో సమావేశ కార్యక్రమాలు ప్రారంభమవుతాయి.

రాష్ట్ర శాసనసభ, పరిషత్తుల సమావేశాలు ప్రారంభం అయ్యే ముందు ముఖ్యమైన ప్రతిపక్షమైన కమ్యూనిస్ట్ పార్టీ ఆఫ్ ఇండియా సభ్యులు నా దగ్గరకు వచ్చి రాష్ట్రసమైక్యత కోసం, చురుకుగా ప్రగతి కార్యక్రమాలను సాగించటం కోసం వారు నా ప్రభుత్వానికి తగిన సహకారం అందించేందుకు సిద్ధంగా వున్నామని తెలియు చేశారు. రెండు వేర్పాటు ఉద్యమాలతో అభివృద్ధి కుంటుబడిన నేపథ్యంలో బాధ్యత చేపట్టిన నాకు తమ సంపూర్ణ సహకారం వుంటుందని వారు చెప్పారు.

ఉభయ శాసనసభల సంయుక్త సమావేశంలో ప్రసంగిస్తూ గవర్నర్ వేర్పాటు వుద్యమాల మూలంగా అభివృద్ధి కుంటుబడిన రాష్ట్రాన్ని సమైక్యంగా వుంచి ముందుకు తీసుకొని వెళ్లవలసిన అవసరం గురించి నొక్కిచెప్పారు. అన్ని ప్రాంతాలకూ న్యాయం జరిగేందుకూ కేంద్రం రూపొందించిన ఆరు సూత్రాల పథకాన్ని అమలు చేసేందుకు ప్రభుత్వం చిత్తశుద్ధితో కృషి చేస్తుందని ఆయన అన్నారు. రాష్ట్రంలో వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధికి కేంద్రం యిచ్చే రు.90 కోట్లనూ, జంటనగరాల అభివృద్ధికి యిచ్చే రు.10 కోట్లనూ ఖర్చుచేసి రాష్ట్రసమగ్రాభివృద్ధికి కృషి చేయటం గురించి, వార్షిక ప్రణాళిక గురించి సూచన ప్రాయంగా గవర్నరు తన ప్రసంగంలో ప్రస్తావించారు.

గవర్నరు ప్రసంగానికి కృతజ్ఞతలు చెప్పే తీర్మానాన్ని ముఖ్యమంత్రి ప్రవేశ పెడతారు. ఆయనే ఆ తీర్మానంపై జరిగే చర్చకు సమాధానం యిస్తారు. ఎవరు ముఖ్యమంత్రి అయినా, వారు మొదటి దఫా యెదుర్కొనే శాసనసభా సమావేశాలు ఆయన సమర్థతకు గీటు రాళ్లుగా వుంటాయి. నేను అంతకు ముందు కాసు బ్రహ్మానందరెడ్డి, పి.వి.నరసింహారావుల మంత్రి వర్గాలలో మంత్రిగా వుంటూ వారు శాసనసభానిర్వహణలో స్పీకర్‌కు ఎలా సహకరిస్తూ వచ్చిందీ, ముఖ్యంగా గవర్నరు ప్రసంగంపై చర్చకు ఎలా సమాధానం చెబు తుండేదీ గమనిస్తూ వుండేవాణ్ని. సామాన్యంగా ముఖ్య మంత్రులు అధికారులు తయారు చేసిన సమాధానాలను చూసి చర్చకు జవాబు చెప్పటం జరుగుతుండేది. నేను చర్చ జరిగినంతసేపూ సభలో వుండి, ఒక నోట్‌బుక్‌పై సభ్యులు చెబుతూవచ్చిన అంశాలను నోట్‌చేసుకొనేవాడిని. వేర్పాటు ఉద్యమాల గురించీ, వెనుకబడిన ప్రాంతాల

అభివృద్ధినీ గురించీ, రాష్ట్రంలో విద్యుత్ కొరతను గురించీ, నీటిపారుదల పథకాలకు డబ్బులేక ఆగిపోయిన సంగతి గురించీ, శాంతి భద్రతల గురించీ - యిలా దాదాపు 40, 50 మంది దాకా సభ్యులు అనేక విషయాలను ప్రస్తావించారు. నేను రాసుకొన్న నోట్స్ సహాయంతో వారు లేవనెత్తిన అంశాలన్నిటికీ ఒక్కొక్కటిగా సమాధానం యిస్తూ ఎక్స్ టెంపోర్ (ఆశువు)గా నేను ప్రసంగించాను. దాదాపు గంటా నలభై నిమిషాల దాకా సాగిన నా ప్రసంగంలో సభ్యులందరూ మాట్లాడిన విషయాలకు అన్నింటికీ సమాధానం లభించేలా నేను జవాబు చెప్పటం జరిగింది. (నేనానాడు అసెంబ్లీలో చేసిన ప్రసంగ పాఠాన్ని అనుబంధంగా పొందుపరుస్తున్నాను.) అప్పుడు స్పీకర్‌గా వున్న పిడతల రంగారెడ్డిగారూ, సభలో వున్న శాసనసభ్యులూ నా జవాబుకు ఎంతో సంతృప్తి చెంది, నన్నభినందించటం జరిగింది. ఒక విధంగా ఆ శాసన సభాసమావేశాలు నాకొక పరీక్ష వంటివి. ఆ పరీక్షకు నిలబడేటువంటి విధంగా, 'అందరూ ముఖ్యమంత్రి సమర్ధుడు, అన్ని సమస్యలనూ బాగా అవగాహన చేసికొన్న వ్యక్తి అనీ, పట్టుదలగా పనిచేసే మనిషి అనీ, ఏ సమస్యనైనా క్షుణ్ణంగా పరిశీలించి, అర్థంచేసుకొని, జవాబు చెప్పగలిగే శక్తి వుందనీ, చేస్తానని మాటయిస్తే మాట తప్పడు అనేటటువంటి విశ్వాసాన్ని ఆ మొదటి సమావేశంలోనే కలిగించగలిగాము.

## నూకల మరణం :

నూకల రామచంద్రారెడ్డి గారికి గుండెపోటు రావటం వల్ల ఆయనకు బదులు నేనే రాష్ట్ర బడ్జెట్‌ను ప్రవేశపెట్టాల్సి వచ్చింది. బడ్జెట్‌పై చర్చకుకూడా ఆర్థిక మంత్రి బదులు నేనే జవాబు యివ్వటం జరిగింది. ఆ సమాధానం కూడ సభ్యులకు ఎంతో సంతృప్తిని కలిగించింది. మార్చి 31వ తేదీ ఉదయం ఎప్రొప్రియేషన్ బిల్లు పాసవడం, ఇంతలోనే ఆర్థిక మంత్రి ఆసుపత్రిలో మరణించాడన్న వార్త రావడం జరిగింది. నేను సమావేశం ముగియగానే హుటాహుటిన బయలుదేరి ఆసుపత్రికి వెళ్లాను. ఆయన వున్న గదిలోకి అడుగుబెట్టే సరికి అంతకు అయిదు నిమిషాల క్రితమే ఆయన చనిపోయారని అంత వరకూ ఆయనకు వైద్యం చేస్తున్న డాక్టర్ వీరరాఘవరెడ్డి, డాక్టర్ పి.యస్.రావు నాకెదురు వచ్చి తెలియచేశారు. అంతకు క్రితం రాత్రే ఆయన స్థితి ఆందోళనకరంగా వుండటంతో, ఢిల్లీకి ఫోన్ చేసి, వైద్యనిపుణులను విమానంలో రప్పించటం జరిగింది. ఆ వైద్య నిపుణురాలు రెడ్డిగారిని పరీక్షచేసి చికిత్స సంగతి

వివరించి, గెస్ట్‌హౌస్‌కు వెళుతుండగానే ఆయన మరణించారు. ఆయన ప్రాణాలను కాపాడటానికి చేసిన ప్రయత్నాలు ఏవీ ఫలించలేదు.

ఆయన మరణవార్త వినగానే ఆయన గౌరవార్థం ఆ రోజు ప్రభుత్వ శలవుదినంగా ప్రకటించాము. గవర్నరు గారు, నేను రామచంద్రారెడ్డి గారి యింటికి వెళ్లి ఆయన భౌతిక కాయంపై పుష్పగుచ్ఛాల నుంచి శ్రద్ధాంజలి ఘటించిన తరువాతే రామచంద్రారెడ్డిగారి అంతిమ యాత్ర ప్రారంభ మయింది. సాయంకాలం అంబరుపేట శ్మశానవాటికలో ప్రభుత్వ లాంఛ నాలతో ఆయన భౌతిక కాయానికి అంత్యక్రియలు జరిగాయి. నేను, నా మంత్రి వర్గ సభ్యులు, శాసన సభ్యులు, శాసన పరిషత్ సభ్యులు, ఉన్నతాధి కారులు, రాజకీయ ప్రముఖులు, పురప్రముఖులు ఎందరో శ్మశానవాటికకు వెళ్లాము. కార్యకర్తలు ఆ కార్యక్రమానికి విషణ్ణవదనాలతో హాజరయ్యారు.

మరుసటి దినమే ఉభయసభలలో సంతాపతీర్మానాలను ప్రవేశ పెట్టటం జరిగింది. ముందు నేను మాట్లాడిన తరువాత యితర రాజకీయ పక్షాల నాయకులు విచారం వ్యక్తం చేస్తూ ప్రసంగించారు. నా మంత్రి వర్గంలో చేరి నాలుగు నెలలన్నా కాకముందే, ఆయన మరణించటం నాకు ఎంతో లోటుగా అనిపించింది.

అప్పటివరకూ రామచంద్రారెడ్డిగారు నిర్వహిస్తూ వచ్చిన ఆర్థిక, రెవెన్యూ శాఖలను, ఆయన మరణానంతరం యింకొకరిని వేసేదాకా నేనే చూస్తూ వచ్చాను.

## శాసన సభల కార్యక్రమాలు :

అసెంబ్లీ, కౌన్సిల్ సమావేశాలు ఉదయం 8.30కు మొదలయి మధ్యాహ్నం ఒంటి గంటవరకూ సాగేవి. ఉదయం సమావేశం మొదలుకాగానే ఒక గంటసేపు ప్రశ్నలూ, జవాబుల కార్యక్రమం జరిగేది. గౌరవ సభ్యులు అడిగే ప్రశ్నలకు రాతపూర్వకంగా గాని, సభాముఖంగా గాని జవాబులిచ్చేవాళ్లం. ఆ జవాబులతో వారు తృప్తి చెందకపోతే, స్పీకరు ఒకరిద్దరిని అనుబంధ ప్రశ్నలు అడిగేందుకు అవకాశం యిచ్చేవారు. నేను ముఖ్యమంత్రిగా వున్న సమయంలో దాపరికం లేకుండా యదార్థ విషయాలను చెప్పి సభ్యులకు సంతృప్తి కలిగించే ప్రయత్నం చేసే వాళ్లం. ఎవరయినా మంత్రి పొరపాటున తాను యివ్వలసిన జవాబును చెప్పటంలో తడబడటం జరిగినా, అతడు సరిగా చదువుకొని తయారుగా లేకపోయినా

నూకల రామచంద్రారెడ్డి హఠాన్మరణంతో రాష్ట్ర శాసనసభలో బడ్జెట్‌ను ప్రవేశపెడుతున్న వెంగళరావు

ముఖ్యమంత్రి కలుగ చేసికొని జవాబు చెప్పుతుండేవాడు. సభాసమావేశాల సమయంలో ముఖ్యమంత్రిగాని, మంత్రులుగాని సామాన్యంగా పర్యటనలకు వెళ్లరాదని మేము నియమం పెట్టుకున్నాం. సమావేశం జరిగే సమయంలో సామాన్యంగా వీలయినంత ఎక్కువ సేపు నేను సభలోనే కూర్చొని వుండి సభ్యుల ప్రసంగాలను శ్రద్ధగా వింటూ వుండేవాడిని. దీని వల్ల ప్రభుత్వ పనితీరెలా వుందీ, లోటు బాట్లేమిటీ, ఎలా సవరించుకోవాలి మొదలయిన అనేక విషయాలు తెలిసేవి. మంత్రులు ప్రజలతో సంబంధం పెట్టుకొని, వారి సమస్యల నెంతవరకు అవగాహన చేసికోగల్గుతున్నారు, ఆ సమస్యల పరిష్కారానికి ఏం చేస్తున్నారు, వారి వారి శాఖలపై వారికి గల పట్టు ఎంత – యిలాటి విషయాలనెన్నిటినో ఆకళింపు చేసికోడానికి శాసనసభ, శాసనపరిషత్తు సమావేశాలు ఉపకరించేవి. ప్రతిపక్షంలో కమ్యూనిస్టుపార్టీ సభ్యులు అనుభవంగల ఇండిపెండెంట్లు వుండేవారు. వారి దృష్టికి ఏదయినా అన్యాయం జరిగినట్లు తెలిస్తే, నాతో వచ్చి కలిసి చెబుతుండేవారు. తమకు సరయిన విధానమని తోస్తే నాకు సంపూర్ణంగా సహకారం అందించేవారు. విధాన మండలి సమావేశాలు సాయంకాలం నాలుగు గంటల నుండి రాత్రి 7-30దాకా సాగేవి. అక్కడ కూడ ఎందరో అనుభవజ్ఞులుండేవారు. వారంతా నేనంటే ఎంతో అభిమానంతో వుండేవారు. సభలో వారు ఏదయినా అంశంపై విమర్శించినప్పటికీ, బయట అంతా ఒక కుటుంబం లాగా వుండేవాళ్లం. అలాటి మంచి వాతావరణంలో నేను ముఖ్యమంత్రిగా వున్న నాలుగు సంవత్సరాలకాలం శాసనసభ, శాసనమండలి సమావేశాలను ఎంతో ప్రయోజన కరంగా, హుందాగా జరుపుకోగలిగాం.

శాసనసభా సమావేశాలు జరుగుతున్నప్పుడూ, తరువాతా కూడ శాసనసభ్యుల్లోనూ ప్రజల్లోనూ వెంగళరావు ప్రభుత్వం సమర్థవంతంగా నడిచే ప్రభుత్వమని, నీతివంత మైనటువంటి పరిపాలన అందించ గలుగుతోందనే విశ్వాసాన్ని కలిగించగలిగాము. ప్రభుత్వ ఉద్యోగుల అభిమానాన్ని, సహాయ సహకారాలను పొందగలిగాము.

# ప్రధాన పథకాలు

నేను ముఖ్యమంత్రి పదవిని స్వీకరించిన తరువాత రాష్ట్రంలో తిరిగి ప్రశాంత వాతావరణం నెలకొన్నది. అభివృద్ధి కార్యక్రమాల అమలు తిరిగి వేగం పుంజుకొంది. కొన్ని పెద్ద పెద్ద ప్రాజెక్టులను ప్రారంభించుకోగలిగే అవకాశం వచ్చింది. అందువల్ల ప్రధాని ఇందిరాగాంధీని ఒకసారి రాష్ట్రానికి ఆహ్వానించి ఆమె చేతులమీదుగా ఆ ప్రాజెక్టులను ప్రారంభించుకోవాలన్న ఆలోచన కలిగింది. ఆమె కొంతకాలంగా రాష్ట్రానికి రావటం కుదరలేదు. వేర్పాటు ఉద్యమాల వల్లా, రాష్ట్రపతి పాలన వుండటం వల్లా, ఆమెకు పని వొత్తిడి ఎక్కువగా వుండటం వల్లా రాష్ట్రంలో ప్రధాని పర్యటించటం పడలేదు. అదీగాక, ప్రస్తుతం రాష్ట్రం ఎంత ప్రశాంతంగా వున్నదీ, ప్రగతి పథకాలు ఎలా అమలు జరుగుతున్నదీ ఆమె రాష్ట్రంలో ఒకసారి పర్యటించి తెలుసుకుంటే బాగుంటుందనిపించింది. కనుక రాష్ట్రంలో పర్యటనకు రావాల్సిందిగా ఆమెను నేనాహ్వానించగానే ఆమె సంతోషంతో అంగీక రించారు. **1974** ఏప్రిల్‌లో పర్యటనకు వచ్చారు. అది మండు టెండాకాలం. అయినా ఆమె ఎండల తీవ్రతను లెక్కచేయక ఎంతో వుత్సాహంతోరాష్ట్రంలోపర్యటించారు. వచ్చినరోజు రాత్రి హైదరాబాదులో రాజభవన్‌లో బసచేశారు.

## బీబీనగర్ – నడికూడి :

మర్నాడు ఉదయం ఎంతో ముఖ్యమైన కార్యక్రమానికి ఆమె శంకుస్థాపన చేశారు. అది బీబీనగర్ – నడికూడి రైలు మార్గనిర్మాణ పథకం. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత రాష్ట్రంలో ఒక కిలోమీటరు రైలు మార్గమైనా కొత్తగా వేయలేదు. అటువంటిది ఒక ముఖ్యమైన రైలు మార్గనిర్మాణం నా పరిపాలనా కాలంలో ప్రధాని చేతుల మీదుగా ప్రారంభం కావటం నాకెంతో ఆనందదాయకంగా వుంది. ఆ రైలు మార్గం తెలంగాణాలో వెనుకబడిన ప్రాంతమైన నలగొండ జిల్లానుండి వెళుతుంది. నలగొండకు అంతకు ముందు రైలు లేదు. ఆ మార్గం కృష్ణా నదిని కొత్తగా నిర్మించనున్న రైలువంతెనపై దాటి అవతల వొడ్డున గల నడికూడిని చేరుతుంది. అక్కడి నుండి గుంటూరు వరకు అదివరకే వున్న మీటర్ గేజిని బ్రాడ్‌గేజిగా మార్చటంతో హైదరాబాదు నుండి గుంటూరుకు కాజీపేట మీదుగా చుట్టూ

తిరిగిపోవాల్సిన అవసరం లేకుండా సరాసరి కనెక్షన్ లభిస్తుంది. హైదరాబాదు నుండి మద్రాసుకు తిరుపతికి కూడా దాదాపు 80 మైళ్ల దూరం తగ్గిపోయి, ప్రయాణ కాలం కలిసివస్తుంది. ఇంత ముఖ్యమైన రైలు మార్గాన్ని, ఎన్నో ఏళ్లుగా ప్రజలు కలలుకంటున్న యీ పథకాన్ని నేను ముఖ్య మంత్రి అయిన తరువాత తన తొలి పర్యటనలో ప్రధాని రాష్ట్రానికి కానుకగా యిచ్చింది. ఇప్పుడు ఈ రైలు మార్గం వెంట ఎన్నో సిమెంటు కర్మాగారాలూ, రైసుమిల్లులూ, యితర పరిశ్రమలు నెలకొల్పబడి యీ ప్రాంతం అంతా బాగా అభివృద్ధి చెందింది. ఇదే మాట ఆ రోజు యీ పథకానికి శంకుస్థాపన చేస్తూ ప్రధాని ఇందిరాగాంధి అన్నారు. 'వెనుకబడిన ప్రాంతం అభివృద్ధి చెందాలనే అభిప్రాయంతోనే యీ పథకాన్ని మంజూరు చేశాము. ఇది యీ ప్రాంత ప్రజలకు ముందు ముందు ఎన్నో విధాలుగా వుపయోగిస్తుంది అని నా విశ్వాసం', అని ఆమె ఆనాడు చెప్పారు.

బీబీనగర్ సభ ఎంతో విజయవంతంగా జరిగింది. అక్కడి నుండి నేను ఇందిరాగాంధి గారితో కలిసి హైదరాబాదుకు తిరిగివచ్చి, రాజభవన్ చేరుకొన్నాము. ఆమె భోజనం చేసి విశ్రాంతి తీసికోగానే మధ్యాహ్నం రెండు గంటలకు విమానంలో బయలుదేరి గన్నవరం విమానాశ్రయానికి చేరుకున్నాము.

## విజయవాడకు :

ఆంధ్రప్రాంతంలో అంతకు కొద్దికాలం క్రితమే తీవ్రమైన స్థాయిలో ప్రత్యేకాంధ్ర వుద్యమం నడిచింది. ముఖ్యంగా విజయవాడ ఆ వుద్యమానికి నడిబొడ్డుగా వుండేది. ఒక స్థాయిలో ఇందిరను వ్యక్తిగతంగా దూషిస్తూ ఆ వుద్యమనాయకులు ప్రసంగాలు చేయటం, ఆమె గురించి గోడలపై నీచమైన పదజాలంలో ఏవేవో నినాదాలు రాయటం దాకా పరిస్థితి దిగజారింది. ఆ ప్రాంతానికి ఇందిరాగాంధీని పర్యటనకు తీసికొని వెళ్లి, పర్యటనను విజయవంతం చేయటం ఒక పెద్ద సవాలుగా వుండింది. ఎంతో మంది మిత్రులు అది రిస్క్‌తో కూడిన పని అని సలహా యిచ్చినా, నాకు మాత్రం ప్రజాసామాన్యం యీ పర్యటనకు బ్రహ్మాండంగా సహకరిస్తుందన్న గట్టి విశ్వాసం కల్గింది. అయినా ముందు జాగ్రత్త చర్యగా పోలీసు యంత్రాంగాన్ని అప్రమత్తం చేసి, కట్టుదిట్టంగా భద్రతా ఏర్పాట్లు చేయించాను.

మేము గన్నవరం చేరుకొనే సరికి నా అంచనాలను కూడా తల క్రిందులు

చేస్తూ లక్షలాది జనం ఆమెకు స్వాగతం చెప్పటానికి వచ్చారు. అక్కడి నుండి విజయవాడ మీదుగా రాయనపాడుకు మేం వెళ్లాల్సి వుంది. ప్రధాని ఇందిరాగాంధీ ఓపెన్‌టాప్ జీపులో ఎక్కితే, ప్రక్కన నేను నిలుచున్నాను. దారి పొడుగూతా యిరుప్రక్కల జనం కిక్కిరిసి నిలుచొని దట్టంగా గోడకట్టినట్లున్నారు. ఒక్కొక్కచోట ప్రజానీకం ఉత్సాహం పొంగి పొర్లగా ఇందిరాగాంధీకి స్వాగతం పలుకు తుంటే, వారిని అదుపు చేయటం పోలీసులకు ఎంతో కష్టమౌతుండేది. ఇదే ప్రాంతంలో అంతకు కొద్ది కాలం క్రితం ఇందిర వ్యతిరేక భావాలు తీవ్రస్థాయిలో వుండేవని చెబితే నమ్మటం కష్టం అన్నట్లుగా ఆ పర్యటన అద్భుతంగా సాగింది.

## రాయనపాడు :

ముందుగా మేము రాయనపాడు వద్ద రైల్వేవాగన్ల మరమ్మతు కర్మాగారానికి ప్రధాని శంకుస్థాపన చేసే కార్యక్రమానికి వెళ్లాము. అప్పటి రైల్వే మంత్రి కీ.శే.ఎల్.ఎన్.మిశ్రాగారు కూడా ఆ సభకు హాజరయ్యారు. అది కోట్ల ఖర్చుతో నిర్మించే అతి ముఖ్యమైన కర్మాగారం.

## ఇబ్రహీంపట్నం :

ఆ కార్యక్రమానికి శంకుస్థాపన కాగానే, అక్కడి నుండి ఇబ్రహీం పట్నానికి వెళ్లాము. దారి పొడుగూతా జనం అటూ యిటూ వేల సంఖ్యలో నిలబడి స్వాగతం చెబుతూ ఉత్సాహంగా 'ఇందిరాగాంధీకి జై!' అని నినాదాలు చేస్తూనే వున్నారు. దారి అంతా వందలాది స్వాగత ద్వారాలతో, తోరణాలతో అందంగా అలంకరించారు.

ఇబ్రహీం పట్నం సభ విశాలమైన మైదానంలో జరిగింది. అప్పుడు ఎండాకాలం కావటం వల్ల వూరి బయట పొలాలలో అనువైన స్థలాన్ని ఎన్నికచేసి వేదికను నిర్మించారు. వూరికి దూరంగా వున్నా, ఆ సమావేశ స్థలమంతా నిండిపోయి కిక్కిరిసింది. అక్కడ ఇందిరగాంధీ **440** మెగావాట్ల విజయవాడ థర్మల్ కేంద్రానికి శంకుస్థాపన చేశారు. ఇది ఎంతో ముఖ్యమైన ప్రాజెక్టు. దీనికి కావలసిన భూమిని సేకరించి యివ్వటం లోనూ, కృష్ణానది నుండి కేంద్రానికి కావలసిన నీటిని తీసికొనే ఏర్పాట్లను మంజూరు చేయటంలోనూ, నిధులను సమకూర్చటంలోనూ రాష్ట్ర ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధతో వ్యవహరించింది. ఆ

రోజు ఇందిరాగాంధీ ప్రారంభించిన యీ పథక నిర్మాణం వేగంగా రూపుదిద్దుకొనటమే కాదు, యీ రోజు 1200 మెగావాట్లకు పైగా విద్యుదుత్పాదనకు అవకాశం యిస్తూ, యింకా విస్తరణ జరిగేందుకు తయారుగా వుంది. దేశంలో అతి సమర్థవంతంగా నిర్వహించబడుతున్న విద్యుత్కేంద్రంగా యీ కేంద్రం అనేక బహుమతులను గెలుచుకోడం విశేషం. ఇటువంటి పథకాన్ని ప్రణాళికలో చేర్చేందుకు ప్రణాళికా సంఘ ఆమోదాన్ని పొందటంలోనూ, కార్యక్రమాన్ని చురుకుగా మొదలు పెట్టించి పూర్తి అయ్యేలా చూడటం లోనూ ప్రధాన పాత్రవహించే అవకాశం నాకు రాష్ట్ర ముఖ్యమంత్రిగా లభించటం నా అదృష్టం. ఈ కార్యక్రమాలన్నీ, 'ఈ ప్రభుత్వం మాటల ప్రభుత్వం కాదు, చేతల ప్రభుత్వం' అన్న విశ్వాసాన్ని ప్రజలలో కల్గించ గలిగాయి.

## ఇందిర పట్ల అభిమానం :

విజయవాడ నుండి తిరిగి గన్నవరం వెళుతున్నప్పుడు వచ్చినప్పటి కన్నా కూడ ఎక్కువగా తండోప తండాలుగా జనం రోడ్లకు రెండు ప్రక్కలా బారులు తీరి యింకా ఎక్కువ వుత్సాహంగా జయ జయధ్వానాలు చేశారు. కారులో విజయవాడ వీధుల గుండా పోతున్నప్పుడు ఇందిరా గాంధి ప్రక్కనే కూర్చున్న నన్ను 'ఇక్కడేనా ఉద్యమం జరిగింది? ఇప్పుడు ఆ గొడవేం లేకుండా జనాలు యిలా సంతోషంగా తండోప తండాలుగా వచ్చి నాకు స్వాగతం చెబుతున్నారు!', అని ఆశ్చర్యంగా అడిగారు. నేను 'అవును, ఈ ప్రాంతమంతా ఉద్యమం అప్పుడు తీవ్రంగా నడిచింది. నేను గత నాలుగు మాసాలలో యిక్కడకు అనేక సారులు వచ్చి ప్రజలను కలుసుకొని వారిలో మంచి అభిప్రాయం కలుగ చేసే ప్రయత్నం చేశాను. ప్రజలలో ఉన్న అపోహలన్నీ పోయి, మీపట్ల వారెప్పటివలె ఎంతో ప్రేమాభిమానాలు చూపిస్తున్నారని, దానికిదే నిదర్శనం' అనీ చెప్పాను.

ప్రధాని హైదరాబాద్ చేరిన తరువాత గవర్నర్, తదితర ప్రముఖు లందరినీ కలిసి ఢిల్లీకి విమానం ఎక్కబోయే ముందు పూలదండ ఆమె చేతికి యిచ్చి 'ఈ రోజు ఎండలో మిమ్మల్ని చాలా దూరం ప్రయాణం చేయించి శ్రమపెట్టాను. క్షమించాలి!' అని చెప్పాను. దానికి ఆమె 'ఈ రోజు పర్యటన శ్రమకన్నా నాకు సంతోషం ఎక్కువగా కల్గించింది. మీరు ముఖ్యమంత్రి అయిన కొద్దిరోజుల్లోనే ప్రజల విశ్వాసాన్ని యింతగా చూరగొనగల్గారు. ఒక్క రోజులోనే నా చేతిమీదుగా ఎన్నో వందల కోట్ల రూపాయల అభివృద్ధి పథకాలకు శంకుస్థాపన చేయించారు.

ఎండ అనీ, శ్రమ అనీ కూడ అనిపించ కుండా గడిచిపోయిన యీ రోజు చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించదగిన రోజు' అని ఎంతో సంతోషంతో నాకు ధన్యవాదాలు తెలియచేసి బదులు చెప్పారు.

ఆమె ఢిల్లీ చేరుకున్న తరువాత తన మంత్రి వర్గసహచరులతోనూ, యితర నాయకులతోనూ తన ఆంధ్రప్రదేశ్ పర్యటన అనుకున్నదాని కన్నా ఎంతోబాగా జరిగిందనీ, రాష్ట్రముఖ్యమంత్రి వెంగళరావుగారు పరిస్థితిలో కొద్దికాలంలోనే ఎంతో మార్పు తెచ్చారనీ, సమర్ధవంతంగా పనిచేస్తూ రాష్ట్రాన్ని అభివృద్ధి పథంలో నడిపిస్తున్నారనీ ఎంతో సంతోషంగా చెప్పటం జరిగింది.

వెనుకబడిన తెలంగాణా, రాయలసీమ ప్రాంతాల అభివృద్ధికి కొత్త బాటలు వేసిన బీబీనగర్-నడికుడి రైలు మార్గానికి శ్రీమతి ఇందిరాగాంధీ శంకుస్థాపన,

విజయవాడ థర్మల్ కేంద్రానికి శ్రీమతి ఇందిరాగాంధీ శంకుస్థాపన
దేశంలోనే అత్యుత్తమ థర్మల్ విద్యుత్ కేంద్రంగా ఇది అభివృద్ధి చెందింది

# ఇతర కార్యక్రమాలు

వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధికై కేంద్రం యిచ్చిన రు.90 కోట్లలోనూ రు.45 కోట్లు తెలంగాణా జిల్లాలకు కేటాయించగా, రు.28 కోట్లు రాయలసీమకు యివ్వటం జరిగింది. ఆంధ్రప్రాంతంలో వెనుక బడిన జిల్లాలైన శ్రీకాకుళం, విజయనగరం, విశాఖ తదితర ప్రాంతాలకు రు.17 కోట్లు యివ్వటం జరిగింది. ఈ మొత్తాలను ఖర్చుపెట్టే తీరును సమీక్షించటానికి మూడు ప్రాంతాలకు వేరు వేరుగా ప్రాంతీయ అభివృద్ధి సంఘాలు నియమించబడ్డాయి.

రాష్ట్రస్థాయిలో సమీక్షాసంఘానికి ముఖ్యమంత్రి అధ్యక్షులుగా, ప్రధాన కార్యదర్శి, ప్రణాళికా కార్యదర్శి, ముఖ్యమంత్రి కార్యదర్శి సభ్యులుగా వుండేవారు. పేరు ప్రఖ్యాతులున్న నిపుణులను యీ సంఘసమావేశాలకు ఆహ్వానించి వారి సలహాలను తీసికోడం జరిగేది. అంతర్జాతీయ ఖ్యాతి గడించిన శాస్త్రవేత్త డాక్టర్ నాయుడమ్మ గారిని ప్రభుత్వ సలహాదారుగా వేసికొని యీ కమిటి సమావేశాలకు ఆహ్వానించుతూ వుండటం జరిగేది. అందువల్ల చాల ప్రయోజనం కల్గింది. అయితే ఆయన నుండి ఇంకా అమూల్యమైన సేవలు రాష్ట్రానికీ, దేశానికీ అందుతాయి అని ఆశిస్తున్న తరుణంలో దురదృష్టవశాత్తు ఆయన ప్రయాణిస్తున్న ఎయిర్ ఇండియా విమానం మధ్యలో కూలిపోవటం జరిగింది. దానికి విద్రోహచర్య కారణమని భావించారు. ఇంతవరకూ ప్రమాదకారణం విషయమై యితమిత్థంగా ఏమీ తేలలేదు. ఆయన ఆకస్మిక మృతివల్ల భారతదేశానికీ, ముఖ్యంగా రాష్ట్రానికి తీరనిలోటు ఏర్పడింది.

## నీటి తీరువా :

సంజీవ రెడ్డిగారి హయామములోనూ, బ్రహ్మానందరెడ్డి గారి హయాములోనూ భారీనీటి పారుదల ప్రాజెక్టుల కింద సాగయే భూమిపై విధించే నీటి తీరువాను పెంచేందుకు ప్రయత్నాలు జరిగినా అవి సాగలేదు. భారీ, మధ్యతరహా ప్రాజెక్టుల కింద సాగయే భూమిపై మొదటి పంటకు ఎకరానికి రు.15/- చొప్పునా, రెండవ పంటకు రు.7.50చొప్పునా నీటి తీరువా వసూలు చేసేవారు. నేను ముఖ్యమంత్రిగా బాధ్యత తీసికొన్న తరువాత నీటితీరువా రేట్లను

సవరించటం జరిగింది. మొదటి పంటకు రు.30 చొప్పున, రెండవ పంటకు కూడా అదే రేటున తీరువా వసూలు చేయాలని నిర్ణయం తీసుకున్నాము. ఈ విషయంలో శాసనసభలోనూ, పరిషత్తులోనూ బిల్లు తెచ్చి చట్టం చేయడం జరిగింది. ఈ చర్యవల్ల రాష్ట్రం ఆర్థికంగా బాగా పుంజుకొనే అవకాశం ఏర్పడింది.

పన్నును పెంచటం అనేది ఎంత న్యాయంగా జరిగినప్పటికీ, పన్ను చెల్లించేవారు అసంతృప్తి చెందటం సహజం. మనదేశంలో పన్నుల విధానాన్ని బ్రిటీషువారు ఎప్పుడో వంద సంవత్సరాలకు పూర్వం కారన్‌వాలీస్ గవర్నర్ జనరల్‌గా వుండగా నిర్ణయించారు. అది ఈస్టిండియా కంపెనీనాటి మాట. ఆనాడున్న ధరలను పరిగణనలోకి తీసుకొని పన్నులను నిర్ణయించారు. ఆ రోజుల్లో వడ్ల బస్తా ఖరీదు రూపాయో, రెండో వుండేదేమో ! బంగారం తులం పదో పదిహేనో ! వెండి తులం పావలా! రెండు పంటలు పండే పొలం ఎకరం రు.500/- కన్నా ధర పలికేదికాదు. అప్పటికీ యిప్పటికీ పంట దిగుబడి పెరిగింది. వర్షాధారం కాకుండా నమ్మకంగా నీరందించే ప్రాజెక్టులు వచ్చాయి. పంటకు ధరబాగా పలుకుతోంది. అయినా అప్పటి శిస్తులూ, తీరువా రేట్లే కొనసాగాలనుకోడంలో అర్థం లేదుగదా ! వ్యాసులవారు రచించిన మహాభారతంలో కూడ ధర్మరాజు కౌరవులను జయించి రాజ్యభారం వహించబోయే ముందు కృష్ణుని ఆదేశంపై వ్యాసులవారి నుండి రాజనీతి తెలుసు కుంటాడు. ఆ రాజనీతి సంగతులన్నీ భారతంలోని శాంతి పర్వంలో వివరంగా వున్నాయి. ప్రభుత్వ నిర్వహణ వ్యయాన్ని సమకూర్చు కోడానికి రైతు తాను పండించిన పంటలో ఆరవవంతు రాజుకు యివ్వాలని అందులో పేర్కొనటం జరిగింది. అంటే, పంటలో ఆరవ వంతు విలువను ఆనాడు శిస్తురేటుగా తీసికోవచ్చు. అశోకుని కాలంలోనూ, మొగల్ చక్రవర్తుల కాలంలోనూ పంటలో నాలుగోపాలు నుండి ఆరవపాలు దాకా రాజు తీసికొనే వాడని చరిత్ర చెబుతోంది. ప్రభుత్వాన్ని విమర్శించే వారు యీ వాస్తవాలన్నీ పట్టించుకోరు గదా!.

నేను నీటి తీరువా రేట్లను సవరించినప్పుడు తూర్పుగోదావరి జిల్లాలోని నాయకులు కొందరు రాజకీయ కారణాలను మనసులో వుంచుకొని 'వెంగళరావుగారు రైతులపై ఎప్పుడూ లేనంత భారం వేశారు', అంటూ రెచ్చగొట్టే ప్రయత్నాలు చేశారు. నాకిది తెలిసి, నేనే ఆ ప్రాంతంలో రెండు మూడు రోజులపాటు పర్యటన చేశాను. నా పర్యటనలో వీలైనన్ని చోట్ల సమావేశాలు పెట్టి ప్రజలను కలుసుకొని నీటి తీరువారేట్లు పెంచటం గురించి వివరించాను.

రైతులు చెల్లిస్తున్న తీరువా ప్రాజెక్టుల నిర్వహణకు సరిపోవటం లేదు. ధరలు పెరిగినా ఎన్నో దశాబ్దాలుగా తీరువా రేట్లు పెరగలేదు. సర్ ఆర్థర్ కాటన్ మహాశయుడు ఎప్పుడో నూరు, నూటఏభై ఏళ్ల కింద కట్టిన కృష్ణా, గోదావరి ఆనకట్టలు దాదాపు శిథిలావస్థకు చేరుకున్నాయి. ఎప్పుడు ఏ ఆనకట్టకు గండిపడి ఏ ప్రాజెక్టు దెబ్బతింటుందో తెలియదు. వెంటనే ప్రపంచబ్యాంకు నుండి ఋణం తీసుకొని ప్రాజెక్టులను మరమ్మతు చేయకపోతే గోదావరి డెల్టాలో దాదాపు 12 లక్షల ఎకరాలు బీడుపడి పోయే ప్రమాదం వుంది. రెండు పంటలు పండించే భూమికి సాలీనా రు.60/- యివ్వటం కష్టం అని మీరనుకుంటే యివ్వొద్దు. దాని బదులు మీరు పండించే పంటలో ఎకరాకు ఒక క్వింటాల్ ధాన్యం ప్రభుత్వానికి యివ్వండి!' అని అడిగాను. దానిపై రైతులంతా ప్రభుత్వ నిర్ణయం న్యాయమైనదని అంగీకరించారు. శిస్తు బకాయి పెట్టకుండా ఎప్పటికప్పుడు చెల్లించే అలవాటు కూడా రైతులలో తిరిగి నెలకొల్పటం జరిగింది.

ఏ ప్రభుత్వం ఆంధ్రరాష్ట్రంలో వచ్చినా, చవకబారు కార్యక్రమాలు పెట్టి, నీటి పారుదల విషయం మరచిపోవటం జరిగింది. ఎప్పుడుకూడా నీటి పారుదల ప్రాజక్టులను మరమత్తు చేయించటానికి, సాధారణంగా సిబ్బంది జీతభత్యాలు, రైతుకు వచ్చే ఆదాయం దృష్టిలో వుంచుకొని, ఎకరానికి ఎంత ఖరీదువున్నా శిస్తు కింద కనీసం ఒక 'క్వింటాల్' ధర ప్రతి సంవత్సరం వసూలు చేస్తే, ఈనాడు వనరులను బాగా వినియోగించు కోవచ్చు. అదే విధంగా చెరుకు రైతుల దగ్గర కూడా ఒకటన్ను చెరకు వసూలు చేస్తే, ప్రభుత్వం పెద్ద తరహా, మధ్యతరహా నీటి వనరులను డబ్బు లేకుండా నిర్లక్ష్యం చేయకుండా, ఈ డబ్బులో మరమత్తులు చేసి, రైతుకు సహాయ పడవచ్చును.

## గోదావరి ఆనకట్ట గండి:

ఇదిలా వుండగా ధవళేశ్వరం వద్దగల గోదావరి ఆనకట్టకు 1976 జులై 8 అర్ధరాత్రి (తెల్లవారితే 9వ తేదీ అనగా) గండిపడింది. ఈ విషయం నాకు వైర్‌లెస్ మెసేజ్ ద్వారా తెలియచేశారు. నేను వెంటనే రాత్రికిరాత్రే రాజమండ్రికి బయలుదేరి తెల్లవారేసరికి ఆనకట్ట వద్దకు చేరుకున్నాను. నేను రాజమండ్రి స్టేషన్‌లో దిగి సరాసరి గండి పడిన ప్రాంతానికి వెళ్లాను. అప్పటికింకా అక్కడికి స్థానిక శాసన సభ్యులు కూడా చేరుకోలేదు. ఒక శాసనసభ్యుడు తరవాత అసెంబ్లీలో మాట్లాడుతూ తననెవరూ పిలవలేదని ఆగ్రహించాడు. 'ఇది ఎవరింట్లో పెండ్లి

బొట్టుపెట్టి పిలవటానికి? అవతల వరదొచ్చి, గండిపడి దేశం కొట్టుకొని పోతుంటే, ఎవరొచ్చి పిలవాలి ప్రజా ప్రతినిధులను? - అని నేను అసెంబ్లీలో చెప్పాల్సి వచ్చింది.

తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలకు రెండిటికీ గోదావరి ఆనకట్టే గుండెకాయ. కనుక పరిస్థితిని ఇంజనీర్లతో కలిసి అప్పటికప్పుడు అంచనా వేస్తే తేలిందేమిటంటే సెంట్రల్ డెల్టాలోనూ, పశ్చిమ డెల్టాలోనూ ఇప్పటికీ పరిస్థితి చేయిదాటి పోలేదు, పంటను కాపాడుకోగలం అనిపించింది. కాని తూర్పు డెల్టాను రక్షించే మార్గం గోచరించ లేదు. అదీగాక, కాకినాడ, యింకా ఇతర మునిసిపాలిటీలకు మంచినీళ్ల ఎద్దడి రాకుండా చూడాలి. ఎందుకంటే అక్కడ మంచినీటి సరఫరా కూడా గోదావరి కాలువలపైనే ఆధారపడి వుంది.

నేను వెంటనే ఒక ఎక్స్‌పర్ట్ కమిటీని వేశాను. అందులో మన దగ్గర ఛీఫ్ ఇంజనీర్లుగా పనిచేసి రిటయిరయిన అనుభవజ్ఞులనూ, సెంట్రల్ వాటర్, పవర్‌కమీషన్ నుంచి ఒక నిపుణుడినీ అందులో వేశాము. రెవెన్యూ బోర్డ్ ఫస్ట్ మెంబరు ఎ. కృష్ణస్వామిని ఈ కార్యక్రమం యావత్తూ సూపర్‌వైజ్ చేసి నడిపించటానికి స్పెషలాఫీసర్‌గా వేశాము. ప్రభుత్వాన్ని చీటికి మాటికి సంప్రదిస్తూ కాలయాపన జరక్కుండా అక్కడికక్కడే నిర్ణయాలు తీసికొనే అధికారాన్ని ఆయనకు ఇవ్వటం జరిగింది. నేను ఆయనకు ఒకటే చెప్పాను! 'ఎంత ఖర్చయినా సరే, డబ్బుకు వెనకాడవద్దు. (రాష్ట్ర ప్రభుత్వ ఆర్థిక స్థితి అప్పుడు బాగానే వుంది, తగినన్ని నిధులున్నాయి) ఏం చేస్తారో మీ యిష్టం. కాని మే నెలకల్లా తూర్పుడెల్టా క్కూడా నీళ్లందించాలి'.

గోదావరి ఆనకట్టకు గండి పడితే పరిస్థితి అక్కడ జల ప్రళయం వచ్చినట్లుగా వుంది. నది మంచి వరదమీద వుంది. ఆ పరిస్థితులలో గండి పూడ్చటం అంటే మాటలు కాదు. బ్రహ్మాండమైన స్థాయిలో అంగబలాన్ని దింపాలి. సిమెంటు, రాళ్లు వంటి సామగ్రి చేరవేయాలి. లారీలు, క్రేన్లు వంటివన్నీ అక్కడికి పెద్ద సంఖ్యలో ఉరికించాలి. ఇదంతా అప్పటికప్పుడు జరగాల్సి వుంది. అంతే కాదు, ఈ తొందరలో ఏదో ఒక పొరపాటు చేసి, ''ఇక్కడంతా ఏదో కుంభకోణం జరిగింది'' అనే ఆరోపణ రావటానికి క్కూడా అవకాశం యివ్వని విధంగా పనంతా జరిగిపోవాలి.

అప్పుడు విశాఖపట్నంలో ఒక పెద్దకంపెనీ ఔటర్ హార్బర్ నిర్మాణ కార్యక్రమం చూస్తోంది. వెంటనే వారిని సంప్రదించి, గండిపూడ్చే కార్యక్రమాన్ని వారికి అప్పగించాము. వాళ్లు ఔటర్‌హార్బరు నిర్మాణం కోసం టన్నుల కొద్దీ బరువుండే పెద్ద పెద్ద సిమెంటు కాంక్రీటు స్ట్రక్చర్లు తయారు చేసి పెట్టుకున్నారు. వాటిని వెంటనే రాజమండ్రికి ప్రత్యేక రైళ్లద్వారా తరలించటం జరిగింది. దగ్గరలో వున్న కొండల నుండి గ్రానైటు రాళ్లను క్వారీ చేయించి తెప్పించటం, వందల కొద్ది లారీలను ఈ పనికి మరలించి వాటిని గండి పడ్డ చోటుకు తరలించటం, క్రేన్సు మొదలైన యంత్రసామగ్రిని కూడా కావలసిన సంఖ్యలో సేకరించటం - ఇదంతా యుద్ధ ప్రాతిపదికన జరిపించాము. హెవీ పంప్‌సెట్లను ఎన్నిటినో తెప్పించి అక్కడ ఏర్పాటు చేశాము. నీటి మట్టం పడిపోతే తోడి కాలువలను మామూలుగా పారించటానికి ఇవి అవసరం. వాటికి కరెంటు సరఫరా నిరంతరం జరిగేట్లు చూడాలని ఎలక్ట్రిసిటీ బోర్డుకు ఆదేశాలిచ్చాము. ముఖ్యంగా కాకినాడ మొదలయిన పట్నాలకు మంచినీరు ఎద్దడి జరక్కుండా చూడటానికి మెయిన్ కాలవలోకి నీరు తోడటంలో ఇవి ఎంతో వుపకరించాయి.

అక్కడ వున్న భీభత్సదృశ్యం చూస్తే ఎవడికైనా గుండె చెదురుతుంది. ఎంతో అనుభవజ్ఞులు, కేంద్రంలో ఇరిగేషన్ మంత్రి చేసిన డ్వాక్టర్ కె. యల్. రావుగారు కూడా ఈ గండి పూడ్చటానికి ఎంత లేదన్నా రెండు మూడేళ్లు పట్టవచ్చునన్న సందేహం వెలిబుచ్చారు. అయితే గోదావరి డెల్టాను అన్నాళ్లు బీడు పెట్టగలమా? దాని వల్ల ఎన్ని వేల కుటుంబాలు నానా యిబ్బందుల పాలవుతాయో ఆలోచించాలి. ఎన్నికోట్ల రూపాయల పంట నష్టమౌతుంది? ఇది రాష్ట్రానికే గాదు, దేశానికే తీరని నష్టం. అందుకని నేను దీన్నొక పెద్ద సవాలుగా తీసికొనటం జరిగింది. ఎంత ఖర్చయినా సరే, గండిని వెంటనే పూడ్చి తీరాలని నిర్ణయం తీసుకున్నాము. ఇంతటి కష్టం వచ్చిపడ్డప్పుడు తమ ప్రభుత్వం తమను ఆదుకొంటుంది - అన్న విశ్వాసాన్ని ప్రజలలో కల్గించటం ప్రభుత్వ కనీస ధర్మం అని నేను భావించాను. అధికారులు, సిబ్బందీ, వందలూ, వేల కొద్దీ కూలీలు అంతా రాత్రింబవళ్లు కష్టపడి పని చేశారు. విశాఖ పోర్టు అధికారులు, రైల్వేశాఖవారు, కేంద్ర జలవిద్యుత్ కమీషన్ వారు ఒకరేమిటి - అంతా ఈ బృహత్కార్యంలో మనస్ఫూర్తిగా సహకరించారు.

మంచి పనికి విఘ్నాలు కలగటం సహజం. ఉన్నట్లుండి గోదావరికి కొత్త వరదవచ్చి రెండు మూడు రోజులు గండి పూడ్చే కార్యక్రమాన్ని ఆపుచేయాల్సి

వచ్చింది. అంతేకాదు. అంత వరకూ గండిలో వేసిన రాళ్లూ అవీ అన్నీ కొట్టుకొని పోయి పని మళ్లీ మొదటికి వస్తుందనీ, చేసినదంతా వృథా అవుతుందేమోనని భయపడ్డాము. వరద తగ్గుముఖం పట్టిన తరువాత చూస్తే అంతకు ముందు గండి కొసలలో అటుయిటూ వేసిన సపోర్టులూ, పోసిన కట్టా అవీ అన్నీ వరదను తట్టుకొని నిలవగలిగాయి. అంటే జరిగిన పని సక్రమంగా జరుగు తున్నదన్న ధైర్యం అందరకూ కలిగింది.

ఏదయితేనేం మొత్తంమీద అనుకొన్న ప్రకారం కొన్ని వారాలలోనే గండిని పూడ్చగలిగాం. అంతేకాదు, నేను చెప్పిన ప్రకారం తూర్పు డెల్టా కాలువలకు జూన్‌లో నేనే నీటిని విడుదల చేయుటం జరిగింది. అప్పుడు ప్రజలను ఒక పెద్దకష్టం వచ్చినప్పుడు ప్రభుత్వం ఆదుకోగల్గిందని నాకెంతో తృప్తి కలిగింది.

ఈ కార్యక్రమాన్ని ప్రభుత్వం ధైర్యంగా నిలబడి, సమర్థతతో నిర్వహించిన తీరుకు, జూన్‌లో కాలవలకు యథా ప్రకారం నీరంది పంట దెబ్బతినకుండా వున్నందుకూ ఉభయ గోదావరుల ప్రజలు ఎంతో ఆనందపడ్డారు. 'ఈ ప్రభుత్వం అవసరంతో రైతులను ఆదుకొనే ప్రభుత్వం' అన్న భరోసాను, విశ్వాసాన్నీ వారిలో కల్గించాను. నీటి తీరువా రేట్లు మొదలయిన సంగతులన్నీ దీనితో అడుగునబడి పోయాయి. అసలా గొడవే ప్రజలు మరిచిపోయారు.

గోదావరి గండిపడ్డ **15** రోజులకే నేను అసెంబ్లీని పిలిచి, యీ గోదావరి ఆనకట్ట పుట్టు పూర్వోత్తరాల గురించి సమగ్రమైన నివేదిక సభముందు వుంచటం జరిగింది. శతాబ్ద చరిత్రగల ఈ ఆనకట్ట గురించి ఇక్కడ రాసే బదులు, నేను అసెంబ్లీకి సమర్పించిన స్టేటుమెంటును దీనికి అనుబంధముగా పెట్టడం సముచితంగా ఉంటుందని భావించి అనుబంధంగా పెట్టినాను. దీని మీద రెండు రోజులు అసెంబ్లీలో చర్చ జరిగింది. దానికి సమాధానం నేనే అసెంబ్లీ సభ్యులకు ఇవ్వడం జరిగింది. ఆ సమాధానం కూడా అనుబంధంగా పొందు పర్చటమైనది. ఇంత సమగ్రమైన సమాచారం సామాన్య ప్రజలకు అందు బాటులో ఉండటం కష్టం. ఈ పుస్తకాన్ని చదువుకొని ఈసంగతులన్ని విశదంగా తెలుసు కొనేందుకు ముందు తరాలకిది ఉపయోగపడుతుంది.

## నదీ జలాలు :

ఇప్పుడు పాలించే ప్రభుత్వాలు కూడా వట్టి మాటలు చెబుతూ కాలం గడిపేకన్నా, రైతులకు సరిగా నచ్చచెప్పి వారిని కలుపుకొని పోగలిగితే వనరులు

పెంచుకొని, నేడు వృథాగా సముద్రం పాలవుతున్న నదీజలాలను పొలాలకు మళ్లించుకో గల్గుతాము. బంగారం పండించగల్గుతాము. ఒక ప్రక్క లక్షలాది టిఎమ్‌సి ల నీరు వృథాగా సముద్రంలో కలుస్తుంటే, హైదరాబాదు, వైజాగ్ నగరాలవంటి ప్రాంతాలెన్నింటిలోనో జనం తాగేందుకు నీళ్లులేక అలమటిస్తున్నారు. నిజానికి గోదావరి నీరు వాడుకోడానికి మనకెట్టి అభ్యంతరం లేదు.

ఒకసారి ప్రధాని ఇందిరాగాంధి నాతో మాట్లాడుతూ 16 సంవత్సరాలుగా తెగకుండా ముడిపడకుండా వున్న నదీజలాల తగాదాను పరిష్కరించుకోవలసిందని చెప్పారు. 'ఈ విషయం మీ వల్ల అవుతుందనే నమ్మకం నాకుందని' ఆమె అన్నారు. తరువాత మూడు మాసాలలోపే ముఖ్యమంత్రులం అందరం కూర్చొని చర్చించుకొని ట్రిబ్యునల్ బయటనే ఒక ఒప్పందానికి రాగల్గాము. ఆ ఒప్పందానికి సంబంధించి ఒక వైట్ పేపరును శాసనసభల ముందుంచాము. దాని కాపీని అనుబంధంగా పొందు పరుస్తున్నాను. ఆంధ్రప్రదేశ్ వాడుకోదగిన నీళ్ల పరిమితి మొదలయిన విషయాలను ఈ వైట్‌పేపర్ యిస్తున్నది. ఇలాటి వివరాలన్నీ సామాన్య ప్రజానీకానికి అందుబాటులో వుండవు. ముందు తరాలవారికి - ముఖ్యంగా ఇంజనీర్లకు, పరిపాలకులకూ ఈ సమాచారం ఉపకరించ గలదని ఆశిస్తున్నాను. ఈ ఒప్పందం విషయం ఇందిరాగాంధి గారికి చెబితే ఆమె సంతోషంతో నన్నభినందించారు.

కాని పూర్వం ముఖ్యమంత్రులుగా వున్న బ్రహ్మానందరెడ్డి, పి.వి. నరసింహారావులు ఈ విషయంపై దుష్ప్రచారానికి పూనుకొన్నారు. దానిపై నేను ఢిల్లీ వెళ్లి ఇందిరాగాంధీని కలిసి వాళ్లు చేస్తున్న తప్పుడు ప్రచారం గురించి చెప్పాను. అప్పుడామె నవ్వి 'ఆ సంగతి నా కొదిలేయండి! నేను చూసుకొంటాను. మీరు దానిని గురించి పట్టించుకోవద్దు!', అని చెప్పారు. అదే రోజు ప్రధాని కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ సమావేశంలో మాట్లాడుతూ' 'నేను యిక్కడకు వచ్చేముందే ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి వెంగళరావుగారు నా దగ్గరకు వచ్చారు. ట్రిబ్యునల్ బయటనే సంప్రదింపుల ద్వారా గోదావరీ నదీ జలాల వివాదాన్ని యితర రాష్ట్రాల ముఖ్యమంత్రులతో కలిసి, స్నేహ పూర్వకంగా పరిష్కారం చేసుకున్నందుకు నేనాయనను అభినందించి వచ్చాను. వెంగళరావుగారి మాదిరిగానే యితర రాష్ట్రాల వారు కూడా ఆయనను ఆదర్శంగా తీసికొని వివాదాల పరిష్కారానికి ప్రయత్నిస్తే బాగుంటుంది!', అని చెప్పారు. అక్కడే వున్న బ్రహ్మానందరెడ్డి,

పి.వి.నరసింహారావులు అది విని తమకేదో అవమానం జరిగినట్లుగా మొహాలు మాడ్చుకున్నారు. అయితే అక్కడ వున్న మిగతా కాంగ్రెస్ పార్లమెంట్ సభ్యులంతా ఎంతో మెచ్చుకున్నారు.

## ప్రపంచ తెలుగు మహాసభలు :

రాష్ట్రంలో ప్రత్యేక తెలంగాణా, ప్రత్యేక ఆంధ్ర వుద్యమాలు వచ్చిపోయిన తరువాత హైదరాబాదులో ప్రపంచ తెలుగు మహాసభలను జరుపుకోవాలనే ఆలోచన కలిగింది. అంతకు ముందు తమిళనాడు ముఖ్యమంత్రి అన్నాదురై నాయకత్వంలో ప్రపంచ తమిళ మహాసభలను ఎంతో వైభవంగా తమిళులు మదరాసులో జరుపుకున్నారు. వారు ఆ సభలను ఎలా నిర్వహించిందీ తెలుసుకొనేందుకు వారా సందర్భంలో తీసిన డాక్యుమెంటరీని చూడటం జరిగింది. అప్పుడు నా వెంట నా భార్య, మా చిన్న కుమారుడు వెంకట్ కూడ మద్రాసు వచ్చారు. ప్రపంచ తమిళ మహాసభల డాక్యుమెంటరీతోబాటు యన్.టి.రామారావుగారు నటించిన సినిమానొకదానిలో కొంతభాగాన్ని కూడా అక్కడ చూశాము. ఆ తరువాత ఆయన నన్నూ, నా కుటుంబ సభ్యులనూ, నా వెంట వచ్చిన వారినందరినీ మధ్యాహ్న భోజనానికి ఆహ్వానించారు. చక్కటి తెలుగు భోజనం వడ్డించి, సత్కారం చేశారు.

హైదరాబాదు తిరిగి వచ్చిన తరువాత తమిళ మహాసభల కన్నా బాగా తెలుగు మహాసభలను నిర్వహించాలన్న పట్టుదల కలిగింది. ఈ విషయాన్ని మంత్రివర్గ సమావేశంలో చర్చించి, ప్రపంచ తెలుగు మహాసభలను హైదరాబాదులో నిర్వహించాలన్న నిర్ణయం తీసుకొన్నాం. ఖర్చులో కొంత ప్రభుత్వం భరించటానికి సిద్ధంగా వున్నా, తెలుగు సినీరంగానికి చెందిన నటీనటులు కొంత మొత్తాన్ని విరాళంగా పోగు చేయాలనీ, హైదరాబాదులో వున్న హోటళ్ల వారందరి సహకారం తీసుకోవాలనీ నిర్ణయం తీసికోడం జరిగింది. వారంతా కూడ ఎంతో ఉత్సాహంతో ముందుకు వచ్చి అన్ని విధాల సహకరిస్తామని చెప్పడం జరిగింది.

## చారిత్రాత్మక ఘట్టం :

ఈ మహాసభలు జరపటంలో ప్రధాన ఉద్దేశ్యం ఆంధ్ర తెలంగాణా ఉద్యమాల కారణంగా ప్రజలలో కల్గిన అపోహలను, అనుమానాలనూ తొలగించటం. మన రాష్ట్రంలోని తెలుగు వారేకాక, యితర రాష్ట్రాల లోనూ,

ప్రపంచ మంతటా గల తెలుగు వారందరికీ చిరస్మరణీయంగా ఉత్సవాలను నిర్వహించాలన్న ధ్యేయంతో కృషి సాగించాము. వివిధ రాష్ట్రాలలో, వివిధ దేశాలలో వున్న ప్రముఖులందరికీ ఆహ్వానాలు పంపాము. అప్పుడ మనకు ఉపాధ్యక్షులుగా వున్న బి.డి.జట్టీ గారిని ఉత్సవాలను ప్రారంభంచేయటానికి ఆహ్వానించటం జరిగింది. ముగింపు సమావేశానికి రాష్ట్రపతి ఫక్రుద్దీన్ ఆలీ అహ్మద్‌గారినే కాక కాశ్మీర్ ముఖ్యమంత్రిగా వున్న షేక్ అబ్దుల్లా గారిని సతీసమేతంగా ఆహ్వానించటం జరిగింది. వారంతా కార్యక్రమాలను తిలకించి ఎంతో సంతోషించి రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలోనే కాకుండా వివిధ రాష్ట్రాలలో, వివిధ దేశాలలో వున్న తెలుగు వారంతా ఒకటే కుటుంబం అని చక్కగా చాటి చెప్పారని అభినందించారు. ఈ ఉత్సవం తెలుగు జాతి చరిత్రలోనే సువర్ణాక్షరాలతో లిఖించబడుతుందని అన్నారు. వివిధ రంగాలలో ప్రఖ్యాతులైన తెలుగు వారిని ఆహ్వానించి సన్మానించటం జరిగింది. ఆ కార్యక్రమాలన్నీ నా పదవీ కాలంలో జరిగిన ఒక చారిత్రాత్మక ఘట్టం. నా జీవిత కాలంలో జరిగిన ఒక మహాసంతోషదాయకమైన సంఘటన. తెలుగు వారందరికీ మరపురాని సన్నివేశం.

## నూతన విశ్వవిద్యాలయాలు :

నేను ముఖ్యమంత్రిగా పదవీ బాధ్యతలను స్వీకరించేందుకు కొద్దికాలం ముందే కేంద్రం ఆరుసూత్రాల పథకాన్ని రూపొందించింది. ఆ పథకంలో వెనకబడిన ప్రాంతాల అభివృద్ధికి ఏర్పాటుతోబాటు ఉద్యోగుల బదిలీ నియామకాల సంగతీ, విద్యార్థుల సమస్యల సంగతీ పరిశీలించి తగిన పరిష్కార మార్గాలను పొందు పరచారు. వరంగల్‌లో కాకతీయ విశ్వవిద్యాలయం, గుంటూరులో నాగార్జున విశ్వవిద్యాలయం, అనంత పూర్‌లో కృష్ణ దేవరాయ విశ్వవిద్యాలయాలను స్థాపించటానికి నిర్ణయం తీసికొన్నాము. ఇందుకు యూనివర్శిటీ గ్రాంట్ల సంఘం నుండి కొన్ని అభ్యంతరాలు వచ్చాయి. నేనే కేంద్ర విద్యామంత్రి నూరుల్‌హసన్ గారితోనూ, యు.జి.సి. ఛైర్మన్ సతీశ్ చంద్ర గారితోను మాట్లాడి వారిని అంగీకరింప చేయగలిగాము. వారు 'నాతో మీరు కోరినవాటికి మేము అంగీకరిస్తాము. కాని మీరు కూడా మేం చెప్పినదానిని వొకటి అంగీకరించాలి', అని అడిగారు. యు.జి.సి. కళాశాలల్లో, విశ్వవిద్యా లయాలలో పనిచేసే బోధనా సిబ్బంది జీతభత్యాలకు సంబం ధించిన స్కేళ్లను

రూపొందించి అన్ని రాష్ట్రాలకు పంపింది. అయితే యు.జి.సి. పే కమీషన్ నివేదికను ఏ రాష్ట్రం ఆమోదించలేదు. కారణం రాష్ట్రాలపై ఆర్థిక భారం అదనంగా పడుతుందనే. యు.జి.సి. ఛైర్మన్ నన్నుకోరింది ఆ వేతనస్కేళ్ల నివేదికను ఆమోదించి, రాష్ట్రంలో అమలు జరపమనే. 'మీరు అమలుజరిపితే, మిగతావారంతా మీ దారిలో నడచి అమలు చేస్తారు. కనుక ముందు మీరు దోవ చూపాలి!', అని వారు కోరారు. నేను వారితో 'మీరు నేను కోరినట్లు విశ్వవిద్యాలయాలనూ పి.జి. సెంటర్లనూ స్థాపించేందుకు అంగీకరిస్తే, మీరు కోరింది చేయటానికి నేను సిద్ధమే'నని చెప్పాను. అలా వివిధ ప్రాంతాలలో పి.జి. సెంటర్లు రావటం వల్ల ఆయా ప్రాంతాలలో విద్యార్థులకు పై చదువులు చదువుకొనే వెసులుబాటు కలిగింది.

## కేంద్ర విశ్వవిద్యాలయం :

ప్రాంతీయ తారతమ్యాలు లేకుండా హైదరాబాదులో అన్ని ప్రాంతాల విద్యార్థులూ చేరి చదువుకొనేందుకు వీలు కల్గించేందుకూ కేంద్ర విశ్వవిద్యాలయాన్ని నెలకొల్పాలన్నది ఆరుసూత్రాల పథకంలో భాగమే. ఆ విశ్వవిద్యాలయాన్ని వెంటనే నెలకొల్పేందుకు తాత్కాలిక వసతి చూపుతూ శాశ్వత భవన నిర్మాణం కోసం **1500** ఎకరాల స్థలాన్ని కూడా వారు ఎంపిక చేసిన చోట యివ్వాలని వారు కోరారు. అయితే రాష్ట్ర ప్రభుత్వం వారికి ఒకే చోట **2500** ఎకరాల స్థలాన్ని సేకరించి యిచ్చింది.

తాత్కాలిక భవనంగా ఆబిడ్స్ నుండి నాంపల్లి వెళ్లే రోడ్డుపై నున్న 'గోల్డెన్ త్రెషోల్డ్' అన్న భవనాన్ని యివ్వటం జరిగింది. ఆ భవనం ప్రఖ్యాత కవయిత్రి, స్వాతంత్ర్య సమరయోధురాలు అయిన సరోజినీ నాయుడుగారి యిల్లు. ఆ భవనాన్ని సరోజినీ నాయుడుగారి కుమార్తె, ఆమె వారసురాలు అయిన కుమారి పద్మజానాయుడు కేంద్ర విశ్వవిద్యాలయానికి యిస్తూ ఆమె బ్రతికి వున్నప్పుడే గిఫ్ట్ డీడ్ రాసి ఇందిరాగాంధీగారికి అందచేశారు. అప్పుడు ఆ భవనాన్ని అద్దెకు తీసుకున్నవారు అందులో ఒక పెద్ద హోటలును నడుపుతుండేవారు. వారు ఆ భవనాన్ని ఖాళీ చేయటానికి యూనివర్సిటీ అధికారులు వెళ్లి అడిగితే ఒప్పుకోలేదు. దానిమీద వారు నా దగ్గరకు వచ్చి 'మీరు కలుగ చేసుకుంటే కాని యీ భవనం మాకు స్వాధీనం కాదు', అని చెప్పుకున్నారు. ఆ హోటల్ యజమాని సీతారామారావు గారు నాకు దాదాపు **30** ఏళ్లుగా తెలుసు. అది కొన్ని

కోట్ల రూపాయలు విలువచేసే ఆస్తి. వారు ఖాళీ చేసేందుకు అంగీక రించకపోవటం సహజమే. అయినా ఒక మంచి పనికి వారుకూడా సహకరిస్తే బాగుంటుందని నేను వారిని పిలిపించి అడిగాను. 'ముందుగా భవనంలో కొంత భాగం వారికి యివ్వండి! మిగిలినది రెండు నెలల్లో ఖాళీ చేయండి!', అని చెప్పాను. వారు నా మాట మీద వున్న గౌరవంతో ముందు మెయిన్ బిల్డింగ్ ఖాళీచేసి యిచ్చారు. దానిని బాగుచేయించి, ప్రారంభోత్సవానికి సిద్ధం చేయించావు. ఇందిరాగాంధీగారిని ఆహ్వానించగానే వారు సంతోషంతో అంగీకరించారు. ప్రారంభోత్సవ సభలో ఆమె నాతో మాట్లాడుతూ 'పద్మజా నాయుడుగారి కుటుంబ సభ్యులెవరైనా వున్నారా? అనడిగారు. నేను 'పద్మజా నాయుడు గారి మరణంతోనే ఆమె కుటుంబం అంతరించి పోయిందనీ, వారి బంధువర్గం కొందరు సభకు వచ్చారనీ' చెప్పాను. ఆ రోజు ఇందిరాగాంధి ప్రారంభం చేసిన ఆ కేంద్ర విశ్వవిద్యాలయం నేడు సొంత భవనాలలో చక్కగా పనిచేస్తూ వుంది. దానికి సంబంధించిన ఖర్చు కేంద్రం భరిస్తూనే వుంది. విద్యార్థులు పై చదువులు చదవటానికి సీట్ల కొరతకూడా వేర్పాటు వుద్యమాలకు ఒక ముఖ్యకారణం. ఆ సమస్య యీ విధంగా చాలవరకు శాశ్వతంగా పరిష్కారమై పోయింది. ఇప్పుడు ఆ సమస్య గురించి మాట్లాడే వారే లేరు.

## యు.జి.సి. స్కేళ్లు :

ఇక నేను యు.జి.సి. ఛైర్మన్‌గారికి మాటయిచ్చిన సంగతిపై ఉస్మానియా విశ్వవిద్యాలయానికి ఉపాధ్యక్షులుగా వున్న పింగళి జగన్మోహనరెడ్డిగారి అధ్యక్షతన ఒక సంఘాన్ని వేశాను. జగన్మోహన రెడ్డిగారు సుప్రీంకోర్టు న్యాయమూర్తిగా పనిచేసి రిటయిరయినారు. చాల అనుభవం కలిగిన వారు. ఆ సంఘం చేసిన సిఫారసులన్నింటినీ మంత్రి వర్గం ముందుపెట్టి, ఆమోదం తీసుకొని, వెంటనే అమలు చేస్తామని పత్రికల్లో ప్రకటించాము. వెంటనే యు.జి.సి. ఛైర్మన్ గారేకాక, రాష్ట్రంలోని ప్రొఫెసర్లు, లెక్చరర్లు అంతా కూడ ప్రభుత్వ ప్రకటనపై హర్షం ప్రకటించారు. 'యు.జి.సి. వేతనాలను అమలుచేసిన ఘనత మొట్ట మొదట ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి దక్కింది. వెంగళరావుగారు తాను చెప్పినమాట ప్రకారం నిలబడి, యు.జి.సి. వేతన స్కేళ్లను అమలు చేసి నందుకు అభినందనీయులు', అంటూ యు.జి.సి.వారు సంతోషించారు.

## జోనల్ పద్ధతి :

ఆరుసూత్రాల పథకం ప్రకారం, బదిలీలు చేయాలంటే, తాసిల్దారు అంతకు లోపు వుద్యోగులందరినీ వారి వారి జోన్లలోనూ, లోయర్ డివిజన్ గుమస్తాలు, అటెండర్ల వంటి ఉద్యోగులు వారి వారి జిల్లాల లోనూ మాత్రమే బదిలీలు చేయాలని నిర్దేశిస్తూ ప్రభుత్వ వుత్తర్వులు జారీ చేయటం జరిగింది. క్రొత్తగా నియామకాల విషయంలోనూ, ప్రమోషన్ విషయంలోనూ ఇదే విధంగా జోనల్ లెవెల్, జిల్లా లెవెల్ పరిధిని పాటించాలని కూడా నిర్దేశించటం జరిగింది. దీనితో ప్రభుత్వోద్యో గులలో వుండే అనుమానాలు, అపోహలు చాలవరకు తొలగిపోయి, కార్యాలయాల్లో చురుకుగా పనిసాగిపోయే అవకాశాలు కలిగాయి.

## యన్.జి.వోలకు సౌకర్యాలు :

నా కన్నాముందు ముఖ్యమంత్రులుగా వున్న బ్రహ్మానందరెడ్డి, పి.వి.నరసింహారావుల కాలంలో యన్.జి.వోలు సమ్మె చేశారు. బ్రహ్మానందరెడ్డి హయాంలో ఉద్యోగులు సమ్మె చేస్తే, యన్.జి.వో. నాయకుడు అమోస్‌ను ఉద్యోగం నుంచి బర్తరఫ్ చేశారు. తరువాత ఏదో కొద్దిగా యిచ్చి, సమ్మె విరమింపచేశారు. పి.వి.నరసింహారావు ముఖ్యమంత్రిగా వుండగా, ఆంధ్రలో యన్జీవోల సంఘంవారు శ్రీరాములు, ఐ.వి.రామకృష్ణారావుల నాయకత్వంలో పి.వి.ప్రభుత్వం కూలిపోయేదాకా ఉద్యమం కొనసాగించారు. అప్పుడు ఐ.వి. రామకృష్ణా రావును ఉద్యోగం నుండి తొలగించారు. నేను ముఖ్యమంత్రిగా వున్న కాలంలో ప్రభుత్వోద్యోగులకు ప్రభుత్వం మీద అసంతృప్తికలిగే అవకాశం కానీ, అదికావాలి, యిది కావాలి అని వారువచ్చి ముఖ్యమంత్రిని అడిగే అవకాశం కాని కలుగనీయలేదు. నల్ల బ్యాడ్జీలు గాని, సమ్మె నోటీసులు గాని లేనే లేవు. వారికి న్యాయంగా యివ్వాల్సిన సౌకర్యాలను నేనే ఆలోచించి, వారు అడగకముందే యిస్తుండే వాడిని. ఒక్కోసారి కేంద్ర వుద్యోగులకన్నా కూడ రాష్ట్రంలో ఉద్యోగుల పరిస్థితి బాగా వుంటుండేది. అందువల్లనే, అటు ఆంధ్ర వుద్యోగుల సంఘంవారు, యిటు తెలంగాణా వుద్యోగుల సంఘంవారు నా ప్రభుత్వానికి తమ సంపూర్ణ సహకారం అందిస్తూ వుండేవారు. వారి జీతభత్యాలలో వున్న ఎనామలీస్‌ను సరి చేయటానికి వేతన సవరణ సంఘాన్ని నియమించి, ఆ సంఘ సిఫారసు లను యథాతథంగా అమలు చేశాము. దాని వల్లకూడా వుద్యోగులు ఆశించిన దానికన్నా

ఎక్కువ ప్రయోజనం వారికి కలిగింది. వారు కూడ ప్రభుత్వం గురించి కాని, ముఖ్యమంత్రి గురించి కాని ఒక్కమాట కూడ వ్యతిరేకంగా మాట్లాడకుండా వుండటమే గాక ప్రభుత్వ విధానాల అమలుకు శక్తివంచన లేకుండా కృషి చేస్తూవచ్చారు.

నేను ముఖ్యమంత్రిగా వుండగా ఉద్యోగుల జీతభత్యాల విషయమేకాక వారి కుటుంబాల సంక్షేమం సంగతి కూడ ఆలోచించి అనేక కొత్త సౌకర్యాలు కల్పించాము. అందులో కొన్ని :

1) ప్రభుత్వోద్యోగంలో వున్న ఎవరయినా మరణించినప్పుడు ఆ వ్యక్తి అంతిమ సంస్కారాలకై వెంటనే రు.500/- అప్పటికప్పుడు చెల్లించే ఏర్పాటు. అతనికి అంతవరకూ మామూలుగా యివ్వాల్సిన జీత భత్యాలను అతని కుటుంబానికి చెల్లించటమే గాక, ఆ వ్యక్తి చనిపోయిన నెలలోగా ఆ వ్యక్తి కుటుంబానికి రు.10,000/- అదనంగా అంద చేయాలి. అటెండర్ నుండి పెద్ద వుద్యోగివరకు అందరికీ యిది వర్తిస్తుంది. ఆ కుటుంబంలో వొకరికి తప్పకుండా ప్రభుత్వోద్యోగం యివ్వాలి. అందువల్ల ఆ వుద్యోగి కుటుంబం బజారునపడే దౌర్భాగ్యం వుండదు.

2) ప్రభుత్వోద్యోగులు రిటరయిన తరువాత వారికి యిల్లు లేకుండా వుండరాదన్న నిశ్చయంతో, వారు కోరగానే వనస్థలి పురం (హైదరాబాదు)లో వారికి యిండ్ల స్థలాలుగా పంచటానికి 150 ఎకరాల భూమిని ప్రభుత్వం కేటాయించింది. ఆ భూమిని ప్రభుత్వోద్యోగులకు చదరపు గజం కేవలం 48 పైసలకే యివ్వటం జరిగింది. వారంతా అక్కడ యిళ్లు నిర్మించుకోగల్గారు. అక్కడ యిప్పుడు గజం రు.1500 నుంచి రు.2000 దాకా పెరగటమే కాక, ఒకప్పుడు పట్టణానికి సివారుగా వున్నదల్లా యిప్పుడు నగరంలో ఒక పేటగా కలిసిపోయింది.

## జంటనగరాల అభివృద్ధి :

ఆరు సూత్రాల పథకం క్రిందనే జంటనగరాల అభివృద్ధికై కేంద్రం రు.10కోట్లు యిచ్చింది. మామూలుగా రాష్ట్రప్రభుత్వం యిచ్చే నిధులు కాక యిది అదనం.

వేర్పాటు ఉద్యమాలు తగ్గిపోయి, శాంతి భద్రతల పరిస్థితి మెరుగు

పడటంతో హైదరాబాదు నగరంలో ఎప్పటివలె వృత్తులూ, వాణిజ్యాలూ అవలంబిస్తూ జనం ప్రశాంత జీవనం గడుపుతూ వున్నారు. పట్టణంలోకి అనేక ప్రాంతాల నుండి ప్రజలు వచ్చి పెద్ద ఎత్తున నివాసం ఏర్పరచు కొంటూ వుండటంతో పెద్దయెత్తున యిండ్లు, భవనాల నిర్మాణం పుంజు కొంది. జంటనగరాల అభివృద్ధి విషయంలో రానున్న అర్ధశతాబ్దపు అవసరాలను కూడ దృష్టిలో వుంచుకొని నగరాన్ని తీర్చిదిద్దుకోవలసిన అవసరం కన్పిస్తోంది. అందుకు సరియయిన ప్లానింగ్ అవసరం. మంచినీటి వసతి, డ్రైనేజి ఏర్పాట్లు, రహదార్లు, నగర విస్తరణకు తగిన ప్లాను యివన్నీ అవసరం. అందుకని కలకత్తా, బొంబాయి, ఢిల్లీ, మద్రాసు నగరాలవలె హైదరాబాదును చక్కని మెట్రోపాలిటన్ సిటీగా తీర్చి దిద్దటం కోసం ఇక్కడ వొక పట్టణాభివృద్ధి సంస్థను ఏర్పాటు చేయాలి. ఇందుకు అప్పటి పురపాలక శాఖమంత్రి చల్లా సుబ్బారాయుడు అధ్యక్షుడుగానూ, బావా అనే ఐఏయస్ ఆఫీసర్ అడ్మినిస్ట్రేటర్‌గానూ, ఒక సంఘాన్ని నియమించాము.

వారు కలకత్తా, మద్రాసు, బొంబాయి, ఢిల్లీ అర్బన్ డెవలప్‌మెంట్ అథారిటీలు పనిచేస్తున్న తీరును పరిశీలించి, బిల్లు ముసాయిదా తయారు చేయటం, దానిని శాసనసభల్లో ఆమోదించి చట్టం చేయటం జరిగింది. ఏ ప్రాంతాలు వాణిజ్య ప్రాంతాలుగా వుండాలి, ఏ ప్రాంతాలు నివాస ప్రాంతాలుగా వుండాలి అనేది నిర్ణయిస్తూ మాస్టర్ ప్లాన్ తయారు చేయటం జరిగింది. జాతీయ రహదారులలో నడిచే వాహనాలు సిటీలోనికి వచ్చే అవసరం లేకుండా సరాసరి వూరి బయట నుండి వెళ్లిపోయేందుకు వీలుగా రెండు రింగ్‌రోడ్లు అవసరం. హైదరాబాద్ – నాగపూర్ హైవే, హైదరాబాదు-బెంగుళూరు హైవే, హైదరాబాదు – విజయవాడ హైవే, వరంగల్, నాగార్జున సాగర్‌వైపు వెళ్లే రహదార్ల పైనా సెటిలైట్ టౌన్స్ నిర్మాణం చేసి నగరంపై వత్తిడి తగ్గించాలని నిర్ణయం చేయటం జరిగింది. అందుకనుగుణంగా ఇన్నర్ రింగ్‌రోడ్, ఔటర్ రింగ్‌రోడ్‌లను నిర్మించాలనీ, నాలుగు సెటిలైట్ టౌన్స్‌ను నిర్మాణం చేయాలనీ నిర్ణయం తీసికోడం జరిగింది. కాని నేను ముఖ్యమంత్రిగా దిగిపోయిన తరువాత వచ్చిన ప్రభుత్వాలు శ్రద్ధ తీసికోనందువల్ల, ఈ కార్యక్రమాలన్నీ వెనకబడి పోయాయి. జంట నగరాల అభివృద్ధి కుంటుపడి, ప్రజలు నానా యిబ్బందులతో సతమతమవుతున్నారు.

## రామకృష్ణ మఠం :

హైదరాబాదు నగరాభివృద్ధికి కేంద్రం ఆరు సూత్రాల కార్యక్రమం క్రింద యిచ్చిన పదికోట్లు కాక అదనంగా కొంత డబ్బుయిచ్చింది. ఆ ద్రవ్యాన్ని వుపయోగించి టాంక్‌బండ్ సమీపంలో మునిసిపల్ కార్పొరేషన్ భవనాన్ని, ఇందిరాపార్కును, పాటిగడ్డ వద్ద సంజీవయ్య పార్కును నిర్మించటం జరిగింది. రామకృష్ణ మఠానికి చెందిన స్వామి రంగనాథానంద వచ్చి నన్నుకలసి రామకృష్ణ మఠాన్ని నిర్మించుకోడానికి స్థలం కావాలని అడిగారు. ఇందిరాపార్కు ఎదురుగా ఎనిమిది ఎకరాల భూమిని వారికి యివ్వటం జరిగింది. అది చాలవిలువైనది. భూమేగాక, రు.30 లక్షల రూపాయలదాకా ఆర్థిక సహాయం కూడా వారికి యిచ్చేందుకు అంగీకరించటం జరిగింది. కన్యాకుమారి వద్దగల వివేకానంద మందిరం తరువాత ఎంతో ప్రతిష్ఠాత్మకమైన రీతిలో అక్కడ వారు రామకృష్ణ మఠనిర్మాణం చేశారు. అందులో అన్ని హంగులూకల ఆడిటోరియం, ధ్యానమందిరం మొదలయినవన్నీ వున్నాయి. ఎంతో ప్రశాంత వాతావరణం నెలకొనివుండే ఆ మందిర సముదాయం జంటనగర వాసులకొక అమూల్యకానుక. ఇట్టి మహత్తర కృషిలో నన్ను పాలుపంచుకొనేలా చేసినవారు స్వామీ రంగనాథానంద. వివేకానంద, రామకృష్ణ పరమహంసల బోధలను వినే అవకాశం వందలాది మందికి కలిగే విధంగా ఈ నాటికి ఆ స్థలానికి భోగం వచ్చింది.

## మెర్క్యూరీ లైట్లు :

చాలామందికి గుర్తుండే వుంటుంది. లోగడ హైద్రాబాదులో టాంక్‌బండ్ మీద మామూలు ట్యూబ్ లైట్లుండేవి. నేను ఢిల్లీ వెళ్లినప్పుడు అక్కడ ఎయిర్‌పోర్టు నుండి నగరందాకా రోడ్డుపై మెర్క్యూరీ దీపాలుండటం గమనించాను. ఆ లైట్ల వెలుతురులో 'గ్లేర్' వుండదు. అందుకని ఫిలిప్స్ కంపెనీతో సంప్రదించి, వారికి కాంట్రాక్ట్ యిచ్చి టాంక్‌బండ్‌పైనా, హైదరాబాదు వీధులలోనూ మెర్క్యూరీ లైట్లనమర్చే కార్యక్రమాన్ని చేపట్టటం జరిగింది. ఈనాడు దానివల్లనే హైదరాబాదు నగరం ఎంతో శోభాయమానంగా కనిపిస్తోంది.

## బిర్లామందిర్ :

సచివాలయం ఎదురుగా వున్న కొండను నౌబత్‌పహాడ్ అంటారు. ఆ కొండపై శ్రీ వేంకటేశ్వరాలయం నిర్మించటానికి బిర్లాట్రస్ట్ వారు ముందుకు

వచ్చారు. దానికి నేను ముఖ్యమంత్రిగా వుండగా తగిన సహాయం చేయడంవల్ల ఆ దేవాలయ ప్రారంభోత్సవంనాతోనే చేయించారు. ఆ ఉత్సవానికి బి.యం.బిర్లా గారు సకుటుంబంగా వచ్చారు. ఆ దేవాలయం ఎంతో సుందరమైనది. మొత్తం పాలరాతితో నిర్మించబడింది. విద్యుద్దీపాలంకరణతో మొత్తం హైదరాబాదు నగరానికే ఒక అమూల్య అలంకారంలా ప్రకాశిస్తుంటుంది. తిరుపతి వెంకన్నవలె, ఈ దేవాలయం కూడా పెద్ద సంఖ్యలో భక్తులను ఆకర్షిస్తుండటం ఎంతో విశేషం. ఈ దేవాలయాన్ని బిర్లా ట్రస్ట్ వారు ఎంతో పరిశుభ్రంగా, ఇతర దేవాలయాలకు ఆదర్శప్రాయంగా నిర్వహిస్తుండటం గమనించదగింది.

దాని ప్రక్కనే బిర్లా సంస్థవారే ఒక మంచి నక్షత్రశాల నెలకొల్పారు. ఆ నక్షత్రశాలకూడా విశేషంగా ప్రేక్షకుల నాకర్షిస్తోంది.

హైదరాబాదు అర్బన్ డెవలప్‌మెంట్ అథారిటీని ప్రోత్సహించి సరిగా కార్యక్రమాలనమలు చేసేందుకు ప్రభుత్వం తన మద్దతునిస్తే, జంట నగరాలను ఎంతో అభివృద్ధి చేయువచ్చు. కేంద్ర సహాయం తీసికొని దేశంలో అయిదవ మెట్రోపోలిటన్ నగరంగా ఆధునిక రీతిలో తీర్చిదిద్ద వచ్చు.

## మత సమైక్యత :

రాష్ట్రంలో శాంతి భద్రతలు కాపాడటంలోనూ, మత కలహాలు చెలరేగకుండా అదుపుచేయడంలోనూ, పోలీస్ యంత్రాంగాన్ని పటిష్ఠంగా వుంచి, వారి మనోధైర్యం, నైతిక స్థైర్యం చెదరకుండా బాగా పని చేయించడంలోనూ నా ప్రభుత్వానికి ఎంతో మంచి పేరు వచ్చింది. హిందువులనూ, ముస్లింలనూ సమానంగా చూచుకొనటం జరిగింది. నా పరిపాలనా కాలంలో ఎప్పుడూ రాష్ట్రంలో ఎక్కడా మత కలహాలు తల ఎత్తలేదు. నేను దిగిపోయి డాక్టర్ మర్రి చెన్నారెడ్డి ముఖ్యమంత్రి పదవిని చేపట్టిన కొద్ది కాలానికే రాజధానిలో మత కల్లోలాలు చెలరేగి, కాల్పులకు దారితీయటం వల్ల నా పరిపాలనా కాలంలో చెక్కు చెదరకుండా వున్న ప్రశాంత పరిస్థితులు ఆ తరువాత కొంత వరకు దెబ్బ తినటం జరిగింది.

## ఆహారంలో స్వయం సమృద్ధి :

ఈ రోజు మనం ఎదుర్కొంటున్న అనేక సమస్యలకు కారణం కేంద్రంలో పటిష్ఠమైన ప్రభుత్వం లేకపోవడమే. చౌకబారు కార్యక్రమాలకు కేంద్ర, రాష్ట్ర

ప్రభుత్వాలు డబ్బు కోట్ల కొలదిగా మంజూరు చేసి ప్రజాభి మానాన్ని సంపాదించుకోవాలనుకోవడం, ఆ డబ్బు చివరకు బీదవారికి చేరకపోగా మధ్యవారు తినేస్తుండటంతో అలా విలువైన జాతీయ ఆర్థిక వనరులు వృధా అవుతున్నాయి. ఇది నిజంగా దురదృష్టం. పండిత జవహర్‌లాల్‌నెహ్రూ, లాల్‌బహదూర్ శాస్త్రి, ఇందిరాగాంధి వంటి పెద్దలు ఎంతో శ్రమపడి అభివృద్ధి పథంలో నడిపిస్తూ వచ్చిన భారతదేశం యీ రోజు అమెరికా, ప్రపంచ బ్యాంక్, ఐ.యం.యఫ్‌ల దయా దాక్షిణ్యాలకోసం అర్రులు చాచాల్సిన దుర్గతిలో వుంది. బెంగాల్ కరువులో లక్షలాది జనం తిండిలేక ఆకలిచావులు చావడం మనం చూశాం. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత కూడా దేశంలో జనాభాకు సరిపడా ఆహార ధాన్యాలు లేక దిగుమతులపై ఆధారపడి ఉండటం చూశాం. అయితే ఆ పరిస్థితులను నెహ్రూ నాయకత్వంలో కాంగ్రెస్ ప్రభుత్వం ధైర్యంగా ఎదుర్కొన్నది. అమెరికా నుండి పి.యల్.420 పథకం క్రింద ఆహారం దిగుమతి చేసుకొని ప్రజలకు అందించటం జరిగేది. ఇలా ఎన్నాళ్లు - అని ఆలోచన చేసి దేశంలో పెద్ద పెద్ద నీటిపారుదల ప్రాజెక్టులను నిర్మించుకొని, వ్యవసాయ రంగంలో అభివృద్ధి సాధించాము. గ్రీన్ రివల్యూషన్ ద్వారా ఆహారరంగంలో స్వయం సమృద్ధి సాధించుకోగలిగాము. లాల్ బహదూర్ శాస్త్రి, ఇందిరాగాంధీలు తమ పరిపాలనా కాలంలో వ్యవసాయ రంగాన్ని యింకా ముందుకు తీసుకొని వెళ్లారు.

వ్యవసాయ రంగం అభివృద్ధి చెందే విషయంలోనూ, గ్రీన్ రివల్యూషన్ విజయం కావటం విషయంలోను మనం మరిచిపోరాని వ్యక్తులు యిద్దరు వున్నారు. ఒకరు కేంద్ర ఆహార, వ్యవసాయ శాఖమంత్రి సి.సుబ్రహ్మణ్యం. రెండవవారు అంతర్జాతీయ ఖ్యాతిగాంచిన వ్యవసాయ శాస్త్ర నిపుణులు స్వామినాథన్. మన రాష్ట్రంలో కూడ వ్యవసాయ విశ్వవిద్యాలయాన్ని మనం స్థాపించుకున్నాము. అలాగే దేశంలో అనేక చోట్ల వ్యవసాయ విశ్వవిద్యాలయాలూ, పరిశోధనా సంస్థలూ నెలకొల్పు కోటం జరిగింది. అందువల్ల గోధుమ, వరి, మొక్కజొన్న, జొన్న, సజ్జ మొదలయిన ధాన్యాలను పండించటంలో ఆధునిక విధానాలు అమలులోకి వచ్చాయి. అధిక దిగుబడి నిచ్చే వంగడాలు ప్రచారంలోకి వచ్చాయి. ఎరువుల కర్మాగారాలు ఏర్పాటు చేసికొనటమే కాక దిగుమతి చేసుకొనైనా రైతులకు కావలసినన్ని ఎరువులు సరఫరా చేయడం జరుగుతోంది. పురుగు మందు వాడకం పెరిగింది. ఇవన్నీ న్యాయంగా ఆలోచిస్తే సుబ్రహ్మణ్యం, స్వామినాథన్ వంటి వారి కృషి వల్లనే సాధ్యమయ్యాయి. పనికిరాని వాళ్లందరికీ భారతరత్న బిరుదులు

యిచ్చేబదులు, వారిద్దరికీ భారత ప్రభుత్వం ఆ బిరుదులు ప్రదానం చేసి వుంటే ఎంతో సముచితంగా వుండేది. ఈ ఆలోచన మన నాయకులకు రానందుకు మనం విచారపడాలి.

## ప్రకాశం కలక్టరేట్ :

అలాగే ప్రకాశం జిల్లాను ఒంగోలు కేంద్రంగా బ్రహ్మానందరెడ్డి గారు ముఖ్యమంత్రిగా వుండగా ఏర్పాటు చేశారు. అన్ని ప్రభుత్వ కార్యా లయాలు ఒకే చోట వుండేటట్లుగా జిల్లా కలక్టర్ కార్యాలయాన్ని నిర్మించేందుకై బ్రహ్మానందరెడ్డి గారు శంకుస్థాపన చేశారు. కాని దాని నిర్మాణం జరగలేదు. నేను దానికి కావలసిన నిధులు యిప్పించి, పూర్తి చేయించాను. దాని ప్రారంభోత్సవానికి వాళ్లు నన్నే ఆహ్వానించటం జరిగింది.

## మంగళగిరి ఓవర్ బ్రిడ్జి :

మద్రాస్ - కలకత్తా జాతీయ రహదారిపై మంగళగిరి వద్ద రైలు గేటు కారణంగా ట్రాఫిక్ బాటిల్‌నెక్ ఏర్పడి యిబ్బందిగా వుండేది. రైల్వే ఓవర్ బ్రిడ్జ్ నిర్మాణం చేయించి ఆ యిబ్బందిని శాశ్వతంగా తొలగించగలిగాము. మంగళగిరి - గుంటూరు మధ్యలో నాగార్జున విశ్వవిద్యాలయాల భవనాలను నిర్మాణం చేయించాము. అప్పుడు రాష్ట్రపతిగా వున్న ఫక్రుద్దీన్ ఆలీ అహమ్మద్ గారిని తీసుకొని వచ్చి ప్రారంభోత్సవం చేయించాము. ఎంతో కాలంగా అక్కడి ప్రజలు కన్న కలలు ఫలించాయన్న ఆనందం ఆనాడు సభకు వచ్చిన వారిలో కన్పించింది. ఆ దృశ్యం మరువరానిది.

## నిమ్స్ :

హైదరాబాద్‌లో ఉస్మానియా, గాంధీ ఆసుపత్రులున్నప్పటికీ, వాటిల్లో సూపర్‌స్పెషాలిటీస్ లేవు. వైద్య సహాయం అవసరమయిన వాళ్లు మదరాసుకో, ఢిల్లీలోని అఖిలభారత వైద్య విజ్ఞాన సంస్థకో వెళ్లవలసి వచ్చేది. ఇందువల్ల ప్రభుత్వానికి కూడ ఖర్చు ఎక్కువవుతుండేది. హైదరాబాద్‌లోనే యీ స్పెషాలిటీస్‌ను ఎందుకు ఏర్పాటు చేయ కూడదు? - అన్న ఆలోచన వచ్చింది. ప్రస్తుతం నిజాం ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్ అని పిలువబడుతున్న ఆస్పత్రి ఆ ఆలోచన ఫలితంగా ఏర్పడిందే. అంతకు ముందు దానిని నిజాం ఆర్థోపెడిక్

హాస్పిటల్ అనేవారు. అక్కడ ఎముకలు విరిగితే కట్లుకట్టడం వంటి చికిత్సలు జరిగేవి. ఆ ఆసుపత్రి నగరానికి నడిబొడ్డున 26 ఎకరాల స్థలంలో వుంది. నేను ముఖ్యమంత్రిగా వుండగా ఒకసారి ఆ ఆసుపత్రిని చూడటానికి వెళ్లాను. నా వెంట వున్న అధికారులు ఆ ఆసుపత్రి నిజాం ఛారిటబుల్ ట్రస్ట్ వారిచే నడపబడుతున్న సంస్థ అని చెప్పారు. ఆ ఆసుపత్రిని ప్రభుత్వం తీసికొని సూపర్ స్పెషాలిటీస్ వుండే వైద్య విజ్ఞాన సంస్థగా అభివృద్ధి చేస్తే ఎలా వుంటుందనే ఆలోచన వచ్చింది. నిజాం ట్రస్ట్‌లో అప్పుడు జహీర్ అహమ్మద్ గారు పనిచేస్తున్నారు. ఆయన ఐ.ఏ.యస్. ఆఫీసరుగా పనిచేసి రిటయిరయిన వారు. నాకు బాగా పరిచయం. ఒకసారి ఆయన నన్ను కలవటానికి మాయింటికి వచ్చారు. నేను ఆయనతో 'మీరు ఇంత ఖర్చుపెట్టి భవనాలు నిర్మించారు. కాని ఆర్థోపెడిక్ సెక్షన్ మినహా మిగతా బిల్డింగ్ అంతా ఖాళీగా వుంచారు. ఎందుకని?' అని అడిగాను. దానిపై వారు దాని నిర్వహణకు ఏటా యిప్పటికే రు.6లక్షలు ఖర్చవు తున్నాయనీ, ఇంకా అంతకన్నా ఖర్చు చేయలేమనీ అన్నారు. అప్పుడు నేను వారితో నా ఆలోచన చెప్పాను. 'ఆ సంస్థను మా కప్పగించితే, దానిని ప్రభుత్వం ఒక వైద్య విజ్ఞాన సంస్థగా అభివృద్ధి చేస్తుంది. మీ కభ్యంతరం లేకపోతే మా కప్పగించండి!', అని కోరాను. వారు వెంటనే అంగీక రించారు. అయితే వారు ఒకే ఒక్క షరతు పెట్టారు. 'మీరు ఏ పేరైనా పెట్టండి కాని నిజాం అన్నమాట మాత్రం ఆ సంస్థ పేరుకు జోడించాలి. తీసేయకూడదు!' అని. నేను సంతోషంతో వొప్పుకున్నాను. తరువాత నేను వైద్య శాఖమంత్రితోనూ, అధికారులతోనూ చర్చించి, ఆ సంస్థను స్వాధీనం చేసుకొనేందుకు నిర్ణయం తీసుకొన్నాను. నిజాం ఛారిటబుల్ ట్రస్ట్ వారు కూడా సమావేశమై ప్రభుత్వానికి ఆ సంస్థను 99 సంవత్సరాల లీజుపై స్వాధీనం చేయటానికి అభ్యంతరం లేదని తీర్మానం చేశారు. ఆ సంస్థను తీసుకొన్న తరువాత దాని అభివృద్ధి చేయుటంలో భాగంగా నూతనభవనాల నిర్మాణానికీ, అధునాతన వైద్య యంత్రాల కొనుగోలుకూ కావలసిన నిధులను సమకూర్చటం జరిగింది. ఆ ఆసుపత్రిలో యీనాడు అన్ని రంగాలలోనూ స్పెషాలిటీస్‌ను పెంపొందించటం, పేరు వోసిన నిపుణుల సహాయంతో వైద్య సహాయం చేయడం జరుగుతోంది. క్రమంగా ఆ సంస్థ నేడొక ప్రతిష్ఠాత్మకమైన వైద్య విజ్ఞాన సంస్థగా దేశంలో ప్రఖ్యాతి సంపాదించుకొంటోంది. ఆ సంస్థ నిర్వహణకు ఒక సంఘాన్ని ప్రభుత్వం నియమించింది. ప్రభుత్వ వైద్య శాఖ క్రిందవుండే దానికన్న ప్రత్యేక సంఘ నిర్వహణలో వుండటం వల్ల నిర్ణయాలు

తీసికోడంలో జాప్యం లేకుండా చేయువచ్చునన్న అభిప్రాయంతో ఆ విధంగా చేశాము.

## మహావీర్ ఆస్పత్రి :

అలాగే స్థానిక జైన్ సంఘం వారు కొందరు ఒకసారి నా వద్దకు వచ్చి ఒక పెద్ద ఆసుపత్రి నెలకొల్పాలన్న ఆలోచన వుందని చెప్పారు. నేను వెంటనే వారికి ఎ.సి.గార్డ్స్ ప్రాంతంలో స్థలాన్ని యిచ్చే ఏర్పాటు చేశాను. ఆ భూమి విలువ ఈ రోజు కొన్ని కోట్లు అంటే ఆశ్చర్యం లేదు. వారు నాకు చెప్పిన ప్రకారం సకల సౌకర్యాలతో పెద్ద ఆసుపత్రి భవనాన్ని నిర్మించి చక్కగా నిర్వహిస్తున్నారు. మహావీర్ ఆసుపత్రిగా అది నేడు అందరికీ వైద్య సేవలందిస్తోంది. ఇదివరకు ఏ అమెరికాకో, ఇంగ్లాండుకో, కనీసం ఢిల్లీకోవెళ్లి చేయించుకోవాల్సిన ఆధునిక చికిత్సలూ బైపాస్ సర్జరీలూ, యితర ఆపరేషన్లూ అన్నీ యీ రోజు హైదరాబాదులోనే చేయించుకొనే సౌకర్యం ఏర్పడింది.

## రాజమండ్రి వంతెన :

రైల్వేశాఖ గోదావరిపై రాజమండ్రి వద్ద మరొక రైలు వంతెనను నిర్మిస్తున్నప్పుడు రాష్ట్రప్రభుత్వం దానిని రోడ్ - కమ్ - రైలు బ్రిడ్జిగా నిర్మించవలసిందిగా కోరింది. అందుకు రాష్ట్ర ప్రభుత్వం రు.6కోట్లు రైల్వేలకు యిచ్చేందుకు అంగీకరించింది. అయితే నా కన్న ముందు అధికారంలో వున్నవారు ఆ డబ్బులో కొంతయిచ్చి, కొంత యివ్వక జరుపుల్లు పెట్టడం వల్ల ఆ నిర్మాణ కార్యక్రమం నత్తనడక నడుస్తూ వుంది. దానికి వొప్పుకున్న మొత్తం అంతా నేను రైల్వేశాఖకు చెల్లించే ఏర్పాటు చేశాను. ఆ వంతెనను పూర్తి చేయించి, రాష్ట్రపతి ఫక్రుద్దీన్ ఆలీ అహమ్మద్ గారిని తీసుకొనివచ్చి ప్రారంభోత్సవం జరిపించాను.

## షెడ్యూలు కులాలు, తెగలు :

తరతరాలుగా వెనుకబడిన షెడ్యూలు కులాల, షెడ్యూలు తెగల వారు గానీ, యితర వెనుకబడిన వర్గాలను గానీ పైకి తీసుకొని రావాల్సి వుంది. అందుకు ఏం చేయడం అని ఆలోచించాను. అందుకు వారి పిల్లలు చదువుకొనేందుకు మంచి వసతులు కల్పించాలి అని చెప్పి వారి పిల్లలకు ఉచితంగా భోజనం,బట్ట, పుస్తకాలు వగయిరా యిచ్చే ఏర్పాటు చేశాము. ప్రతి విద్యార్థికి పాకెట్‌మనీ కింద

ఆకస్మికంగా కొట్టుకుపోయిన ధవళేశ్వరం ఆనకట్ట పునర్నిర్మాణాన్ని పరిశీలిస్తున్న శ్రీ వెంగళరావు, రికార్డు టైమ్‌లో ఆనకట్టను పునర్నిర్మించి చరిత్ర సృష్టించారు

తెలుగు జాతిని తిరిగి ఏకం చేసిన ప్రపంచ తెలుగు మహాసభలో రాష్ట్రపతి ఫక్రుద్దీన్ అలీ అహ్మద్ నుంచి అభినందనలు అందుకుంటున్న శ్రీ వెంగళరావు,

నెలకు రు.25/- యిచ్చే కార్యక్రమం ప్రారంభించాము. కనీసం ఒక వ్యక్తయినా చదువుకొని ఉద్యోగం సంపాదించుకోగల్గితే ఆ కుటుంబం పైకి వస్తుంది. అందుకప్పుడు కేంద్రం యిచ్చే సహాయం కన్న రాష్ట్రం యిచ్చేదే ఎక్కువగా వుండేది. కాని తరువాత కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు చేసే సహాయాన్ని సమానం చేశారు. రాష్ట్రానికి కొంతఖర్చు తగ్గుతుందని అలాచేసి వుంటారు.

షెడ్యూలు కులాల, తెగల అభ్యర్థులు అఖిలభారత సర్వీస్ పరీక్షలకు హాజరయ్యే సందర్భంలో వారికి ఉచితంగా కోచింగ్ ఏర్పాటు చేశాము. అందువల్ల బాగా చదువుకొని ఎక్కువ మార్కులతో ఉత్తీర్ణు లయ్యే అవకాశం వారికి కలిగింది.

# మంచినీటి సరఫరా

హైదరాబాదు, సికిందరాబాదు నగరాలకు మంచి నీటి సరఫరా కోసం నిజాం ప్రభుత్వకాలంలో ఉస్మాన్‌సాగర్ (గండిపేట) నిర్మించారు. అది అయిదారు లక్షల మందికి నీరు సరఫరా చేసేందుకు ఉద్దేశించ బడింది. తరువాత హిమాయత్ సాగర్ నిర్మాణం జరిగింది. నగర నీటి అవసరాలు రోజు రోజుకూ పెరుగుతూ వున్నాయి. హైదరాబాదు నగరానికే కాక, సివారు పట్టణాల జనాభాకు, రంగారెడ్డి జిల్లాలోని పరిశ్రమలకు కూడా నీరు సరఫరా చేయవలసిన అవసరం వుంది. కనుక ముందు, ముందు హైదరాబాదుకు నీటి కొరత వస్తుందనే అభిప్రాయంతో దానిని నివారించటానికే కర్నాటక, మహారాష్ట్ర ముఖ్యమంత్రులతో గోదావరీ జలాల వొప్పందాన్ని చేసుకొనేటప్పుడు, మంజీరపై సింగూరు ప్రాజెక్టు నిర్మాణం చేసి, అందులో 30 టిఎమ్‌సిల నీటిని నిలవచేసేందుకు వారితో అవగాహనకు రావటం జరిగింది. ఆ ప్రాజెక్టు నిర్మాణం వల్ల కర్నాటకలోని బీదర్ జిల్లాలో 20గ్రామాలు మునిగిపోతాయి. అందుకని, ముందు వారు దీనికి అంగీకరించలేదు. అప్పటి కర్నాటక ముఖ్యమంత్రి దేవరాజ్ అర్సు నాకు సన్నిహిత మిత్రుడు. నేనంటే ఆయనకు ఎంతో అభిమానం. ఆయన తన రాష్ట్ర ఉద్యోగ బృందం అభ్యంతరాలు లేవనెత్తినా, వెంగళరావుగారు ఆంధ్రప్రదేశ్ రాజధానికి మంచినీరు కావాలని అడిగినప్పుడు మనం కాదనరాదని చెప్పి, ఒడంబడికపై సంతకం చేశారు. తరువాత ఆయన మాట మీద ఆయన ప్రభుత్వాధికారులు కూడా సంతకాలు చేశారు. ఆంధ్రప్రదేశ్ పక్షాన నేనూ, మన అధికారులూ సంతకం చేశాము.

## సింగూరు :

1975వ సంవత్సరంలో యీ రిజర్వాయర్‌కు శంకుస్థాపన సందర్భంలో నేను దేవరాజ్ అర్స్ గారిని ఆహ్వానించాను. కర్నాటక ప్రభుత్వం కూడా కరంజాయ ప్రాజెక్ట్ నిర్మాణం చేసేందుకు అదే ఒడంబడికలో చేర్చటం జరిగింది. కనుక ఒకే రోజున నేనూ, అర్సుగారు బయలుదేరి కర్నాటకలోని కరంజాయ ప్రాజెక్టు స్థలానికి చేరుకున్నాము. ఆ ప్రాజెక్టుకు నేను శంకుస్థాపన చేశాను. తరువాత హైదరాబాదు వచ్చి భోజనం చేసికొని సింగూరుకు పోయి అర్సుగారితో ఆ ప్రాజెక్టుకు శంకుస్థాపన చేయించాము. ఉభయ రాష్ట్రాల నాయకుల మధ్య సదవగాహన

వుండటం మూలాన్నే ఆనాడీ కార్యక్రమం సఫలమయింది. ఇప్పటి పరిస్థితుల్లోనైతే అది జరిగేదికాదు.

నేను ముఖ్యమంత్రిగా వుండగా సింగూరు ప్రాజెక్టును త్వరగా పూర్తిచేయాలన్న వుద్దేశంతో డబ్బు కేటాయించటం జరిగింది. కాని నేను 1978 మార్చిలో పదవీ విరమణ చేసిన తర్వాత వచ్చిన ప్రభుత్వం దానిపట్ల శ్రద్ధ చూపకపోవటంతో ప్రాజెక్ట్ పని నత్తనడక నడిచింది. రు.50కోట్లతో పూర్తికావలసిన ప్రాజెక్ట్ తడిసి ముప్పందుమొ రు.300 కోట్లదాకా పెరిగిపోయి, పూర్తిచేయటానికిగాను చివరకు ప్రపంచ బ్యాంక్ ఋణం కూడ తీసికోవలసిన అగత్యం ఏర్పడింది. ఇప్పటికీ ఒక పైపులైన్ కూడపూర్తికాలేదు. 1981-82, 1982-83, 1983-84 సంవత్సరాలలో నిధులు తగినన్ని కేటాయించనికారణంగా ప్రాజెక్ట్ పనులు సరిగా జరగలేదు. ఒక సంవత్సరం రిజర్వాయర్ గేట్లు సరిగా అమర్చక కూలిపోవటంతో రిజర్వాయర్‌లో నీరు వృధాగా పోయింది కూడ. ప్రాజెక్టు మొదలుపెట్టి 20 ఏళ్లయినా పూర్తికాకపోవటం వల్ల, ప్రాజెక్ట్ వ్యయం విపరీతంగా పెరిగిపోవటం అటుంచి, యింతకాలం జనం నీటి కొరతతో నానా యిబ్బందుల పాలయ్యారు. ఉస్మాన్‌సాగర్, హిమాయత్ సాగర్‌లలో నీరు నిండక ప్రజలకు రెండు రోజులకొకసారి నీరందించే పరిస్థితి ఏర్పడింది.

ఇదిలా వుండగా, 1993-94లో అప్పటి ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయభాస్కరరెడ్డి రాజకీయ వొత్తిడులకు లొంగి నిజాంసాగర్ నీరు తక్కువయిందని చెప్పి ముందు చూపు లేకుండా, సింగూరు గేట్‌లోంచి నీరు వదలటంతో జంటనగరాల ప్రజలు మరింతగా నీటి యెద్దడిని ఎదుర్కోవలసి వచ్చింది. నిజానికి సింగూరు నీటిని అట్లా మళ్లించటానికి వీలులేదు. సింగూరు ప్రాజెక్టుకు సంబంధించిన ఒడంబడికలో 'ఈ ప్రాజెక్టు నీరు జంటనగరాల తాగు నీటి సరఫరాకు, సివారు పట్టణాలకు నీటి సరఫరాకు, అక్కడి పరిశ్రమల అవసరాలకు' అని ప్రత్యేకించి పేర్కొనడం జరిగింది. సరిపడినంత నీరుందో లేదో చూసుకోకుండానే, ఆ ఒడంబడికను ఉల్లంఘించి నిజాంసాగర్‌కు నీరు యివ్వటంతో యీ చికాకంతా వచ్చిపడింది.

## కృష్ణ నీరు :

హైదరాబాదు నగరనీటి సమస్యను పరిష్కరించేందుకు నాగార్జున సాగర్‌నుండి 10 టిఎమ్‌సిల కృష్ణ నీరు తేవాలన్న ఆలోచన చేశారు. యన్.టి.రామారావుగారు మొదటిసారి ముఖ్యమంత్రి చేసినప్పుడే ఆ పథకానికి శంకుస్థాపన చేశారు. 1993లో అప్పటి ముఖ్యమంత్రి శ్రీ విజయభాస్కరరెడ్డిగారు అదే ప్రాజెక్టుకు మళ్లీ శంకుస్థాపన చేశారు. కాని రెండు సందర్భాలలోనూ పని మాత్రం ప్రారంభంకాలేదు. యన్.టి. రామారావు గారు రెండవ దఫా ముఖ్యమంత్రిగా వచ్చిన తరువాత ఈ ప్రాజెక్ట్ పనిని ఒక ప్రయివేటు కంపెనీకి వొప్పచెప్పి, మూడు సంవత్సరాల లోనే కృష్ణా జలాలను హైదరాబాదుకు అందిస్తామని చెప్పారు. ఏదయినా, యిప్పటికీ పని యింకా మొదలుకాలేదు.

అయితే రాబోయే 50 సంవత్సరాలలో హైదరాబాదు పట్నం ఎలా అభివృద్ధి చెందేదీ వూహించుకుంటే, యీ ఏర్పాటు సరిపోదు. ఇప్పటి నుండే ప్రయత్నం చేసి, ఇచ్చంపల్లి నుండి హైదరాబాదుకు గోదావరీ జలాలను తరలించటం చాల అవసరం. ఇచ్చంపల్లి నుండి హైదరాబాదు దాకా వున్న పట్టణాల, గ్రామాల నీటి అవసరాలను కూడా యీ సందర్భం లో గుర్తుంచుకోవాల్సి వుంటుంది. వెంటనే యిందుకు తగిన చర్యలను దూరదృష్టితో తీసికొనకపోతే, తరవాత ఎన్నో యిబ్బందులకు గురవుతాం. క్రీ.శ.2000 లోగానే యీ కార్యక్రమం పూర్తి కావటం బచావత్ ట్రిబ్యునల్ దృష్ట్యా తప్పనిసరి.

రాష్ట్రంలో కృష్ణా, గోదావరి వంటి జీవనదులు ప్రవహిస్తున్నాయి. సహజవనరులు కలిగిన రాష్ట్రం యిది. అయినా మన పట్టణాలలోనూ, గ్రామాలలోనూ అనేకవాటికి తాగటానికి తగిన మంచి నీటి సరఫరా చాలినంతగా జరపలేకపోతున్నాము. రాష్ట్రరాజధాని హైదరాబాదు ప్రజలే తీవ్రమైన నీటి ఎద్దడిని ఎదుర్కోవలసి వస్తోందంటే, అది 1978 నుండి నేటి వరకూ ఈ రాష్ట్రాన్ని పాలిస్తూ వచ్చిన వారి అసమర్థతను చాటి చెబుతోంది.

## విశాఖకు నీటి వసతి :

విశాఖపట్నానికున్నూడా తీవ్రంగా నీటి యెద్దడి వుండేది. నేను ముఖ్యమంత్రిగా వుండగా మేఘాద్రిగడ్డ ప్రాజెక్టు నిర్మించి విశాఖకు నీటి యెద్దడి లేకుండా చేయాలని సంకల్పించాము. కె.యల్.రావుగారి వంటి ఇంజనీరుకూడా

'ఆ ప్రాజెక్టు అక్కర లేదు. అది కట్టేలోగా మనకు పోలవరం నుండి నీరు వస్తుంది' అని చెప్పారు. అప్పటికే దానిపైన ఒక కోటి దాకా ఖర్చయింది. అయినా నేను సాహసం చేసి నాలుగైదు కోట్లు ఖర్చయినా సరే, మేఘాద్రిగడ్డ రిజర్వాయర్ నిర్మాణం చేయించాను. దాని వల్ల యీ రోజు విశాఖకు పుష్కలంగా నీరు లభిస్తోంది. ఆ పోలవరం యిప్పటిదాకా అయిపులేదు. దానినే నమ్ముకుంటే రెంటికీ చెడ్డ రేవడి అయ్యేదికదా విశాఖ వాసులపని !

అలాగే విశాఖ వుక్కు కర్మాగారానికి కావలసిన నీటిని కూడ పోలవరం ప్రాజెక్టు నుండి తీసుకోవాలని మొదట అనుకున్నారు. పోలవరం వంటి భారీ ప్రాజెక్టు నిర్మాణం అంత తేలికకాదు. దాని నిర్మాణం ఆలస్యమైతే ఉక్కు కర్మాగారం పని కుంటుపడుతుంది. ఇవన్నీ ఆలోచించి నేను ఏలేరు రిజర్వాయర్ నిర్మించేందుకు చర్యలు తీసుకోడం జరిగింది. అంతకు ముందు ఉక్కుకర్మాగార నిర్మాణానికి అవసరమైన నీటిని రైవాడ ప్రాజెక్టునుండి కాలువ తీసి, అందించటం జరిగేది. కాని ఉక్కుకర్మాగారపు పూర్తి అవసరాలకు ఆ నీరు చాలదు. పోలవరం ప్రాజెక్టు పూర్తయితే అందులోనుంచి సరిపోయినంత నీరు లభించేది. కాని యీలోగా యిబ్బంది లేకుండా ఏలేరు రిజర్వాయర్ నుండి కొంత దూరం కాలువ ద్వారా మరి కొంత దూరం పైప్‌లైన్ ద్వారా ఉక్కు కర్మాగారానికి నీరందించే ఏర్పాటు చేయడం జరిగింది. ఏలేరు రిజర్వాయరు తూర్పు గోదావరి జిల్లాలో వుంది. దీనివల్ల రైవాడ నుండి నీరు తీసికోనవసరం లేకపోవడంతో, రైవాడ నీటిని వేరే కాలువ ద్వారా విశాఖ పట్నానికి తీసుకొని పోతున్నారు. విశాఖ పట్నం శరవేగంతో పెరిగి పోతోంది. ముఖ్యంగా ఎన్నో పరిశ్రమలు యిక్కడ వెలుస్తున్నాయి. ఈ పరిస్థితిలో గోదావరి నుండి నీటిని ప్రత్యేక పైప్‌లైన్స్ ద్వారా విశాఖ ఉక్కు కర్మాగారానికి తీసికొని వెళ్లే ప్రయత్నం చేయుటం చాల అవసరం. ఇంకో అయిదారు సంవత్సరాలలోగా యీ ఏర్పాటు జరక్కపోతే చాల యిబ్బందులు కలుగుతాయి. రాష్ట్రప్రభుత్వం ఈ విషయంలో తగిన శ్రద్ధాశక్తులు చూపగలదని ఆశిస్తున్నాను.

## తిరుపతికి నీరు :

తిరుపతి పట్టణానికి నీరందించే కళ్యాణి ప్రాజెక్టుకు నాకు ముందు వచ్చిన వారి కాలంలోనే శంకుస్థాపన చేసినా నిధులు లేక పనిసాగలేదు. తిరుపతి మునిసిపల్ ఛైర్మన్ గురువా రెడ్డిగారు నన్నుతీసికొని పోయి ప్రాజెక్టు చూపించి దానిని పొడ్డున

పడవేసే మార్గం చూడవలసిందని కోరాడు. దానికి కావలసిన నిధులను సమకూర్చి ఏడాదిలోగా పూర్తి చేయించాము. అందుకయ్యే ఖర్చులో నాల్గవవంతు దేవస్థానం భరించే విధంగా ఉత్తరువులు జారీ చేయడం జరిగింది.

తిరుపతి కొండలపై పాపనాశనం ప్రాజెక్టుకు కూడ నేను ముఖ్య మంత్రిగా వుండగా శంకుస్థాపన చేయటం జరిగింది. తిరుమలపై రోజురోజుకు పెరుగుతున్న యాత్రికులకు యిబ్బందిలేకుండా నీటి వసతి కల్పించటానికి అది తోడ్పడుతుంది.

## వరంగల్లుకు మంచినీళ్లు :

అలాగే తెలంగాణాకు శ్రీరామ్‌సాగర్ (పోచంపాడు) ప్రాజెక్టు ప్రాణాధారం. ఆ ప్రాజెక్టుకు కూడా నిధుల కొరతవచ్చి పని సాగకపోతే, నేను ముఖ్యమంత్రి అయిన తరువాత కావలసిన నిధులు యిచ్చి తొందరగా పూర్తి చేయించటం జరిగింది.

ఒకసారి కరీంనగర్ జిల్లా పర్యటనలో లోయర్ మానేర్ డాం నిర్మాణం జరుగుతుంటే చూడటానికి వెళ్లాను. అప్పుడు అక్కడవున్న కన్‌స్ట్రక్షన్ కార్పొరేషన్ ఛైర్‌మన్ గోపాలరావుగారితో మాట్లాడుతుంటే వారు పైపులైన్ ద్వారా గోదావరి నీటిని, వరంగల్లుకు మంచి నీటి వసతి కల్పించ టానికి సరఫరా చేసే పథకానికి లోగడ బ్రహ్మానందరెడ్డి శంకుస్థాపన చేశారనీ, కాని ఆ పథకం అమలు కాలేదని చెప్పటం జరిగింది. నేను వారితో ఆ కార్యక్రమం ఎందుకు ఆగిపోయిందని అడిగాను. మానేరు డాం వల్ల కరీంనగర్ వెళ్లే రోడ్డు మునిగిపోతుందని ఆపేసినట్లు చెప్పారు. నేను 'ఆ రోడ్డును మరోవేపు డైవర్టు చేయండి! మానేరు రిజర్వాయర్ దగ్గర పెద్ద వంతెన నిర్మించి, రోడ్డును రిజర్వాయర్ పక్కనుంచి తీసుకొని వెళ్లండి!' అని ఆదేశించాను. తరువాత లోయర్ మానేర్ బాలెన్స్‌డ్ రిజర్వాయర్‌కు శంకుస్థాపన చేశాను. కరీంనగర్ జిల్లాలో హుజూరాబాద్ యితర ప్రాంతాలకు నీరు సప్లయి చేసి, వరంగల్లుకు మంచి నీరందించే కార్యక్రమాన్ని ప్రారంభించటం జరిగింది.

## గుంటూరుకు నీరు :

బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రిగా వుండగా కృష్ణానది నుంచి గుంటూరు కాలవను తవ్వేందుకు ఒక పథకాన్ని చేపట్టారు. కాని దానికి నిధులు లేక

ఆగిపోయింది. నేను దానిని పూర్తి చేయించాను. దాని వల్ల గుంటూరు పట్టణానికి మంచినీటి వసతి ఏర్పరచే వీలు చిక్కింది.

## మద్రాసుకు మంచినీరు :

ఇందిరాగాంధి గారొక సారి మద్రాసు వెళ్లినప్పుడు అక్కడ ప్రసంగిస్తూ కృష్ణాజలాలను మద్రాసుకు మంచినీటి వసతికోసం తరలించే విషయం ప్రకటించారు. ఇందుకు ఆంధ్ర, మహారాష్ట్ర, కర్నాటక ముఖ్యమంత్రులు ఒక అవగాహనకు వచ్చారని, దాని ప్రకారం కృష్ణా జలాల్లో తమవాటాకు వచ్చేనీటి నుండి కర్నాటక, మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్ తలా 5 టియమ్‌సిలను యిస్తే 15 టియమ్‌సిల నీళ్లను ఆంధ్రనుంచి కాలువ ద్వారా మదరాసుకు తరలించే ఏర్పాటు జరుగుతుందని ఆమె చెప్పారు. ఆ అవగాహనపై ఆయా రాష్ట్ర ముఖ్యమంత్రులు సంతకాలు చేశారు.

శ్రీశైలం ప్రాజెక్టు వద్ద కేబుల్ నిర్మాణానికి ప్రారంభం చేయడానికి వెళ్లినప్పుడే నేను అక్కడ ఛీఫ్ ఇంజనీర్‌గా వున్న యం.యల్.స్వామి గారిని అడిగాను. 'మద్రాసుకు నీళ్లిచ్చేందుకు బలిలిఙ్రొ జిహ్రాశ్రీ జాఖమేశ్రాఎఙ్ఞను ఎప్పుడు నిర్మించాలి?' అనడిగాను. 'శ్రీశైలం ఆనకట్ట నిర్మాణం పూర్తయితే ఆ పనులు చేయడం కష్టం. ఇపుడే ఆ పనిచేసుకోవాల్సి వుంటుందని', ఆయన జవాబు చెప్పారు. పర్మిషన్ యిస్తే వెంటనే పని ప్రారంభిస్తానని చెప్పారు. దానిని కేంద్ర ప్రభుత్వం ఆమోదం కోసం పంపితే తేలటం కష్టం. కనుక మంత్రిమండలిలో ఆ ప్రతిపాదన పెట్టి, ఇందిరాగాంధి గారికి మనం రాసి యిచ్చిన ప్రకారం 15 టియమ్‌సిల నీటిని మదరాసుకు తరలించాల్సి వుంది. దానికై బలిలిఙ్రొ జిహ్రాశ్రీ జాఖమే శ్రాఎఙ్ఞ నిర్మాణం చేయాల్సివుందని చెప్పి మంజూరు తీసికొన్నాము. పోతిరెడ్డి పాలెం వద్ద రెగ్యులేటర్ నిర్మాణానికి ఏర్పాటు చేసి నేను వెళ్లి శంకు స్థాపన చేశాను. అప్పుడు స్వామిగారితో రెగ్యులేటర్ కెపాసిటీ 15 టియమ్‌సిలు మాత్రమే కాకుండా యింకా ఎక్కువగా పెట్టాలనీ, భవిష్యత్తులో రాయలసీమకు కృష్ణాజలాలను అందించేందుకు సరిపడా వుండాలనీ చెప్పటం జరిగింది. దానికి కావలసిన డబ్బు శ్రీశైలం ఆనకట్ట బడ్జెట్ నుండి రు.6 కోట్లు విడుదల చేశాము. ఈనాడు మనం మదరాసుకు మంచి నీరందించే పథకం, దానితో పాటు రాయలసీమకు కృష్ణాజలాల సరఫరా ఏర్పాటు చేయాలని ప్రయత్నం చేస్తున్నాం. ఆనాడు మనం సాహసం చేసి కేంద్రామోదానికై కాచుకూర్చోకుండా రెగ్యులేటర్ నిర్మాణం చేసుకొని ముందుకు సాగటంవల్లనే ఈ రోజు అది సాధ్యపడింది.

## తెలుగు గంగ :

కృష్ణా నదీజలాలను మద్రాసు పట్టణానికి మంచినీటి కోసం అందించాలన్న ప్రతిపాదనను చర్చించటానికి కేంద్ర ఆహార, నీటి పారుదల శాఖమంత్రి శ్రీ బాబూ జగ్జీవనరాం 1976 ఏప్రియల్ 17న న్యూఢిల్లీలో ఒక సమావేశం ఏర్పాటు చేశారు. తమిళనాడు అప్పుడు అధ్యక్షపాలనలో వుండటం వల్ల తమిళనాడు గవర్నర్ కె.కె.షా. దానికి హాజరయ్యారు. మూడు రాష్ట్రాలకూ అప్పుడే ఒక ఒప్పందం కుదిరింది. ఆ ఒప్పందం మీద నేను సంతకం పెడుతూ, కేంద్ర మంత్రి శ్రీ జగ్జీవనరాం గారికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికున్న రిజర్వేషన్లను లిఖిత పూర్వకంగా తెలియ జేశాను. (ఆ ఒప్పందం ప్రతినీ, జగ్జీవన రాంగారికి నేను రాసిన ఉత్తరాన్నీ అనుబంధాలలో చూడవచ్చు).

తెలుగు దేశం అధికారంలోకి వచ్చిన తరువాత ముఖ్యమంత్రయిన యన్.టి.రామారావు గారు మద్రాసుకు నీరు తరలించే కాలువకు తనదైన బాణీలో 'తెలుగు గంగ' అనిపేరు పెట్టారు. దానికి మహారాష్ట్ర, కర్నాటక ప్రభుత్వాలు అభ్యంతర పెట్టటం జరిగింది. తెలుగు గంగ పని యింకా కొనసాగుతూనే వుంది. ఇటీవల దాకా ముఖ్యమంత్రిగా వున్న యన్.టి.రామారావుగారు 1996 డిసెంబర్ కల్లా మదరాసుకు నీరందిస్తామని ప్రకటనలు గుప్పిస్తుండే వారు. అదే జరిగితే, అంతకన్నా కావలసిందేముంటుంది?

# భారీ ప్రాజెక్టులు

ఆంధ్రప్రదేశ్ ఏర్పడక ముందు హైదరాబాద్ రాష్ట్రానికి బూర్గుల రామకృష్ణారావు గారు ముఖ్యమంత్రి. 1953లో కర్నూల్ రాజధానిగా ఆంధ్రరాష్ట్రం ఏర్పడ్డాక ప్రకాశం గారి మంత్రివర్గంపై విశ్వాస రాహిత్య తీర్మానాన్ని శాసనసభ ఆమోదించటం వల్ల అక్కడ అధ్యక్షపాలన వచ్చింది. అప్పుడు ఆంధ్రగవర్నరుగా సి.యం.త్రివేది వుండేవారు. రామకృష్ణారావు గారు, త్రివేది యిద్దరూ ఒక అంగీకారానికి వచ్చి నాగార్జునసాగర్ ప్రాజెక్టును నిర్మించాలని ఒడంబడిక చేసుకున్నారు. హైదరాబాదు – ఆంధ్ర రాష్ట్రాలు సంయుక్తంగా చేపట్టిన యీ ప్రాజెక్టు ప్రపంచంలో కెల్లా పెద్దదయిన రాతికట్ట (మాసనరీ) ఆనకట్ట. నవభారత ప్రథమ ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ ఆ ప్రాజెక్టుకు శంకుస్థాపన చేశారు. ఇలాటి ప్రాజెక్టులను నూతన దేవాలయాలని ఆయన అభివర్ణించే వారు.

హైదరాబాదు సంస్థానానికి అంతకుముందు నవాబుగా వుండిన నిజాం రాష్ట్ర రాజప్రముఖ్‌గా వుండేవారు. 1956లో భాషాప్రయుక్త రాష్ట్ర నిర్మాణం జరిగింది. అప్పుడు హైద్రాబాద్ సంస్థానాన్ని విభజించి ఆంధ్రప్రదేశ్, కర్నాటక, బొంబాయి రాష్ట్రాలలో వరుసగా తెలుగు, కన్నడ, మరాఠీ భాషా ప్రాంతాలను కలిపి వేశారు. కర్నూలులో ఆంధ్రకు గవర్నరుగా వున్న త్రివేది ఆంధ్రప్రదేశ్‌కు మొదటి గవర్నరుగా వచ్చారు. రాజ ప్రముఖుల చరిత్ర అక్కడితో ముగిసింది.

ఆంధ్రప్రదేశ్ మొదటి ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డిగారు. ఆయన కాలంలో నాగార్జునసాగర్ ఆనకట్ట నిర్మాణం సాగి, బ్రహ్మానందరెడ్డి గారి కాలంలో పూర్తయింది. ప్రజల ఆనందోత్సవాల మధ్య సాగర్ కాలువలలోకి నీళ్లు విడుదల కార్యక్రమానికి ప్రధాని ఇందిరాగాంధి హాజరయ్యారు. అయితే, నిజానికి అప్పటికి కాలువల నిర్మాణం పూర్తి కాలేదు. ఏయేటి కాయేడు సాగర్‌కు కేటాయించే మొత్తాలు సిబ్బంది జీతభత్యాలకే అత్తెసరుగా సరిపోవడం, కాలువల నిర్మాణ కార్యక్రమం నిధులకొరత మూలంగా మందకొడిగా సాగుతుండటం జరిగేది. ఫలితంగా ఏయేటి కాయేడు నిర్మాణ వ్యయం ఇబ్బడి ముబ్బడిగా పెరుగుతూ వచ్చింది. అందువల్ల సాగర్‌లో నీళ్లు నిండుగా వున్నా వాడు కొనే సావకాశం రైతులకు లభించలేదు.

## సౌదీ ఋణం :

సంజీవ రెడ్డిగారు ముఖ్యమంత్రిగా వుండగానే, శ్రీశైలం జల విద్యుత్ కేంద్రానికి కూడా శంకుస్థాపన జరిగింది. అది విద్యుదుత్పాదనకు ఉద్దేశించబడింది. నాగార్జున సాగర్ ప్రధానంగా వ్యవసాయక ప్రయోజనాల కుద్దేశించినదయినా, అది బహుళార్థసాధక ప్రాజెక్టు కావటం వల్ల 20 లక్షల ఎకరాలకు జలాన్ని అందించటంతోపాటు 900 మెగా వాట్ల విద్యుత్తును కూడా ఉత్పత్తి చేయగలదు. ఈ ప్రాజెక్టులను పూర్తి చేయటానికి కేంద్రం అనుమతితో విదేశాల నుండి ఋణం సంపాదించాలని సంకల్పించాము. అందుకు కావలసిన ఎస్టి మేట్సన్నీ తయారు చేసి సిద్ధంగా వుంచటం జరిగింది. సౌదీ అరేబియా నుండి రు.200 కోట్ల ఋణ సహాయంకై ప్రయత్నాలు జరిగాయి.

సౌదీ అరేబియా గల్ఫ్ దేశాల్లో ముఖ్యమైనది. ఆ దేశం ఇస్లామిక్ రాజ్యం. భారత దేశం హిందూమత రాజ్యమనీ, వారు ముస్లింలను సరిగా చూడరనీ వారికొక తప్పుడు అభిప్రాయం వుండేది. అప్పుడు సౌదీ అరేబియాలో భారతరాయబారిగా జహీర్ అహమ్మద్ అనే రిటయిర్డ్ ఐఏయస్ అధికారి వున్నాడు. ఆయన నాకు చాలా కాలంగా తెలుసు. నేనంటే ఆయనకు ఎంతో అభిమానం. నేను ముఖ్యమంత్రి అయిన తరువాత ఒకసారి ఆయన నన్ను కలవటానికి వచ్చాడు. అప్పుడు నేనాయనతో చెప్పాను: 'మీరు ఆంధ్రప్రదేశ్ కేడర్‌కు చెందిన ఐ.ఏ.యస్. అధికారులు. మీరు సౌదీ అరేబియాలో రాయబారిగా వున్నకాలంలోనే నాగార్జున సాగర్, శ్రీశైలం ప్రాజెక్టులు పూర్తి చేయటానికి తగిన ఆర్థిక సహాయం సౌదీ అరేబియా నుండి దొరికేటట్లు మీరు తోడ్పడాలి', అని నేను ఆయనకు అప్పుడే చెప్పటం జరిగింది. ఆయనకు యీ ప్రాజెక్టుల గురించి, ఋణ ప్రతిపాదనల గురించి పూర్తి సమాచారాన్ని అంద చేశాము. ఆయన సౌదీకి తిరిగి వెళ్లేటప్పుడు మా యింటికి వచ్చారు. 'సౌదీ అరేబియాలో పెట్రోలియం శాఖమంత్రిగా వున్న జకీ అమీన్‌ను భారతదేశ పర్యటనకు తీసికొని వచ్చినప్పుడు హైదరాబాదును దర్శించే ఏర్పాటు చేస్తాను. మీరు ఆయనకు మంచి మర్యాదచేసి, మన రాష్ట్రంలో హిందూ- ముస్లిం భేదం లేదనే అభిప్రాయం ఆయన మనసులో కలుగ చేస్తే, మనకు ఆర్థిక సహాయం లభించటం సులువని' చెప్పారు. అదే విధంగా ఆపైన కొద్ది రోజులకే సౌదీ అరేబియా పెట్రోలియం శాఖ మంత్రి పర్యటన ఏర్పాటయింది. సౌదీ

అరేబియాకు ఆదాయం లభించేది ప్రధానంగా పెట్రోలు వల్లనే. అటువంటి పెట్రోలియం శాఖ నిర్వహిస్తున్న మంత్రి సౌదీ రాజుకు కుడి భుజంలాటి వాడు. ఆయన ఏం చెప్పినా రాజు కాదనడని జహీర్ అహ్మద్‌గారు నాకదివరకు చెప్పాడు. సౌదీ మంత్రి జకీ అమీన్‌గారు ముందు ఢిల్లీకి వచ్చి అక్కడ ప్రధాని తదితరులను కలసి ఆపైన హైదరాబాదుకు వచ్చారు. నేను, యితర మంత్రులు, అధికారులు విమానాశ్రయానికి వెళ్లి ఆయనకు, ఆయన బృందానికి ఘనంగా స్వాగతం చెప్పి వారిని రాజభవన్‌కు తీసికొని వచ్చాము. ఆ రోజు రాత్రి ఆయన గౌరవార్థం విందు ఏర్పాటు చేశాము. మరుసటి రోజు ఉస్మానియా విశ్వవిద్యాలయం వారు ఆయనకు గౌరవ డాక్టరేట్ పట్టం ప్రదానం చేసి గౌరవించారు. హైదరాబాదులో గల సుప్రసిద్ధమైన మక్కామసీదుకు వెళ్లి ఆయన ప్రార్థనలు జరిపారు. అక్కడ ముస్లిం ప్రముఖులంతా ఆయనతో 'మా ముఖ్యమంత్రి గారికి హిందూ అని, ముస్లిం అని భేదం లేదు. ఆయనకు అందరూ సమానమే. మాకు హిందువులతో సమానంగా అన్ని హక్కులూ యిక్కడ వున్నాయి. ఇక్కడ ఏవిధమైన మతకలహాలు లేవు. అంతా అన్నదమ్ముల మాదిరిగా కలసి మెలసి సంతోషంగా యీ రాష్ట్రంలో జీవిస్తున్నాం', అని చెప్పారు. ఆయన పర్యటన జయప్రదంగా ముగిసిన తర్వాత ఆయనకు వీడ్కోలు చెప్పటానికి నేను విమానాశ్రయానికి వెళ్లినప్పుడు, ఆయన నాతో మాట్లాడుతూ, 'ఇక్కడ ముస్లింలకు స్వేచ్ఛగా జీవించే హక్కు లేదని నేనిక్కడకు వచ్చేవరకూ నాకొక అభిప్రాయం వుండేది. కాని యిక్కడకు వచ్చి పరిస్థితులను స్వయంగా చూసిన తరువాత, మీరు హిందూ-ముస్లిం తేడా లేకుండా అందర్నీ సమానంగా చూస్తున్న విషయం చూసి ఎంతో సంతోషించాను. మేమింత వరకు భారతదేశంలో ఏ ప్రాజెక్టుకూ ఋణం మంజూరు చేయలేదు. కాని యిక్కడకు వచ్చి అంతా చూసిన తర్వాత ఈ రాష్ట్రానికి ఏదయినా సహాయం చేయాలన్న భావం కలిగింది. ఏం చేయమంటారో చెప్పండి!', అన్నారు. నేను 'శ్రీశైలం, నాగార్జునసాగర్ ప్రాజెక్టులకు ఋణసహాయం చేయండి', అని కోరాను. ఆయన ఎంతో సంతోషంగా అంగీకరించారు.

విదేశీ సహాయం తీసికోడానికి కేంద్రం అనుమతించాలి. కనుక నేను తర్వాత ఢిల్లీ వెళ్లి చర్చించాను. అంతకు రెండు మూడు నెలలకు ముందే సౌదీ అరేబియా నుండి శ్రీశైలం, నాగార్జునసాగర్ ప్రాజెక్టులను పూర్తిచేయుటానికి ప్రపంచ బ్యాంక్ ద్వారా ఋణ సహాయం కావాలన్న ప్రతిపాదనలను కేంద్రానికి

పంపించటం జరిగింది. అయితే కేంద్రం పంపించిన ప్రతిపాదనలలో శ్రీశైలం, నాగార్జున సాగర్‌ల ప్రస్తావనే లేదు.

అయినా సౌదీ అరేబియా పెట్రోలియం శాఖమంత్రి అమీన్‌గారి సహాయం వల్ల శ్రీశైలం, నాగార్జునసాగర్‌లకు సౌదీ అరేబియా ప్రభుత్వం ప్రపంచ బ్యాంకు ద్వారా ఋణం మంజూరు చేసేదానికి సౌదీ రాజు ఆమోదం లభించింది. ఆ సంగతి సౌదీ అరేబియా వారు ప్రపంచ బ్యాంకుకూ, భారత ప్రభుత్వానికీ తెలియపరచటం జరిగింది. అది చూసి యిక్కడి వారంతా ఆశ్చర్యపోయారు. 'మనం శ్రీశైలం, నాగార్జున సాగర్‌ల సంగతి ప్రస్తావన కూడా చేయలేదుగదా, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి ఆ ప్రాజెక్టులకు ఋణం ఎలా సాధించగలిగారు?' అని మల్లగొల్లాలు పడుతూ, నేనొకసారి ఢిల్లీ వెళ్లినప్పుడు అడిగారు : 'మీరిది ఎలా సాధించ గలిగారు;', అని. 'ఆంధ్రప్రదేశ్ భారత దేశంలోనే వుందికదా, మా కిస్తే దేశానికి యిచ్చినట్లేగదా?' అని జవాబు చెప్పాను. కాని అసలు సంగతి ప్రధాని ఇందిరాగాంధీకి తెలియచేయటం నా ధర్మం అని భావించి ఆమెను కలిసి అంతా చెప్పినప్పుడు ఆమె ఎంతో ఆనందించారు. 'మంచి పని చేశారని' నన్నభినందించారు.

నేను ముఖ్యమంత్రి అయిన తరువాత యింతకు ముందు వివరించినట్లు సౌదీ అరేబియా నుండి తెచ్చిన అప్పుతో ఆ ప్రాజెక్టులను పూర్తి చేయడం జరిగింది. దానితో లక్షలాది రైతు కుటుంబాలు చిర కాలంగా కంటున్న కలలు ఫలించి రాష్ట్రం సస్యశ్యామలం అయింది. విద్యుదుత్పాదన కూడా గణనీయంగా పెరిగింది.

## అవినీతికి స్వస్తి:

బ్రహ్మానందరెడ్డిగారు ముఖ్యమంత్రిగా వుండగా పెద్ద పెద్ద ప్రాజెక్టుల నిర్మాణంలో కంట్రాక్టర్లకు కాంట్రాక్టు మొత్తంలో కొంత అడ్వాన్స్‌గా చెల్లించే చెడ్డ సంప్రదాయం ప్రవేశ పెట్టబడింది. కంట్రాక్టరు పని మొదలు పెట్టకుండానే పెద్ద మొత్తాలు అడ్వాన్స్‌గా ప్రభుత్వం నుంచి తీసికోడం, అందులోంచి ముఖ్యమంత్రికీ, నీటిపారుదల శాఖమంత్రికి, ఇతర ఉద్యోగులకూ ముడుపులు ముట్టజెప్పటం ప్రారంభించారు. ఈ కాంట్రాక్టర్లంతా కేవలం రెండు మూడు కుటుంబాలకు చెందిన వ్యక్తులే కావడం గమనించవలసిన విషయం. ప్రతిపనికీ వారే ముందుకు వచ్చి టెండర్లు పెట్టడం, కంట్రాక్టులన్నీ ఏదో వొక పేరు మీద ఎలాగోలా వారే

హస్తగతం చేసికోవడం జరిగేది. ఇందుకు ప్రభుత్వంలో వివిధ స్థాయిలలో వున్న వారిని అవినీతి ముగ్గులోకి దింపి, బాగా వుపయోగించుకొని తమ పనులను నొక్కించుకొనే వాడుపు వారికి బాగా వుండేది.

నేను ముఖ్యమంత్రి అయిన తర్వాత మొదటి మంత్రి వర్గ సమావేశంలోనే బ్రహ్మానందరెడ్డి కాలంనుండీ అమలవుతున్న కాంట్రాక్టర్లకు అడ్వాన్స్ చెల్లించే విధానాన్ని రద్దు చేశాము. ఏ కంట్రాక్టరయినా ఎస్టిమేట్లకన్నా ఎక్కువ రేట్లు కావాలని అడిగితే, ఆ పని వారికి యివ్వకుండా కన్‌స్ట్రక్షన్ కార్పొరేషన్‌కు అప్పగించి చేయించాలని కూడా నిర్ణయించాము. ఈ నిర్ణయంతో అప్పటి వరకూ చెలామణీ అవుతున్న అవినీతి విధానాలకూ, చెడ్డ సంప్రదాయాలకూ మంగళం పాడటం జరిగింది.

## హక్సర్ సహాయం :

ప్రాజెక్టులన్నిటినీ నా హయాంలో పూర్తి చేసుకోగలగటానికి సౌదీ అరేబియా ప్రపంచబ్యాంకు ద్వారా యిచ్చిన ఋణసదుపాయం కారణం. ఈ విషయంలో జహీర్ అహమ్మద్ వలె పి.యన్.హక్సర్ కూడా నాకు చాలా తోడ్పడ్డారు. ఆయన జవహర్‌లాల్ నెహ్రూకు కార్యదర్శిగా వుండేవారు. తరువాత ఇందిరాగాంధీ క్కూడా కార్యదర్శిగానూ, ప్లానింగ్ కమీషన్ ఉపాధ్యక్షులుగానూ ఆయన పని చేశారు. ఆయన గొప్పమేధావి. సమర్థుడు. **1975-76** రాష్ట్రవార్షిక ప్రణాళికను ఖరారు చేసికొనేందుకు నేను ఢిల్లీ వెళ్లినప్పుడు మొదటిసారిగా ఆయనను కలవటం జరిగింది. ముఖ్యమంత్రులు తాము చెప్పిన మాటనిలబెట్టుకోరని ఆయనకు ఒక అభిప్రాయం వుండేది. నేను ఆయనను కలవటానికి వెళ్లే ముందే, ఆయన నావిషయం యితరుల ద్వారా తెలుసుకొని, అధికారులెవ్వరూ లేకుండా నాతో వొంటరిగా చర్చించారు. వార్షిక ప్రణాళికను నేను సూచించిన పద్ధతిలో ఖరారు చేసేందుకు అంగీకరించారు. 'గోదావరి బరాజ్, శ్రీశైలం, నాగార్జునసాగర్ ప్రాజెక్టులను పూర్తిచేయటానికి మీ సహాయం ఎంతో అవసరం' అని నేనంటే ఆయన తాను తప్పక సహకరిస్తానని చెప్పారు. ప్రపంచ బ్యాంకు సహాయాన్ని ఆయన సహకారంవల్లే అతి త్వరలో పొందగలిగాము.

ఆయన, నేను యిద్దరం చర్చించి ప్రణాళికను ఖరారు చేసిన తర్వాత అధికారులను అందర్నీ లోపలకు పిలిచాము. 'ప్రణాళిక ఖరారయింది.

సంతకాలు పెట్టి కాపీలు తీసుకోండి!', అని చెబుతే వారంతా ఎంతో ఆశ్చర్యపోయారు. 'ఏ ముఖ్యమంత్రి వచ్చినా కనీసం రెండు, మూడు రోజులన్నా చర్చించనిదే వార్షిక ప్రణాళిక ఖరారవటం జరగదు. మరి మేమంతా లోపలకు కూడా రాకుండానే మీ రిద్దరే కూర్చొని వెంగళరావు గారు చెప్పినట్లు ప్రణాళికను ఎలా ఖరారు చేయగలిగారని', వారంతా నవ్వుతూ అడిగారు. ఆయన వాళ్లతో ఒక్కటే మాట చెప్పారు : 'కొన్ని రాష్ట్రాలకు యిచ్చిన డబ్బు అక్కడ దుర్వినియోగం అయింది. వెంగళరావు గారలాటి ముఖ్యమంత్రికాదు. ఆయన మాట తప్పరు. చెప్పినదంతా తప్పక చేసి చూపేవ్యక్తి అని నాకు నమ్మకం కలిగింది. మిగతా వారివలె కాకుండా, ఆయనకిచ్చిన మొత్తం అంతా సద్వినియోగం అవుతుంది. తాను ఒప్పుకున్న మేరకు ఆయన అదనపు ఆర్థిక వనరులను సేకరించగలరు. పనులు పూర్తిచేసి రాష్ట్రప్రజలకు ఫలితాలనందించగలరన్న విశ్వాసం నాకుంది. అందుకే వారు చెప్పినదంతా ఒప్పుకొని ప్రణాళికను ఖరారు చేయటం జరిగింది'.

## సాగర్ ఎడమ కాలువ :

ప్రపంచ బ్యాంక్ సహాయం నాగార్జునసాగర్ కాలువలకు మొదటి విడతగా లభించింది రు.50కోట్లు. అంత డబ్బు ఒక్క ఛీఫ్ ఇంజనీర్ ఖర్చుపెట్టటం సాధ్యంకాదని ఒక ఛీఫ్ ఇంజనీరును కుడికాలువ పనికి నాగార్జునసాగర్ వద్ద హెడ్ క్వార్టర్సు పెట్టి నియమించాము. ఎడమ కాలువకు మరొక ఛీఫ్ ఇంజనీరును ఖమ్మం హెడ్ క్వార్టర్సు వుండేట్లు నియమించాము. ప్రాజెక్టుల పనికిగాని రోడ్లకుగాని టెండర్లపని ప్రభుత్వం దాకా వచ్చి జాప్యం జరిగే అవకాశం లేకుండా ఎక్కడికక్కడ ఛీఫ్ ఇంజనీర్‌తో కమిటీ ఏర్పరచి, టెండర్ల పనిని అక్కడికక్కడే ఖరారు చేసేందుకు, కాంట్రాక్టు మంజూరు చేసేందుకు అధికారాన్ని వికేంద్రీకరించటం జరిగింది. అందువల్ల పనులు చురుకుగా సాగటానికే గాక కాంట్రాక్టర్ల దోపిడీ సాగకుండా ఆపే అవకాశం చిక్కింది.

## సాగర్ కుడి కాలువ :

నాగార్జునసాగర్ కుడికాలువ గుంటూరు జిల్లాకు ప్రాణం. బ్రహ్మానందరెడ్డి ఆ జిల్లాకు చెందిన వాడే అయినా ఆ కాలువ పనిని అసంపూర్తిగా వదిలేయటం జరిగింది. ప్రపంచ బ్యాంకు యిచ్చిన నిధులను సద్వినియోగం చేసుకొని, కుడికాలువ నిర్మాణాన్ని కొనసాగించి గుంటూరు, ప్రకాశం జిల్లాలకు సాగర్ జలాల

నందించగలిగాము. చేజర్ల, వినుకొండ, అగ్ని గుండాల దగ్గర నేను ముఖ్యమంత్రిగా స్వయంగా నీరు విడుదల చేశాను. అప్పుడక్కడ హాజరయిన ప్రజానీకం ముఖంలో కన్పించిన ఆనందాన్ని చూస్తుంటే నా కెంతో సంతోషమనిపించింది. ఒంగోలు, దర్శి ప్రాంతాల వంటి అనావృష్టి ప్రాంతాలకు కూడా సాగర్ జలాలు అందటం, అవి సస్యశ్యామలం కావటం జరిగింది.

## కన్స్ట్రక్షన్ కార్పొరేషన్ :

కాంట్రాక్టర్లపై సక్రమమైన అదుపు వుండాలన్న వుద్దేశంతో సాధారణ పరిపాలనా శాఖ, లా అండ్ ఆర్డరు, హోం, భూ సంస్కరణలు, పట్టణ భూపరిమితి చట్టం, పౌరసరఫరాల వంటి ముఖ్యమైన శాఖలతోపాటు భారీనీటి పారుదల శాఖ కూడా ముఖ్యమంత్రి అధీనంలోనే వుండేది. లోగడ రాష్ట్రపతి పాలనాకాలంలో గవర్నరు గారికి సలహాదారుగా వున్న సరీన్ కన్స్ట్రక్షన్ కార్పొరేషన్ ఏర్పాటు చేశారు. ప్రధానంగా యిది కాంట్రాక్టర్లను అదుపు చేసేందుకు ప్రారంభించబడింది.

ఆ సంస్థను బాగా నిర్వహించగల సమర్థుడైన అధికారికోసం నేను ఆలోచిస్తున్న సమయంలో ఒకసారి నేను ఢిల్లీ వెళ్లినపుడు అక్కడ మాటూరి గోపాలరావుగారనే ప్రముఖ ఇంజనీరు నన్ను వచ్చి కలిశారు. నాగార్జునసాగర్ ప్రాజెక్టుల ఆరంభంలో సర్వేకార్యక్రమం దగ్గర నుంచీ, ఎస్టిమేట్లు తయారు చేయడం మొదలయిన కార్యక్రమాలన్నిటిలోను ఆయన సంబంధం వున్నవారు. ఆయనకు ఎంతో అనుభవం వున్నా ఇక్కడ ఆయనను ఛీఫ్ ఇంజనీరుగా చేయకపోవటం వలన తన పదవికి రాజీనామా చేసి ఆయన జమ్మూ కాశ్మీర్ రాష్ట్రానికి వెళ్లి అక్కడ ఒక పెద్ద హైడల్ ప్రాజెక్టుపై ఛీఫ్ ఇంజనీర్‌గా నియమితులై పనిచేస్తున్నారు. ఆయన నాకు చాలాకాలంగా తెలుసు. నేనాయనతో 'మీరు మన రాష్ట్రంలో నాగార్జున సాగర్ నిర్మాణంతో ఆది నుంచీ సంబంధం వున్నవారు. ఇప్పుడు మన రాష్ట్రంలో అనేక ముఖ్యమైన ప్రాజెక్టు పనులు నిర్వహించాల్సిన అవసరం వుంది. మీరు మన రాష్ట్రానికి తిరిగి వచ్చి, ఆ బాధ్యత తీసికోవాలి' అని కోరాను. ఆయన నా మాట మీద గౌరవంతో తన పదవికి రాజీనామా చేసి హైదరాబాదు వచ్చి నన్ను కలిశారు. నేను నా కార్యదర్శి కృష్ణస్వామి రావుసాహెబ్‌ను పిలచి 'మాటూరి గోపాలరావుగారిని కన్స్ట్రక్షన్ కార్పొరేషన్ ఛైర్మన్‌గా నియమిస్తూ ఉత్తరువులు జారీ కావాలి. ఫైలు పెట్టండి!' అని చెప్పాను. ఆయన

వెంటనే ఫైలు పెట్టి, ఆర్డర్లు తీసికొని గోపాలరావుగారికి జి.వో.ను అందచేయటం జరిగింది.

కన్‌స్ట్రక్షన్ కార్పొరేషన్‌ను బాగా సమర్థవంతంగా పనిచేయించటం వల్ల బ్రహ్మానందరెడ్డి కాలం నుండి కోట్లాది రూపాయలు సంపాదించుకోగల్గిన కొందరి ఆటకట్టింది. ఏ కంట్రాక్టరన్నా ఎస్టిమేట్స్ కన్నా ఎక్కువ రేటుకు టెండర్ పెట్టితే ఆ పనిని కంట్రాక్టర్స్‌కు యివ్వకుండా కన్‌స్ట్రక్షన్ కార్పొరేషన్‌కు యివ్వడం, దానిని వెంటనే గోపాలరావుగారు పూర్తి చేయిస్తుండటం జరుగుతుండేది. కొంత మంది కాంట్రాక్టర్లు లోగడ కాలువల పని కంట్రాక్టు తీసికొని, అడ్వాన్సులు పుచ్చుకొని తేలికయిన మేరకు పనిపూర్తి చేసి కష్టమైనదీ, ఖర్చెక్కువగా వుండేది అయిన పనిని బకాయిపెట్టేవారు. అలా మిగిలిపోయిన వాటిలో డీప్‌కట్స్ కూడా వున్నాయి. వాటికి యింకా అదనంగా డబ్బుకావాలని కంట్రాక్టర్లు పేచీపెట్టి పని ఆపి కూచునే వారు. అలాటి పనులను నేను వెంటనే కన్‌స్ట్రక్షన్ కార్పొరేషన్‌కు అప్పగించటంతో సత్యనారాయణ సింగ్ అనే ఛీఫ్ ఇంజనీర్‌ను పెట్టి వెంకటాయపాలెం డీప్‌కట్ నుండి నూజివీడు దాకా కాలువను పూర్తి చేయటం జరిగింది. అందువల్ల ఇటు ఖమ్మం జిల్లాలో కొన్నివందల గ్రామాలేగాక, అటు కృష్ణాజిల్లాలో కూడ నందిగామ, జగ్గయ్యపేట, కంచికచర్ల, మైలవరం, తిరువూరు, విస్సన్నపేట, నూజివీడు ప్రాంతాలకి సాగర్ జలాలు చేరుకున్నాయి. నాగార్జునసాగర్ నీళ్లు తమ పొలాలకు యింత తొందరగా వస్తాయని అక్కడ జనం ఎవ్వరూ కలలోకూడ అనుకోలేదు. అలాటిది ఈ రోజు వారందరి పొలాలకు జలాలందటం, సస్యశ్యామలం కావటం జరిగింది. ఒకనాడు కేవలం వర్షాధారంగా జొన్న వేసుకొనే రైతులు నేడు వరే గాక రకరకాల కాష్‌క్రాప్స్ పండించుకోగల్గుతున్నారు. ఖమ్మం జిల్లాలోని పాలేరు ప్రాజెక్టును బాలెన్సింగ్ రిజర్వాయర్‌గా చేయడంతో సంవత్సరం పొడుగునా నీరు నిండుగా వుండి పొలాలకు సమృద్ధిగా నీరందుతోంది. ఇప్పుడా ప్రాంతంలో రైతులు చెరకు పండించుకొని చక్కెర కర్మాగారాలను ఏర్పరచుకొని వృద్ధిలోకి వచ్చారు.

## శ్రీరాం సాగర్ :

పోచంపాడు ప్రాజెక్టుకు తెలంగాణా ప్రాంతీయ సంఘ నిధులను కొంత వరకు కేటాయించాము. ఈ లోగా ప్రపంచ బ్యాంక్ సహాయం అందటం వల్ల ప్రాజెక్ట్ నిర్మాణ కార్యక్రమం చాలవరకు పూర్తయింది. పోచంపాడు ప్రాజెక్టుకు ఎడమ

వైపు వొక రెగ్యులేటర్ నిర్మించాలని వుత్తరువులను జారీ చేసింది నేనే. ఆ రెగ్యులేటర్ నుండే సరస్వతి కాలువను తీయటం జరిగింది. ఆ కాలువ ద్వారా కడెం ప్రాజెక్ట్‌లోనికి నీరు వదిలి, ప్రాజెక్టు కింది ఆయకట్టును స్థిరపరచేందుకు వీలు చిక్కింది. అలాగే పోచంపాడు కుడి వైపునుండి లక్ష్మికాలువను త్రవ్వి నిజాంసాగర్ క్రింద కొనవాటు పొలాలకు నీటిని అందించేందుకు ఏర్పాటు జరిగింది. అంత వరకు యీ భూములకు నిజాంసాగర్ నీళ్లు సరిపడా అందక యెద్దడయి ఒక్కోసారి బీడు పడి పోతుండటం జరుగుతూ వుండేది. ఆ పరిస్థితి తప్పింది. పోచంపాడు నుండి యీ విధంగా యిటు వరంగల్ మంచినీటి సరఫరాకు, అటు ఆదిలాబాద్, నిజామాబాద్ జిల్లాలకు నీరందే ఏర్పాటు జరిగింది. ఈ విధంగా యీ ప్రాజెక్టు రు.305 కోట్లతో ఎస్టిమేట్స్ తయారు చేయించి మంజూరు యివ్వటంజరిగింది. ఇది జరిగి యిప్పటికి 20 సంవత్సరాలు దాటినా యింకా పనులు అన్నీ పూర్తి కాలేదు. ఆ సంగతి ఆ ప్రాంతాలవారు నన్నప్పుడప్పుడుకలిసి చెబుతుంటారు.

పోచంపాడు రెండవ దశ కాలువ పనిని సర్వే చేయించటానికి నల్లగొండ జిల్లా సూర్యాపేటలో సూపర్ఇన్‌టెండింగ్ ఇంజనీరు కార్యాలయాన్ని ఏర్పాటు చేయించి, సర్వే పని పూర్తిచేసి ఎస్టిమేట్సు తయారు చేయించటం జరిగింది. ఆ పనిని పూర్తిచేయటానికి ఇప్పుడు ప్రపంచ బ్యాంక్ ఋణం కూడా లభించిందని వింటున్నాము. ఈ కాలువ పూర్తయితే, కాకతీయ కాలువ ద్వారా సాగు అయ్యేభూమి కాక అదనంగా 3 లక్షల ఎకరాలకు నీరందుతుంది.

లోగడ బూర్గుల రామకృష్ణారావుగారు హైదరాబాదు రాష్ట్ర ముఖ్యమంత్రిగా వుండగా మూసీ ప్రాజెక్టును నిర్మించారు. కాని దాని కింద వున్న ఆయకట్టుకు పూర్తిగా నీరందక కొనవాటు నేలలు బీడుపడి పోతున్నాయి. అందుకని పోచంపాడు రెండవదశ పూర్తిచేసి కాలువను మూసీనదిలో విడచిపెడితే మూసీ ప్రాజెక్టు కింది ఆయకట్టు స్థిర పడుతుంది; యింకా అదనంగా భూమిని సాగులోకి తెచ్చేందుకు వీలవుతుంది. ఈ వుద్దేశంతోనే నేను పోచంపాడు రెండవదశను సర్వే చేయించి, ఎస్టిమేట్సుకు మంజూరు యివ్వటం జరిగింది. అయితే దురదృష్టవశాత్తు నా తరవాత వచ్చిన వారు యీ విషయంలో బొత్తిగా శ్రద్ధతీసికొనక పోవడంతో ఆ కార్యక్రమాలు ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్లాగిపోయాయి.

## సోమశిల :

నెల్లూరు జిల్లాలో పెన్నానది ప్రవహిస్తూ వుంది. సర్ ఆర్థర్ కాటన్ కాలంలో దానికి ఒక చిన్న ఆనకట్ట కట్టి నీటిని కనిగిరి రిజర్వాయర్‌లోకి మళ్లించే ఏర్పాటు చేశారు. కాని నెల్లూరు జిల్లా అవసరాలకు అది సరిపోదు. అందుకని సోమశిల వద్ద ఒక ప్రాజెక్టును నిర్మించాలని అక్కడి ప్రజలు ఉమ్మడి మదరాసు రాష్ట్రంలో వున్నప్పటి నుంచి ఆందోళన చేస్తున్నారు. అయినా వారి ఆశలు ఫలించలేదు. ఆ జిల్లా వారయిన బెజవాడ గోపాలరెడ్డిగారు ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రిగా వున్నారు. అయినా వారి కోరిక అలాగే వుండిపోయింది. నెల్లూరు జిల్లాకు చెందిన ఎ.సి.సుబ్బారెడ్డిగారు సంజీవరెడ్డి, బ్రహ్మానందరెడ్డి ప్రభుత్వాలలో నీటిపారుదల శాఖమంత్రిగా వున్నారు. ఆయన సోమశిల ప్రాజెక్టుకు ఎస్టిమేట్స్ తయారు చేయించి కేంద్రానికి పంపించగా అవి అక్కడే వుండి పోయాయి. ఇంతలో దురదృష్టవశాత్తు ఎ.సి.సుబ్బారెడ్డిగారు మరణించారు. నేను యింకా కొద్దికాలానికి ముఖ్యమంత్రి నవుతాననగా ఒక సంఘటన జరిగింది. అప్పుడు నెల్లూరు జిల్లా పరిషత్ అధ్యక్షులుగా వున్న గోపాలకృష్ణారెడ్డిగారు ఒక ప్రత్యేక రైలు ఏర్పాటు చేయించి నెల్లూరు జిల్లా రైతు ప్రముఖులనందర్ని ఢిల్లీకి తీసుకొని పోయి, ప్రధాని ఇందిరాగాంధి గారిని కలుసుకొని మెమోరాండం సమర్పించారు. అయితే ప్రధాని ప్రస్తుతానికి డబ్బులేదు అని జవాబిస్తే వారు నిరాశతో వెనుదిరగాల్సి వచ్చింది. నేను ముఖ్యమంత్రి నయిన తర్వాత ప్రణాళికా సంఘ ఆమోదాన్ని సంపాదించి ఆ ప్రాజెక్టుకు శంకుస్థాపన చేశాను. పని ప్రారంభం చేయించాను. అవసరమయిన నిధులు సమకూర్చి సోమశిల (మొదటి దశ)ను పూర్తిచేయించాను. కృష్ణా జలాలను మదరాసుకు తరలించే పథకంలో భాగంగా ఈ ప్రాజెక్టు రెండవదశను యిటీవల పూర్తి చేశారు. నా హయాంలో కుడి కాలువను ప్రారంభించి ఆత్మకూరు తాలూకా గ్రామాలకు నీరందించే ఏర్పాటు చేశాము. కావలి కాలువను కూడా పూర్తి చేశాము. అదే విధంగా సోమశిల నీటిని కనుపూరు కాలువకు మళ్లించి చాలా గ్రామాలకు ప్రయోజనం కలిగేలా చేశాము. నెల్లూరు జిల్లాలోనే గండిపాలెం ప్రాజెక్టును ప్రారంభించి దాదాపు 30 గ్రామాలదాకా నీరందించగలిగాము. నెల్లూరు జిల్లాకు ఏ ముఖ్యమంత్రీ చేయనంత అభివృద్ధి వెంగళరావుగారి హయాంలో జరిగిందని ఆ ప్రాంతంవారు ఎప్పుడు నన్ను కలిసినా చెబుతుంటారు.

## శ్రీశైలం :

శ్రీశైలం ప్రాజెక్టు నిర్మాణానికి ఎన్నుకొన్న స్థలంలో కృష్ణ ఎంతో లోతయిన లోయలో నుండి పారుతుండేది. అందుకే అక్కడ కృష్ణను పాతాళగంగ అనేవారు. అక్కడ ఆనకట్ట నిర్మించటానికి మన ఇంజనీర్లు ఎంతో శ్రమపడవలసివచ్చింది. వర్షాలు వచ్చినా వరదలు వచ్చినా పనిసాగేది కాదు. నీటిని ఎగువన మళ్లించే 'కాపర్‌డాం' నిర్మాణం కూడా జటిల సమస్య అయి కూచుంది. అయినా మన ఇంజనీర్లు ఎంతో ప్రతిభా వంతంగా, దక్షతగా వ్యవహరించి, ఒక్కొక్క సమస్యను పరిష్కరించు కొంటూ నిర్మాణాన్ని విజయవంతంగా కొనసాగించుకుంటూ వచ్చారు. వారికున్న సాంకేతిక సమస్యలకు తోడు ఆర్థిక సమస్య వొకటి. తగినంత డబ్బుకేటాయించకపోడంతో ప్రాజెక్టు నత్తనడక నడుస్తూ వచ్చింది. అటువంటి పాజెక్టునం కూడా సాదీ ఋణంతో పూర్తి చేసుకోగలిగాము. అంతకుముందున్న ప్రభుత్వాలు ఈ ప్రాజెక్టుల విషయంలో మరికొంత శ్రద్ధ చూపివుంటే, వాటి నిర్మాణ వ్యయం ఎంతో కలిసివచ్చేది. రైతులకూ రాష్ట్రానికీ యింకా తొందరగా ప్రయోజనం సమకూరేది.

## కేబుల్ వర్కు :

శ్రీశైలం ఆనకట్ట పనుల విషయంలో కూడ లోగడ కంట్రాక్టరులు వానొచ్చినా వరదొచ్చినా పని ఆపేయుటం జరిగేది. వేసవి కాలంలో తప్ప పని సాగేది కాదు. ప్రపంచబ్యాంకు నిధులు వచ్చాయి అనగానే కంట్రాక్టర్లు ఎక్కువ రేట్లకు టెండర్లు వేయసాగారు. అందుచేత ఆ పనులను కూడ కన్‌స్ట్రక్షన్ కార్పొరేషన్‌కే అప్పగించాము. కృష్ణలో నీరున్నప్పుడు పని ఆపేయకుండా ఏదన్నా మార్గం ఆలోచించకూడదా అని నేను గోపాలరావు గారిని అడిగాను. ఆయన కేబుల్ ద్వారా కాంక్రీటును బకెట్లలో తీసుకొని పోయివేస్తూ ఆనకట్ట ఎత్తును పెంచుకుంటూ పోవచ్చని ఒక మార్గం సూచించారు. అసెంబ్లీ సమావేశాలు జరుగుతుండగా వొకరోజు ఆయన ముఖ్యమంత్రి ఛాంబర్‌కు వచ్చి నన్ను కలిశారు. ఆ కేబుల్‌ను విదేశాల నుండి దిగుమతి చేసుకొనే అవసరంలేదనీ, మన దేశంలోనే ఆ నాణ్యం గలిగిన కేబుల్ దొరుకుతోందనీ చెప్పారు. అయితే ఆ కేబుల్‌కు దాదాపు రెండు కోట్లు అవుతుంది. నేను వెంటనే ఆ శాఖ కార్యదర్శిని పిలిచి మాట్లాడి వెంటనే రెండు కోట్లు మంజూరు చేస్తూ ప్రభుత్వ ఉత్తర్వులు యిప్పించాను. 'నెల రోజుల్లో మీరు పని పూర్తి చేస్తే, నేనే శ్రీశైలం వచ్చి కేబుల్

పనికి ప్రారంభోత్సవం చేస్తానని చెప్పాను. అంతే ! కేబుల్ తెప్పించటం, ప్రాజెక్ట్ స్థలంలో ఫిట్ చేయించటం, నాకు నివేదిక పంపటం చకచకా జరిగిపోయాయి. నేను వెంటనే శ్రీశైలం వెళ్లి కేబుల్ పనికి నెలలోగానే ప్రారంభోత్సవం చేయడం జరిగింది. విద్యుచ్ఛక్తి సంస్థ అధ్యక్షులు తాతారావు గారు, అప్పుడక్కడ ఆనకట్ట నిర్మాణం పనిని చూస్తున్న యం.యల్.స్వామిగారు ఆ ప్రారంభోత్సవంలో పాల్గొన్న వారిలో వున్నారు.

## ఎడమవైపు టనెల్ :

ఆ కేబుల్ వేసిన తర్వాత పని ఎలా జరుగుతున్నదో గమనించటానికి నేను వారందరితో కలిసి వెళుతున్నప్పుడు వారిని నేనో ప్రశ్న అడిగాను : 'మనం ఎంతో డబ్బు ఖర్చుచేసి యీ ఆనకట్ట నిర్మిస్తున్నాము. కుడి ప్రక్కన పవర్‌హౌస్ నిర్మిస్తూ అక్కడ ఒక్కొక్కటి 110 మెం.వా. ఉత్పత్తి శక్తిగల 7 యూనిట్లను నెలకొల్పబోతున్నాము. కుడి ప్రక్కన పవర్‌హౌస్ కని వదిలే నీటిని నాగార్జున సాగర్‌కు వదులుతున్నాము. బాగానే వుంది. కాని ఎడమ ప్రక్కన కూడా విద్యుదుత్పాదన చేసే అవకాశం వుంది కదా. అక్కడకూడా కుడివైపువలెనే టనల్ తొలిచి, పవర్‌హౌస్ ఏర్పాటు చేసికొని రివర్సిబుల్ సెట్స్ (విద్యుదుత్పాదన చేసి తరువాత ఆ నీటిని వెనక్కితోడి తిరిగి జలాశయంలోకి విడచేపంపులు) అమర్చి విద్యుదుత్పాదన ఎందుకు చేయకూడదు? దానికి వారు చెప్పిన అభ్యంతరం ఏమిటంటే, 'కుడివైపు పవర్‌హౌస్ మొదలయిన వాటికి ఎస్టిమేట్స్‌లో ప్రావిజన్ వుంది. కాని ఎడమవైపు సంగతి ఎస్టిమేట్స్‌లో లేదు. కనక ఆలోచించ లేదు.'

అప్పుడు నేను వారితో 'ఇప్పుడు టనల్ నిర్మించి వుంచితే డబ్బున్నప్పుడు విద్యుత్కేంద్రాన్ని నిర్మించుకోవచ్చు. ఇప్పుడు వూరు కుంటే భవిష్యత్తులో అవకాశాన్ని బట్టి ఏదన్నా చేసే వీలుండదు' అన్నాను. అప్పుడు ఛీఫ్ ఇంజనీర్ స్వామిగారు 'మీరు అనుమతిస్తే వెంటనే టనల్ నిర్మించి ప్రస్తుతానికి బ్లాక్ చేసి వుంచుతాము. డబ్బున్నప్పుడు ఉపయోగపడుతుంది', అన్నారు. నేను 'సరే' అని హైదరాబాదుకు రాగానే ఆ ప్రతిపాదన మంత్రి వర్గం ముందు పెట్టి ఆమోదింపచేసి శాంక్షన్ ఆర్డర్సు పంపించాను. నిజానికి ఆ రోజు ఆ టనల్ నిర్మాణానికి కేంద్ర ప్రభుత్వ క్లియరెన్స్ లేదు. కరెస్పాండెన్స్‌లో పెడితే అది యిప్పటిదాకా తేలేది కాదు. పైగా మొత్తం ప్రాజెక్టు పని నిలచిపోయేది. ఆనాడు అలా ధైర్యం చేసి పూర్తి చేసిన ఆ టనెల్ దగ్గరే ప్రస్తుతం రివర్సిబుల్ సెట్స్ అమర్చి విద్యుదుత్పాదన చేసేందుకు

పనిసాగుతూ వుంది. దానికి ఇప్పుడు జపాన్ ఆర్థిక సాయం లభించింది. ఆనాడు ముందు చూపుతో చేసిన పని ఈనాడు అక్కరకు వచ్చింది. దాదాపు 800 మెగావాట్ల విద్యుత్తు అదనంగా ఉత్పాదన అయ్యే అవకాశం కలిగింది. ఇది మొదట తయారు చేసిన వొరిజినల్ ఎస్టిమేట్స్‌లో లేకపోయినా, ఎస్టిమేట్ చేయించి, టనెల్ పూర్తిచేసి బ్లాక్‌చేయించి వుండకపోతే శాశ్వతంగా రాష్ట్రం నష్టపోయివుండేది.

## రాయలసీమకు కృష్ణా జలాలు :

ఇదిలా వుండగా నేను ముఖ్యమంత్రి అయిన నెలరోజుల్లోనే కృష్ణాజలాలపై ట్రిబ్యునల్ తీర్పు వెలువడింది. ఆ తీర్పు ప్రకారం మహారాష్ట్ర, కర్నాటకలు ఎంతెంత నీరు వాడుకోవచ్చో తేల్చటంతోపాటు, అదనపు జలాలను వాడుకోవటానికి క్రీ.శ.2000 వరకు మనకు హక్కు ఏర్పడింది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత నాకన్న ముందు వచ్చిన ముఖ్యమంత్రులు కృష్ణా జలాలు రాయలసీమకు యిస్తామని చెప్పలేక పోయారు. అందుకు కృష్ణానదీ జలాల వివాదం పరిష్కారం కాకపోవటమే కారణం. కృష్ణా నదీ జలాల ట్రిబ్యునల్ తీర్పువెల్లడి కాగానే రాయలసీమ నాయకులంతా కలసి నంద్యాలలో ఒక పెద్ద బహిరంగ సభ ఏర్పాటు చేశారు. దానికి వారు నన్నాహ్వానించారు. ఆ సభలో పాల్గొన్న వారిలో నివర్తి వెంకట సుబ్బయ్య, పెండేకంటి వెంకటసుబ్బయ్య, మద్దూరు సుబ్బారెడ్డి వంటి ప్రముఖు లెందరో వున్నారు. రాయలసీమ ప్రజలు ఎంత కాలంగానో కృష్ణా జలాలకై కనిపెట్టుకొని వున్నారనీ, కాని వారి ఆశలు ఫలించలేదనీ, ఇప్పుడు ట్రిబ్యునల్ తీర్పు కూడ వచ్చింది కనుక మీరు ముఖ్యమంత్రిగా ఈ విషయాన్ని ఇక్కడే యీ సభలోనే ప్రకటించాలనీ వారంతా నన్ను గట్టిగా కోరారు. 'ఇప్పుడు మీరీ ప్రకటన చేస్తే రాయలసీమ ప్రజలు మిమ్మల్నెప్పటికీ మరవరు' అని వారు చెప్పారు.

నేను ఆ సభలో మాట్లాడుతూ మద్రాసుకు మంచినీటి కోసం కృష్ణాజలాలను యివ్వాల్సి వుందనీ, ఆ కాలువ ద్వారానే రాయలసీమకు కృష్ణా జలాలను అందించే ఏర్పాటు చేస్తామనీ ప్రకటించాను. నా ప్రకటనకు అక్కడ చేరిన లక్షలాది జనం ఆనందంతో హర్షధ్వానాలు చేశారు. ట్రిబ్యునల్ తీర్పు అప్పటివరకూ రానందువల్ల అంతకుముందు ముఖ్యమంత్రులెవరూ ఈ ప్రకటన చేయవీలుకాలేదు. ఆ అవకాశం నాకు లభించటం నా అదృష్టం.

ప్రకటన చేయగానే సరి కాదు గదా! ఆ ప్రకటనను నెరవేర్చే బాధ్యత కూడా నాపైనే వుంది.

నంద్యాల సభలో రాయలసీమకు కృష్ణాజలాల సంగతి ప్రకటించిన తరువాత నంద్యాల సూపరింటెండింగ్ ఇంజనీరు కార్యాలయానికి అందుకు సంబంధించిన సర్వే జరిపి ఎస్టిమేట్స్ తయారు చేసేందుకు కావలసిన సిబ్బందినీ, బడ్జెట్నూ యివ్వటం జరిగింది.

## తుంగభద్ర హైలెవెల్ ఛానల్

వెనుకటి హైదరాబాదు సంస్థానం, ఉమ్మడి మదరాసు రాష్ట్రం కలిసి తుంగభద్రపై ఒక ఆనకట్టను నిర్మించారు. ఆనకట్ట నిర్మాణమైన చోటు రాయచూర్ జిల్లాలో వుంది. భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు తరువాత హైదరాబాదు సంస్థాన విభజన జరిగి కర్నాటక రాష్ట్రంలోకి ఆ ప్రాంతం చేరింది. ప్రస్తుతం ఆ ప్రాజెక్టు నిర్వహణకు ఒక బోర్డు వుంది. అందులో మన రాష్ట్రం నుండి ఒక సూపరెంటెండింగ్ ఇంజనీరు సభ్యులు. తుంగ భద్రనీటిని ఆంధ్ర, కర్నాటక రాష్ట్రాల మధ్య పంపిణీ చేయటం ఆ బోర్డు బాధ్యత. తుంగభద్ర కాలువల వల్ల అనంతపురం జిల్లాకు ఎక్కువగానూ, కడపజిల్లాకు కొంతా ప్రయోజనం కలుగుతుంది. తుంగభద్ర హైలెవెల్ కాలువ పనులు కొన్ని అసంపూర్తిగా వుంటే, నేను ముఖ్యమంత్రి అయిన తర్వాత కావలసిన నిధులు విడుదల చేసి వాటిని పూర్తి చేయించాను.

దేశంలో తొలిసారిగా నాగార్జునసాగర్ ప్రాజెక్టుకు ఆర్థిక సహాయం
అందజేసిన సౌదీ అరేబియా మంత్రికి హైదరాబాద్‌లో ఘనస్వాగతం

శ్రీశైలం పవర్ ప్రాజెక్టు నిర్మాణ పర్యవేక్షణ

# మధ్య తరహా ప్రాజెక్టులు

గోదావరి నదీ జలాల వివాదం పరిష్కారం కాగానే, గోదావరి పరీవాహక ప్రాంతాల్లోనూ రాష్ట్రంలో యితర చోట్లా అనేక మధ్యతరహా ప్రాజెక్టులను ధైర్యం చేసి మంజూరు చేశాము. ఆర్థిక శాఖ కార్యదర్శి డబ్బుకి యిబ్బంది వస్తుంది అని హెచ్చరించినా, ముఖ్యమైన కార్యక్రమం కనుక ప్రాజెక్టులకు డబ్బిచ్చి పని ప్రారంభించటం జరిగింది.

## సంజీవయ్య సాగర్ :

సంజీవయ్య గారు ముఖ్యమంత్రిగా వుండగా గాజుల దిమ్మె ప్రాజెక్టుకు శంకుస్థాపన చేశారు. తరువాత వచ్చిన ముఖ్యమంత్రులు దానినసలు పట్టించుకోలేదు. నేను ముఖ్యమంత్రి అయిన వెంటనే ఆ ప్రాజెక్టును పూర్తి చేసేందుకు కావలసిన నిధులను విడుదల చేయుటం జరిగింది. ఆ ప్రాజెక్టు పూర్తికాగానే దానికి సంజీవయ్య గారి జ్ఞాపకార్థం 'సంజీవయ్య సాగర్' అని పేరు పెట్టి నీటిని విడుదల చేశాము. దాని వల్ల పత్తికొండ ప్రాంతానికి చాలా మేలు కలుగుతోంది.

## సుబ్బరాయ సాగర్ :

నా మంత్రి వర్గంలో వున్న చల్లా సుబ్బారాయుడు గారితో 'రాయల సీమకు మనం ఏం చేస్తే ఎక్కువ ప్రయోజనం కలుగుతుంది?' అని అప్పుడప్పుడు సంప్రదిస్తూ వుండేవాడిని. ఆయన చాల అనుభవంగల మనిషి. నేనెప్పుడు అనంతపురం జిల్లాకు వెళ్లినా ఆయన నాతో వచ్చి అక్కడి సమస్యల గురించి వివరిస్తుండే వారు. తుంగభద్ర హైలెవెల్ కెనాల్ అసంపూర్తిగా వున్న సంగతిని వివరించి నిధులు కావాలని గట్టిగా కోరినది ఆయనే. తరువాత యన్.టి.రామారావుగారి ప్రభుత్వంలో ఇరిగేషన్ ఎడ్వయిజర్గా పనిచేసిన శివరామకృష్ణయ్య అప్పుడక్కడ సూపరెంటెండింగ్ ఇంజనీరుగా వుండేవాడు. ఆయనతోనూ, సుబ్బరాయుడి గారితోనూ చర్చించిన తరువాత రాయలసీమకు లాభం చేకూర్చే పనులెన్నో చేపట్టటం జరిగింది. ఈ సందర్భంలో సుబ్బారాయుడుగారు చక్కటి సలహాలిచ్చే వారు. తుంగభద్ర హైలెవెల్ కెనాలును

తెచ్చి తాడిపత్రి దగ్గర రెండు కొండలకుమధ్య కట్టపోసికలిపి, మధ్యలోతూముపెట్టి, ఆ రిజర్వాయర్‌కు 'సుబ్బరాయసాగర్'అని పేరు పెట్టటం జరిగింది. దాని వల్ల తాడిపత్రి ప్రాంతానికి ఎంతో లాభం కలిగింది.

## మైలవరం ప్రాజెక్టు :

మైలవరం దగ్గర కడపజిల్లాకు మేలు చేకూర్చేందుకు ఒక రిజర్వాయర్ నిర్మించాలని బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రిగా వుండగా పని మొదలు పెట్టటం జరిగింది. అయితే దానికి కావలసిన నిధులు సమకూర్చక పని అసంపూర్తిగా వుండి పోయింది. ఒకసారి నా అనంతపురం, కడపజిల్లాల పర్యటన సందర్భంగా నేను శివరామకృష్ణయ్య గారితో మైలవరం ప్రాజెక్టును పూర్తి చేయడానికి ఎంత కావాలని అడిగాను. ఆయన రు.5కోట్లు కావాలన్నాడు. 'ఇస్తాను కాని వచ్చే పంటకాలానికి నీరు విడుదల చేయాలి, సరేనా!' అన్నాను. ఆయన అంగీకరించాడు. హైదరాబాదు రాగానే ఆయన కోరిన మొత్తం రు.5కోట్లు విడుదల చేయటం జరిగింది. ఆయన కూడా శరవేగంతో పనులు చేయించి, అన్న ప్రకారం పంటకాలానికి నన్ను తీసుకొని వెళ్లి నీటిని ఆ ప్రాజెక్టు ఎడమ కాలువ నుండి విడుదల చేయించాడు.

## పెన్నహోబిలం :

సుబ్బారాయుడు గారు, యింకా అక్కడి శాసనసభ్యులు, శాసన మండలి సభ్యులు కోరగా పెన్నహోబిలం పైన కూడ ఒక ప్రాజెక్టును మంజూరు చేశాము. కాని అది యింకా పూర్తయినట్లు లేదు. తుంగభద్ర నీటిని వినియోగించుకొనే విషయంలో అప్పుడు ఏ రకమైన యిబ్బందులు కలగలేదు. కారణం అప్పటి కర్నాటక ముఖ్యమంత్రి దేవరాజ్ అర్సుగారూ, నేనూ సన్నిహిత మిత్రులం కావటం, సదవగాహనతో పనులు చేసుకొనిపోతుండటం. ఇప్పుడు నీరువాడుకొనే విషయంలో యిబ్బందులు కలుగుతున్నాయని అంటున్నారు.

## చెయ్యేరు, పెద్దేరు :

అలాగే కడపజిల్లా రాజంపేట నియోజకవర్గంలో చెయ్యేరు ప్రాజెక్టును మంజూరు చేశాము. కాని అది యింతవరకు పూర్తికాని కారణం తెలియదు. చిత్తూరు జిల్లాలో కూడ మదనపల్లి, తంబళ్ల పల్లి ప్రాంతాలకు లాభం చేకూర్చే

పెద్దేరు ప్రాజెక్టు (1వ దశ)నూ, (2వ దశనూ) పూర్తిచేసేందుకు నిధులు విడుదల చేశాము. దానివలన ముఖ్యంగా బంజారా జాతికి చెందిన అనేక కుటుంబాలు ప్రయోజనం పొందాయి.

## కృష్ణసాగర్ :

చిత్తూరు జిల్లాలోనే కార్వేటి నగరం దగ్గర కృష్ణసాగర్ ప్రాజెక్ట్‌కు శంకుస్థాపన చేశాము. దానికి అప్పుడక్కడ శాసన సభ్యులుగా వున్న పి.గోపాలరాజు పట్టుదల కారణం.

అలాగే బంగారు పాలెం దగ్గరలో రెండు మూడు నీటి పారుదల పథకాలను మొదలు పెట్టి ఎంతో కాలం గడిచినా, వాటిని పూర్తి చేసేందుకు ఎవరూ శ్రద్ధ తీసికోలేదు. వాటిని పూర్తి చేయించటం జరిగింది.

రాయలసీమ నుంచి అనేక మంది మంత్రులూ, ముఖ్యమంత్రులూ వచ్చారు. అయినా రాయలసీమ అభివృద్ధికి ఎంతో అవసరమైన కృష్ణాజలాలను తీసుకొని వచ్చే విషయంలోగాని, అక్కడ ఇతర నీటి పారుదల ప్రాజెక్టులను పూర్తి చేసి కడప, అనంతపురం, చిత్తూరు జిల్లాల్లో వ్యవసాయాన్ని అభివృద్ధి చేయడానికి కాని, నేను ముఖ్యమంత్రిగా వుండగా జరిగినంత కృషి అంతకుముందేనాడూ జరిగి వుండలేదు. నా ప్రభుత్వం రాయలసీమ అభివృద్ధికి చేసిన దోహదానికి ఇవన్నీ నిదర్శనాలే.

## నిజాంసాగర్ :

నేను ముఖ్యమంత్రయిన సమయంలో నిజాంసాగర్ ప్రాజెక్టు పూడిక వల్ల నీరెక్కువ నిలవ కాని స్థితిలో వుంది. వరసగ మూడేళ్లపాటు వరి, చెరకు పండక రైతులలో చాలమంది చాల కష్టనష్టాలకు గురయ్యారు. ప్రభుత్వాధీనంలో వున్న షుగర్‌ఫ్యాక్టరీ కూడ మూతపడినష్టాల పాలయింది. నేను ముఖ్యమంత్రినయిన తర్వాత ఇంజనీర్లను సంప్రదించటం జరిగింది. ఆ తర్వాత నా మంత్రి వర్గంలో నిజామాబాద్ జిల్లాకు చెందిన మంత్రి జి.రాజారాంగారినీ, యింజనీర్లనూ వెంటతీసికొని నిజాంసాగర్ ప్రాజెక్టు దగ్గరకు వెళ్లాను. ముందు పాత ప్రాజెక్టును అభివృద్ధిచేసి, దానికింద వున్న ఆయకట్టుకు నీరందేలా చేయడం, మూతపడిన చక్కెర ఫ్యాక్టరీని తిరిగి పనిచేసేలా చేయడం ఎలా అన్న సంగతి అక్కడ

చర్చించాము. అప్పుడు ఛీఫ్ ఇంజనీరు, ఆయనతో వున్నవారు ఆనకట్టను పెంచాలని, నూతనంగా రెగ్యులేటర్‌ను నిర్మించాలనీ, కాలువలకు సిమెంట్ లైనింగ్ చేస్తే నీరు యింకి పోయి వృధా కాకుండా వుంటుందని చెప్పారు. అందుకెంతవుతుందని నేనడిగాను. వారు రు.15 కోట్లదాకా కావచ్చని చెప్పారు. నేను అక్కడి కక్కడే, 'మంచిది! నేను రు.15 కోట్లు యిచ్చేందుకు వొప్పుకున్నాను. మీరు వెంటనే పని మొదలు చేసి, సకాలంలో పూర్తి చేయాలని చెప్పాను. హైదరాబాదుకు తిరిగిరాగానే వారు కోరినట్లు శాంక్షన్ ఆర్డర్ పంపాను. తరువాత 15 రోజులకు నేను వెళ్లి రెగ్యులేటర్‌కు శంకుస్థాపన చేసి వచ్చాను. ఇంజనీర్లు కూడ శ్రమించి పనిచేసి పంటకాలంకల్లా నీరందించడం అభినందించదగిన సంగతి. లోగడ యీ ప్రాజెక్టు కోసమే ఎకరాకు రు.500 డిపాజిట్లు వసూలు చేయాలని అప్పటి ముఖ్యమంత్రులు బ్రహ్మానందరెడ్డి, పి.వి. నరసింహారావుల సమయంలో అంటుండేవారు. అలా డిపాజిట్లు చేస్తేనే పని మొదలు పెడతామని చెప్పేవారు. నేనవన్నీ మౌనంగా వింటుండేవాణ్ణి. నేను ముఖ్యమంత్రినయిన తరువాత రైతులను ఒక రూపాయి అడక్కుండానే ఆ కార్యక్రమాన్ని చేపట్టి పూర్తి చేయటం జరిగింది.

## సాతనాల :

ఆదిలాబాద్ జిల్లాలోని సాతనాల ప్రాజెక్టు అప్పుడు మంజూ రయిందే. అది పూర్తి అయి, అక్కడ వెనుక బడ్డ ప్రాంతానిక చెందిన రైతుల పొలాలకు నీటిని అందిస్తోంది.

## బొగ్గులకుంట :

ఇక కరీంనగర్ జిల్లాలోని మంథైన నియోజక వర్గంలోని బొగ్గుల కుంట ప్రాజెక్టు. 'ఈ నియోజక వర్గం నుండి పి.వి.నరసింహారావుగారు నాలుగు సార్లు యం.యల్.ఏ.గా ఎన్నికయ్యారు. కాని మాకెం చేయ లేదు,' అన అక్కడ ప్రజలు నాతో చెప్పారు. నేను 'అప్పటి సంగతులు మరచిపోండి, నేను చేస్తాను గదా,' అని చెప్పాను. చెప్పిన మాట ప్రకారం బొగ్గుల కుంట ప్రాజెక్టుకు డబ్బిచ్చి పూర్తిచేయించటం జరిగింది. ఇప్పుడు దాని కింద పదివేల ఎకరాలకు పైగా సేద్యం జరుగుతోంది. అప్పుడు ప్రారంభించిన వరంగల్లు జిల్లాలోని వల్లూరు వాగు ప్రాజెక్టు కిందకూడా యిప్పుడు పదివేల ఎకరాలకు పైగా సాగవుతోంది. దాని వల్ల ఆటవికప్రాంతాలలో వున్న రైతాంగానికి ఎక్కువ ప్రయోజనం చేకూరింది.

## తాలిపేరు :

ఖమ్మం జిల్లాలో గోదావరికి ఉపనదియైన తాలిపేరు నదిమీద ప్రాజెక్టును ప్రారంభించటానికి గాను మధ్యప్రదేశ్ ప్రభుత్వం ఆటంక పరచకుండా వారి ఆమోదాన్ని పొంది, ఆ ప్రాజెక్టుకు శంకుస్థాపన చేసి డబ్బుయిచ్చి పని మొదలు పెట్టించటం జరిగింది. అదిప్పుడు పూర్తై, సుమారు 50,000 ఎకరాలకు రెండు పంటలకు నీరందిస్తోంది. ఎంతో వెనుకబడిన ఆ ప్రాంతంలో అనేక గ్రామాలలోని పేదరైతులకు పెన్నిధి అయింది.

## నూకమామిడి :

ఖమ్మం జిల్లాలోనే నూకమామిడి ప్రాజెక్టుకు కూడా నేను మంజూరు యిచ్చి, శంకుస్థాపన చేశాను. అది పాలవంచ తాలూకా (అప్పుడు మండలాలు లేవు. అన్నీ తాలూకాలే)లో వుంది. దాని కింద యీనాడు పదివేల ఎకరాలు సాగవుతున్నాయి. అందులో అంతా ఎక్కువగా లంబాడీ రైతులే. ఈ మధ్య ఎవరో చెప్పారు, అక్కడ ఎకరం లక్షదాకా పలుకుతోందని. అలాగే దామెరచర్ల వాగుపైన సీతయ్యగూడెం ప్రాజెక్టుకు నేనే శంకుస్తాపన చేశాను. అలాగే గుమ్మడపల్లి దగ్గర పెదవాగు ప్రాజెక్టుకు నేనే శంకుస్థాపన చేశాను. దాని కింద 15,000 ఎకరాలు సాగవుతోంది.

## తమ్మిలేరు :

ఉమ్మడి మదరాసు రాష్ట్రంలో వర్షాలకు గోదావరి డెల్టా పొలాలు మునిగిపోతుంటే ఏం చేయాలో సూచించటానికి మిత్రా కమిటీని వేశారు. అయితే ఆ కమిటీ నివేదికను పట్టించుకొన్నవారు లేరు. సంజీవయ్యగారు ముఖ్యమంత్రిగా వుండగా తమ్మిలేటి వరదను అదుపు చేయటంకోసం చింతల పూడి తాలూకాలో తమ్మిలేరు ప్రాజెక్టుకు శంకుస్థాపన చేశారు. అయితే, వారి తరువాత వచ్చిన వారి అశ్రద్ధవలన ఆ ప్రాజెక్టు పనులు అర్ధంతరంగా ఆగిపోయాయి. నేను ముఖ్యమంత్రికాగానే, అప్పడు ఛీఫ్ ఇంజనీర్‌గా వున్న ముర్రేని పిలచి, ఈ ప్రాజెక్టు పూర్తిచేసి, కాలువలు తవ్వి మెరక ప్రాంతం వారికి సాగునీరు యివ్వటంతో పాటు, ఈ ప్రవాహం కొల్లేరులో పడకుండా ఆపటానికి ఎంత ఖర్చవుతుందని అడిగాను. 1976-77లో కోటి రూపాయలు యిస్తే పూర్తి చేస్తామని ఆయన

అన్నారు. నేను ఇంజనీర్లతో కలిసి ఆ ప్రాజెక్టు స్థలాన్ని దర్శించి, వారికి కావలసిన డబ్బు శాంక్షన్ చేయటం జరిగింది. ఆ ప్రాజెక్టు పూర్తి కావటం వల్ల చింతలపూడి తాలూకాలో ఎందరికో మేలు కలిగింది. మురుగునీటి ముంపు సమస్య కొంతవరకు పరిష్కారమయింది.

## జల్లేరు :

జంగారెడ్డి గూడెం దగ్గర ఎర్రకాలువ మీద ప్రాజెక్టు, బుట్టాయి గూడెం దగ్గరవున్న జల్లేరు ప్రాజెక్టుకు నేనే శంకుస్థాపన చేశాను. అది కూడా మిత్రా కమిటీ సూచించినదే. అనుకున్నట్లుగా పనులు సాగివుంటే, గోదావరి డెల్టాలో మురుగునీటి సమస్యకొంతవరకు పరిష్కారం కావటంతోపాటు సుమారు 80వేల ఎకరాలను సాగుచేసే వీలుండేది. నా తరవాత వచ్చిన ప్రభుత్వాలు ఈ ప్రాజెక్టుపై శ్రద్ధ చూపక పోవడం వలన పనులు అన్నీ పూర్తికాలేదు. అయినా ఒకనాడు బీదరికం అనుభవించిన బుట్టాయిగూడెం, జంగారెడ్డి గూడెం ప్రాంతాలు యీ నాడు సస్యశ్యామలమయ్యాయి. మిత్రాకమిటీ సూచించిన ప్రాజెక్టును పూర్తిచేయటానికి నాకు నా పదవీ కాలంలో సమయం సరిపోలేదు. ఉదాహరణకు పులిగుండ ప్రాజెక్టునూ, కొవ్వాడ వాగును గోదావరికి మళ్లించే పథకాలనూ సర్వే చేయించాను కాని ప్రారంభించలేక పోయాను. అవి పూర్తవుతే, రాళ్ల మడుగు ప్రాజెక్టుకు కూడ నీరు మళ్లించి గోదావరి పశ్చిమ డెల్టాకు మురుగునీటి ముంపును తగ్గించటం సాధ్యమవుతుంది.

## మద్దుల వాగు :

మద్దులవాగు ప్రాజెక్టు తూర్పుగోదావరి జిల్లాలో రంప చోడవరం ప్రాంతంలో వుంది. అది పూర్తిగా కోయవారు నివసించే ప్రాంతం. ఆ ప్రాజెక్టుకు నేను నిధులను సమకూర్చటం, శాంక్షన్ యివ్వటం జరిగింది, నేనే శంకుస్థాపన చేశాను. ఈ రోజు అక్కడ పదివేల ఎకరం దాకా సాగవుతోంది. విశాఖపట్నం జిల్లాలో కూడ తాండవ, రైవాడ, కోన ప్రాజెక్టులను చేపట్టి పూర్తి చేయించటం జరిగింది. చోడవరం, నరసీపట్నం, మాడుగుల తాలూకాలలోని గ్రామాలనేకం దాని వల్ల లాభం పొందాయి.

## వంశధారకు జీవం :

అప్పుడు విజయనగరం జిల్లా లేదు. ఆ జిల్లాలోని ప్రాంతాలు కొంత భాగం విశాఖలో, కొంత శ్రీకాకుళం జిల్లాలో వుండేవి. 1969లో నేను హోంమంత్రిగా వున్నప్పుడు శ్రీకాకుళం జిల్లాలో అనేక ప్రాంతాలు పర్యటించాను. అప్పుడక్కడ నక్సలైటు ఉద్యమం తీవ్రంగా వుంది. ఆ ప్రాంతంలో నేను కొన్ని వూళ్లకు జీపుపైనా, కొన్నిటికి కాలినడకనా వెళ్లి, నక్సలైట్లచే హత్య చేయబడ్డ వారి కుటుంబాలను పరామర్శించటం జరిగింది. శ్రీకాకుళం జిల్లా నాకు కొత్తగాదు. ఆ జిల్లా సంగతి నాకు క్షుణ్ణంగా తెలుసు. అక్కడ దారిద్ర్యం ఎక్కువ. ఎంతో మంది బర్మాకు, మలేషియాకు ఉపాధికోసం వలస వెళ్లారు. కొందరు కృష్ణా, గోదావరి జిల్లాలకు వచ్చారు. ఆ జిల్లాలో అనేక జీవనదులు ప్రవహిస్తున్నా, నీటి పారుదల ప్రాజెక్టుల నిర్మాణానికి శ్రద్ధ తీసికోలేదు. ఆ ప్రాంతం వెనుకబడి వుండటం వల్లనే అక్కడ నక్సలైట్లు స్థావరం ఏర్పరచుకో గలిగారు. గ్రామాలను దోయటం, ఎదురు చెప్పిన వారిని హత్య చేయడం నిత్య కృత్యమై పోయింది. హోం మంత్రిగా నేను ఆ గ్రామాల్ని పర్యటించి నప్పుడు యీ సంగతులన్నీ ఆలోచించాను. నక్సలైటు సమస్య కేవలం లా అండ్ ఆర్డర్ సమస్యకాదు. ప్రజల ఆర్థిక పరిస్థితిని మెరుగు చేయాల్సి వుంది. అది వూరకే వుపన్యాసాలు చెబితే జరిగేదికాదు. అక్కడి నదులకు ఆనకట్టలు నిర్మించి, పొలాలకు నీటి పారుదల సౌకర్యాలు ఏర్పరచటం అవసరం. నేను ముఖ్యమంత్రిని అయిన తరువాత ఆ జిల్లాపై శ్రద్ధ వహించాను. అదిగాక, నేను అదే జిల్లాలో రాజాం దగ్గర సోంపేటలో పుట్టడం వలన ఆ జిల్లా కేదైనా మేలు చేయాలని నాకుండేది. అంతకు ముందా జిల్లాలో వంశధార ప్రాజెక్టు ప్రారంభం అయినా డబ్బులేక నత్తనడక నడుస్తున్నది. అందుకని యం.యల్.స్వామిని ఆ ప్రాజెక్టుకు సూపరింటెండింగ్ ఇంజనీర్‌గా వేసి ఆ ప్రాజెక్టును వేగంగా పూర్తి చేయించాను. నేను వెళ్లి ప్రాజెక్టు నీటిని విడుదల చేయడం జరిగింది. ఇప్పుడా ప్రాజెక్టు కింద దాదాపు రెండు లక్షల ఎకరాల దాకా సాగవు తున్నాయి. లోగడ ఎందుకూ పనికిరాని భూములు యివాళ బంగారం పండిస్తున్నాయి. హరిశ్చంద్ర పురం, కోటబొమ్మాళి, నరసన్నపేట, టెక్కలి మొదలయిన ప్రాంతాలకు ఎంతో ప్రయోజనం కలిగింది. శ్రీకాకుళం జిల్లాలోనే జంజావతి, వెంగళరాయసాగర్, మొద్దువలస ప్రాజెక్టులకు కూడా నేను శంకుస్థాపన చేశాను. పని ప్రారంభింపచేశాము. జంగావతి ప్రాజెక్టు సమయంలో ఒరిస్సావారు

అభ్యంతరం పెట్టారు. నా తరువాత వచ్చిన వారు శ్రద్ధ వహించక పోవడం వల్ల పని ఆగిపోయింది. వెంగళరాయసాగర్ పూర్తయింది కాని ధనాభావం వల్ల కాలువల తవ్వకం పూర్తికాలేదు. యన్.టి.రామారావుగారు ముఖ్యమంత్రిగా వుండగా, ఆయనను తీసుకొని వెళ్లి వుట్టిభూమి పైనే నీరు విడుదల చేయించారట! ప్రస్తుతం కాలువలు కొంతవరకు పూర్తి అయి దాదాపు పదివేల ఎకరాల దాకా సేద్యం జరుగుతోంది. ఆ తరువాత మరి కొంత ధనం మంజూరు కావటంతో, కాలువలను బొబ్బిలి రైల్వే లైన్ దాకా తెచ్చేందుకు ఎస్టిమేట్స్ శాంక్షన్ అయ్యాయి. ఇది పూర్తయితే అదనంగా మరో పదివేల ఎకరాలకు నీటిపారుదల సౌకర్యం ఏర్పడుతుంది. రాజాం దగ్గర మెుద్దువలస ప్రాజెక్టు మీద కొన్ని కోట్లు ఖర్చయ్యాయి. అయితే నా తరువాత వచ్చిన ప్రభుత్వాలు మంజూరు చేసిన మొత్తాలు జీతాలకే సరి అన్నట్లుండటంతో, సిబ్బంది పోషణకే వినియోగపడుతున్నాయి కాని పని సాగటల్లేదు. శ్రీకాకుళం జిల్లాలోనే పెద్ద అంకణం, చిన్న అంకణం ప్రాజెక్టులను కూడా మంజూరు చేసి పూర్తి చేయటంతో సుమారు పదిగ్రామాల రైతులు రెండు పంటలు పండించుకొని సుఖంగా జీవించే అవకాశం కలిగింది.

## ఖమ్మమే కాదు :

నా హయాంలో ప్రాజెక్టులను ఏ వొక్క జిల్లాలోనో కాక అన్ని జిల్లాలలోనూ చేపట్టటం జరిగింది. అయితే కొందరి అభిప్రాయం ఏమిటంటే, వెంగళరావుగారు ముఖ్యమంత్రిగా వున్నప్పుడు ఖమ్మం జిల్లా మీదనే ఎక్కువ శ్రద్ధ చూపించారని. అది అపోహమాత్రమే. అన్ని జిల్లాలకు నేను సమానంగా న్యాయం చేశాననీ యిప్పటికి కూడా నా మనసు నాకు చెబుతోంది.

## ప్రజాకర్షణ పథకాలు :

ప్రస్తుతం భారతదేశంలో నలభై శాతం జనాభా దారిద్ర్యరేఖకు దిగువన వుంది. దారిద్ర్య నిర్మూలన కార్యక్రమాలను ఎన్నిటినో కోట్ల రూపాయల వ్యయంతో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అమలు జరుపుతున్నాయి. రోజ్‌గార్‌యోజన వంటివి యిందులో చేరినవే. అధికారంలో వున్న వారు వోట్లను సంపాదించిపెట్టే ప్రజాకర్షణ పథకాలపై ఎన్నో వందల, వేల కోట్ల రూపాయలు ఖర్చు చేస్తున్నారు. కాని ఆ సొమ్ము నిరుద్యోగంతో, దరిద్రంతో బాధ పడేవారి

దాకా చేరటల్లేదు. మధ్యలో గుటకాయస్వాహాల వల్ల ఆశించిన ఫలితాలు కలగటల్లేదు.

తెలుగు దేశం పార్టీని పెట్టినప్పుడే యన్.టి.రామారావు గారు రెండు రూపాయలకు కిలో బియ్యం పథకం, ఉచిత మధ్యాహ్న భోజన పథకాలను ప్రకటించారు. ఆ పథకాలకు ఆయనను ఒక ప్రక్క విమర్శిస్తూనే అప్పటి కాంగ్రెస్ ముఖ్యమంత్రి విజయభాస్కరరెడ్డి రు.1-90లకే కిలో బియ్యం అమ్మే కార్యక్రమాన్ని ప్రారంభించారు. ఈ మధ్య ఒరిస్సాలో కాంగ్రెస్ ప్రభుత్వం కూడా సబ్సిడీ బియ్యం పథకాన్ని ప్రవేశపెట్టింది. యన్.టి.ఆర్.తో పోటీ పడ్డట్లు బి.జె.పి. - శివసేన ప్రభుత్వం మహారాష్ట్రలో రూపాయికి రోటీ-కూర పథకాన్ని ప్రకటించింది. పార్లమెంటు ఎన్నికలు దగ్గరకొస్తున్న కొద్దీ కాంగ్రెస్‌తో సహా అన్ని రాజకీయ పార్టీల వారూ యిలాటి చౌకబారు ప్రజాకర్షణ పథకాలపై దృష్టి సారిస్తున్నారు. ప్రధాని పి.వి.నరసింహారావు కూడ స్త్రీలకు చీరలనీ, నిరుద్యోగుల కోసం యింకా ఏవేవో కొత్త పథకాలు ప్రవేశపెడతామనీ చెబుతున్నారు. ఈ పథకాల వల్ల కొన్ని చోట్ల వోట్లు రావచ్చు. రాకపోవచ్చు కూడా. 1989లో తెలుగు దేశం పార్టీ కిలో రెండు రూపాయల బియ్యం పథకాన్ని అమలు చేస్తోనే వుంది కదా ! సబ్సిడీపై జనతా చీరలు, ధోవతులూ యిస్తూనే వుంది కదా! అయినా ప్రజలు యన్.టి.ఆర్. ప్రభుత్వాన్ని ఓడించారు! కనుక ప్రజలు రాజకీయ పరిజ్ఞానం లేని వారని, చౌకబారు పథకాల మోజులో పడి ఓట్లేస్తారనీ అనుకోడం పొరపాటు. ప్రభుత్వం పనిచేసే తీరును ప్రజలు గమనిస్తుంటారు. ఇందుకు నిదర్శనం అసెంబ్లీ ఎన్నికలలో కాంగ్రెస్ ప్రధాన ప్రతిపక్షంగా పనిచేసేందుకు కావలసిన సీట్లయినా సంపాదించుకోలేని దుస్థితిలో పడిపోవటమే. ప్రభుత్వంలోని వారు అవినీతి పరులా? నీతిగా నడచుకొనే వారా? ప్రజలకు సమర్థవంతమైన, నీతి వంతమైన పాలనను అందిస్తు న్నారా? ప్రజల అవసరాలను గమనిస్తున్నారా? యదార్థంగా అభివృద్ధి కార్యక్రమాలను అమలు చేస్తున్నారా? లేక వట్టి వాగ్దానాలతో కాలక్షేపం చేస్తున్నారా? దారిద్ర్య నిర్మూలనకు నడుంబిగించి పని చేస్తున్నారా? లేక కేవలం ప్రజాకర్షణ పథకాలతో సరిపుచ్చుతున్నారా? - ఇవన్నీ జనం ఆలోచిస్తారు.

## అసలయిన అభివృద్ధి :

నేను జిల్లా పరిషత్ ఛైర్మన్‌గా వున్నప్పటి నుంచి అనుభవంతో గ్రహించిన విషయం ఏమిటంటే గ్రామీణ ప్రజలకు నిజంగా మేలు కలిగించేది వొకటే : నీటి

పారుదల పథకాలను పూర్తిచేసి వారిపొలాలకు నీరు విడుదల చేస్తే, వాళ్లు కష్టపడి పొలాలను సాగుచేసి మట్టినుండి బంగారం పండించుకోగల్గుతారు. ఆర్థికంగా అభివృద్ధి చెందుతారు. దేశానికి అన్నం పెడతారు. అలా రైతులూ, కూలీలు మనం వూహించలేని రీతిలో దారిద్ర్యరేఖను దాటి పైకి వచ్చి హాయిగా పెళ్లాం పిల్లలతో సుఖంగా జీవించడం నేను కళ్లారా చూశాను. ఉదాహరణకు యిక్కడ వొక విషయం పేర్కొన దలచాను. నేను ముఖ్యమంత్రిగా వున్నప్పుడు ప్రపంచ బ్యాంక్‌నుండి అప్పు సంపాదించి నాగార్జునసాగర్ కుడి, ఎడమ కాలువలను పూర్తిచేయించి, నల్లగొండ, ఖమ్మం, కృష్ణా, గుంటూరు, ప్రకాశం జిల్లాలకు సాగర్ నీరందే ఏర్పాటు చేస్తే, యీనాడు అక్కడి గ్రామాల స్వరూపమే మారిపోయింది. అప్పుడు వర్షాలు లేక, పంటలు పండక అప్పులపాలై, దరిద్ర్యం అనుభవించిన కుటుంబాలు, యీనాడు సంపన్నంగా వున్నాయి. అక్కడ కూలీ నాలీ చేసుకొనే వాళ్లుకూడా రెండు పూట్లా కడుపునిండా అన్నం తిని సుఖంగా వుంటున్నారు. కాలువలు పూర్తి అయిన పదిసంవత్సరాలలోనే దారిద్ర్యం, నిరుద్యోగ సమస్య వాటంతట అవే కనపడకుండా పోయాయి. నేను పార్లమెంటుకు పోటీ చేసినప్పుడు గ్రామాలు తిరిగి ఓటర్లను కలవడానికి వెళ్లినప్పుడు నాకు కలిగిన అనుభవాలు మరవలేనివి. ఒకనాడొక లంబాడీ రైతు నా కారుకి అడ్డంగా నిలబడి ఆపుచేసి 'మీరు కారు దిగి నా యింటికి వచ్చి ఒక నిముషమైనా కూర్చొనిపోవాలి!' అని బలవంత పెట్టి తీసుకొని పోయాడు. అతనిది అదివరకు పూరి గుడిసె. ఇప్పుడదే స్థలంలో డాబా లేచింది. నన్ను ఒక కుర్చీ వేసి కూచోబెట్టి అతడు నాతో అన్నమాటలు ఎప్పటికీ నా చెవుల్లో గింగురు మంటుంటాయి. 'మీరు ఎంతో కష్టపడి ఈ ప్రాంతం ప్రజలకోసం సాగర్ కాలువలు తీసుకొనివచ్చారు. కనుకనే మేము యీ రోజు హాయిగా జీవిస్తున్నాము. అంతకుముందు జొన్నవేస్తే మా పొలం ఒక యేడు పండితే ఒక యేడు పోయేది. ఇప్పుడు సాగర్ నీళ్లొచ్చిన తరువాత నా పొలమంతా మాగాణి అయింది. ఈ సంవత్సరం నేను వేయి క్వింటాల్స్ ధాన్యం పండించాను. ఇదంతా మీరు చేసిన కార్యక్రమాల వల్ల జరిగిందే. ఇక మీరు వచ్చి మమ్మల్ని ఓటడిగే పనేముంది? ప్రతి వాడికీ మీరందించిన నీటితో పంటలు పండించు కొంటుంటే, ఆ నీటిలో మీరే కనబడుతున్నారు!' - అన్నాడు. అతను చదువుకున్నవాడు కాదు. అయినా తన జీవితంలో వచ్చిన మార్పులు, అందుకు కారణాలు చక్కగా అర్థంచేసుకో గలిగాడు. ఇలాటి సంఘటన యిదొక్కటే కాదు. వందలు, వేలు.

నేను జిల్లా పరిషత్ ఛైర్మన్‌గా వున్నరోజుల్లో పర్యటన చేసేటప్పుడు ఏ యేటిని చూసినా, ఏ నదిని చూసినా ఈ నీరంతా వృధాగా పోతున్నదే అని బాధకలిగేది. 'నేనెప్పటికైనా యీ రాష్ట్రానికి ముఖ్యమంత్రినైతే ఈ నీరంతా వృథాపోకుండా, ఆనకట్టలు కట్టి పొలాలకు మళ్లించే ఏర్పాటు చేయాలి. దేశాన్ని సస్యశ్యామలం చేసి దారిద్ర్యాన్ని పోగొట్టాలి', అని కలలు కంటుండేవాణ్ణి. 'విద్యుదుత్పాదన పుష్కలంగా వుండాలి. అందువల్ల పరిశ్రమలను స్థాపించుకోగల్గుతాం. ముఖ్యంగా వ్యవసాయాధారంగా వుండే పరిశ్రమలను పెంపొందించుకోవచ్చు. మంచి రహదారి సౌకర్యాలు ఏర్పాటు చేయాలి. విద్యా సంస్థలను స్థాపించి అందరికీ చదువు అబ్బేలాచేయాలి. ముఖ్యంగా వెనుకబడిన ప్రాంతాలలో, షెడ్యూలు కులాల, తెగలవారి కుటుంబాలకు కుటుంబంలో ఒక్కనికైనా ఉద్యోగం కల్పించినట్లయితే దారిద్ర్యం, నిరుద్యోగ సమస్య వాటంతటవే పరిష్కారం అవుతాయి. రాష్ట్రం బాగుపడుతుంది'- ఇది నాటికీ, నేటికీ నా ఆలోచనా ధోరణి. గంటల తరబడి ఊకదంపుడు ఉపన్యాసాలు చెప్పే దానివల్లా, వుత్తుత్త వాగ్దానాలు చేసేదాని వల్లా ఫలితం శూన్యం - అని నా విశ్వాసం.

నేను కలలు కన్నట్లుగానే, నా కల నిజమయి నేను **1973** డిసెంబరు **10**న రాష్ట్రానికి ముఖ్యమంత్రినైనాను. ముఖ్యమంత్రి బాధ్యతలు తీసుకొన్న తరువాత నేను రాజకీయ విషయాలలో సమయం పాడుచేసుకొనేవాడిని కాను. ఎన్నాళ్లు ముఖ్యమంత్రిగా వుంటాము, ఎప్పుడు దిగిపోతాము - అన్న ఆలోచనే వచ్చేది కాదు. ఆ భయం అసలే వుండేదికాదు. ఎంత కాలం వుంటే అంతకాలం ఈ రాష్ట్రాన్ని అన్ని రంగాలలోనూ ముందుకు తీసికొని పోవాలని ప్రయత్నం చేయాలి. దేశంలోనే ముందుండేలా బాగా అభివృద్ధి చేయాలన్న తపనతోనే నాకు తోచిన ప్రయత్నం శక్తివంచన లేకుండా చేశాను.

# కొల్లేరు ప్రాంత అభివృద్ధి

కొల్లేరు సరస్సు కృష్ణా - పశ్చిమ గోదావరి జిల్లాలకు రెంటికీ సంబంధించినది. పై నుండి వచ్చిన మురుగంతా ఆ సరస్సులోకి వచ్చి చేరుతుంది. అక్కడి నుండి ఉప్పుటేరు ద్వారా ఆ నీరంతా సముద్రానికి చేరుతుంటుంది. మిత్రాకమిటీ సూచనల ప్రకారం నేనింతకుముందు ప్రస్తావించిన ప్రాజెక్టుల నిర్మాణం వల్ల మురుగునీటి ముంపు సమస్య కొంత పరిష్కారమయింది. అయినా బాగా వర్షాలు పడినప్పుడు, అక్కడి గ్రామాలన్నీ జలమయం అవుతూనే వుంటాయి. ఒక్కొక్కసారి ఆరు నెలల దాకా జనం అలా యిబ్బంది పడాల్సి వస్తుంది. నేను ముఖ్యమంత్రి నయిన తరువాత కొల్లేరు ప్రాంతాన్ని పర్యటించాను. కొంత దూరం కారు మీద, ఆపైన లాంచిపైనా ప్రయాణం సాగించాము. నాతోపాటు ఉభయ జిల్లా పరిషత్తుల అధ్యక్షులు, జిల్లా కలక్టర్లు, శాసన సభ్యులు వున్నారు.

## చేపల చెరువులు :

ఆ ప్రాంతంలో వడ్డీలు అనే పల్లెవారు నివసిస్తుంటారు. వారి ముఖ్యవృత్తి చేపలు పట్టటం, బాతులను పెంచడం. వారు వరి వేస్తారు. అది వరదలో మునిగిపోతే, చిన్న చిన్న దోనెలలో వెళ్లి, పైకి తేలిన కంకులను తెంపుకొని తెచ్చుకొని ధాన్యం కైలు చేసుకుంటారు. వాళ్లు పట్టిన చేపలనూ, రొయ్యలనూ, పెంచే బాతులనూ, వాటి గుడ్లనూ మధ్యదళారీలు కొంటారు. ఎగుమతి చేసి విపరీతంగా డబ్బు సంపా దిస్తారు. అసలు పల్లె వారు మాత్రం ఎప్పటి వలె బీదతనంతో బాధపడు తుండేవారు. అక్కడంతా తిరిగి చూచిన తరువాత యీ ప్రాంతాన్ని అభివృద్ధి చేయడం ఎలా అని ఆలోచించాను. అప్పుడు నాతో కృష్ణా కలక్టర్ కె.ఆర్.వేణుగోపాల్ వున్నారు. ఆయనతో నేను హైదరాబాదు వెళ్లగానే ఫిషరీస్ కార్పొరేషన్ వారితో చెప్పి రు.4 లక్షలు పంపించమని చెబుతాను. గ్రామాలలో వుండే పల్లెవారిని సహకార సంఘాలను ఏర్పాటు చేసికోమనండి! 50 ఎకరాల భూమిలో రెండు చెరువులు తవ్వించే ఏర్పాటు చేయండి! కొల్లేరులో వరద ఎంత వచ్చినా మునగకుండా ఆ చెరువులకు ఎత్తుగా కట్టలు పోయించాలి. ఆ చెరువుల్లో చేప పిల్లలను వేసి పెంచే ఏర్పాటు చేయించాలి,' అని ఆదేశించాను.

ఆయన అలాగే చేశాడు. దానివల్ల మంచి ఆదాయంవచ్చి, సహకారసంఘ సభ్యులందరూ బాగుపడటం జరిగింది. ఈ ప్రయోగం జయప్రదం కావటంతో, కొల్లేరు ప్రాంతంలో ఇంకా యిలాటి చెరువుల ద్వారా అభివృద్ధి చేసే అవకాశం వుందని తేలింది. వెంటనే పశ్చిమగోదావరి, కృష్ణా జిల్లాల కలక్టర్లను హైదరాబాదుకు పిలిపించి సంబంధిత అధికారులతో సమావేశం ఏర్పాటు చేశాము. ఒక్కొక్క జిల్లాలో **40** చెరువులను తవ్వించాలని నిర్ణయం తీసికొన్నాము. ఆయా గ్రామాల వారిని సహకార సంఘాలుగా ఏర్పాటు చేసి వ్యవసాయాభివృద్ధి బ్యాంక్ నుండి సుమారు మూడు, నాలుగు కోట్ల రూపాయలను అప్పుగా మంజూరు చేయించాము. ఆ చెరువులన్నీ పూర్తయిన తర్వాత గట్లపై పెంచుకోడానికి కొబ్బరి మొక్కలను సప్లయి చేయించాము. వారు పెంచుకోవడానికి బాతులను కూడా యివ్వటం జరిగింది. ఇందుకయిన ఖర్చులో కొంత సబ్సిడీగా యిచ్చాము. ఒక్కొక్క కుటుంబానికి **24** ఆడబాతులు, ఒక మగబాతును మద్రాస్ మొదలయిన ప్రాంతాల నుండి తెప్పించి, పంపిణీ చేయించాము. ఇంత చేసినా మధ్య దళారులున్నంత కాలం వీళ్లు బాగుపడరని చెప్పి మధ్యదళారులను పూర్తిగా తొలగించే ప్రయత్నం చేశాము. అందుకని కొల్లేరు డెవలప్‌మెంట్ బోర్డ్ ఒకటి ఏర్పాటు చేశాము.

## విద్యుత్సరఫరా :

ఈ ప్రాంతంలో ఎక్కడా విద్యుత్సరఫరా సౌకర్యం లేదు. ఇటు వంటి మారుమూల గ్రామాల క్కూడా విద్యుచ్ఛక్తి సౌకర్యం కల్పించాలని కేంద్రం జాతీయ స్థాయిలో గ్రామీణ విద్యుద్దీకరణ సంస్థ (తాంఎఱఇదాౖశ్రీ జాశీషాౖశ్రీ ౹శ్రీఖఎషఠశ్లుఠౌ ఎఠఃఇద ్ఇఎలిఇషాఎఠఃఇద)ను నెలకొల్పింది. అప్పుడా సంస్థకు అధ్యక్షులుగా ఆంధ్రప్రదేశ్‌కు చెందిన రిటయిర్‌డ్ ఐఏయస్ అధికారి బొర్రా వెంకటప్పయ్యగారుండేవారు. నేను ఆయనతో మాట్లాడి కొల్లేరు ప్రాంత గ్రామాలకు విద్యుత్సౌకర్యం ఏర్పాటు చేసే విషయం చెప్పాను. అక్కడికి ఎలక్ట్రిక్ స్తంభాలను తీసుకొని వెళ్లడం ఒక సమస్య అయింది. లారీలు, బండ్లు ఆ వూళ్లకు వెళ్లే వీలులేదు. అయినా లాంచీల సహాయంతో ఎంతో ప్రయాసపడి ఆ కార్యక్రమాన్ని పూర్తి చేయించాము. ఆ ప్రాంతంలో విద్యా సౌకర్యాలు బొత్తిగా శూన్యం. అందుకని ఆ ప్రాంతంలోని పల్లెలలో ప్రాథమిక పాఠశాలలను నెలకొల్పాము. కొల్లేటి కోట వద్ద ఒక హైస్కూలును, హాస్టల్ సౌకర్యంతో ఏర్పాటు చేయడం జరిగింది.

అయితే దురదృష్టవశాత్తు నా తరువాత అధికారంలోకి వచ్చిన వారు యీ కార్యక్రమాలపట్ల శ్రద్ధ చూపకపోవటంతో పనులు అనుకున్న విధంగా జరగలేదు. చేపల చెరువుల వల్ల బాగా లాభం కలగటంతో కొందరు 'పెద్ద' వారు వచ్చి కొల్లేటి భూమి నాక్రమించి చెరువులు తవ్వించి లాభాలు గడించసాగారు. అంతే కాక పేద పల్లె వారికని మేము ఏర్పాటు చేసిన చెరువులను కూడా వాళ్ల నుంచి అధికారికంగా కౌలుకు తీసికొని నడపటం జరిగింది. ఈ రోజు ఆ ప్రాంతంలో యిలాటి చెరువులు వందల సంఖ్యలో కనుపిస్తాయి. రోజూ టన్నుల కొద్దీ చేపలు, రొయ్యలు మొదలయినవి అక్కడ నుంచి దూరప్రాంతాలకూ, విదేశాలకూ ఎగుమతి అవుతున్నాయి. దానివల్ల ఎందరో ధనవంతులైనారు. ఇటీవల కొందమంది పల్లెవారు కూడా తెలివి తెచ్చుకొని, మధ్యదళారులను వదిలించుకొని తమంత తామే చేపలను ఎగుమతి చేసుకుంటూ బాగా వృద్ధిలోకి వస్తున్నారు. తమ పిల్లలను చదివించుకుంటూ మంచి దశలోకి రాగలిగారు.

కొల్లేటి నీరు ఎక్కువ కాలం నిలవవుండకుండా ఎప్పటికప్పుడు సముద్రంలోకి పోవటానికి గాను డ్రెయిన్లను లోతు చేయడానికీ, వెడల్పుచేయడానికీ డ్రెడ్జర్లను తెప్పించి ఆ కార్యక్రమం కూడా ప్రారంభం చేశాము. తరువాత వచ్చిన ప్రభుత్వాలు ఉపన్యాసాలు చెప్పటం తప్ప యిలాటి కార్యక్రమాల పట్ల శ్రద్ధ తీసికోడం జరగటల్లేదు. కనుక స్థానికులకు యింకా ఎక్కువ లాభం జరిగే వీలు కలగ లేదు.

# పారిశ్రామిక ప్రగతి

నేను ముఖ్యమంత్రి కాక ముందు **1973-74** వార్షిక ప్రణాళిక రు.**100** కోట్లుకాగా, ఒక్క ఏడాదిలో ప్రణాళికా మొత్తాన్ని రెట్టింపు చేయకలిగాము. అంతేకాక, విద్యుత్తు, నీటిపారుదల రంగాలకు దాదాపు **60** శాతం కేటాయించి అభివృద్ధికి పటిష్ఠంగా తగిన పునాదులను వేయటం జరిగింది. ఒక్క సంవత్సర కాలంలోనే విజయవాడ థెర్మల్ స్టేషన్, పాల్వంచలో థెర్మల్ కేంద్రాన్నీ, లోయర్ సీలేరు విద్యుత్కేంద్రాన్ని పూర్తి చేసి రాష్ట్రంలో విద్యుత్తు కొరత లేదనిపించుకోగల్గాము. ఈ కార్యక్రమాన్నంతటినీ నిర్వహించేందుకు ఒక సమర్థుడైన వ్యక్తి ఎలక్ట్రిసిటీ బోర్డు ఛైర్మన్‌గా వుండాలన్న పట్టుదలతో నార్ల తాతారావుగారిని రాష్ట్రానికి ఆహ్వానించి ఆ స్థానంలో నియమించాము. ఆయన అంతకుముందు మధ్యప్రదేశ్ విద్యుత్ సంస్థ అధ్యక్షులుగా పనిచేసి, కేంద్రంలో వున్నారు. కె.సి.పంత్‌గారిని వొప్పించి, తాతారావుగారిని తీసికొనివచ్చి 'విద్యుదుత్పాదన రంగంలో రాష్ట్రం అగ్రశ్రేణిలో వుండాలి. అందుకోసమే యీ బాధ్యతను మీకప్పజెపుతున్నాము', అని చెప్పి వారికి అప్పగించాము. ఆయన కూడా రాత్రింబవళ్లు కష్టపడి పనిచేస్తూ వచ్చారు.

## విద్యుదుత్పాదన :

ఇందిరాగాంధీ గారు అత్యవసర పరిస్థితిని విధించిన తరువాత ప్రకటించిన **20** సూత్రాల కార్యక్రమంలో విద్యుదుత్పాదనను పెంచటం ఒక అంశం. జాతీయ స్థాయిలో నేషనల్ థెర్మల్‌పవర్ కార్పొరేషన్ ఆధ్వర్యంలో ఒక్కొక్కటి **2000** మె.వా. శక్తిగల నాలుగు థెర్మల్ కేంద్రాలను నిర్మించాలన్న ప్రతిపాదనవచ్చింది. ఆ నాలుగింటిలో ఆంధ్రలో రామగుండం పేరు రాస్తూ, పక్కన తమిళనాడులో నెవెల్లీ అని కలపటం జరగింది. ఎన్నో ఏళ్లుగా రాష్ట్రప్రభుత్వ యాజమాన్యంలో నడుస్తున్న సింగరేణి కాలరీస్ నుండి బొగ్గు పుష్కలంగా లభిస్తుంది. కనుక బొగ్గు గనులకు దగ్గరలో థెర్మల్ కేంద్రాలుంటే, ఎన్నో వందల మైళ్లు బొగ్గు చేరవేసే అదనపుభారం రైల్వేలపై పడకుండా వుంటుంది. ఈ సంగతిని నేను ఇందిరాగాంధి గారిని కలిసి వివరించాను. ఈ థెర్మల్ కేంద్రాలు నాలుగూ ఎక్కడెక్కడ పెట్టాలో

నిర్ణయించటానికి కేంద్రం నియమించిన నిపుణుల కమిటీకి రాష్ట్రప్రభుత్వం తరపున యీ విషయాలన్నీ రాతపూర్వకంగా యిస్తూ ప్రథమ స్థానం రామగుండానికిచ్చి రెండవస్థానం అన్ని వనరులూ వున్న ఖమ్మం జిల్లాలోని మణుగూరుకు యివ్వాలని కోరటం జరిగింది. నిపుణుల సంఘం కూడా బొగ్గు, నీరు దగ్గరలో లభించే విధంగా రామగుండం వద్ద థెర్మల్ కేంద్రాన్ని నిర్మించాలని సూచించారు. (ఇలా దగ్గరలోనే బొగ్గు, నీరు వుంటే వాటిని పిట్‌హెడ్ థెర్మల్ కేంద్రాలంటారు.) ఈ కేంద్రానికి గోదావరి నీరు పోలవరం ప్రాజెక్టు నుండి గొట్టాల ద్వారా సరఫరా చేస్తామని హామీ యివ్వటం జరిగింది. రామగుండం ఉత్పత్తి చేసే విద్యుత్తులో ఆంధ్రకు ఎక్కువ భాగం లభిస్తుంది. ఆంధ్రప్రదేశ్ కాక తమిళనాడు, కర్నాటక, పాండిచ్చేరి, కేరళ, గోవాలకు కూడా అందులో వాటా వుంటుంది. ఈ విధంగా ఎంతో విశ్వప్రయత్నం చేస్తే ఈ థెర్మల్ కేంద్రాలూ, ప్రాజెక్టులూ రూపు ధరించాయి.

శ్రీశైలం జలవిద్యుత్కేంద్రం, నాగార్జునసాగర్ జలవిద్యుత్కేంద్రం, కొత్తగూడెం థెర్మల్‌కేంద్రం, దిగువ సీలేరు విద్యుత్కేంద్రం, విజయవాడ థెర్మల్ కేంద్రాలను పూర్తిచేసికోగలిగాము. విద్యుత్కేంద్రాలన్నీ పూర్తి కావటంతో రాష్ట్రంలో విద్యుత్‌కొరత తీరిపోయింది. ఇతర రాష్ట్రాలకు కూడా పవర్ సప్లయి చేసే స్థితికి రాష్ట్రం ఎదిగింది. ఈ విజయాలకు విద్యుచ్ఛక్తి సంస్థ అధ్యక్షులుగా నేను తీసికొని వచ్చిన నార్ల తాతారావుగారు, ఆయన నాయకత్వంలో కృషి చేసిన విద్యుచ్ఛక్తి సంస్థ అధికారులూ, సిబ్బందీ ముఖ్యకారకులు.

## జంటనగరాలలో :

ఈ రోజు హైదరాబాదుపట్టణం దేశంలోనే ఒకముఖ్య పారిశ్రామిక కేంద్రంగా రూపొందింది. నేను పరిశ్రమల మంత్రిగా వున్నప్పుడు పారిశ్రామిక వేత్తలను మన రాష్ట్రానికి ఆకర్షించటం గురించి ఎంతో ప్రయత్నం చేశాను. ముఖ్యమంత్రినయిన తరువాత ఆ ప్రయత్నాలను ముమ్మరం చేయటం జరిగింది. పరిశ్రమలు పెట్టాలని ఉత్సాహంగా వచ్చేవారికి యిక్కడ నీటికీ, విద్యుత్తుకు కొదవలేదని నచ్చచెప్పగలిగాము. వారికి కావలసిన సౌకర్యాలను కలుగ చేసేందుకు తగిన యంత్రాంగాన్ని ఏర్పాటు చేశాము. ప్రభుత్వ భూమిని సేకరించి, అక్కడ రోడ్లు, డ్రైయినేజి, విద్యుచ్ఛక్తి మొదలయిన సౌకర్యాలను ఏర్పాటుచేసి పరిశ్రమలకు కావలసిన వ్యవస్థ (ఇన్ ఫ్రాస్ట్రక్చర్)ను అభివృద్ధి చేయ గలిగాము. అనేక ప్రభుత్వ

రంగ సంస్థలూ, రక్షణశాఖ పరిశ్రమలూ యీనాడు హైదరాబాదు వచ్చాయంటే, అందుకు ఆనాడే తగిన పునాదులు పడటం ముఖ్యకారణం.

## భద్రాచలం పేపర్ బోర్డ్స్ :

ఉదాహరణకు ఐ.టి.సి. వారు పేపర్ బోర్డ్స్ పరిశ్రమ పెడతామని వస్తే, నేను 24 గంటలలోనే వారికి కావలసిన శాంక్షన్ అందచేయటం జరిగింది. భద్రాచలం దగ్గర 500 ఎకరాల భూమిని సేకరించి యిచ్చాము. నీటి వసతి కల్పించాము. ఐ.టి.సి. వారు కూడా అన్న ప్రకారం అక్కడ ఆ పరిశ్రమను స్థాపించి, చక్కగానిర్వహిస్తూ మంచిపేరు తెచ్చుకోగలిగారు.

## రాయలసీమ పేపర్ మిల్స్ :

అలాగే కర్నూల్ జిల్లాలో రాయలసీమ పేపర్‌మిల్స్‌కు కూడా నా పాలనా కాలంలోనే శాంక్షన్ యివ్వటం జరిగింది. వారు కూడా కాగితపు పరిశ్రమను స్థాపించారు కాని, అది యాజమాన్యం సరిగా లేక మూత పడటం దురదృష్టం. దానిని తొందరలో తిరిగి ప్రారంభించి చక్కగా నిర్వహిస్తారని ఆశిద్దాం!

## సిమెంట్ :

దేశంలోని సున్నపురాయిలో దాదాపు 40 శాతం దాకా ఆంధ్ర, కర్నాటక రాష్ట్రాల్లోనే వుంది. కనుక యిక్కడ సిమెంట్ పరిశ్రమకు మంచి అవకాశాలున్నాయి. కేంద్ర ప్రభుత్వ సంస్థఅయిన సిమెంట్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా వారితో మాట్లాడి వారికి కావలసిన సౌకర్యాలనేర్పాటు చేయించాము. కడప జిల్లాలో ఎర్రగుంట్లలోనూ, ఆదిలాబాద్ జిల్లాలో ఆదిలాబాద్ వద్దా, రంగారెడ్డి జిల్లాలో తాండూరులోనూ సిమెంటు ఫ్యాక్టరీలను నెలకొల్పేలా ప్రోత్సహించాము. అంతకు ముందు ప్రయివేటు వారికి సిమెంట్ ఫ్యాక్టరీల నిర్మాణానికి లైసెన్స్ యివ్వరాదనే నిబంధన వుండేది. నేను దానిని రద్దుచేసి ప్రయివేటు రంగంలో ఔత్సాహికులకు ప్రోత్సాహం అందించాను. వారికి సున్నపురాయి త్రవ్వకానికి లీజ్ మంజూరు చేయడంతో పెద్ద సిమెంట్ ఫ్యాక్టరీలను నిర్మించే వీలు కలిగింది. దీనివలననే ఆదిలాబాద్ జిల్లా ఓరియంట్ సిమెంట్ అని బిర్లాస్ ఒక సిమెంట్ కర్మాగారాన్ని ఏర్పాటు చేశారు. అది మంచి అభివృద్ధిలోకి వచ్చింది. అదే విధంగా నల్లగొండ జిల్లా వాడపల్లి దగ్గరా, బీబీనగర్ – నడికూడి రైల్వేలైన్ దగ్గరా రాశి సిమెంట్స్ వారికి

కూడా లీజ్ మంజూరు చేశాము. ఈ రోజు వారి కర్మాగారాలు కూడ మంచి అభివృద్ధిలోకి వచ్చాయి. అలాగే రాయలసీమలో అనంతపురం, కడపజిల్లాలో కూడ సిమెంట్ ఫ్యాక్టరీల నిర్మాణానికి వున్న అవకాశాలను బాగా వినియోగించు కోగలిగాము. ఎర్రగుంట్లలోని సిమెంట్ ఫ్యాక్టరీకి నేను ముఖ్యమంత్రిగా వుండగా కేంద్రమంత్రి కోరమాండల్ ఫెర్టిలైజర్స్ వారొక ఫ్యాక్టరీని, బిర్లాకు చెందిన టెక్స్‌మాకో వారొక ఫ్యాక్టరీని నిర్మించారు. దురదృష్టవశాత్తు ఆ ప్రాంతాలలో నెలకొన్న బాంబుల సంస్కృతి, హత్యలు మొదలయిన వాటికి భయపడి, ఆ ప్రాంతాలలో పరిశ్రమల స్థాపనకు ఔత్సాహిక పారిశ్రామికులు సంకోచిస్తున్నారు. లేకపోతే యింకా ఎంతగానో ఆ ప్రాంతం అభివృద్ధి చెందేది. కొందరు రాజకీయ నాయకులు సిమెంట్ ఫ్యాక్టరీ అధికారులపై దౌర్జన్యం చేయడం, అక్కడ నుంచి సిమెంట్ రవాణా చేసే ట్రాన్స్‌పోర్ట్ కంపెనీల వారిపై దౌర్జన్యం చేయడం, వారిని బెదిరించి లక్షలలో మామూళ్లు వసూళ్లు చేయడం మొదలయిన పనులు మొదలు పెట్టారు. దాంతో అక్కడ వాతావరణం చెడి, ముందుకు వచ్చి పరిశ్రమలు స్థాపించేందుకు ఎవరికివారు జంకుతున్నారు. పరిశ్రమల విషయంలోనే కాదు, నీటి పారుదల ప్రాజెక్టుల విషయంలో – ముఖ్యంగా తెలుగు గంగ పనుల విషయంలో స్థానిక నాయకుల అనుమతి లేకుండా ఎవరూ టెండర్ వేసే వీలు లేదు. అసలు టెండర్ ఫారాలు తీసికొనేందుకే అవకాశం వుండదు. ఎవరైనా తెలియక వస్తే, దౌర్జన్యం జరిగేది. విజయభాస్కరరెడ్డి గారు ముఖ్యమంత్రిగా వుండగా స్థానికంగా టెండర్లు పెడితే దౌర్జన్యం జరుగుతుందని ఆలోచించి ఆ కార్యక్రమాన్ని హైదరాబాదులో ఛీఫ్ ఇంజనీర్ కార్యాలయంలో పెట్టారు. ఇక్కడకు కూడా ముఠానాయకులు తుపాకులతో వచ్చి కంట్రాక్టర్లను బెదిరించి, భయపెట్టి టెండర్ ఫారాలు లాక్కుపోయారు. అలా జరగటానికి ప్రభుత్వంలోని నాయకుల మద్దతు వుండటం ముఖ్యకారణం. అందువల్లే పోలీసులు ఏమీ చేయలేక వూరుకోవాల్సి వచ్చింది. రాయలసీమ అభివృద్ధి చెందలేదని వూరికే వుపన్యాసాలు యిచ్చే వారు అందుకు కారణం ఏమిటో గ్రహించాలి. పనులు చెయ్యటానికి వచ్చిన వారిని ఆ కార్యక్రమాలు చేయకుండా భయపెట్టి, నిరోధించటం వల్ల తలపెట్టిన అభివృద్ధి కార్యక్రమాలు అమలు కాకుండా ఆగిపోతున్నాయి. దౌర్జన్యం, రక్తపాతం, బాంబుల సంస్కృతి ఆ ప్రాంతంలో అభివృద్ధి కుంటు పడటానికి ముఖ్యకారణం అని రాయలసీమ నాయకులు యిప్పటికైనా తెలుసుకోవాలి. స్వయంకృతాప రాధానికి వారు ఎవర్నో నిందించి ప్రయోజనం లేదు.

## సింగరేణి :

ఆంధ్రప్రదేశ్‌లో ప్రధానమైన పరిశ్రమ సింగరేణి కాలరీస్. బొగ్గు వుత్పత్తిలో యిది దేశం మొత్తంపై రెండోస్థానంలో వుంది. సుమారు లక్షా ఏభైవేల మందికి యిది ఉద్యోగ అవకాశాలు కల్గిస్తోంది. ఇటువంటి సంస్థలో రాష్ట్రప్రభుత్వానికి 51 శాతం వాటాలున్నాయి. కేంద్రానికి 49 శాతం. దీనికి ఛైర్‌మన్‌నూ, మేనేజింగ్ డైరెక్టర్‌నూ రాష్ట్ర ప్రభుత్వమే నియమిస్తుంది. నేను పరిశ్రమల మంత్రిగా వుండగా ఒకసారి భద్రాచలం దగ్గర వున్న మణుగూరు వెళ్లాను. అప్పుడది వేయి జనాభావున్న చిన్న పల్లెటూరు. అక్కడ నాతో సింగరేణికాలరీస్ వారు కొత్త బొగ్గుగని త్రవ్వకానికి ప్రారంభం చేయించారు. నాకు ముందున్న ముఖ్యమంత్రి బొగ్గు గనుల యాజమాన్యాన్ని కేంద్రానికి అప్పచెప్పాలని ఆలోచించారు. అలా అని కేంద్రానికి రాసి పంపారు కూడా. నేను ముఖ్యమంత్రిని కాగానే, ఈ సంస్థను కేంద్రానికి అప్పగించాలని కేంద్రం మమ్మల్ని కోరింది. అప్పుడు ఇది చాల ముఖ్యమైన సంస్థ. దీనిని ఎంతో అభివృద్ధి చేయవాల్సిన అవసరముంది. ఎంతో మందికి ఉద్యోగావకాశాలు కల్పించేందుకు వీలుంది. కనుక దీని యాజమాన్యం రాష్ట్రం చేతిలోనే వుండాలి', అన్న నిర్ణయం మేము తీసికొన్నాము. ఈ సంస్థకు సమర్థుడైన అధికారిని నియమించి బాగా అభివృద్ధి చేయాలని ఆలోచించి బి.యన్.రామన్ అనే సీనియర్ ఐ.ఏ.యస్ అధికారిని ఛైర్‌మన్ అండ్ యం.డి.గా నియమించాను. ఆయనకు ఒక్కటే చెప్పాను : 'ఈ సంస్థను బాగా అభివృద్ధి చేయండి! బొగ్గు వుత్పత్తిని బాగా పెంచండి! మీ పనిలో మీకు పూర్తి స్వేచ్ఛయిస్తున్నాను.' ఆనాడు నేను పరిశ్రమల మంత్రిగా వుండి ప్రారంభంచేసిన మణుగూరు గని ప్రాంతం యీ రోజు **80,000** జనాభా గల పట్టణంగా అభివృద్ధి చెందింది. బి.యన్.రామన్‌గారు యం.డి.గా వున్నప్పుడు అనేక కొత్త గనులను తవ్వే ఏర్పాటు జరిగింది. కాలరీస్‌ను బాగా అభివృద్ధి చేశారు. కార్మికుల సంక్షేమం కోసం ఎన్నో చర్యలు చేపట్టారు. కొత్తగూడెంలోని ఆసుపత్రిని బాగా అభివృద్ధి చేశారు. ఒక మహిళా కళాశాలను స్థాపించారు. ఇల్లందులో కూడ ఆసుపత్రిని అభివృద్ధి చేశారు. విద్యా సంస్థలను అభివృద్ధి చేశారు.

## హెవీ వాటర్ ప్లాంటు :

ఒకసారి అణుశక్తి సంస్థ అధ్యక్షులుగా వున్న సెత్నాగారు, విద్యుచ్ఛక్తి బోర్డు అధ్యక్షులు తాతారావుగారు వచ్చి నన్ను కలిశారు. అప్పుడు నేను సేత్నాగారితో

'అణుశక్తి సంస్థ మణుగూరులో హెవీవాటర్ ప్లాంట్‌ను స్థాపించాలన్నీ, అందుకు కావలసిన సౌకర్యాలు మేం సమకూరుస్తామని చెప్పాను. అందుకాయన వెంటనే అంగీకారం తెలియచేశారు. తరువాత మణుగూరులో హెవీ వాటర్ ప్లాంటును మంజూరు చేశారు.

అలాగే నేషనల్ థెర్మల్ పవర్ కార్పొరేషన్ వారు రామగుండంలో ఒక సూపర్ థెర్మల్ స్టేషన్‌ను నా పట్టుదలతోనే ఏర్పాటు చేశారు. అక్కడ బొగ్గుతో నడిచే ఎరువుల కర్మాగారం కూడా ఏర్పాటయింది.

రామగుండం ఓపెన్ కాస్ట్ కోల్‌మైన్‌ను నేనే ప్రారంభించాను. అక్కడ కోటి రూపాయల ఖర్చుతో నిర్మించిన ఆసుపత్రిని నేనే ప్రారంభించాను. గోదావరిపై వంతెన లేక బెల్లంపల్లినుండి రామగుండం రావాలంటే వంద మైళ్లు చుట్టూ తిరిగి రావాల్సి వచ్చేది. అందుకని అక్కడ రోడ్ బ్రిడ్జి నిర్మాణానికి నేను నిధులు కేటాయించి శంకుస్థాపన చేసి పని ప్రారంభం చేయించాను. కాని నా తరువాత వచ్చిన వారికి శ్రద్ధ లేక నిధులను వేరే మళ్లించటం వల్ల పని ఆగిపోయింది. అది పూర్తి కావటానికి దాదాపు 18 ఏళ్లు పట్టింది. ప్రధానిని తీసుకొని వచ్చి దానిని ప్రారంభం చేయించాలని ఎన్నికల ముందు విజయభాస్కరరెడ్డి ఆలోచించారు గాని కుదరలేదు. చివరకు ప్రజలే వంతెనను ప్రారంభించుకొని వుపయోగించుకుంటూ వున్నారు.

## ఆర్థిక స్థితి :

దురదృష్టవశాత్తు నాకు ముందున్న బ్రహ్మానందరెడ్డి, పి.వి.నరసింహా రావు ప్రభుత్వాలుగాని, నా తరువాత వచ్చిన ప్రభుత్వాలు గానీ, సరిగా శ్రద్ధ తీసికొని వ్యవహరించక పోవడం వల్ల రాష్ట్ర ఆర్థిక పరిస్థితి బాగా దెబ్బతినటం జరిగింది. దేశంలో యితర రాష్ట్రాలకన్నా ఎంతో ముందుండాల్సిన మన రాష్ట్రం ఈనాడు ఎంతో వెనకబడి పోయింది. ఒకటి రెండు విషయాలను పరికిస్తే యీ విషయం అర్థమౌతుంది. ఉదాహరణకు, నరసింహారావు, బ్రహ్మానందరెడ్డి ప్రభుత్వాల కాలంలో నాల్గవ ప్రణాళిక వ్యయం మొత్తం అయిదేళ్లకీ కలిపి రు.450 కోట్లు అయితే నేను ముఖ్యమంత్రిగా వుండగా, అయిదవ ప్రణాళిక ఆఖరు సంవత్సరంలో 1977-78 వార్షిక ప్రణాళిక ఒక్క ఏడాదికే రు.480కోట్లు వుండేట్లు ప్రణాళికా సంఘ ఆమోదాన్ని సాధించ గలిగాము.

నేను ముఖ్యమంత్రి పదవి తీసుకొన్న రోజు రాష్ట్రం రు.10కోట్ల ఓవర్

డ్రాఫ్ట్‌లో వుంది. నేను దిగిపోయే రోజున రిజర్వ్ బ్యాంకుకు ఒక్క రూపాయి ఓవర్ డ్రాఫ్ట్ లేకపోగా, నా పరిపాలనలో ఎప్పుడూ ఓవర్ డ్రాఫ్ట్‌లు తీసికోలేదు. కాగా రు.150కోట్లు నిలవతో నా తరవాత వచ్చిన ముఖ్యమంత్రికి పరిపాలనను అప్పగించటం జరిగింది. కాని, దురదృష్ట వశాత్తు నా తరువాత వచ్చిన వారు రాష్ట్రాన్ని దివాళా తీయించే మార్గంలో నడిచారని చెప్పటానికి విచారిస్తున్నాను.

# ముఖ్యమంత్రి బాధ్యత

ముఖ్యమంత్రి పదవి దర్జాగా అనుభవించటానికీ, అధికారం చలాయించటానికీ ఏర్పడ్డది కాదు. సంఘంలో శాంతి సౌభాగ్యాలను పెంచి, ప్రజలు సుఖశాంతులతో తమ జీవనం గడిపేలా దోహదం చేయటం ముఖ్యమంత్రి బాధ్యత. రాష్ట్రం అన్ని రంగాల్లో యితర రాష్ట్రాల కన్న ఒక అడుగు ముందుండేలాచూచుకోవాలి ప్రజలతో సన్నిహిత సంబంధాలను పెంచుకొని వారి యిబ్బందులనూ, అవసరాలనూ గమనించాలి. ప్రజా ప్రతినిధులతో సత్సంబంధాలు పెట్టుకొని వారిద్వారా ఆయా ప్రాంతాల ప్రజల సమస్యలను సకాలంలో పరిష్కరించేందుకు చొరవ చూపాలి. నిర్ణయం తీసికోటంలో వివేచనముఖ్యం. జాప్యంపనికిరాదు. ఊగిసలాటా, తటపటాయింపు వల్ల వుపయోగం వుండదు. పైపెచ్చు పని చెడుతుంది. ముఖ్యమంత్రి తన మంత్రి వర్గ సభ్యుల విషయంలో గాని, అధికారుల విషయంలోగాని ఏ వొక్కనిపైనో ఆధారపడి వుంటే కుదరదు. తన మంత్రి వర్గ సభ్యుల నందరినీ కలుపుకొని పోతూ, అందరూ తమ తమ శాఖల నిర్వహణపై తగినంత శ్రద్ధ చూపించేలా వారికి ప్రోద్బలం చేకూర్చాలి. అలా అంతా కలిసి ఒక 'టీం'లా బాగా పనిచేసినప్పుడే ఆ ప్రభుత్వం మంచి పేరు తెచ్చుకోగల్గుతుంది. మంత్రులలో వొకరిద్దరు ఎలా వున్నా, మొత్తం మీద ఎక్కువ భాగం చాలా కాలం రాజకీయాల్లో పనిచేస్తూ, అనుభవంగల వ్యక్తులే వుంటారు. కనుక వారందరి సహకారాన్ని పొందటం అవసరం.

నాకదివరకు పంచాయతీ ఛాంబర్ అధ్యక్షుడిగా, హోం మంత్రిగా, పరిశ్రమల మంత్రిగా పని చేసిన సమయంలో ప్రజలతోనూ, అధికారుల తోనూ, ఆయా ప్రాంతాల నాయకులతోనూ సత్సంబంధాలు ఏర్పరచు కొని, చక్కని అవగాహన పెంపొందించుకొనే అవకాశం కలిగింది. ఆ అనుభవమూ, పరిచయాలూ, సంబంధాలూ నాకు ముఖ్యమంత్రిగా ఎంతో ఉపకరించాయి.

## పటిష్ఠమైన పాలన :

ప్రభుత్వం పటిష్ఠమైన పాలన నందించాలంటే, మొట్టమొదట ముఖ్యమంత్రి సమర్థుడై, ఆదర్శ ప్రాయంగా వుండాలి. అప్పుడు యథారాజా తథా

ప్రజా అని అధికారులు, ప్రజలు కూడ ముఖ్యమంత్రిని అనుసరిస్తారు.

పరిపాలనా యంత్రాంగంలో కీలకమైన వ్యక్తి ప్రధాన కార్యదర్శి. ఆయన ముఖ్యమంత్రికి తగిన సలహాలను యిస్తాడు. అదే విధంగా పోలీస్ శాఖకు సంబంధించి డైరక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్ ముఖ్యుడు. ముఖ్యమంత్రి లా అండ్ ఆర్డర్‌కు సంబంధించిన విషయాలలో ఆయనతో సంప్రదించి, సలహాతీసుకొంటూ వుంటే ప్రభుత్వానికి మంచి పేరు వస్తుంది. ముఖ్యమంత్రికీ, ప్రధాన అధికారులకూ మధ్య చక్కని అవగాహన, విశ్వాసం వుండాలి. అప్పుడే ప్రభుత్వం సరిగా నడవటానికి వీలుంటుంది. 'ఎవరికివారే యమునా తీరే' అయితే ప్రభుత్వ వ్యవస్థ ఛిన్నాభిన్నం అవుతుంది.

రాష్ట్రస్థాయిలో ముఖ్యమంత్రి గట్టిమనిషీ, ఆదర్శ ప్రాయుడూ, సమర్థుడూ అయితే ప్రభుత్వ పాలన ఎలా పటిష్ఠంగా వుంటుందో, జిల్లా స్థాయిలో సరయిన వ్యక్తిని కలెక్టరుగా నియమిస్తే పరిపాలన అంత పటిష్ఠంగా వుంటుంది. జిల్లాలో నేను పర్యటించేటప్పుడు కలెక్టర్లు తమతమ జిల్లా అభివృద్ధికోసం అదనంగా నిధులడుగుతూ, పోటా పోటీగా పనిచేసేవారు. నేను కూడా ప్రధాన కార్యదర్శినుండి కింది ఉద్యోగి వరకూ అందరినీ నా కుటుంబ సభ్యులలాగా ఆప్యాయతతో చూసి గౌరవిస్తూ, వారికష్ట సుఖాలను విచారిస్తుండే వాడిని. నిర్భయంగా, నిస్సంకోచంగా తమ తమ అభిప్రాయాలను నాతో చెప్పుకొనే అవకాశం, చొరవవారికి కలగ నిచ్చే వాడిని. ముఖ్యంగా అభివృద్ధి కార్యక్రమాల విషయంలో వారు అడిగే వాటిని వీలయినంతవరకు ఆమోదించేందుకే ప్రయత్నం చేసేవాడిని. మంచిపని చేసేవాడికి నిధుల కొరత వుండకూడదు, అలాటి వారిని అన్నివిధాలా ప్రోత్సహించాలి అన్న భావంతో నేను వారి మాటలు వింటూ వుండేవాడిని. ముఖ్యంగా బలహీన వర్గాల సంక్షేమం కోసం జిల్లా కలెక్టర్లు ప్రత్యేక శ్రద్ధ తీసికోడం చూస్తే, నాకు ఎంతో ఆనందంగా వుండేది. ఈ విధంగా పనిచేస్తే రాష్ట్రం అన్ని విధాలా ముందుకుపోవటమే కాకుండా, ప్రజలు శాంతి సౌభాగ్యాలతో జీవించగల్గుతారు.

## దైనందిన కార్యక్రమం :

ఏ ముఖ్యమంత్రయినా ప్రజాసామాన్యం తనను కలిసి స్వయంగా కష్టసుఖాలు చెప్పుకొనేందుకు అవకాశం కల్పించాలి. తాను రాజధానిలో వున్నా, జిల్లాలకు

పర్యటనకు వెళ్ళినా యీ కార్యక్రమం మాత్రం ఏ ఆటంకం లేకుండా కొనసాగుతుండటం అవసరం.

నేను హైదరాబాదులో వున్నప్పుడు యింటి నుండి సరిగా ఉదయం 9 గం.కు బయలుదేరి తొమ్మిదింబావు కల్లా సచివాలయానికి చేరుకొనే వాడిని. ఏవయినా అర్జెంటుగా చూడవలసిన ఫైళ్ళు కాని, సంతకం చేయాల్సిన కాగితాలు కాని వుంటే చూసుకొని ప్రజాప్రతినిధులను, అధికారులను, అనధికారులను కలుసుకొంటూ వుండేవాడిని. నా మంత్రి వర్గ సహచరులూ, పార్లమెంటు సభ్యులూ, శాసనసభ్యులూ, ప్రధాన కార్యదర్శి, ఇతర అధికారులు, జనసామాన్యం – యిలా ఎవరు నన్ను కలవాలన్నా, అవకాశం దొరికేది. ఎంతో మంది చాలాదూరం నుంచి కూడ వచ్చేవారు. చాలామంది బీదాసాదా వుండేవారు. ముఖ్యమంత్రి గారిని కలిసి చెప్పుకుంటే ఏదయినా న్యాయం జరుగుతుందన్న ఆశతో వచ్చేవాళ్ళు. వాళ్ళు నన్ను కలుసుకున్నప్పుడు యితర విషయాలు మాట్లాడి కాలం వ్యర్థం చేయకుండా సూటిగా వారి పనేమిటో తెలుసుకోడం, అయ్యే పనయితే వెంటనే అధికారులకు ఆ పనిచేయాలని ఆర్డరు వేయటం, లేకపోతే వారి నుండి దరఖాస్తు తీసికొని ఫైలు తెప్పించి, పరిశీలించి వీలయిన సాయం చట్టం పరిధిలో చేయడం జరిగేది. కోరిన కోరిక న్యాయమైనదైతే తప్పక చేస్తానని, లేకపోతే చేయననీ, క్లుప్తంగా దాపరికం లేకుండా చెప్పేవాడిని. ఇలా మధ్యాహ్నం ఒంటి గంట వరకూ నడిచేది. అప్పటికి యింకా ఎవరయినా విజిటర్స్ బయట వేచివుంటే వారందరినీ పిలిచి, కలుసుకొని మాట్లాడి నేను యింటికి వెళ్లటం జరిగేది. ముఖ్యమంత్రిని కలుసుకోడానికి వీలులేక వెనక్కి-పోయిన వారెవ్వరూ వుండే వారు కాదు. రోజూ యిలా ఒంటి గంట వరకూ కనీసం మూడు వందల మందిదాకా నన్ను కలిసి వెళ్లేవారు.

మధ్యాహ్న భోజనం తర్వాత ఒక గంట విశ్రాంతి తీసుకొని 3గంటలకు మళ్లీ సెక్రటేరియట్‌కు వెళ్లేవాణ్ణి. అప్పుడు ప్రభుత్వ వ్యవహారాలు చూడటం, కార్యదర్శులను యితర అధికారులను కలిసి చర్చించడం, అతి జరూరుగా చేయాల్సిన పనులేవైనా వుంటే తగిన నిర్ణయాలు తీసికోడం, యిలా అధికార కార్యక్రమాలను సాయంకాలం అయిదింటి దాకా చూసుకోడం జరిగేది. అయిదింటి నుండి ముఖ్యమంత్రి కార్యదర్శి, ప్రైవేటు కార్యదర్శి, పర్సనల్ అసిస్టెంట్సుతో చర్చించి ఏరోజు ఫైళ్లు ఆ రోజే చూసిపంపేవాడిని. సామాన్యంగా ఏ ఫైలూ నిద్రజేయటం వుండేదికాదు. మరీ ముఖ్యమైన ఫైలుంటే యింటికి

తీసుకొని వెళ్లి చూసేవాడిని. మర్నాడు నేను ఆఫీసుకు వెళ్లకముందే అది తిరిగి అధికారులకు వెళ్లిపోతుండేది.

## పర్యటనలు :

జిల్లాలకు పర్యటనకు వెళ్లే సందర్భంలో ఎక్కువగా కారులోగాని దూర ప్రాంతాలకు రైలులో గాని వెళుతుండటం వుండేది. నేను ముఖ్యమంత్రి కాకముందు జిల్లాకల్టర్లు, యితర అధికారులు ఎంత రాత్రయినా రైలు స్టేషన్లలో ముఖ్యమంత్రి రాకకోసం పడిగాపులు గాసే సంప్రదాయం వుండేది. నా కోసం అలా ఎవరూ రాత్రి పదిగంటలు దాటితే రైలు స్టేషన్లలో వేచి వుండాల్సిన పని లేదని ఆదేశాలివ్వటంతో వారికి ఆ బాధ తప్పింది. నేను ఏ జిల్లాలో మకాంచేస్తే అక్కడ అధికారులు ఉదయం గెస్టుహౌస్‌కు వచ్చి కలుస్తే చాలని చెప్పటం జరిగింది. జిల్లా పర్యటన ప్రారంభంలోనే జిల్లా కల్టర్లు, పోలీస్ సూపర్నెంటులను పిలిచి ముందుగా జిల్లా పరిస్థితులను గురించి తెలుసుకొనేవాడిని. తరువాత జిల్లా పరిషత్ అధ్యక్షుడు, పార్లమెంట్ సభ్యులూ, శాసనసభ్యులూ, యితర ప్రముఖులు ఎవరయినా వస్తే కలిసి మాట్లాడటం, వారు చెప్పింది న్యాయమైతే జిల్లాకల్టర్లనూ, అధికారులనూ పిలిచి సంప్రదించి, అక్కడికక్కడ ఉత్తరువు లివ్వటం జరిగేది. డబ్బులేక పోవడం వంటి సమస్యలుంటే, నేను రాజధానికి వెళ్లి తరువాత నిధులను విడుదల చేయుటం జరిగేది.

పార్లమెంట్ సభ్యులూ, శాసన సభ్యులు మొదలయిన ముఖ్యు లందరికీ ఉత్తరాలన్నీ నా సంతకంతోనే వెళ్లేవి. వారి వారి నియోజక వర్గాలలో పరిష్కారం కాకుండా వున్న సమస్యలు పంపించ వలసిందిగా వారందరికీ వుత్తరాలు రాసే వాళ్లం. వారు పంపిన సమస్యలను ఆయా శాఖల కార్యదర్శులకు పంపి వాటిని అమలు చేయటానికి వున్న సాధక బాధకాలను పరిశీలించటం జరిగేది. జిల్లా పర్యటనలో ఆ జిల్లా అధికారులతో పాటు జిల్లా పరిషత్ అధ్యక్షులు, ప్రజా ప్రతినిధులు అందరినీ పిలచి ఆయా సమస్యల గురించి చర్చించి, ముందే శాఖల కార్యదర్శుల నివేదికలు అందివున్నాయి గనక సత్వరమే నిర్ణయాలు ప్రకటించేందుకు వీలయ్యేది. అవసరమైన ఉత్తరువులు అక్కడికక్కడే జారీ చేసి పనులను పూర్తి చేయవలసిందిగా అధికారులను ఆదేశించటం జరిగేది. ఈ పద్ధతి వల్ల 'మాకు పై అధికారుల నుంచి మంజూరు రాలేదు' అని కింది అధికారులు అనే అవకాశం కలిగేది కాదు.

జిల్లా పర్యటనల సందర్భంగా ఆయా శాఖ పనితీరును క్షుణ్ణంగా సమీక్షించటం వుండేది. ఆ సమావేశాలకు జిల్లా కలక్టర్, పోలీస్ సూపర్నెంటు, తదితర అధికారులు వివిధ సమస్యలపై పూర్తి సమా చారంతో ఏదడిగినా జవాబు చెప్పేందుకు తయారై వచ్చేవారు. ఆ సమావేశాలకు ప్రజాప్రతినిధులు, జిల్లాపరిషత్ అధ్యక్షులు, వివిధ శాఖల జిల్లా అధికారులు అంతా వచ్చేవారు. ప్రభుత్వానికి రావలసిన పన్నుల బకాయిలు ఎంత, అందులో ఎంత వసూలయ్యాయి, మిగతావాటి వసూలుకు తీసుకొంటున్న చర్యలేమిటి, అవి ఎప్పటికి వసూలవుతాయి - అని అడిగి ఎప్పటిలోపల ఖచ్చితంగా వసూలు చేయాల్సిందీ అక్కడి కక్కడే నిర్ణయం చేసేవాళ్లం. అలా చేయని అధికారులను హెచ్చరించటం జరిగేది. సామాన్యంగా అందరూ బకాయిల వసూళ్లపై శ్రద్ధ తీసికొనడంతో ఎవరిమీదా చర్య తీసికోవాల్సిన అవసరమే కలగలేదు.

అలాగే అభివృద్ధికార్యక్రమాలకూ, ప్రజోపయోగ కార్యక్రమాలకూ ఎంతెంత కేటాయించిందీ, అందులో ఎంత ఖర్చయిందీ, యింకా ఎంత ఖర్చు చేయాల్సి వుందీ, యిచ్చిన పైకం సరిపోతుందా, లేకపోతే అదనంగా ఎంత కావాల్సి వస్తుందీ - యివన్నీ చర్చలోకి వచ్చేవి. అధికారులు ఏ విషయాన్నైనా దాచినా, తప్పుచెప్పినా ప్రజాప్రతినిధులు ఆ పొరపాటును బయట పెట్టే అవకాశం వుంది కనక అలా జరిగేది కాదు. ఆ చర్చల్లో ప్రభుత్వ స్థాయిలో జారీ చేయాల్సిన ఉత్తరువులు వుంటే నా వెంట వచ్చిన అధికారులు నోట్ చేసి కొని హైదరాబాదుకు తిరిగి వెళ్లగానే ఉత్తరువులు జారీ చేసేందుకు చర్యతీసికోడం, సమావేశంలో నేను హామీ యిచ్చిన మేరకు ఉత్తరువులు వెంటనే పంపటం జరుగుతుండేది. అంతేకాని, అన్నిటికీ అదివరకు మాదిరిగా 'చూస్తాము, ఆలోచిస్తాము' అనటం వుండేది కాదు. ఏ పనయినా చేస్తే అవుతుంది. నాది మాటలు చెప్పే ప్రభుత్వం కాదనీ పనులు చేయించే ప్రభుత్వమని ప్రజలలో, ప్రజా ప్రతి నిధులలో నమ్మకం ఏర్పడింది. వివిధ శాఖల అధికారులు కూడ కేటా యించిన సొమ్మును వినియోగించుకొని పనులు చేయించకపోతే యీ ముఖ్యమంత్రి వూరుకోరని గ్రహించి కష్టపడి పనిచేసి పనులను పూర్తి చేసేవారు.

ఏ రాష్ట్రంలోనైనా ప్రభుత్వం బాగా పనిచేయాలంటే, ఆ రాష్ట్ర ముఖ్యమంత్రి న్యాయం చేయటంలో, యితడు ఎవరి వొత్తిడులకూ లొంగకుండా పనిచేసుకొని పోయేవ్యక్తి', అన్న నమ్మకం ప్రజలలో కలిగించాలి. మంత్రులలో ఎవరయినా పొరపాటు చేస్తే, ఆ సంగతి ముఖ్యమంత్రి దృష్టికి వస్తే, ఆయన ఆ

మంత్రిని పిలిచి మందలించి చేసిన పొరపాటును సరిదిద్దుకోవలసిందని చెప్పవలసి వుంది. అప్పుడే వారు అలాటి పొరపాట్లు మళ్లీ చేయకుండా వుంటారు. ప్రతిపనికి అందుకు తగిన వ్యక్తిని ఎంపిక చేయాలి. అలా సరయిన అధికారులను సెలక్టుచేసి ఆయాపనులకు నియమించటంలోనే ముఖ్యమంత్రి సమర్ధత తేలి పోతుంది. సరయిన వ్యక్తులను వేసిన తరువాత చీటికి మాటికి బదిలీ చేయకుండా అతడు పనిచేసే అవకాశాన్నివ్వాలి. అలా చేసినప్పుడు అతడు తనకు అప్పజెప్పిన బాధ్యతను నెరవేర్చటానికి వెనుకాడకుండా పనిచేస్తుంటాడు. అప్పుడప్పుడు ఆయా శాఖలకు సంబంధించిన మంత్రులను, వారికి సంబంధించిన అధికారులను పిలచి పావుగంట సేపు ఆ శాఖలో ఏం జరుగుతుందో విచారిస్తుంటే వారు అప్రమత్తంగా తమ బాధ్యతలను తాము నెరవేరుస్తుంటారు.

ఏ ముఖ్యమంత్రయినా సమర్ధవంతంగా పనిచేయాలంటే ఆ రాష్ట్ర ప్రభుత్వ యంత్రాంగం కింది వుద్యోగి నుండి ప్రధాన కార్యదర్శిదాకా అంతా ఉత్సాహంతో పనిచేయటం అవసరం. ముఖ్యమంత్రి అందుకు తగిన వాతావరణాన్ని కల్పించి, వారి అభిమానాన్ని పొందగలగాలి. ముఖ్యమంత్రి తమ శ్రేయస్సును, సంక్షేమాన్నీ కోరే వ్యక్తి అన్న నమ్మకాన్ని వారిలో కలిగించాలి. అలా జరిగిన్నాడు ప్రతి ఉద్యోగి రాష్ట్రానికి మంచి పేరు తేవాలన్న దీక్షతో, పట్టుదలతో పనిచేయగలుగుతాడు. నేను ముఖ్య మంత్రిగా వున్న కాలంలో ప్రభుత్వ యంత్రాంగం యొక్క పూర్తి విశ్వాసాన్ని పొందగలిగాను. నాకు వారంతా అన్నివిధాలా ఎల్లవేళలా పూర్తి సహకారాన్ని అందించారు. అది నా అదృష్టంగా భావిస్తున్నాను. ఈరోజుకూ్డ గ్రామాల నుండీ, జిల్లాల నుండి నాదగ్గరకు వచ్చే కార్యకర్తలూ, ప్రజా ప్రతినిధులూ, ఉద్యోగులూ, ఉన్నతాధికారులూ అంతా నా పరిపాలనా కాలంలో ఒక్కరోజైనా జాప్యం లేకుండా ఫైళ్లు కదిలేవని, ఎప్పటికప్పుడు నిర్ణయాలు జరిగేవని చెప్పుకుంటుంటారు. పటిష్ఠమైన పాలన అందించి అన్నిరంగాలలోను అభివృద్ధి సాధించిన స్వర్ణయుగమని నా పాలనా కాలాన్ని వర్ణిస్తుంటారు. అలాటి మంచిపేరు రావటానికి కారణం ప్రజలు, ఉద్యోగులు, నా పార్టీ కార్యకర్తలూ, నా మంత్రివర్గ సహచరులూ, కేంద్రం - ముఖ్యంగా ప్రధాని అందించిన సహాయ సహకారాలే.

దురదృష్టవశాత్తు నా తరవాత వచ్చిన వారు ఆయా పద్ధతులను పాటించనందున ప్రజాభిమానాన్ని పొందలేక పోయారు.

# ఇందిర : అత్యవసర పరిస్థితి

1972 సార్వత్రిక ఎన్నికలలో ఇందిరాగాంధి ఉత్తర ప్రదేశ్‌లోని రాయ్ బెరెల్లీ నియోజక వర్గం నుండి ఎన్నిక కావటం, దేశప్రధానిగా కొనసాగటం జరిగింది. తన తండ్రి జవహర్‌లాల్ నెహ్రూ ప్రధానిగా వుండగా, ఆమె ఆయన వెంట ప్రపంచ దేశాలన్నీ పర్యటించి ప్రపంచ రాజకీయాలలో మంచి అనుభవం గడించిన వ్యక్తి. 1958-59 లలో అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షురాలిగా ఆమె ఎన్నికయింది. ఇటు పార్టీ పరంగానూ, ప్రభుత్వపరంగా మంచి అనుభవం సంపాదించింది. లాల్ బహదూర్ శాస్త్రిగారి మంత్రి వర్గంలో ఆమె సమాచార, ప్రసారశాఖ మంత్రిగా వుంది. అప్పుడే దురదృష్టవశాత్తు తాష్కెంటులో ప్రధాని లాల్‌బహదూర్ అకస్మాత్తుగా మరణించటం, ఆమెను ప్రధానిగా ఎన్ను కోడం జరిగింది.

ఇందిరకు మంచి జ్ఞాపకశక్తి వుంది. వివిధ రాష్ట్రాలలోని కాంగ్రెస్ నాయకులందరినీ ఆవిడ బాగా యెరుగు. దేశాన్ని అభివృద్ధి చేయుటంలో, పరిపాలన నడపటంలో ధైర్యంగా నిర్ణయాలు తీసుకొని ముందుకు వెళ్లగలిగిన సమర్థురాలు. తూర్పు బెంగాల్ సంక్షోభం సమయంలో కాందిశీకుల సమస్యను పరిష్కరించటం కోసం ముక్తి బాహినితో చేతులు కలిపి అప్పటి తూర్పు పాకిస్థాన్‌లోకి సైన్యాలను పంపించి, కేవలం 14 రోజులలోనే పాక్ సైన్యాలను ఓడించి ఢాకాను వశపరచుకోవటంలో ఆమె చూపిన ధైర్య సాహసాలు, చొరవ, దూరదృష్టి ప్రశంసనీయం. పాకిస్థాన్‌ను రెండు ముక్కలుగా విడదీసి, బంగ్లాదేశ్ అవతరణకు ఆమె దోహదం చేసింది. షేక్ ముజిబుర్ రహమాన్‌ను ప్రజలు బంగ్లాదేశ్ ప్రధానిగా ఎన్నుకోవడం, ఆయునకు మన సైన్యం బంగ్లాదేశ్‌ను అప్పగించటం జరిగింది. అప్పుడు దాదాపు 90 వేల మంది పాక్‌సైనికులూ, సైనికాధి కారులూ యుద్ధ సామగ్రితో సహా మనకు లొంగి పోయారు. వారిని ముందు భారత్‌కు తరలించి, తరువాత సురక్షితంగా పాక్‌కు అప్పగించటం ఆమె రాజనీతిజ్ఞతకు నిదర్శనం. అంతేకాక, మన సైన్యాన్ని అవసరమైన దానికన్నా ఒక్క రోజు కూడా బంగ్లాదేశ్‌లో వుంచకుండా వెనక్కి రప్పించడం, కాందిశీకులందర్నీ బంగ్లాదేశ్‌కు తిరిగి పంపటం, పాకిస్థాన్‌లో మనం ఆక్రమించిన భూభాగాన్ని తిరిగి పాకిస్థాన్‌కు అప్ప గించటం జరిగింది. ఈ పరిణామాల కారణంగా పాక్ నియంత వైతొలగి, తన విదేశాంగ మంత్రి భుట్టోకు అధికారాన్ని అప్పగించ వలసి వచ్చింది. పాక్

ప్రధాని భుట్టో సిమ్లాకు వచ్చి ఇందిరాగాంధీ గారితో చర్చలు జరిపి చరిత్రాత్మకమైన సిమ్లా ఒడంబడికపై సంతకాలు చేశారు. ఈ సంఘటనలన్నిటి ఫలితంగా ఇందిరాగాంధి గారి కీర్తి ప్రతిష్ఠలు భారత దేశంలోనే గాక ప్రపంచ దేశాలన్నిట్లోనూ మారు మ్రోగాయి. ఇందిర అత్యంత సమర్థవంతురాలనీ, గట్టి పట్టుదల గల వ్యక్తి అనీ అందరూ ప్రశంసించారు.

## ఇందిర ఎన్నిక రద్దు :

భారత దేశంలో ఇందిరాగాంధీకి వ్యతిరేకంగా వున్న ప్రతిపక్షాలు ఆమె పలుకుబడి ఘనంగా పెరిగిపోవడం చూసి సహించలేక పోయాయి. కొందరు ఆమె నెలాగయినా అప్రదిష్ఠ పాలు చేయాలన్న ఆలోచనలో వున్నారు. అందుకని రాయ్‌బరేలీలో పార్లమెంటుకు ఎన్నిక కావటం కోసం ప్రభుత్వ యంత్రాంగాన్ని దుర్వినియోగం చేశారని ఆరోపిస్తూ ఇందిరా గాంధిపై ఎన్నికల పిటీషన్ దాఖలయింది. అయితే ఇందిరాగాంధి గారు గాని, ఆమె సలహాదారులుగాని, మిగతా కాంగ్రెస్ నాయకులుగాని దీనిని పట్టించుకోకుండా ఉపేక్షచేశారు. అయితే కోర్టు తీర్పు యింకా రెండు మూడు నెలలకు వస్తుందనగా ఒక సంఘటన జరిగింది. ఇందిరాగాంధి గారి పైవచ్చిన పిటీషన్‌ను విచారిస్తున్న జడ్జి ఒకసారి జయప్రకాశ్ నారాయణ్ గారిని కలిసి, తీర్పు ఆమెకు వ్యతిరేకంగా యివ్వబోతున్నట్లు చెప్పారనీ, ఆ సంగతి జయప్రకాష్ నారాయణ్ తన సన్నిహితులొకరికి చెప్పగా, ఆ సన్నిహితుడు ఆ సంగతి శ్రీ యం.వి. యస్. సుబ్బరాజుగారికి చెప్పటం జరిగిందట ! సుబ్బరాజుగారు తూర్పు గోదావరి జిల్లా కొత్తపేట నుండి శాసనసభకు ఎన్నికయి, సంజీవరెడ్డిగారు ముఖ్యమంత్రిగా వుండగా కాంగ్రెస్ పార్టీకి ఛీఫ్ విప్‌గా పనిచేసినవారు. సంజీవరెడ్డిగారికి యిప్పటికీ చాలా సన్నిహితుడనని చెప్పుకొనే మనిషి. జయప్రకాష్‌తో జడ్జి అలా చెప్పిన సంగతి ఎంతవరకు యదార్థం, జయప్రకాశ్ యీ సంగతి నిజంగా తన సన్నిహితులతో అన్నారా - అన్న విషయాలను ధృవపరచుకోడానికి ఆస్కారం లేదు. ఆ సంగతులెలా వున్నా సుబ్బరాజు గారు వెంటనే సంజీవరెడ్డిగారికి ఒక వుత్తరం రాస్తూ తనకు తెలిసినదంతా అందులో యథాతథంగా పేర్కొన్నారు. ఎలాగో సుబ్బరాజుగారి వుత్తరం రాష్ట్రగూఢచారి విభాగం దృష్టికి వచ్చింది. ఆ విభాగం అధిపతిగా వున్న శ్రీ విజయరామారావు ఆ వుత్తరం నకలును తెచ్చి నాకు చూపించారు. నేను వెంటనే ఆ సంగతి కేంద్ర గూఢచారి శాఖ ద్వారా

ఇందిరాగాంధి గారి దృష్టికి తీసుకొని వెళ్ల వలసిందని ఆదేశించాను. అయితే కేంద్ర గూఢచారిశాఖ అధికారులు యీ విషయానికి ఎట్టి ప్రాముఖ్యం యివ్వక పోగా, హైకోర్టు తీర్పు అనుకూలంగానే వస్తుందన్న భరోసా ప్రధానికి కలిగించటం జరిగింది. ఆమెకు సన్నిహితంగా వున్న కాంగ్రెస్ నాయకులు కూడా ఆమెకు అదే అభిప్రాయాన్ని కలిగించారు. చివరకు హైకోర్టు తీర్పు 1975 జూన్ నెలలో యిస్తారని తారీఖు నిర్ణయించి ప్రకటించటంతో కాంగ్రెస్ ముఖ్యమంత్రులందర్నీ ఆ రోజు ఢిల్లీకి వచ్చి వుండవలసిందిగా ఢిల్లీ నుండి పిలుపు వచ్చింది. మేమంతా ఆ రోజు ఢిల్లీలో వున్నాం. తీరా చూస్తే అలహాబాదు హైకోర్టు జడ్జి ఇందిర ఎన్నికను రద్దుచేస్తూ తీర్పు యిచ్చారు. ఎన్నికల సమయంలో అధికార దుర్వినియోగం చేసినందుకు గాను ఆరు సంవత్సరాలపాటు ఎన్నికలలో పోటీ చేసేందుకు ఆమె అనర్హురాలని కూడా ఆయన ప్రకటించారు. ఇది సహజంగా పెద్ద సంచలనం కలిగించింది. కాంగ్రెస్ వారంతా నిరుత్సాహం చెందటం, ప్రతిపక్షాలవారు ఎంతో సంతోషంగా వుండటం కనిపించింది.

నేను ఢిల్లీ చేరగానే యీ వార్త తెలియడంతో, వెంటనే ఇందిరా గాంధి గారిని కలిసి, దీని వెనుక చాల కథ వుందని, లోగడ సుబ్బరాజు గారు రాసిన వుత్తరం గురించి చెప్పాను, కాని దానిని కేంద్ర గూఢచారి సంస్థ ప్రధానికి తెలియ పరచినట్లు లేదు. వెంటనే ఇందిరాగాంధి కేంద్ర గూఢచారి సంస్థకు చెందిన అధికారిని పిలచి నా ముందే నేను చెప్పిన విషయం గురించి వారిని నిలదీయటం జరిగింది. వారు వెంగళరావుగారు చెప్పినదంతా నిజమేనని అంగీకరిస్తూ రెండు మూడు నెలల కిందటే ఆ వుత్తరం నకలును తమ దృష్టికి ఆంధ్రప్రదేశ్ గూఢచారి సంస్థ తీసుకొని వచ్చిన సంగతిని ధృవపరచారు.

## సుప్రీంకోర్టు స్టే :

ఇందిరాగాంధి గారు ప్రధానిగా కొనసాగటం అవసరమనీ, ప్రస్తుతం దేశం వున్న పరిస్థితులలో పటిష్ఠమైన ఆమె నాయకత్వం దేశానికి తప్పని సరి అనీ ఎందరో కాంగ్రెస్ నాయకులు ఆమెకు చెప్పినా కూడ, నైతిక బాధ్యతగా కోర్టు తీర్పును శిరసావహిస్తూ ఆమె రాజీనామా పత్రాన్ని తయారు చేసుకున్నారు. అయితే ఆమె కుమారుడు సంజయ్ గాంధీ వచ్చి తల్లి చేతిలో నుండి ఆ కాగితాన్ని లాక్కొని చింపివేయటం జరిగింది. భారతదేశంలోని ప్రముఖ న్యాయవాదుల్లో వొకరుగా పేరుమోసిన నానీ పాల్కీవాలా ఇందిరాగాంధి గారి ఎన్నికపై హైకోర్టు యిచ్చిన

తీర్పు చెల్లదని ఆమె పక్షాన సుప్రీంకోర్టులో అపీలు చేస్తూ కోర్టు తీర్పువచ్చేదాకా హైకోర్టు తీర్పు అమలు కాకుండా స్టే యిమ్మని కోరుతూ పిటీషన్ వేశారు. రెండో రోజుననే సుప్రీం కోర్టు వారు స్టే మంజూరు చేస్తూ అప్పీలును విచారణకు స్వీకరించారు.

## సంజయ్‌గాంధి జోక్యం :

ఇదిలా వుండగా, అప్పటివరకూ రాజకీయాలతో సంబంధం పెట్టుకోకుండా వేరే పనులు చూసుకుంటున్న ఇందిరాగాంధీ రెండవ కుమారుడు సంజయ్‌గాంధీ రాజకీయ రంగంలో అడుగుపెట్టారు. నేను అన్ని సంవత్సరాలు ముఖ్యమంత్రిగా వున్నా ఆయన పేరు వినడమే కాని ఆయనను ఎప్పుడూ కలుసుకోలేదు. ఈ తీర్పు వచ్చిన తరువాత ఇందిరాగాంధీ గారు ఆయనను నాకు పరిచయం చేశారు. ఆయనకు అప్పుడు హర్యానా ముఖ్యమంత్రిగా వున్న బన్సీలాల్, పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రిగా వున్న సిద్ధార్థ్ శంకర్‌రే ముఖ్య సలహాదారులు. సిద్ధార్థ్ శంకర్ రే ప్రముఖ న్యాయవాది కూడ. రే, బన్సీలాల్, సంజయ్‌గాంధి, ఇందిరాగాంధి కూర్చొని ఆలోచించి రాజ్యాంగాన్ని సవరించాలనీ దేశం లోని ప్రతిపక్షాలు అరాచకం రేపకుండా అత్యవసర పరిస్థితిని ప్రకటించాలనీ నిర్ణయానికి వచ్చారు.

## ఎమర్జన్సీ :

కాంగ్రెస్ ముఖ్యమంత్రులలో నేను ఇందిరాగాంధీ గారికి చాల నమ్మకమైన వ్యక్తిని. నేను ఆంధ్రప్రదేశ్ భవన్‌లోని గెస్టుహౌస్‌లో వుండగా ప్రధాని నుండి పిలుపువచ్చింది. నేను ప్రధాని యింటికి వెళ్లగానే నన్ను లోపలకు తీసుకొని వెళ్లి కూర్చోబెట్టి ఇందిరాగాంధి అన్ని పరిస్థితులూ వివరించారు. తరువాత దేశంలో అత్యవసర పరిస్థితి ప్రకటించాలని నిర్ణయం తీసుకున్న సంగతి చెప్పారు. 'మీరు ఇంకా రెండు రోజులపాటు యిక్కడే వుండండి! నిర్ణయం ప్రకటించిన తర్వాత వెళ్లవచ్చు' అన్నారు. ఎమర్జెన్సీ యింకా మూడురోజులకు ప్రకటిస్తారనగా యిది జరిగింది. అప్పటికి యీ సంగతి కేంద్ర మంత్రి వర్గ సభ్యులకెవరికీ తెలియదు. నాకు యీ సంగతి మూడు రోజుల ముందే ప్రధాని ద్వారానే తెలిసింది.

ఎమర్జెన్సీ ప్రకటనకు ఒక రోజు ముందు ప్రధాని మళ్లీ నన్ను పిలిపించారు.

'ఎమర్జెన్సీ ప్రకటించటానికి నిర్ణయించాము. మీరు బెంగుళూరు వెళ్లండి. దేవరాజ్ అర్స్‌తో మాట్లాడండి! ఎవరిని అరెస్ట్ చేయాల్సింది తరువాత చెబుతాము. హైద్రాబాద్ చేరుకున్న రాత్రి 12 గంటలకు మిగిలిన అన్ని విషయాలూ చెబుతాం', అని చెప్పారు. దేవరాజ్ అర్స్ అప్పుడు కర్నాటక ముఖ్యమంత్రిగా వున్నారు. ఆయన నాకు చాల సన్నిహిత మిత్రుడు. బెంగుళూరు వెళ్లటానికి అప్పుడు విమానం లేదు. అందుకని ప్రధాని ఇందిరాగాంధి ఎయిర్ ఛీఫ్ మార్షల్ ఓ.పి.మెహ్రాను పిలచి తాను మామూలుగా ప్రయాణం చేసే రాజదూత్ విమానాన్ని నా వుపయోగం కోసం యిచ్చి బెంగుళూరులో దింపేందుకు ఏర్పాటు చేయమని చెప్పారు.

నేను వెంటనే ఆంధ్రప్రదేశ్ గెస్ట్‌హౌస్‌కు వెళ్లాను. నేను వెళ్లిన పావుగంటకల్లా, 'ప్లేన్ రెడీ అనీ, నా కోసం ఎయిర్ వైస్ మార్షల్‌ను పంపుతున్నామనీ, ఆయన కారుతీసికొని వస్తున్నారనీ చెప్పారు. తరువాత 15 నిముషాలలో ఎయిర్ వైస్ మార్షల్ వచ్చారు. నేను నా దగ్గర సెక్యూరిటీ ఆఫీసర్‌గా వున్న సీతాపతిని పిలచి నా సామానంతా వెనకవేపు నుండి ఎవరూ చూడకుండా కారులో పెట్టించమని చెప్పాను. నా వద్ద అప్పుడు కొంతమంది పార్లమెంటు సభ్యులు కూర్చొని వున్నారు. నేను వారితో కొంచెం బయట పనివుంది, వెళ్లివస్తానని చెప్పి లేచి వచ్చి, కారులో కూర్చొని బయలు దేరాను. నేను ఎక్కడికి వెళ్లిందీ ఎవరికీ అర్థం కాకుండా రహస్యంగా వుంచటంకోసం యిలా చేయాల్సి వచ్చింది. మేమంతా పాలం విమానాశ్రయం ప్రక్కన సెక్యూరిటీ జోన్‌లో వున్న రాజదూత్ విమానం ఎక్కాము. మా కన్నా ముందే అందులో ఎయిర్ ఫోర్స్‌కు చెందిన పాతిక ముప్పయి మంది ఎక్కి కూచున్నారు. మేము ప్రధాని మామూలుగా ఎక్కే లేడర్ ద్వారా ఎక్కి, ప్రధాని కేబిన్‌లో కూర్చొన్నాము. మేము ఢిల్లీ నుండి బయలుదేరేసరికి దాదాపు పదిగంటలయింది. బెంగుళూరుకు పన్నెండు గంటలకు చేరాము. దిగేసరికి ఎయిర్ ఫోర్స్ వారి కారు రడీగా వుంది. నేను అక్కడి నుంచి ముందు స్టేట్ గెస్ట్‌హౌస్‌కు వెళ్లాను. నా సెక్యూరిటీ ఆఫీసర్ కర్నాటక ఛీఫ్ సెక్రటరీని ఫోన్‌లో కాంటాక్ట్ చేసి 'ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి ఇప్పుడే ఢిల్లీనుంచి వచ్చారు. మీ ముఖ్యమంత్రితో చాల అర్జంటుగా మాట్లాడాలి. ఆయన ఎక్కడ వున్నా యీ సంగతి ఆయనకు వెంటనే తెలియచేయండి! కాని ఇదంతా ఎవరికీ ఏ మాత్రం తెలియకూడదు. అత్యంత రహస్యం', అని చెప్పాడు. ఇంతలో భోజనం వచ్చింది. భోంచేసే సరికి కర్నాటక ముఖ్యమంత్రి నుంచి ఫోన్

వచ్చింది. నేను స్వయంగా వచ్చి అర్జంటుగా మాట్లాడాలని చెబితే, గెస్ట్‌హౌస్ ప్రక్కనే వున్న ఆయన యింటికి రావలసిందిగా ఆహ్వానించారు. వెంటనే నేను ఆయన యింటికి వెళ్లి కలిశాను. 'రేపుదయం తెల్లారేసరికి దేశంలో ఎమర్జెన్సీ ప్రకటిస్తారు. ఈ లోగా మీరు మీ ఛీఫ్ సెక్రటరీని, డి.జి.పి. (డైరక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్)నీ, ఇంటెలిజెన్స్ ఛీఫ్‌నూ రప్పించుకొని రాష్ట్రమంతటా శాంతి భద్రతలు కాపాడే విషయం జాగ్రత్త తీసుకొని, ఎవరయినా ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఉద్యమం తీస్తారనీ, శాంతి భద్రతలకు భంగం కలిగిస్తారనీ అనుమానం కలిగితే అట్టి వారిపై నిఘా వుంచండి! – మళ్లీ రాత్రి పన్నెండు గంటలకు ఇందిరా గాంధీ నుండి ఫోన్ వస్తుంది. ఆ ఫోన్ వచ్చిన వెంటనే ఢిల్లీ నుండి వచ్చే ఆదేశాల మేరకు మీరు మీ అధికారులందరికీ తగు ఆదేశాలు యిచ్చి చర్య తీసుకోండి', అని చెప్పాను. ఆ రోజు బెంగుళూరులో ప్రత్యేక పరిస్థితి నెలకొనివుంది. భారతీయ జనతా పార్టీనాయకులు అటల్ బిహారీ వాజ్‌పేయి మొదలయిన వారు ఆ రోజు బెంగుళూరులోనే వున్నారు. 'కనుక యిప్పటినుంచే అన్ని జాగ్రత్తలూ తీసుకోండి' అని కూడా చెప్పాను.

తరువాత నేను అర్సు గారింటి నుంచే మా ప్రధాన కార్యదర్శికీ, ముఖ్యమంత్రి కార్యదర్శి రావు సాహెబ్‌కూ ఫోన్ చేసి మాట్లాడాను. నేను హైద్రాబాద్ ఎయిర్‌పోర్టులో దిగిన వెంటనే సెక్రటేరియట్‌కు వస్తున్నాననీ, వారిద్దరినీ, డి.జి.పి., డి.ఐ.జి. (ఇన్ టెలిజెన్స్)నూ నేను వచ్చేసరికి సెక్రటేరియట్‌లో తయారుగా వుంచాలనీ, రాగానే ముఖ్యమైన విషయాలు మాట్లాడాలనీ చెప్పాను. దేవరాజ్ అర్స్‌గారితో ఢిల్లీ సంగతులన్నీ వివరించిన తరువాత బయలుదేరి ఎయిర్ ఫోర్స్ కారులోనే తిన్నగా రాజదూత్ దాకా వెళ్లాము. అప్పటికి పైలట్స్ తయారుగా వున్నారు. నేను, నా సెక్యూరిటీ ఆఫీసర్ విమానం ఎక్కి హైదరాబాదుకు బయలు దేరాము. ముందు వారు నాకు చెప్పిన ప్రకారం మేము రహస్యంగా దిండిగల్ ఎయిర్‌ఫోర్స్ బేస్‌లో దిగి కారులో హైద్రాబాదు చేరుకోవాల్సి వుంది. కాని తీరా విమానం దిండిగల్ చేరేసరికి అక్కడ పెద్ద వర్షం కురుస్తూ వుండటంతో విమానాన్ని దింపటం సమస్య అయింది. విమానం పైనే చెక్కర్లు కొడుతూవుండగా కింద నుంచి ఎయిర్‌ఫోర్స్ విమానాశ్రయం అధికారులు వి.ఐ.పి. వున్న విమానం కనుక యీ వాతావరణంలో దింపటం క్షేమం కాదనీ, ప్రమాదం జరిగే అవకాశం వుంది కనుక దిగవద్దని చెప్పారు. ఇక లాభంలేదని పైలట్ విమానాన్ని బేగంపేట విమానాశ్రయానికి తీసుకొచ్చి, సెక్యూరిటీ జోన్

(పాత ఎయిరో డ్రోం)లో దింపాడు. ఈ లోగానే దిండిగల్ నుండి కబురందటం వల్ల ఛీఫ్ సెక్రటరీ, ముఖ్యమంత్రి కార్యదర్శి విమానం దగ్గరకు వచ్చి కలిశారు. నేను పైలట్‌కు థాంక్స్ చెప్పి వారితో సెక్రటేరియట్‌కు బయలుదేరాను.

ఆ రోజు సాయంకాలం 5-30కు ఛీఫ్ సెక్రటరీ, ముఖ్యమంత్రి కార్యదర్శి, డి.జి.పి., డి.ఐ.జి., (ఇంటెలిజెన్స్)లతో సమావేశమై విషయమంతా చెప్పాను. శాంతి భద్రతలను కాపాడటానికి సన్నద్ధంగా వుండాల్సిందిగా ఆదేశించాను. నాకు రాత్రి పన్నెండు గంటలకు ఫోన్ వస్తుంది అనీ, రాగానే నేను వారికి ఏం చేయాలో చెబుతాననీ, ఆ తరువాత వెంటనే వాళ్ళ సిటీలో కమీషనర్ ఆఫ్ పోలీస్‌కూ, జిల్లాల్లో కలక్టర్లకూ, యస్.పి.లకూ తెలియచేసి వెంటనే ప్రమాదకరమైన వ్యక్తులను అరెస్ట్ చేయాలనీ చెప్పాను.

## అత్యవసర పరిస్థితి :

అనుకున్నట్లుగా రాత్రి 12 గంటలకు నాకు ఢిల్లీ నుంచి ఫోన్ వచ్చింది. ఉదయమే గం.6-05 ని.లకు ఇందిరాగాంధి ఢిల్లీ రేడియో స్టేషన్‌కు వెళ్లి ప్రజలనుద్దేశించి ప్రసంగిస్తూ అత్యవసర పరిస్థితిని విధించి నట్లు ప్రకటిస్తారని సమాచారం అందింది.

ఈ విషయం ఏకొద్ది మందికో తప్ప ఢిల్లీలో వున్న వారికి గాని, ఇతర రాష్ట్రాలలోని వారికి గాని తెలియదు. అప్పుడు కాసుబ్రహ్మానందరెడ్డి కేంద్రంలో హోంమంత్రిగా వున్నారు. ఆయన దగ్గరకు రాత్రి 12 గంటలకు హోం శాఖలో సహాయమంత్రిగా వున్న ఓం మెహతా వెళ్లి నిద్రలేపి ఫైల్‌మీద సంతకం పెట్టించుకొని వచ్చాడు. ఏ కాగితం మీద సంతకం చేస్తున్నదీ, ఎందుకు చేస్తున్నది కూడ ఆయనకు తెలియదు. శ్రీమతి ఇందిరాగాంధీ, సిద్ధార్థ శంకర్ రే కలసి రాష్ట్రపతి భవన్‌కు వెళ్లి ''దేశంలో ప్రతిపక్షాల వారు అరాచకం సృష్టించే ప్రయత్నం చేస్తున్నారనీ, ఎమర్జన్సీ ప్రకటించకపోతే చాలా యిబ్బంది కలుగుతుందనీ'' ఆయనకు చెప్పి, ఫైలుపై సంతకం చేసేందుకు ఆయనను వొప్పించటం జరిగింది.

ఆ రాత్రి ప్రధాని యింటినుండి కేంద్ర మంత్రి వర్గ సభ్యులందరికీ ఫోన్‌చేసి ఉదయాన్నే 5-30 గం.కు ప్రధాని యింటి దగ్గరకు రావలసిందని చెప్పారు. ప్రధాని 6 గం.కు బయటకు వచ్చి కారెక్కబోతూ మంత్రులందర్నీ పిలిచి దేశంలో ఎమర్జెన్సీ ప్రకటిస్తూ రేడియో ప్రసంగం చేయటం కోసం తాను రేడియోస్టేషన్‌కు

వెళుతున్నానని చెప్పారు. 'అందుకు రాష్ట్రపతి ఆమోదం రాత్రి తీసుకోడం జరిగింది. 'మీరంతా పదిగంటలకు సౌత్‌బ్లాక్‌లో కేబినెట్ మీటింగుకు హాజరుకావాలని' చెప్పి కారులో రేడియో స్టేషన్‌కు వెళ్లారు. తన రేడియో ప్రసంగంలో ఆమె దేశంలో అత్యవసర పరిస్థితిని ప్రకటిస్తున్నట్లు తెలియచేసి, అందుకు కారణాలేమిటో వివరించారు.

## అరెస్టులు :

అప్పటికే దేశంలో అనేకచోట్ల ఆయా రాష్ట్రాల ముఖ్యమంత్రులు సంజయ్‌గాంధీ వొత్తిడికి భయపడి ప్రముఖ రాజకీయ నాయకులందర్నీ అరెస్ట్ చేయించడం జరిగింది. అరెస్టయిన వారిలో జయప్రకాశ్ నారాయణ్, ఆచార్య కృపలానీ, మొరార్జీ దేశాయ్ మొదలయిన ప్రముఖు లున్నారు.

ఆంధ్ర ప్రదేశ్‌లో మాత్రం మేము జాగ్రత్తగా ఆలోచించాము. ఎమర్జన్సీని దుర్వినియోగం చేయకుండా, తెల్లవారేసరికి 45 మందిదాకా అరెస్ట్ చేయటం జరిగింది. అయితే సంజీవరెడ్డి, తెన్నేటి విశ్వనాధం వంటి నాయకులను అరెస్ట్ చేయలేదు. మన రాష్ట్రంలో ప్రభుత్వం అప్పుడు జాగ్రత్తగా వ్యవహరించటం వల్లా, ఎమర్జన్సీ అధికారాలను దుర్వినియోగం చేయనందునా ప్రజలకుగాని, పెద్దలకు గాని యిబ్బంది కాలేదు. అరెస్ట్ అయిన నాయకులకు కూడ ఏ ఇబ్బంది కల్గించకుండా వారు దరఖాస్తు చేసి కోరిన సౌకర్యాలను కలిగించాము. ఎమర్జన్సీ కాలంలో రాష్ట్రంలో ఎక్కడా గోలలూ, ఆందోళనలూ, సమ్మెలూ అరాచకం జరగలేదు. చాల ప్రశాంతంగా గడిచింది. ఈ అవకాశం తీసుకొని వివిధ పట్టణాలలో రౌడీ షీటర్లను, గూండాలనూ అరెస్టు చేసి జైలులో వుంచటం జరిగింది. ఆ రోజుల్లో విజయవాడ వంటి పట్టణాలలో రాజకీయ పార్టీల ప్రాపకంలో వున్న గూండాలను జైలులో పెట్టడం వల్ల విజయవాడ, యితర పట్నాల ప్రజలు హాయిగా ప్రశాంతంగా జీవించ గల్గారు. అప్పుడు మీసా కింద మేం జైలులో వేసిన రౌడీ షీటర్లలో కొందరు నేడు శాసన సభ్యులుగా ఎన్నిక కావటమే కాక, మంత్రులుగా కూడ వుండటం దురదృష్టం. అయితే అన్ని రాష్ట్రాలలో - ముఖ్యంగా ఉత్తరాదిన అలా అరెస్టుల విషయంలో జాగ్రత్త తీసికోడం జరగలేదు. ఎమర్జెన్సీ అమలులో వున్న 19 నెలల కాలంలో సంజయ్ గాంధీకి అనుభవంలేక పోవడంతో ఇందిరాగాంధి గారికి తెలియకుండా అధికార దుర్వినియోగం చాలా జరిగింది. అక్కడి ముఖ్యమంత్రులు సంజయ్‌గాంధీకి భయపడి ఆయన

చెప్పినట్లల్లా చేసి, అధికార దుర్వినియోగానికి పాల్పడటంతో ఆ రాష్ట్రాలలో కాంగ్రెస్‌కు చెడ్డపేరు వచ్చింది. కొన్ని రాష్ట్రాలలో విచక్షణా రహితంగా వేల సంఖ్యలో అరెస్టులు జరిగాయి. బలవంతంగా కుటుంబ నియంత్రణ శస్త్ర చికిత్సలు జరిపారు. ఇలా అనేక రంగాలలో బలప్రయోగం జరిగింది. నేను ఢిల్లీలో ఇందిరాగాంధీని కలవటానికి వెళ్లినప్పుడల్లా సంజయ్‌గాంధీ ఆంధ్రలో కూడ కుటుంబనియంత్రణ ఆపరేషన్లు బాగా జరగాలనీ, యింకా ఎక్కువ మందిని అరెస్ట్ చేయాలనీ చెబుతూ వుండేవాడు. కాని నేను ఆయన మాట పెడచెవిన పెట్టి ఆయన సలహా ప్రకారం నడచుకొన నిరాకరించే వాడిని. అందుకుగాను, ఆయనకు నాపై కొంత కోపం వుండేది.

## సంజయ్ పర్యటన :

ఇందిరాగాంధీకి కూడ తన తర్వాత సంజయ్‌గాంధీ దేశానికి నాయకుడు కావాలన్న అభిప్రాయం వుండేది. సంజయ్‌గాంధీని రాష్ట్రాలకు ఆహ్వానించి, పెద్ద పెద్ద బహిరంగ సభలు నిర్వహించి ప్రజల్లో ఆయన నాయకత్వానికి బలం చేకూర్చాలని ఆమె అభిప్రాయంగా వుండేది. ఆ విషయం ముఖ్యమంత్రులందరితో చెబుతుండేది. ఒకసారి ఆంధ్రకోస్తా లోనూ, తమిళనాడులోనూ తుఫాన్ సంభవించి అపారనష్టం కలిగింది. అప్పుడు తమిళనాడులో రాష్ట్రపతిపాలన వుండటంతో కేంద్ర హోం శాఖ సహాయమంత్రి ఓం మెహతా సంజయ్‌గాంధీని ప్రత్యేక విమానంలో తీసుకొని వెళ్లి అక్కడ సహాయ కార్యక్రమాలను పర్యవేక్షించాడు. ఆంధ్రలో నెల్లూరు నుండి పశ్చిమ గోదావరి దాకా కొంత నష్టం జరిగింది. నేను విజయవాడలో ఓ వారం రోజులు మకాం పెట్టి జిల్లా కలెక్టర్లను పిలిచి సహాయకార్యక్రమాలను సమీక్షిస్తూ వుండేవాడిని. ఒకనాడు ప్రధాని యింటినుంచి అప్పుడు ప్రధానికి పి.ఏ.గా వున్న ధావన్ నాకు ఫోన్ చేసి మాట్లాడాడు. సంజయ్‌గాంధీని ఆంధ్రలో తుఫాన్ దెబ్బతిన్న ప్రాంతాల పర్యటనకు ఆహ్వానించాలని ఇందిరాగాంధి గారు సూచించినట్లు నాకు ఆయన చెప్పాడు. దానికి నేను ఇందిరాగాంధి గారు ప్రధాని హోదాలో స్వయంగా వచ్చి పర్యటిస్తే ఎంతో బాగుంటుందనీ, ప్రజలకు చాల భరోసా కలుగుతుందనీ, వాళ్లు సంతృప్తి చెందుతారనీ వివరించాను. ఇందిరాగాంధీ కుమారుడయినంత మాత్రాన సంజయ్ గాంధీని ఆహ్వానించి పర్యటన ఏర్పాటు చేయడం సమంజసంగా వుండదని చెప్పాను. తుఫాన్ సహాయ కార్యక్రమాలన్నీ చక్కగా జరుగుతున్నాయనీ,

నేనే స్వయంగా వుండి సమీక్షిస్తున్నాననీ తెలియచేశాను. ఇందిరాగాంధీ గారు రావటానికి యిష్ట పడితే ఆమె వెంట సంజయ్‌గాంధీ వస్తే బాగుంటుంది కాని ఆమె లేకుండా ఆయన వొక్కరే వస్తే, ప్రభుత్వం పర్యటన ఏర్పాటు చేయడం బాగుండదని, ఆ సంగతి ప్రధానికి వివరించవలసిందిగా నేను ధావన్‌ని కోరాను. ఈ విషయం ప్రధానికి ధావన్ చెప్పినప్పుడు ఆమెకు ఆగ్రహం కలిగింది. అప్పుడు మన రాష్ట్రం నుంచి కేంద్రంలో మంత్రిగా వున్న కొత్త రఘురామయ్యగారూ, ఆంధ్రనుంచి ఎన్నికైన పార్లమెంటు సభ్యులు కొందరూ ఇందిరాగాంధీని కలిసి తుఫాన్ పీడిత ప్రాంతాలకు కేంద్ర సహాయం కావాలని అర్థించారు. అప్పుడు ప్రధాని వాళ్లతో మాట్లాడుతూ తుఫాన్ పీడిత ప్రాంతాల్లో సహాయ కార్యక్రమాలను గురించి సంజయ్‌గాంధీ పర్యటనను ఏర్పాటు చేయవలసిందిగా కోరితే ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి యిలా అన్నాడని చెప్పారు. ఆయన నాకు తరువాత ఫోన్ చేసి ఇందిరాగాంధీ గారు తనతో యిలా మాట్లాడిందని చెప్పటం జరిగింది. ఈ లోగా తుఫాన్ ప్రాంతాలలో సహాయ కార్యక్రమాల పని ముగిసింది. అప్పడు గౌహతిలో కాంగ్రెస్ మహాసభలు జరిగాయి. డి.కె.బారువా గారప్పుడు అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షులు. నేనా మహాసభలకు హాజరయ్యాను. ఆంధ్రనుంచి పార్లమెంటు సభ్యులు, ఏ.ఐ.సి.సి. సభ్యులు అంతా వచ్చారు. సభలు పెద్ద యెత్తున జరిగాయి. అప్పుడు వారంతా నాతో సంజయ్ గాంధీ గారినొకసారి రాష్ట్రానికి ఆహ్వానిస్తే బాగుంటుందని కోరటం జరిగింది. అప్పుడు నేను ఇందిరాగాంధీగారిని కలిసి తుఫాన్ బాధితుల సహాయ కార్యక్రమాలు ముగిశాయనీ, నేనే అక్కడ వుండి సమీక్షించటం జరిగిందనీ చెప్పాను. అప్పుడు సంజయ్ గాంధీ గారిని తీసుకొని వెళితే అంతా పర్యటన జయప్రదం చేయటానికి కృషిచేయటంతో సహాయకార్యక్రమాలు దెబ్బతినే అవకాశం వుందన్న భయంతో అప్పుడు ఆహ్వానించ లేదని చెప్పాను. అంతకన్నా వేరే వుద్దేశం లేదనీ, యిప్పుడు సహాయ కార్య క్రమాలన్నీ పూర్తయ్యాయి కనుక మీరిప్పుడు సంజయ్‌గాంధీ గారిని ఆంధ్రకు పంపిస్తే పర్యటన ఏర్పాటు చేయటానికి నా కభ్యంతరం లేదని చెప్పాను. ఆమె దానికి అంగీకరించి సంజయ్ గాంధీని పిలిచి చెప్పడం, కార్యక్రమం అంతా రాసి ఆమోదం తీసికోడం జరిగింది.

సంజయ్ గాంధీ పర్యటన కోసం రాష్ట్ర ప్రభుత్వం ఇండియన్ ఎయిర్‌లైన్స్ నుండి ఒక విమానాన్ని అద్దెకు తీసికొంది. అప్పటి రక్షణ శాఖమంత్రి బన్సీలాల్ గారికి రాసి 15 మంది ఎక్కే వీలున్న మిలిటరీ హెలీకాప్టర్ నొకదానిని కూడా ప్రత్యేకంగా తెప్పించాము.

మొట్టమొదట సంజయ్ గాంధీ హైదరాబాదు వచ్చారు. అక్కడ నుండి విమానంలో తిరుపతి బయలుదేరాము. సంజయ్‌గాంధీకి విమానం నడపటం వచ్చు. ప్రయాణం మధ్యలో పైలట్ వచ్చి సంజయ్ గాంధీని స్వయంగా కాక్‌పిట్‌లోకి తీసికొని వెళ్లాడు. అక్కడ నుండి తిరుపతి చేరిందాకా సంజయ్‌గాంధీయే విమానం నడపటం జరిగింది. విమానంలో వున్న వాళ్లంతా ఈ రోజు మనం క్షేమంగా తిరుపతి చేరేదుందా అని భగవంతుణ్ణి మనసులోనే తలచుకోడం మొదలు పెట్టారు. పైకి ఎవరూ ఏమీ అనలేదు కాని అందరికీ మనసు పింజం పింజం అంటోందని నాకు తెలుసు. మొత్తం మీద తిరుపతి క్షేమంగా చేరాం కాని విమానాన్ని ఆపేటప్పుడు ఆయన సడెన్ బ్రేక్ వేయటం వల్ల అంతా కుదుపుతో ముందుకు వూగాల్సి వచ్చింది. విమానంలో వారంతా భగవంతుని దయవల్ల 'బతుకు జీవుడా! బయట పడ్డాం' అనుకొని వూపిరి పీల్చుకున్నారు.

తిరుమల వెళ్లి శ్రీ వేంకటేశ్వరస్వామి దర్శనం చేసుకొని, ఎయిర్ పోర్ట్‌కు వెళ్లి హెలికాప్టర్‌లో బయలుదేరి కాళహస్తి చేరుకొని అక్కడ ప్రత్యేకంగా తయారు చేసిన హెలీపాడ్‌పై దిగటం జరిగింది. తుఫాన్ బాధితుల సహాయ కార్యక్రమాలను చూపించి తిరిగి హెలీకాప్టర్‌లో నెల్లూరు జిల్లాలో నాయుడుపేట వెళ్లాము. అక్కడ బహిరంగ సభ చూసుకొని కార్యక్రమాలు ముగించుకొన్న తరువాత గన్నవరం విమానాశ్రయం చేరాము. అక్కడ భోజనం ముగించుకొని తిరిగి హెలీకాప్టర్ ఎక్కి పశ్చిమ గోదావరి జిల్లాలోని ఆకివీడు వెళ్లి అక్కడ కూడ తుఫాన్ బాధితుల సహాయ కార్యక్రమాలు చూపించి బహిరంగ సభలో పాల్గొన్న తరువాత సాయంకాలానికి ఖమ్మం జిల్లా కొత్త గూడెం చేరుకున్నాము. అక్కడ సింగరేణి కాలరీస్ గెస్ట్‌హౌస్‌లో విశ్రాంతి తీసుకొని, అక్కడ నుంచి పాల్వంచ దగ్గర కిన్నెరసాని ప్రాజెక్టు చూసి ట్రైబల్ బాయ్స్ రెసిడెన్షియల్ స్కూల్ దర్శించాము. ఆ తరువాత అక్కడ బహిరంగ సభలో ఇందిరాగాంధి 20 సూత్రాల కార్యక్రమం కింద దాదాపు రు.4కోట్ల దాకా బలహీన వర్గాలకు పాడిపశువులూ, ఆయిల్ యింజన్లూ, ఎడ్ల బండ్లు మొదలైనవి పంపిణీ చేయటం జరిగింది. అక్కడి నుంచి కొత్తగూడెం తిరిగి వచ్చాము. అక్కడ ఏర్పాటు చేసిన పెద్ద బహిరంగ సభ ఘనంగా జరిగింది. ఆ సభను ముగించుకొని, గెస్ట్‌హౌస్‌కు వెళ్లి డిన్నర్ తీసుకొని కొత్తగూడెం నుండి రాత్రి 11 గం.లకు హైదరాబాదుకు రైలులో బయలుదేరాము. ఆ రైలుకు ఒక ఏ.సి. కోచ్ ప్రత్యేకంగా ఏర్పాటు చేయించాము. అందులో ప్రయాణం చేసి

తెల్లవారే సరికి సికింద్రాబాద్ చేరుకున్నాము. లేక్‌వ్యూ గెస్ట్‌హౌస్‌కు చేరుకొని స్నానం, బ్రేక్‌ఫాస్ట్ అయింతర్వాత అప్పటికే హైదరాబాదు వచ్చి వేచివున్న కర్నాటక ముఖ్యమంత్రి తదితరులను కలవటం జరిగింది. వారు సంజయ్ గాంధీని కర్నాటక పర్యటనకు ఆహ్వానించి తీసుకొని వెళ్లేందుకు ముందుగా యిక్కడికి వచ్చారు. మేము ఎయిర్‌పోర్టు వరకు వెళ్లి వీడ్కోలు చెప్పివచ్చాము.

## లోక్‌సభకు ఎన్నికలు :

పార్లమెంటుకు ఎన్నికలు జరిగే ముందు ప్రధాని ఇందిరాగాంధి ముఖ్యమంత్రులందర్నీ పిలిచి అంతవరకూ జైళ్లలో వున్న నాయకులందర్నీ వదిలి వేసి ఎన్నికలు జరిపించాలనుకుంటున్నానని చెప్పి, మా అభిప్రాయం అడిగారు. నేను మా రాష్ట్రంలో **42** సీట్లకు గాను కనీసం **40** తప్పక గెలుస్తామని చెప్పాను. ఉత్తరాది రాష్ట్రాల ముఖ్యమంత్రులెవ్వరూ అంత మాత్రం ధైర్యంగా జవాబివ్వలేకపోయారు. సంజయ్‌గాంధీ ప్రోద్బలంవల్ల ఎమర్జన్సీ కాలంలో ఆయా రాష్ట్రాలలో జరిగిన పొరబాట్లే దానికి కారణం. అప్పుడు జరిగిన ఎక్సెసెస్ వల్లనే ప్రజలంతా కాంగ్రెస్‌పై ఆగ్రహంతో వున్నారు. ప్రతిపక్ష నాయకులను జైళ్లలో వుంచినప్పుడు అంతా అక్కడ జైలులోనే చర్చలు జరిపి ఎలాగైనా ఓడించాలనే కృత నిశ్చయంతో దీక్షబూని బయటికి వచ్చారు. జయప్రకాశ్ నారాయణ్, ఆచార్య కృపలానీ వంటి వృద్ధ స్వాతంత్ర్య సమర యోధులను జైళ్లలో పెట్టటం వల్ల కూడ ప్రజలు కాంగ్రెస్‌పై ఆగ్రహంతో వున్నారు. అన్ని పార్టీలవారూ జయప్రకాశ్ నాయకత్వాన్ని అంగీకరించి ఆయన చెప్పినట్లు చేస్తామని వొప్పుకున్నారు.

## జనతా ప్రభంజనం :

ఎన్నికల ఫలితాలు వెల్లడయ్యేసరికి జనతా ప్రభంజనంలో కాంగ్రెస్ కొట్టుకొనిపోయింది. ఆంధ్రప్రదేశ్, కర్నాటక, మహారాష్ట్రలలో మాత్రం కాంగ్రెస్ గెలిచింది. ఆంధ్రప్రదేశ్‌లో ఎన్నికలు ప్రశాంత వాతావరణంలో జరిగాయి. రాష్ట్రంలోని **42** లోక్‌సభ నియోజకవర్గాలలో కాంగ్రెస్ **41** గెలుచుకొంది. కాంగ్రెసేతర అభ్యర్థులలో నంద్యాల నుంచి జనతా పార్టీ అభ్యర్థిగా పోటీ చేసిన ఆంధ్రప్రదేశ్ తొలి ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి ఒక్కరే గెలుపొందగలిగారు. ఆయన తరువాత లోక్‌సభ స్పీకర్‌గా ఎన్నికయ్యారు. **1969**లో ఆయన రాష్ట్రపతి పదవికి కాంగ్రెస్ అభ్యర్థి ఇందిరాగాంధి వ్యతిరేకత కారణంగా ఆయన

ఓడిపోయారు. తిరిగి 1978లో జనతా పార్టీ సంజీవరెడ్డి గారినే రాష్ట్రపతి పదవికి తమ అభ్యర్థిగా నిర్ణయించడం, ఆయన గెలవటం జరగటంతో నంద్యాల లోక్‌సభ స్థానానికి ఉప ఎన్నిక జరిగింది. ఆ ఉప ఎన్నికల్లో ఆ సీటు కూడ కాంగ్రెస్‌కే లభ్యం కావటంతో రాష్ట్రంలో నూటికి నూరు శాతం స్థానాలు కాంగ్రెస్సే గెలుచుకోగలిగింది. నేను ముఖ్యమంత్రి కాక ముందుకాని, నా తరువాత గాని యింతటి బ్రహ్మాండమైన విజయం కాంగ్రెస్‌కు లభించ లేదు. ఇది నా పరిపాలనా కాలంలో జరిగిన ఆల్ టైం రికార్డ్ అని ఇతర రాష్ట్రాలలో నాయకులుగా వున్న నా మిత్రులు అంటుంటారు.

జయప్రకాశ్ నారాయణ్ గారి ఆశీస్సులతో మొరార్జీ దేశాయ్ గారు ప్రధానిగా కేంద్రంలో జనతా ప్రభుత్వం ఏర్పాటయింది. భారత దేశం స్వాతంత్ర్యం పొందిన తరువాత కేంద్రంలో కాంగ్రెస్ కాక మరో పార్టీ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడం అదే మొదటిసారి.

## క్రొత్త అనుభవం :

రాష్ట్రాలలో వుండే కాంగ్రెస్ ప్రభుత్వాలకు కేంద్రంలో అధికారంలో వున్న మరో పార్టీ ప్రభుత్వంతో కలసి మెలసి పనిచేయడం అదొక కొత్త అనుభవం. ఈ పరిస్థితిలో కలిగే ఒత్తిడులు వేరే రకంగా వుంటాయి.

కేంద్రం నాపైన ప్రైమాఫేసీ కేస్ లేకపోయినా ఒక విచారణ సంఘాన్ని నియమించింది. ఈ సంగతి వేరేచోట విశదంగా ప్రస్తావించాను. కేంద్రంలోని నాన్-కాంగ్రెస్ ప్రభుత్వంతో సర్దుకొని పోవాలని నేను ఎంతో ప్రయత్నం చేశాను. అయితే కొన్ని సందర్భాలలో వారి ధోరణి నాకే మాత్రం నచ్చలేదు. ముఖ్యంగా రాష్ట్రపరిపాలనలో కేంద్రం జోక్యం చేసుకొనే ప్రయత్నాలకు నేను తలొగ్గేవాడిని కాదు. ఇదెందుకు రాస్తున్నానంటే ఈ సంగతి 'మొరార్జీ పేపర్స్' అన్న పుస్తకంలో ప్రస్తావించబడింది. మొరార్జీ దేశాయి ప్రధానిగా వుండగా ఆయనకూ, అప్పటి రాష్ట్రపతి నీలం సంజీవరెడ్డి గారికీ మధ్య నడిచిన ఉత్తర ప్రత్యుత్తరాలలో కూడ ఈ అంశం చోటు చేసికొంది. చల్లపల్లి సుగర్ ఫ్యాక్టరీకి చెందిన వ్యావసాయిక భూములకు భూ సంస్కరణల చట్టాన్ని రాష్ట్రప్రభుత్వం వర్తింప జేయటం గురించి ప్రధాని మొరార్జీ దేశాయి రాష్ట్రప్రభుత్వానికి రాశారు. నిజాం సుగర్ ఫ్యాక్టరీకి ఒక రకంగా, చల్లపల్లి ఫ్యాక్టరీకి మరొక రకంగా చట్టాన్ని వర్తింప చేయటంలో విచక్షణ

పాటించినట్లు ఆయన అభిప్రాయపడ్డారు. నిజాం సుగర్ ఫ్యాక్టరీ ప్రభుత్వరంగ సంస్థ. ప్రభుత్వ రంగ సంస్థకు చెందిన భూవములకు మినహాయింపు వుంది. అయితే ప్రభుత్వ రంగ సంస్థలలో కూడా ప్రయివేటు షేర్లకు సంబంధించిన పొలాలకు మినహాయింపు లేదు. అందుకనే నిజాం సుగర్స్ ప్రభుత్వ రంగ సంస్థ అయినా దానికి పూర్తిగా మినహాయింపు లభించలేదు. ఇచ్చిన మినహాయింపేదో చట్టప్రకారం లభించిందే గాని ప్రభుత్వం నిబంధనలు సడలించి పక్షపాతంతో యిచ్చింది కాదు.

'మొరార్జీ పేపర్స్' అన్న పుస్తకంలో ప్రస్తావించబడిన దానిని బట్టి చూస్తే సంజీవరెడ్డిగారికి, మొరార్జీకి మధ్య కలిగిన పొరపొచ్చాలు ఎంత తారస్థాయికి చేరుకున్నదీ అర్థమవుతుంది. ఒక పరిస్థితిలో 'ఆంధ్రప్రదేశ్‌లో జనతా అభ్యర్థులందరితోపాటు సంజీవరెడ్డి కూడా ఓడిపోయి వుంటే పీడా పోయేది' - అని జనతా పార్టీ ఆనంద పడివుండేది - అని అన్నంతవరకూ వెళ్లిందని ఆ పుస్తకంలో వుంది.

(మొరార్జీ దేశాయి గార్కి, నాకు జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలు అనుబంధంగా పొందుపర్చాను. చల్లపల్లి సుగర్స్‌కు సంబంధించిన కేసు సమాచారాన్ని దానినుండి గ్రహించవచ్చు.)

## కమీషన్లు :

జనతాపార్టీ అధికారంలోకి రాగానే చేసిన పనుల్లో వొకటి ఎమర్జన్సీలో జరిగిన అకృత్యాల విచారణకై ఇందిరాగాంధీ మీద, సంజయ్ గాంధీ మీద షా కమీషన్‌ను నియమించటం. ఇందిరాగాంధి గారు చేసిన తప్పులన్నిటినీ రుజువు చేసి ఆమెను కఠినంగా శిక్షించాలనే ఉద్దేశంతో యీ కమీషన్ ఏర్పాటు జరిగింది. ఇందిరాగాంధితో పాటు, దేశంలో కాంగ్రెస్ ముఖ్యమంత్రులుగా వున్న వారందరిపైనా - వారు నేరంచేసినా చేయక పోయినా - ఏదో విధంగా కక్ష సాధించాలన్న అభిప్రాయంతో కమీషన్‌లను వేశారు. నా మీద కూడ బొంబాయి హైకోర్టు జడ్జి విమద్‌లాల్ గారితో ఒక కమీషన్ వేశారు. ఇందిరాగాంధి షా కమీషన్ ముందు ఒకటి రెండు సార్లు హాజరయింది. అయితే కమీషన్ వారు నిష్పక్ష పాతంగా వ్యవహరించకుండా జనతా ప్రభుత్వం చెప్పినట్లు న్యాయ వ్యవస్థ పరువు తీస్తున్నారనే ఆరోపణతో ఆమె కమీషన్‌ను బాయ్‌కాట్ చేయాలనే నిర్ణయం

తీసికొన్నారు. ఆమెతో పాటు కాంగ్రెస్ ముఖ్యమంత్రులు కూడా కమీషన్లను బాయ్‌కాట్ చేయడం జరిగింది.

## ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నిర్దోషి :

నేను మాత్రం కమీషన్‌ను బాయ్‌కాట్ చేయడం మంచిది కాదనీ, మనమేమి తప్పు చేయునప్పుడు కమీషన్‌ను బాయ్‌కాట్ చేయువలసిన అవసరం లేదనీ, మనమేమి తప్పు చేయనప్పుడు కమీషన్ వారైనా మననేమి చేస్తారనే అభిప్రాయంతో కమీషన్ ముందు విచారణకు హైదరాబాదు లోనూ, బొంబాయిలోనూ హాజరై, వారి ముందు యదార్ధంగా జరిగింది జరిగినట్లు నిర్మొహమాటంగా చెప్పడం జరిగింది. విమద్‌లాల్ కమీషన్ విచారణ ఒక సంవత్సర కాలంలోనే పూర్తయింది. అన్ని రికార్డులూ, సాక్ష్యాలూ పరిశీలించి కమీషన్ వారు కేంద్రానికి తమ నివేదికను అంద చేశారు. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి ఏ నేరం చేయకుండానే ఆయనపై కమీషన్ వేయడం అన్యాయం. అయినా ఆయన అభ్యంతరం చెప్పకుండా, బాయ్‌కాట్ చేయకుండా విచారణకు హాజరుకావటం జరిగింది. ఆయనపై ఆరోపించబడిన వేవీ ఋజువు కాలేదు. ఆయన పరువు ప్రతిష్ఠలను దెబ్బతీయడం కోసమే ఈ నేరాలన్నీ ఆయనపై మోపడం జరిగింది. కాని ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నిజాయతీపరులు. నిర్మొహమాటంగా అన్ని విషయాలూ కమీషన్ ముందు చెప్పగలిగారు. ఆయనపై నేరారోపణలు చేసి వాటిని ఋజువు చేయలేక పోయిన వారందరినీ ప్రాసిక్యూట్ చేయాలని సిఫార్స్‌చేస్తూ కమీషన్ తన నివేదికను కేంద్రానికి సమర్పించింది. అప్పుడు కేంద్రంలో జనతా పార్టీ ప్రభుత్వంలో హోం మంత్రిగా వున్న చౌదరీ చరణ్‌సింగ్ ఈ నివేదికను పార్లమెంటుకు సమర్పిస్తూ ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నిర్దోషి అని రాత పూర్వకంగా ప్రకటించారు.

## ఇందిరకు జైలు :

ఇందిరాగాంధి మీద, కాంగ్రెస్ ముఖ్యమంత్రులమీద వేసిన కమీషన్ల విచారణకు వారు హాజరు కాకుండా బాయ్‌కాట్ చేయడంతో కమీషన్ వారు తమ ముందున్న రికార్డులూ, సాక్ష్యాధారాలతో వారిపై మోపిన నేరాలలో కొన్ని ఋజువయినవని నివేదికలు యివ్వటం జరిగింది. ఇందిరాగాంధి తరువాత కర్నాటకలోని చిక్ మగళూరు నుండి లోక్‌సభకు పోటీ చేసి ఎన్నికయ్యారు. ఆమెకు వ్యతిరేకంగా జనతాకు చెందిన వీరేంద్ర పాటిల్ పోటీ చేసి వోడిపోయారు.

పాటిల్ అంతకుముందు కర్నాటక ముఖ్యమంత్రిగా వున్నారు. అయితే అప్పటి ముఖ్యమంత్రి దేవరాజ్ అర్స్ ఎంతో పట్టుదలగా పనిచేసి ఇందిరాగాంధీని పెద్ద మెజారిటీతో గెలిపించ గలిగారు. ఆ ఎన్నికల్లో ఇందిరాగాంధీని గెలిపించటం కోసం ఆయన డబ్బు విపరీతంగా ఖర్చు చేశారని అంటారు. ఇందిరాగాంధి వచ్చి లోక్‌సభలో కూర్చోటం జనతా పార్టీకి బొత్తిగా యిష్టం లేదు. ఆమె లోగడ ప్రధానిగా వుండగా పార్లమెంటుకు పొరబాటున యిచ్చిన స్టేటుమెంటును తీసికొని ఆమె పార్లమెంటును ఉద్దేశపూర్వకంగా తప్పుదారి పట్టించారని ఒక హక్కుల తీర్మానం తెచ్చారు. ఆ తీర్మానాన్ని సభాహక్కుల సంఘం ముందు వుంచారు. ఆ సంఘం నివేదికను లోక్ సభకు సమర్పించారు. తరువాత జనతా పార్టీకి మెజారిటీ వుండటం వల్ల సభ యథాతథంగా ఆ నివేదికను ఆమోదించింది. అప్పటి స్పీకర్ వెంటనే ఆమె పార్లమెంట్ సభ్యత్వాన్ని రద్దు చేసి ఒక రోజు జైలుశిక్షను విధించి జైలుకు పంపటం జరిగింది. ఇందిరాగాంధి ఆ రోజు రాత్రి జైలులో గడిపి మరునాడు ఉదయం విడుదల అయ్యారు. సంజయ్‌గాంధి మీద అనేక నేరాలు ఋజువయినందున ఆయనకూ, మాజీ సమాచార శాఖ మంత్రి వి.సి.శుక్లాకు కఠిన కారాగార శిక్షవిధించారు. వారు హైకోర్టుకు అప్పీలు చేసి, బెయిలుపై విడుదలయ్యారు. ఆ వి.సి.శుక్లా యిటీవల దాకా పి.వి.నరసింహారావు మంత్రి వర్గంలో కేంద్ర నీటి పారుదల శాఖ మంత్రిగా వున్నాడు. ఆయన హవాలా కేసు సందర్భంగా మంత్రి పదవికి రాజీనామా చేయటం జరిగింది.

## రాష్ట్రప్రభుత్వాల రద్దు :

1977 పార్లమెంట్ ఎన్నికలకు ముందే అప్పుడు రాష్ట్రపతిగా వున్న ఫక్రుద్దీన్ ఆలీ అహమ్మద్ అకస్మాత్తుగా మరణించారు. ఎమర్జన్సీ ప్రకటనపై సంతకం చేసినది ఆయనే. ఆయన మరణానంతరం అప్పటి ఉపరాష్ట్రపతి బి.డి.జెట్టి తాత్కాలిక రాష్ట్రపతిగా ప్రమాణ స్వీకారం చేశారు. జనతా ప్రభుత్వం అధికారంలోకి రాగానే కాంగ్రెస్ పార్టీ ఓడిపోయిన రాష్ట్రాలలో వున్న కాంగ్రెస్ ప్రభుత్వాలను అన్నిటినీ బర్తరఫ్ చేయాలనీ, శాసన సభలను రద్దు చేసి తిరిగి ఎన్నికలు జరపాలనీ, రాష్ట్రపతి పాలన ప్రవేశపెట్టాలనీ నిర్ణయం తీసికొన్నారు. కేంద్ర మంత్రి మండలి ప్రధాని మొరార్జీ దేశాయ్ అధ్యక్షతన సమావేశమై ఆ విధంగా తీర్మానం చేసి, ఆ తీర్మానాన్ని రాష్ట్రపతి ఆమోదం కోసం పంపారు. కాని ఆయన వెంటనే సంతకం చేసి పంపక, పరిశీలన కోసం ఒక రోజు ధైర్యంగా తన దగ్గర పెట్టుకున్నారు. దానిపై మొరార్జీ

దేశాయ్, ఆయన మంత్రి వర్గ సభ్యులు రాష్ట్రపతి కాంగ్రెస్ పక్షపాత ధోరణితో వ్యవహరిస్తున్నారనీ, రాజ్యాంగం ప్రకారం మంత్రి మండలి తీర్మానాన్ని రాష్ట్రపతి ఆమోదించాలే కాని తిరస్కరించటానికి ఆయనకు హక్కులేదనీ విమర్శించారు. అయితే ఆ రాత్రి రాష్ట్రపతి సంతకంతో ఫైలు రావటం తెల్లవారే సరికి వివిధ రాష్ట్రాలలో కాంగ్రెస్ ప్రభుత్వాలను బర్తరఫ్ చేసి, శాసనసభలను రద్దు చేసి రాష్ట్రపతి పాలన ప్రవేశ పెట్టడం జరిగింది. అయితే లోక్‌సభ ఎన్నికల్లో కాంగ్రెస్ గెలిచిన ఆంధ్రప్రదేశ్, కర్నాటక, మహారాష్ట్ర, కేరళలలోని కాంగ్రెస్ ప్రభుత్వాలను మాత్రం వారేమీ చేయజాలకపోయారు. కొద్ది నెలల తరవాత ప్రభుత్వాలు రద్దయిన రాష్ట్రాలలో ఎన్నికలు రావటం, జనతా పార్టీ గెలిచి రాష్ట్రప్రభుత్వాల నేర్పాటు చేయడం జరిగింది. కేంద్రంలో మాకు వ్యతిరేకంగా వున్న పార్టీ ప్రభుత్వం వున్నా, రాష్ట్రంలో కాంగ్రెస్ ప్రభుత్వాన్ని నడపటంలో నాకెట్టి యిబ్బంది కలగలేదు. రాజకీయాలకు కాకుండా, రాష్ట్రాభివృద్ధిని దృష్టిలో వుంచుకొని కేంద్రంతో ఘర్షణ విధానానికి పోకుండా సహకరిస్తూ, సహకారం సంపాదించుకొనే పద్ధతిలో మేము వ్యవహరించటమే యిందుకు కారణం.

# దివిసీమ ఉప్పెన

రాష్ట్రం ప్రశాంతంగా వుంటూ, అభివృద్ధి కార్యక్రమాలన్నీ సజావుగా సాగిపోతుండగా అనుకోని విధంగా రాష్ట్రం ప్రకృతి వైపరీత్యానికి గురయింది. 1977 నవంబరు 16న బంగాళాఖాతంలో ఏర్పడ్డ వాయుగుండం కారణంగా భయంకరమైన తుఫాన్ ఏర్పడింది. ఆ వాయువేగానికి అలలు తీవ్రంగా చెలరేగి దాదాపు 18 అడుగుల ఎత్తు దాకా లేచాయి. ఉప్పెన వచ్చి కృష్ణా జిల్లాలో 30 గ్రామాలదాకా తుడిచి పెట్టుకొని పోయాయి. కొన్ని వేలమంది మనుష్యులు, పశువులు, పక్షులు మరణించడం జరిగింది. సముద్ర తీరాన్నుంచి 30 మైళ్లదాకా ఉప్పెన నీరు ముంచి వేయటంతో లక్షలాది ఎకరాల పంటనాశనం కావటమే కాక అనేక వేల ఎకరాలు మళ్లీ సాగుకు పనికిరాకుండా యిసక మేటవేసి పాడయ్యాయి. అంతకు ముందు దాదాపు వందేళ్ల కిందట యిదే విధంగా భయంకరమైన తుఫానూ, ఉప్పెనా వచ్చి బందరు పట్టణం దారుణంగా నష్టపోయింది. అప్పుడు ఇంగ్లీషువారు మన దేశాన్ని పాలిస్తూ వున్నారు. ఒక్క బందరు లోనే కొన్ని వేల మంది చనిపోయారు. ఇక చుట్టు ప్రక్కల పల్లెల సంగతి చెప్పనక్కర లేదు. ఈసారి కూడా బందరు పట్నంతోపాటు అనేక గ్రామాలు జలమయమయ్యాయి. జిల్లా కల్టక్టర్ బంగళా కింది అంతస్తు మునిగిపోయింది. తుఫాన్ తాకిడికి చెట్లూ, కరెంటు స్తంభాలూ, టెలిఫోన్ స్తంభాలు విరిగి రోడ్లకడ్డంగా పడటంతో రాకపోకలు స్తంభించి పోయాయి. కృష్ణాజిల్లాలోని దివితాలూకా, బందరు తాలూకాలే కాకుండా, గుంటూరు, ప్రకాశం జిల్లాలలో దాదాపు చీరాల దాకా పంటలు దెబ్బతిన్నాయి.

కేంద్ర ఆర్థిక మంత్రి హెచ్.యం.పటేల్ ముఖ్యమంత్రులనందర్నీ ఢిల్లీకి ఆహ్వానించి, ఒక సమావేశాన్ని ఏర్పాటు చేస్తే నేను దానికి హాజరయ్యేందుకు గాను ఢిల్లీ వెళ్లి ఆ రోజు అక్కడ వుండటం తటస్థించింది. అయినా ఎప్పటికప్పుడు బంగాళాఖాతంలో వాయు గుండం కదలిక గురించి హైదరాబాదు నుండి నాకు సమాచారం అందుతూ వుండేది. మొదట్లో తుఫాను నెల్లూరు జిల్లా - మదరాసుల మధ్య తగులుతుందని వాతావరణ శాస్త్రజ్ఞుల అంచనా. చివరకు ఆ వాయు గుండం అనుకోని విధంగా తిరిగి వాతావరణ శాస్త్రజ్ఞులు చెప్పిన దానికి భిన్నంగా బందరు దగ్గర తీరాన్ని తాకటం సంభవించింది. రోడ్లమీద చెట్లు పడటం వల్ల రాకపోకలు స్తంభించటంతో జిల్లా కలక్టర్‌గాని, యితర

అధికారులుగాని వెంటనే దెబ్బతిన్న ప్రాంతాలకు వెళ్ళి సహాయ కార్యక్రమాలను ప్రారంభించటం అసాధ్యంగా మారింది. నేను ఢిల్లీ నుండి ఛీఫ్ సెక్రటరీతో ఫోన్‌లో మాట్లాడి సీనియర్ ఐ.ఏ.యస్ అధికారులను తుఫాన్ తాకిడికి గురయిన అన్ని ప్రాంతాలకూ పంపించ వలసిందిగా ఆదేశాలిచ్చాను. వారు అతికష్టం మీద ఆయా జిల్లాలకు చేరుకో గలిగారు. నేను కూడ నవంబరు 17 సాయంకాలానికే హైదరాబాదుకు తిరిగి రావటం 18 ఉదయానికల్లా గన్నవరం విమానాశ్రయానికి విమానంలో చేరుకున్నాను. అక్కడి నుంచి కారులో వెళ్లటం సాధ్యం కాదని మిలటరీ హెలీకాప్టర్ తెప్పించుకొని హెలీకాప్టర్‌లో బయలుదేరాను. వాతావరణం బాగా లేనందున పైలట్ హెలీ కాప్టర్‌ను దింపలేక మళ్లించి చివరకు గుంటూరు పెరేడ్ గ్రౌండ్స్‌లో దింపాడు. గుంటూరు జిల్లాలో కూడ విశేషంగా పంట నష్టం జరగటమే కాక అనేక మంది మరణించారు. నేను జిల్లా కల్టక్టర్, ఇతర అధికారులతో మాట్లాడి సహాయ చర్యల గురించి ఆదేశాలిచ్చాను. రాకపోకలు యింకా స్తంభించి వుండటంతో ఎక్కడ ఎంత మంది మరణించారు అన్న వివరాలు అప్పటి కింకా అందటం కష్టంగా వుంది. అధికార బృందాలు కాలినడకన బయలు దేరి సహాయ కార్యక్రమాలను చేపట్టాలని చెప్పాను. సాయంకాలం నేను హైదరాబాదు చేరుకుని ప్రధాని మొరార్జీ దేశాయ్ గారికి పరిస్థితి తీవ్రతను వైర్‌లెస్ ద్వారా తెలియ చేశాను. మళ్లీ రెండో రోజు విమానంలో గన్నవరం చేరి హెలీ కాప్టర్‌లో బయలుదేరాము. వాతావరణం కొంత ప్రశాంతంగా వుండటంతో ఎలాగో దివితాలూకా అవనిగడ్డలో దిగగల్గాము.

## యుద్ధప్రాతిపదిక :

నా మంత్రి వర్గంలో విద్యాశాఖ మంత్రిగా వున్న మండలి వెంకట కృష్ణారావుగారు కూడ అక్కడే వున్నారు. ఆయన ఆ రాత్రి అవనిగడ్డలోనే వున్నా, తుఫాన్ తీవ్రత కారణంగా ఒక చోట ఏం జరుగుతుందో మరొక చోట తెలియని స్థితి దాపురించటంతో ఆయన ఎంతో దిగ్భ్రాంతికి లోనయివున్నారు. నేనే 17న గన్నవరం వస్తానని ఆయనకు ఎవరో చెప్పగా. నానా కష్టాలుపడి ఆయన గన్నవరం చేరుకొని నన్ను చూడగానే దుఃఖం ఆపుకోలేక ఏడవటం మొదలు పెట్టారు. చాలా మంది మరణించారనీ, ఒక గ్రామం నుండి యింకో గ్రామం వెళ్లే వీలు లేకుండా అయిందనీ ఆయన చెప్పారు. నేను ఆయనకు ధైర్యం చెప్పి తప్పకుండా సాయం చేస్తామని ఆయనను కూడా హెలీకాప్టర్‌లో తీసుకొని బయలుదేరాము కాని అవనిగడ్డలో దిగలేక పోయాము. అయితే 18న పరిస్థితి కాస్తమెరుగవటంతో

అవనిగడ్డలో హెలీకాప్టర్‌ను పైలట్ దించగల్గాడు. ఉప్పెన తాకిడికి పోయిన వారు పోగా బతికి వున్నవారిని ముందు సురక్షిత ప్రాంతాలకు తరలించి అక్కడ వారికి ఉచిత భోజనవసతి, సౌకర్యాలు, వైద్య సహాయం ఏర్పాటు చేయడం, శవాలను తొలగించి అంత్యక్రియలు జరిపించటం చేపట్టాల్సి వుంది. అదీగాక, ఆ ప్రాంతాలలో కలరా ప్రబలే ప్రమాదం వుంది గనుక ముందు జాగ్రత్త చర్యగా అందరికీ కలరా యింజక్షన్లు యిచ్చే ఏర్పాటు చేయడం, పునరావాస కార్యక్రమాలు చేపట్టటం, రహదారులపై వున్న ఆటంకాలు తొలగించి సహాయ కార్య క్రమాలను చురుకుగా కొనసాగించేందుకు దోహదం కల్పించడం, అక్కడి వారెవ్వరూ కలుషితమైన నీరు తాగకుండా టాంకర్ల ద్వారా మంచినీటిని తెప్పించి యివ్వడం – యిలా అనేక కార్యకమాలు చేయాల్సి వుంది. వీటన్నిటి పైనా అధికారులకు తగిన ఆదేశాలు యివ్వటం జరిగింది. ప్రభుత్వోద్యోగులంతా రాత్రింబవళ్లు పనిచేశారు. నేను విజయవాడలోనే 10 రోజులపాటు మకాం పెట్టాను. అక్కడవుంటూ, కారులోనూ, హెలీకాప్టర్‌లోనూ అన్ని ప్రాంతాలూ తిరుగుతూ తుఫాన్‌పీడిత ప్రాంతాలలో సహాయ కార్యక్రమాలు ఎలా అమలు జరుగుతున్నవో ఎప్పటికప్పుడు సమీక్షించి అక్కడికక్కడే ఆదేశాలివ్వటం జరిగేది. బట్టలు, ఆర్థిక సహాయం పంపిణీ, భోజన వసతి సౌకర్యాల ఏర్పాటు యుద్ధ ప్రాతిపదికపై జరిపించాము బందరు నుంచి చీరాలదాకా నేను దాదాపు ప్రతి గ్రామానికి వెళ్లి పరిస్థితిని తెలుసుకొని ప్రజలకు ధైర్యం చెప్పి సహాయ కార్యక్రమాలు సక్రమంగా జరిగేటట్లుగా చూడటం జరిగింది. అప్పుడు నేను సంగమేశ్వరం అనే గ్రామంలో దిగాను. అక్కడ మగవారు తాటి చెట్లపైకి ఎగబాకి వాటిని గట్టిగా కరచుకొని వుండటం వల్ల నీటిలో కొట్టుకుపోకుండ వుండి బతికి బయటపడగలిగారు. నేను వారిని ఉప్పెన ఎలా వచ్చిందీ, ఏమిటీ చెప్పమని అడిగాను. వారు చెప్పినది ఆశ్చర్యంగా వుంది. అర్ధరాత్రి సముద్రంలో ఒక పెద్ద అగ్ని గోళంలాటిది కనుపించిందనీ, ఆ తరువాత అయిదు నిమిషాల్లోనే ఒక పెద్ద కెరటం వచ్చి వూరిని ముంచేసిందనీ వారు చెప్పారు. 'ఆ కెరటం అలా 30 మైళ్లదాకా చొచ్చుకొని పోయింది. అదివెళ్లినంత మేరా సర్వనాశనంఅయింది. మేము ఎలాగో తాటిచెట్లెక్కి ప్రాణాలు కాపాడుకున్నాము', అని వారన్నారు.

## ఖైదీలు చేసిన సేవ :

ఆ ఉప్పెన వల్ల మరణించిన వారి శవాలనూ, పశువుల కళేబరాలనూ దహనం చేయడం పెద్ద సమస్య అయింది. నీటిలో నాని కుళ్లి దుర్వాసన

వేస్తుండటంతో అది మరీ యిబ్బంది కరమై కూచుంది. సింగరేణి కాలరీస్ ఛైర్మన్‌ను 40 వేల టన్నుల బొగ్గునూ, 150 మంది కార్మికులనూ అక్కడికి పంపమని వైర్‌లెస్‌పై ఆదేశించాము. కార్మికులేగాక, స్థానికులూ, స్వచ్ఛంద సంస్థల కార్యకర్తలూ, అన్ని రాజకీయ పార్టీలవారూ యీ కార్యక్రమంలో సహకరించారు. శవాల దహన కార్యక్రమంలో పాల్గొన టానికి వచ్చిన వారికి శిక్ష తగ్గిస్తామని చెబుతే ఆయా జైళ్లలో వున్న అనేక మంది ఖైదీలు కూడ కార్యక్రమంలో పాల్గొన్నారు. వారంతా ఎంతో పట్టుదలతో, దీక్షతో, అనేక కష్టనష్టాలకూ, యిబ్బందులకూ ఓర్చి రాత్రింబవళ్లు కృషి చేసి పనులను పూర్తిచేశారు. అలాగే రహదారుల కడ్డంగా వున్న చెట్లనూ, అడ్డంకులనూ తొలగించటం, టెలిగ్రాఫ్, టెలిఫోన్, విద్యుత్సౌకర్యాలను పునరుద్ధ రించటం, తెగిన కాలువలను బాగు చేయడం వంటి పనులనేకం మేమిచ్చిన మోరల్ సపోర్టుతో స్థానికుల తోనూ, స్వచ్ఛంద సేవకులతోనూ కలిసి కార్యకర్తలు పూర్తి చేయగలిగారు.

## బాధితులకు సహాయం :

తుఫాన్ భీభత్సం గురించి తెలుసుకొన్న ప్రజలు తమశక్తి కొలది తుఫాన్ బాధితులకు సాయపడాలని బట్టలు, మందులు, ఆహార పదార్థాలు, వంట సామాను మొదలయిన వాటిని పంపటం జరిగింది. మన రాష్ట్రం నుండీ, దేశంలోని యితర ప్రాంతాల నుండే కాక, ఇతర దేశాలనుండి కూడ సహాయం విశేషంగా లభించింది. ముఖ్యంగా ముఖ్యమంత్రి సహాయ నిధికి అధిక మొత్తంలో విరాళాలందసాగాయి. ఉపకారబుద్ధితో ప్రజానీకం అందిస్తున్న ఈ సహాయం ఖర్చు చేయటంలో అవినీతి ఆరోపణలకు ఆస్కారం లేకుండా చేయాలనే వుద్దేశంతో పునర్నిర్మాణ కార్యక్రమాలను రామకృష్ణమిషన్ వంటి స్వచ్ఛంద సేవాసంస్థలకు అప్పగించాము. ఇళ్లు దెబ్బతిన్న గ్రామాలలో పక్కాయిళ్ల నిర్మాణం, దెబ్బతిన్న వంతెనలను మరమ్మత్తు చేయడం, కాలువలను బాగు చేయడం మొదలయిన కార్యక్రమాలను చేపట్టి పూర్తిచేయటం జరిగింది. 'ఇదొక మహాయజ్ఞం. అత్యంత భయంకరంగా వున్న పరిస్థితిని చూసి కాళ్లు చేతులూ ఆడక యింకొకరయితే రాజీనామా చేసి పారిపొయ్యేవారు. మీరు ఎంతో ధైర్యంతో పరిస్థితిని ఎదుర్కొని మూడు నెలలలోనే మామూలు పరిస్థితులను ఏర్పరచగల్గారు', అంటూ అక్కడి గ్రామాలవారిప్పటికీ నన్ను కలుసుకొని చెబుతుంటారు. రాజీనామా చేయటం గొప్ప సంగతికాదు. కష్టకాలంలో

ప్రజలను ఆదుకొని వారి అభిమానాన్ని సంపాదించుకో గలగటం ప్రధానం.

## రాష్ట్రపతి పర్యటన :

అప్పుడు ఢిల్లీలో జనతా ప్రభుత్వం వుంది. జనతా అభ్యర్థిగా రాష్ట్రపతిగా ఎన్నికైన సంజీవరెడ్డిగారు ఉప్పెన వల్ల దెబ్బతిన్న ప్రాంతాలలో పర్యటనకు వచ్చారు. నేను ఆయనకు సహాయ కార్యక్రమాల అమలులో ఎదురైన యిబ్బందులను వివరించాను. రోడ్లకు అడ్డంగా పడిన చెట్లను కొట్టివేయాలంటే మనుషులు దొరకని పరిస్థితి. ఎవరికి కావాలంటే వారు కొట్టుకొని పోవచ్చని చెబితే, చుట్టుప్రక్కల గ్రామాలవారు వచ్చి కొట్టు కొని పోవడం వల్ల రహదారులను తెరిచే అవకాశం వచ్చిందని వివరించాను. ఆయన అంతా తిరిగి చూచి అవనిగడ్డలో మాట్లాడుతూ ఇంత పెద్ద కష్టాన్ని రాష్ట్రప్రభుత్వం ధైర్యంగా ఎదుర్కోగలిగిందని సంతృప్తిని వెల్లబుచ్చటం జరిగింది.

## ప్రధాని పర్యటన :

ప్రధాని మొరార్జీ దేశాయి కూడా దెబ్బతిన్న ప్రాంతాలపర్యటనకు వచ్చారు. నేను వెంట వెళ్లాను. జిల్లాకలెక్టరూ, ఛీఫ్ సెక్రటరీ తుఫాన్ సమయంలో సరిగా పనిచేయలేదనీ, వారిద్దరినీ సస్పెండ్ చేయాలనీ ఆయన నాతో అన్నారు. అర్ధరాత్రి ఒక పెద్ద సముద్ర కెరటం వస్తే వాళ్లిద్దరూ అడ్డు వెళ్లి నిలబడితే ఆగుతుందా? వారిద్దరు కూడా కొట్టుకొనిపోతారు. కనుక వారిని అనటం న్యాయం కాదు. జిల్లా కలక్టర్ బంగళా పైన వుండగా, ఆయన బంగళా కింద భాగం మునిగిపోయింది. ప్రకృతి వైపరీత్యానికి వారేం చేస్తారు? వారిని సస్పెండ్ చేయనని నేను నిర్మొహమాటంగా చెప్పాను.

## స్కై ఈజ్ ది లిమిట్ :

కేంద్రం మనకు సహాయం చేస్తే, మంచిదే. ఒకవేళ కేంద్రం సహాయం చేయకపోయినా ఫరవాలేదు. రాష్ట్రప్రభుత్వ ఆర్థిక పరిస్థితి బాగావుంది. ఈ కష్టాన్ని గడిచి గట్టెక్కుతాం, భయం లేదు అని నేను మా అనుచరులతో చెప్పాను. 'డబ్బుగురించి సందేహించకుండా అవసరమైన కార్యక్రమాలన్నీ పూర్తిచేయించండి! సహాయ కార్యక్రమాలకు నిధుల కొరత లేదు', అని నేను అధికారులకు చెప్పాను. అప్పుడు నన్నొక అధికారి అడిగాడు. 'సహాయ కార్యక్రమాలకు అవసరమైతే ఎంతవరకు ఖర్చు పెట్టవచ్చు?'- అని. 'స్కై ఈజ్‌ది లిమిట్'- అని నేను

జవాబు చెప్పాను. ఆ మాటతో వారందరూ ఉత్సాహంగా పనిచేసి కార్యక్రమాలను శరవేగంతో పూర్తి చేయగలిగారు. సహాయ కార్యక్రమాల అమలును పరిశీలించేందుకు కేంద్రం ఒక బృందాన్ని పంపింది. వారు కూడా పనిబాగా జరుగుతోందని సంతృప్తి వ్యక్తం చేశారు. నిధుల దుర్వినియోగం ఒక్క పైసా అయినా కాలేదని వారు చెప్పారు. దానితో కేంద్రం కూడా సంపూర్ణ సహాయం చేయకతప్పలేదు. కేంద్రం 50 వేల టన్నుల బియ్యం, 50 వేల టన్నుల గోధుమలు యిచ్చింది. వాటిని తుఫాన్ దెబ్బతిన్న ప్రాంతాలలో పంపిణీ చేసి రెండు నెలల దాకా ఏ యిబ్బందీ లేకుండా చూడటం జరిగింది. కొన్ని చోట్ల కావలసిన దానికన్నా ఎక్కువగానే సహాయం అందిందని చెప్పటం జరిగింది. దివిసీమలో వచ్చిన ఉప్పెన వంటి జలప్రళయం ఎప్పుడో ఓ వందేళ్లకు గాని రాదు. అటువంటి దారుణ పరిస్థితిని ఎదుర్కోటానికి అంగ బలం, అర్థబలం పుష్కలంగా వుండాలి. సహాయక చర్యలను ప్లాన్ చేసికోవడం, అమలు చేయటం ఒక పెద్ద పరీక్ష. ముందు టెలిఫోన్, టెలిగ్రాఫ్ సౌకర్యాలనూ, రాకపోకల సౌకర్యాలనూ పునరుద్ధరించు కోవాలి. విద్యుత్సరఫరాను తిరిగి ఏర్పాటు చేయాలి. శరణార్థి శిబిరాలను నెలకొల్పడం, అక్కడ ఆహార పానీయాలూ, బట్టలు, పక్కబట్టలు, పారిశుధ్యం వంటివి ఏర్పరచాలి. అన్నిటికన్నా కష్టతర మైనది చనిపోయిన జంతుకళేబరాలనూ, మానవ శవాలనూ దహనం చేయటం, అంటువ్యాధులు ప్రబలకుండా చూడటం.

తాత్కాలిక చర్యలవల్ల ప్రయోజనం కూడా తాత్కాలికమే. పునరావాసం ఏర్పాటు చేయుటంలో పొలాలలో యిసుక మేటలను తొలగించటం, గృహనిర్మాణం, చేతిపనుల వారికి పరికరాలు, ముడిసరుకు సరఫరా - ఇలా ఎన్నో వుంటాయి. ఈ కార్యక్రమాలన్నీ ఎన్నో నెలల పాటు, కొన్ని సార్లు సంవత్సరాల పాటు జరుగుతూనే వుంటాయి.

## నాటికీ నేటికీ ఒరవడి :

దివిసీమ ఉప్పెన సమయంలో నా ప్రభుత్వం తయారు చేసి అమలు పరచిన ఎమర్జన్సీ ప్రణాళిక అటువంటి ప్రకృతి వైపరీత్యాల సమయంలో యిప్పటికీ ఒక ఒరవడిగా వుంది.

ఉప్పెన వచ్చి పోయి నెలగడిచిందో లేదో నేను శాసన సభలను సమావేశపరచి, అన్నివివరాలు వారి ముందుంచటం జరిగింది. ఈ దుర్ఘటనపై సభ్యులు రెండు రోజులపాటు చర్చించారు. ఆ చర్చలో లేవదీసిన అన్ని

వేలాదిమందిని పొట్టన పెట్టుకున్న దివిసీమ ఉప్పెన రాష్ట్ర ప్రభుత్వానికి ఒక పెను సవాలు– దానిని ధీరోదాత్తంగా ఎదుర్కొన్న శ్రీ వెంగళరావు, ఆ ప్రాంతాన్ని ప్రధాని శ్రీ మొరార్జీ దేశాయ్‌తో కలిసి సందర్శించినప్పటి ఫోటో.

రాష్ట్రపతి నీలం సంజీవరెడ్డితో బేగంపేట విమానాశ్రయంలో ఆదరపూర్వక స్వాగతం.

పాయింట్లకూ నేను సవివరంగా, దాపరికం లేకుండా సమాధానం చెప్పాను. నేను అసెంబ్లీలో జరిగిన చర్చకు జవాబు చెబుతూ చేసిన ప్రసంగ పాఠాన్ని కూడా అనుబంధాలలో పొందు పరచాను.

## పక్కా ఇళ్లు, షెల్టర్లు :

సహాయక చర్యలలో ఇండ్ల నిర్మాణం కూడా ముఖ్యమైనది. ఈ దుర్ఘటన దేశప్రజల దృష్టినే కాక ప్రపంచ ప్రజల దృష్టిని కూడా ఆకర్షించింది. ముఖ్యమంత్రి సహాయ నిధికి పెద్దమొత్తాలలో విరాళా లందాయి. అందుకని వూళ్లకు వూళ్లు కొట్టుకొని పోయిన చోట్ల పక్కా గృహాలను నిర్మించే పథకాన్ని తయారు చేసి అమలు చేశాము. అందులో సగం ముఖ్యమంత్రి సహాయ నిధినుండి యిస్తే మిగతా సగం స్వచ్ఛంద సంస్థలు భరించాయి.

పక్కాయిళ్లు వున్న చోట జన నష్టం చాలా తక్కువగా జరిగిందని తరువాత తేలింది. దాని వల్ల నేర్చుకోవాల్సిన పాఠం ఏమిటంటే అలాటి తీరప్రాంతాలలో గుడిసెలు వేయించే దానికన్నా పక్కాగృహాల నిర్మాణమే మంచిది. హంసల దీవిలో ఒక ప్రాచీనాలయం వుంది. ఆ గుడిలో దాదాపు 200మంది దాకా తలదాచుకొని బతికి బయటపడగలిగారు. నేనా వూరికి వెళ్లి చూస్తే నాకే ఆశ్చర్యమయింది, ఈ గుడి యింతమందిని ఎలా ఆపగలిగిందని! కాబట్టే తీర ప్రాంత గ్రామాలలో పక్కాగా నిర్మించిన సైక్లోన్ షెల్టర్లు అవసరం. దానివల్ల ప్రాణ నష్టాన్ని చాలా వరకు తగ్గించ వచ్చు. సైక్లోన్ షెల్టర్లను కూడా స్వచ్ఛంద సంస్థల సహాయంతో నిర్మించేందుకు పూనుకోటం జరిగింది. అందువల్ల అంతర్జాతీయ రెడ్‌క్రాస్ వంటి సంస్థలూ, యూరోపియన్ ఇకో కమిటీ వంటి సంస్థలూ ఈ సైక్లోన్ షెల్టర్ల నియామకానికి ముందుకు వచ్చాయి. దాదాపు 4,5 వందల దాకా యిలాటి షెల్టర్లను నిర్మించగలిగాము. వేలకొలది పక్కా యిండ్లను కట్టగలిగాము. తుఫాన్ కారణంగా కలిగిన జననష్టం ఆస్తినష్టం గురించి ఎంతో బాధకలిగినా ఆ తరువాత వచ్చిన యిండ్లూ, షెల్టర్ల వంటి వాటిని తలచుకొన్నప్పుడు, శాశ్వత ప్రాతిపదికపై షెల్టర్ల నేర్పరచ గలిగామని నాకు ఎంతో తృప్తి కూడా కలుగుతుంది.

ఆనాడు మేము పరిస్థితిని ధైర్యంగా ఎదుర్కొని, యీనాడు యిలా నిలబడగలిగామంటే ప్రభుత్వం అందించిన ఆసరావల్లనే అని అక్కడి ప్రజలు అంటుంటారు.

# అస్థిర పరిస్థితులు

జనతా పార్టీ ఎన్నికలలో గెలవగానే, ఆ పార్టీ నాయకులంతా జయప్రకాశ్ నారాయణ్ సూచనను అనుసరించి ఢిల్లీలో రాజఘాట్‌లో వున్న గాంధీజీ సమాధి వద్దకు వెళ్లి అందరం కలసి కట్టుగా వుంటామనీ, పదవీ వ్యామోహంతో కాకుండా ఐక్యంగా వుంటూ దేశం అభివృద్ధికోసం స్వచ్ఛమైన పాలన అందిస్తామనీ దీక్ష పూనారు. మొరార్జీ దేశాయి తన ప్రభుత్వంలో అన్ని మిత్రపక్షాలకూ ప్రాతినిధ్యం కల్పించారు. భారతీయ జనతాపార్టీ అధ్యక్షులైన అటల్ బిహారీ వాజ్‌పేయి విదేశాంగ మంత్రి అయ్యారు. అంతకుముందున్న విదేశాంగ శాఖమంత్రుల కన్న ఆయన బాగా సమర్థుడని దేశ విదేశాల్లో పేరు తెచ్చుకోగలిగారు. అలాగే మిగతా పార్టీల నుండి వచ్చిన వారిని కూడ మంత్రి వర్గంలో చేర్చుకున్నారు.

## ముఠా తగాదాలు :

అయితే రెండు సంవత్సరాలు తిరగకుండానే, జయప్రకాశ్ నారాయణ్ యింకా బతికి వుండగానే చరణ్‌సింగ్, జగ్‌జీవనరాం వంటి అనుభవజ్ఞులు, అనేక ఏళ్లపాటు పదవులు నిర్వహించినవారూ కలిసి మొరార్జీ నాయకత్వాన్ని తొలగించటానికి ప్రయత్నించటం జరిగింది. చరణ్ సింగ్, జగ్‌జీవనరాంలు ఎవరికి వారు ప్రధాని కావాలని ప్రయత్నం చేయటం వల్ల జనతా పార్టీలో తగాదాలు తారస్థాయికి చేరాయి. అప్పుడు కాంగ్రెస్ పార్టీ నాయకుడుగా వున్న వై.బి.చవాన్ మొరార్జీ ప్రభుత్వంపై అవిశ్వాస తీర్మానాన్ని ప్రతిపాదించారు. చరణ్‌సింగ్ నాయకత్వం కింద 150 మంది దాకా తీర్మానానికి అనుకూలంగా వోటు చేయడంతో తీర్మానం నెగ్గి, మొరార్జీ దేశాయి ప్రభుత్వం రాజీనామా చేసింది.

## రాష్ట్రపతి వైఫల్యం :

అప్పుడు రాష్ట్రపతి నీలం సంజీవరెడ్డిగారు. ఎవర్ని మంత్రి వర్గం ఏర్పాటు చేయటానికి పిలవాలనేది నిర్ణయించ వలసిన బాధ్యత ఆయనపై వుంది. జనతా పార్టీ వారు జగ్‌జీవనరాంను తమ నాయకునిగా ఎన్నుకొన్నారు. రాజ్యాంగం ప్రకారం రాష్ట్రపతి మెజారిటీ పార్టీ అతడిని మంత్రి వర్గం ఏర్పాటు చేయమని ఆహ్వానించాలి. కాని సంజీవరెడ్డిగారు జగ్‌జీవన రాం గారిని కాకుండా చరణ్‌సింగ్

గారికి అవకాశం యిచ్చారు. ఇది సంజీవరెడ్డిగారు జగ్‌జీవనరాం గారి పట్ల వ్యక్తిగత కక్షతో చేసినట్లు అనిపిస్తుంది. 1969లో సంజీవరెడ్డిగారు కాంగ్రెస్ అభ్యర్థిగా రాష్ట్రపతి పదవికి పోటీ చేసినప్పుడు ఇందిరాగాంధి తరపున జగ్‌జీవనరాంగారు అఖిలభారత కాంగ్రెస్ సంఘ ఆదేశాన్ని కాదని సంజీవరెడ్డిగారికి వ్యతిరేకంగా పని చేశారు. ఆ ఎన్నికల్లో సంజీవరెడ్డిగారు ఓడిపోయారు. ఆ కక్షతో రాజ్యాంగబద్ధమైన విధులను నిర్వర్తించటంలో సంజీవరెడ్డిగారు తనపై రాజ్యాంగం మోపిన గురుతర బాధ్యతను విస్మరించారు. నేను ఆ రోజుల్లో ఢిల్లీలో వున్నాను. అప్పుడు సంజీవరెడ్డిగారిని కలవటానికి నేను వెళితే ఆయన నాతో యిలా చెప్పారు: 'ఏ పరిస్థితిలోనూ నేను జగ్‌జీవనరాంను మంత్రివర్గం ఏర్పాటు చేయనివ్వను. అతడు యిదివరకు నాకపకారం చేశాడు'. అంతేగాదు, కాంగ్రెస్ పార్టీ నాయకుడు వై.బి.చవాన్‌ను తాను ఆహ్వానిస్తున్నానని, యీ సంగతి చవాన్‌తో చెప్పడం కూడ జరిగిందని ఆయన అన్నారు. అయితే చవాన్‌కు లోక్‌సభలో బలం లేదు. ఇందిరా గాంధి ఆయన ప్రభుత్వం ఏర్పాటు చేస్తే బలపరిచే అభిప్రాయంలో లేదు. కనుక ప్రభుత్వం ఏర్పాటు చేసే బలం తనకు లేదని ఆయన రాష్ట్రపతికి రాత పూర్వకంగా యివ్వడం జరిగింది. అప్పుడు సంజీవరెడ్డి తక్కువ సంఖ్యాబలమున్న చరణ్‌సింగ్‌ను ప్రభుత్వం ఏర్పాటుకు ఆహ్వానించారు. అంతకు ముందు ఇందిరాగాంధి చరణ్‌సింగ్ ప్రభుత్వాన్ని బలపరుస్తానని రాష్ట్రపతికి రాత పూర్వకంగా యిచ్చింది. అప్పుడు రాష్ట్రపతి నెల రోజుల్లోగా తన మెజారిటీ ఋజువు చేసికొనే షరతుపై చరణ్‌సింగ్‌ను ప్రధానిగా ప్రమాణ స్వీకారం చేయించారు. చరణ్‌సింగ్ కాంగ్రెస్‌కు చెందిన వై.బి.చవాన్, బ్రహ్మానందరెడ్డి, తదితరులను తన మంత్రి వర్గ సభ్యులుగా తీసికొన్నారు. చరణ్‌సింగ్ రాజకీయ వాదుల్లో చాల నిజాయితీపరుడు. కనుక ఆయన ప్రధానిగా కొనసాగితే, ఇందిరాగాంధీ, ఆమె రెండవ కుమారుడు సంజయ్‌గాంధీ తమ పలుకుబడి పోతుందని భయపడ్డారు. చరణ్‌సింగ్ ప్రభుత్వాన్ని బల పరుస్తామని ముందు రాసిచ్చి, తరువాత తమ మద్దతును వుపసంహరించుకొంటున్నట్లు రాష్ట్రపతికి తెలపటం జరిగింది. ఈ పరిణామం తరువాత, లోక్‌సభలో చరణ్‌సింగ్ ప్రభుత్వం విశ్వాస తీర్మానాన్ని గెలుపించుకోగలగటం అసాధ్యం కనుక వెంటనే ఆయన తన రాజీనామాపత్రాన్ని ఆయన రాష్ట్రపతికిసమర్పించారు. ఈ పరిణామాలను బట్టి మెజారిటీ మద్దతుగల నాయకునికి మంత్రివర్గం ఏర్పాటు చేసేందుకు ఆహ్వానించటంలో సంజీవరెడ్డిగారు తన బాధ్యతను సరిగా నిర్వహించలేదని స్పష్టమయినట్లే. చరణ్‌సింగ్ రాజీనామా

యిచ్చినప్పుడయినా, లోక్‌సభలో మెజారిటీ పార్టీనాయకుడయిన జగ్‌జీవన్‌రాం గారిని పిలచి ప్రభుత్వం ఏర్పాటు చేయమని అవకాశం యిచ్చివుండాల్సింది. అయితే ఆయన ఆ ప్రయత్నం చేయలేదు. దానికి బదులు పార్లమెంట్‌ను రద్దుచేసి, చరణ్‌సింగు ప్రభుత్వాన్ని కేర్‌టేకర్ మంత్రివర్గంగా ప్రకటించారు. ఆరు నెలల్లో పార్లమెంటుకు ఎన్నికలు జరపవలసిందిగా కూడ రాష్ట్రపతి ఆదేశించారు.

## జనతా వైఫల్యం :

ఎమర్జన్సీ కాలంలో సంజయ్‌గాంధీ నిర్వహించిన పాత్రవల్ల ప్రజలు ఆగ్రహించి జనతాకు పట్టం కట్టారు. జనతా నాయకులు కూడా ఎంతో చరిత్ర కలిగిన ప్రముఖులు. వారంతా తాము పదవీ వ్యామోహంతో ప్రవర్తించమనీ, అంతా సమైక్యంగా వుండి దేశాభివృద్ధికి కృషి చేస్తామనీ, బాపూజీ సమాధివద్ద ప్రమాణం స్వీకరించినవారు. అటువంటి వారు ప్రజలు తమపై పెట్టుకొన్న ఆశల్ని వమ్ముచేస్తూ, జాతి పట్ల తమకుగల బాధ్యతను మరచి ప్రవర్తించి, ప్రజానీకం తమపట్ల వుంచిన విశ్వాసాన్ని పోగొట్టుకున్నారు.

## సంజయ్ గాంధీ మరణం :

**1980**లో పార్లమెంట్ ఎన్నికలు జరిగే ముందు సంజయ్‌గాంధి ప్రోద్బలం వల్ల ఇందిరా గాంధి కాంగ్రెస్‌ను రెండవసారి చీల్చి, అఖిలభారత కాంగ్రెస్ (ఐ) పార్టీని నెలకొల్పారు. 'ఐ' అంటే ఇందిరే! పార్లమెంట్ ఎన్నికలలో ఇందిరాగాంధీ, సంజయ్‌గాంధీల నాయకత్వంలో వున్న కాంగ్రెస్ (ఐ) మెజారిటీ సాధించగలిగింది. ఇందిరాగాంధి మళ్లీ ప్రధానిగా వచ్చినా, ప్రభుత్వంలోనూ, పార్టీలోనూ కూడ అంతా సంజయ్‌గాంధీ మాట ప్రకారమే జరుగుతూ వుండేది. రాష్ట్రాలలో ఆయన యిష్టప్రకారం ముఖ్యమంత్రులను వేయుటం, తీయుటం జరిగేది. ఆయున మాటకు ఎవరూ ఎదురు చెప్పే పరిస్థితిలేకుండా పోయింది. అటువంటి పరిస్థితులలో **1981**లో సంజయ్‌గాంధీ నడుపుతున్న విమానం ప్రమాదవశాత్తు కూలిపోయి ఆయన మరణించారు.

ఆయన చనిపోక ముందు ఆంధ్రప్రదేశ్‌లో ముఖ్యమంత్రిగా వున్న చెన్నారెడ్డిని తీసివేయాలనీ, ఆయన బదులు టి.అంజయ్యను ముఖ్య మంత్రిని చేయాలనీ నిర్ణయించారు. ఆ తరువాత నాలుగయిదు రోజులకే సంజయ్‌గాంధి చనిపోవడం జరిగింది. ఆ వార్త హైదరాబాదులో చెన్నా రెడ్డికి తెలిసింది. అది విని ఆయన

విచారించటానికి బదులు సంతోషించి, అన్ని తలుపులూ వేసి స్వీట్సు పంచటం జరిగిందని అప్పుడక్కడవున్న కృష్ణాజిల్లా మల్లేశ్వరం శాసనసభ్యుడు బూరగడ్డ నిరంజనరావు ఆ తరవాత నా దగ్గరకు వచ్చి, ఆ సంగతి నాతో స్వయంగా చెప్పటం జరిగింది.

## కాంగ్రెస్ పతనం :

కాని సంజయ్‌గాంధి పోయినా, ఆయన చేసిన నిర్ణయం మారలేదు. తరువాత కొద్దిరోజులకే ఇందిరాగాంధి చెన్నారెడ్డిని తొలగించి అంజయ్యను ముఖ్యమంత్రిని చేసింది. **1978** నుండి **1983** వరకు రాష్ట్రంలో నలుగురు ముఖ్యమంత్రులు మారారు. ప్రభుత్వ యంత్రాంగంలో అలసత్వం, అవినీతి బాగా చోటు చేసికొన్నాయి. **1983**లో విజయ భాస్కరరెడ్డి ముఖ్యమంత్రిగా వచ్చి మూణ్నెళ్లపాటు అధికారంలో వున్నాడు. కాంగ్రెస్ ప్రతిష్ఠను పూర్తిగా నీరుగార్చటం జరిగింది. సినిమా రంగం నుంచి కొత్తగా రాజకీయాలలోకి దూకి, తెలుగు దేశంపార్టీ పెట్టిన తొమ్మిది నెలలకే యన్.టి.రామారావుకు అధికారం అప్పచెప్పారు. ప్రజలు **1989**లో యన్.టి.రామారావును ఓడించి కాంగ్రెస్‌కు తిరిగి అధికారం యిచ్చారు. కాని **1989** నుండి **1993** వరకు మళ్లీ ముగ్గురు కాంగ్రెస్ ముఖ్యమంత్రులు మారారు. మళ్లీ చివరలో విజయభాస్కరరెడ్డికే గద్దె నప్పచెప్పారు. అదివరకు తనకు కేవలం మూడు నెలలే వ్యవధి కనుక తాను ప్రజల అభిమానాన్ని సంపాదించలేక పోయాననీ, యిప్పుడు తగిన వ్యవధి లభించింది కనుక యిక కాంగ్రెస్‌కు ఢోకా లేదని ఆయనకు గట్టి నమ్మకం వుండేది. అయితే లోగడ వలె వెండి పళ్లెంలో కాక యీసారి యన్.టి.ఆర్.కు అధికారాన్ని బంగారు పళ్లెంలో పెట్టి అప్పగిస్తాడని నేను చెబితే కొందరు నేనేదో గిట్టక మాట్లాడుతూ వున్నాననుకొన్నారు గాని నా సలహా నుండి ఏ ప్రయోజనం పొందలేదు. చివరకు నేను చెప్పినట్లే జరగటం నాకెంతో బాధ కల్గించింది. సరయిన వాళ్లను ఎంపిక చేయక పోవటం వల్లనే సుదీర్ఘచరిత్ర గల కాంగ్రెస్ సంస్థ యిలా భ్రష్టుపడుతోందని నాకెంతో విచారంగా వుంది.

# నెహ్రూ - ఇందిర - రాజీవ్

పండిట్ నెహ్రూ అచ్చమైన ప్రజాస్వామ్యవాది. కాదలుచుకుంటే ఆయన మన దేశానికి ఏనాడో నియంత కాగలిగే వాడు. అంతటి వ్యక్తిత్వం, దక్షత, ప్రజాభిమానం ఆయన కున్నా, అలాటి ప్రలోభాలకు లోను గాకుండా మనదేశాన్ని ప్రజాస్వామ్య దేశంగా తీర్చిదిద్దాలని తపన చెందిన మహనీయుడు. ఇందిరాగాంధి సంగతి అలాకాదు. తనకు అనుకూలంగా వున్నంతకాలం ప్రజాస్వామ్యం ఆమెకు అనుకూలమే. అనుకూలం కానప్పుడు ఆమె పార్టీని రెండుసార్లు తన అనుకూలం కోసం చీల్చి, సొంత పార్టీని పెట్టుకొంది.

దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత మనం రాజ్యాంగాన్ని రచించుకోవడం, **1950** జనవరి **26**న మనదేశాన్ని రిపబ్లిక్‌గా ప్రకటించటం జరిగింది. అప్పుడు భారత ప్రథమ రాష్ట్రపతిని నిర్ణయించవలసి వచ్చింది. ఆ రోజుల్లో నెహ్రూ ప్రధానిగానూ, కాంగ్రెస్ పార్లమెంటరీ బోర్డు అధ్యక్షుడుగానూ వున్నారు. అప్పుడు సర్దార్ పటేల్ ఉపప్రధానిగా వున్నారు. పటేల్ మరి కొందరు కలిసి రాష్ట్రపతి పదవికి అందరికన్నా అర్హుడైన వ్యక్తి డా.రాజేంద్రప్రసాద్ అని భావించి ఆయనను అందుకు అభ్యర్థిగా ప్రతిపాదించారు. నెహ్రూకు అది యిష్టం లేదు. ఆయన రాజగోపాలచారిని రాష్ట్రపతిగా ఎన్నుకోవాలని అనుకున్నారు. తీరా పార్లమెంటరీ బోర్డులో అధిక సంఖ్యాకులు రాజేంద్ర ప్రసాద్‌ను బలపరచారు. అయితే నెహ్రూ మెజారిటి సభ్యుల అభిప్రాయాన్ని శిరసావహించి రాజేంద్రప్రసాద్ అభ్యర్థిత్వానికి అంగీకరించారు. నెహ్రూ ఎంత గొప్పవాడయినా మెజారిటీ తీర్పును ధిక్కరించకుండా, క్రమశిక్షణ గల సైనికుడుగా పార్టీ నిర్ణయాన్ని అమలు చేశారు. రాజేంద్రప్రసాద్ ప్రథమ రాష్ట్రపతిగా ఎన్నికయి, అయిదు సంవత్సరాల పదవీకాలాన్ని విజయవంతంగా పూర్తిచేశారు. తరవాత రెండవసారి కూడా ఆయననే అభ్యర్థిగా కాంగ్రెస్ పార్లమెంటరీ బోర్డు మెజారిటీ సభ్యులు నిర్ణయించారు. అప్పుడు కూడ నెహ్రూ తనకు యిష్టం లేకపోయినా, మెజారిటీ అభిప్రాయాన్ని గౌరవించి రాజేంద్రప్రసాద్ అభ్యర్థిత్వానికి అంగీకరించారు. అప్పటికి సర్దార్ పటేల్ మరణించారు. అయితే గోవింద వల్లభపంత్ వంటి పెద్దలు, స్వాతంత్ర్య సమరంలో ఎవరికీ తీసిపోని త్యాగాలు చేసినవారు వున్నారు. పంత్ కేంద్రంలో హోం శాఖ నిర్వహిస్తున్నారు. వారందరికీ నెహ్రూ అభిప్రాయం

తెలుసు. అయినా వారంతా కలిసి రాజేంద్రప్రసాద్‌ను రెండవసారి కూడా ప్రతిపాదించటం, నెహ్రూ ఈ సారి కూడ మెజారిటీ అభిప్రాయాన్ని గౌరవించి తన మాటగురించి పట్టుపట్టక పోవడం జరిగింది. నిజానికి అప్పుడు నెహ్రూకు డా.సర్వేపల్లి రాధాకృష్ణన్‌ను రాష్ట్రపతిగా చేయాలన్న ఆలోచన వుండేది. అయినా ఆయన తన అభ్యర్థిని ఉపరాష్ట్రపతిని చేయటంతోనే తృప్తి చెందారు. పండిట్ నెహ్రూ నిజమైన ప్రజాస్వామ్య వాది అనటానికి అనేక ఉదాహరణలలో యిదొకటి మాత్రమే.

## రాష్ట్రపతి ఎన్నిక :

నెహ్రూ ప్రధానిగావుండగానే డాక్టర్ సర్వేపల్లిరాధాకృష్ణన్ రాష్ట్రపతిగా ఎన్నికయ్యారు. ఆయన తరువాత అధ్యక్షులుగా ఎన్నికయిన డా.జకీర్ హుస్సేన్‌గారు రాష్ట్రపతిగా వుండగానే చనిపోయారు. రాష్ట్రపతి మరణిస్తే ఉపరాష్ట్రపతిని అధ్యక్షులుగా ప్రమాణ స్వీకారం చేయిస్తారు. కొత్త అధ్యక్షుని ఎన్నికలవరకూ ఆయన ఆ పదవిని నిర్వహిస్తారు. రాధాకృష్ణన్, జకీర్ హుసేన్‌లు యిద్దరూ ఉపరాష్ట్రపతిగా వుండి తరువాత రాష్ట్రపతి పదవికి ఎన్నికయ్యారు. ఆ సంప్రదాయం ప్రకారం అప్పుడు ఉప రాష్ట్రపతిగా వున్న వి.వి.గిరి సహజంగా అధ్యక్షపదవిని ఆశించారు. అయితే అప్పుడు బెంగుళూరులో సమావేశమైన కాంగ్రెస్ పార్లమెంటరీ బోర్డు గిరిగారిని కాక సంజీవరెడ్డిగారిని అధ్యక్షపదవికి తమపార్టీ అభ్యర్థిగా మెజారిటీ అభిప్రాయం ప్రకారం నిర్ణయించారు. ఇది ఇందిరాగాంధీ గారికి యిష్టం లేకపోయింది. ఆమె వెంటనే ఢిల్లీకి తిరిగి వెళ్లింది. ఆ రోజే గిరి గారు స్వతంత్ర అభ్యర్థిగా కాంగ్రెస్ అభ్యర్థిపై తాను పోటీ చేస్తానని ప్రకటించారు. ఇందిరాగాంధీకి, నెహ్రూకు గల తారతమ్యం తెల్సు కోడానికే యిదంతా రాయాల్సివస్తోంది.

గిరిగారు తన అభ్యర్థిత్వాన్ని ప్రకటించిన తరువాత ఇందిరాగాంధి గారు అధ్యక్షపదవికి సంజీవరెడ్డిగారు పేరు ప్రతిపాదిస్తూ నామినేషన్ పత్రాలపై సంతకం చేయటం గమనార్హం. తరువాత ఆమె అంతరాత్మ ప్రబోధం అంటూ సంజీవరెడ్డిగారిని ఓడించి గిరిగారిని గెలుపించటానికి సర్వవిధాలా కృషి చేశారు. ప్రజాస్వామ్య పద్ధతులను, నైతిక విలువలనూ లెక్క చేయకుండా తనమాట నెగ్గించుకోటానికి ఏదయినా చేయగల తెగింపు, పట్టుదల కలిగిన నాయకురాలు ఇందిరా గాంధి అనటానికి యిదే నిదర్శనం.

## గ్రీన్ రివల్యూషన్ :

ఇందిరాగాంధి ప్రధానిగా వున్నప్పుడు ఇలా అనేక ముఖ్యమైన సంఘటనలు జరిగాయి. అయినా ఆమె మంచితనం మనం మరువరాదు. ఈ దేశాన్ని అభివృద్ధి చేయాలని, ప్రపంచ రాజ్యాలలో మన దేశకీర్తి ప్రతిష్ఠలు వ్యాపింప చేయాలనీ ఆమెకు ఎంతో తపన వుండేది. మన దేశం ఆహారం విషయంలో దిగుమతులపై ఆధారపడకుండా స్వయం సమృద్ధిని సాధించటానికి గ్రీన్ రివల్యూషన్ తీసుకొని వచ్చింది. స్వాతంత్ర్యం వచ్చినప్పుడు మన జనాభా **30** కోట్లు. ఇప్పుడు **80** కోట్లు. అయినా అందరికీ సరిపడా ఆహార ధాన్యాలను యీనాడు మన రైతులు పండించ గల్గుతున్నారు. దానికి ఆమె కృషి, పట్టుదల ఎంతో కారణం.

సర్దార్ పటేల్ తర్వాత, లాల్‌బహదూర్ శాస్త్రి గారి తర్వాత అత్యంత ధైర్యసాహసాలతో కీలకమైన నిర్ణయాలు తీసికోడంలో ఆమెతో పోల్చదగిన ప్రధానులు చాల తక్కువ మంది.

## బంగ్లాదేశ్ ఆవిర్భావం :

**1971**లో పాకిస్తాన్ మన దేశంపై దురాక్రమణచేస్తే శ్రీమతి గాంధి ప్రధానిగా సైనికబలాలకు అవసరమైన తోడ్పాటునిచ్చి వారి అండతో విజయం సాధించింది. అమెరికా సాయం పాక్‌కు ఉందనే విశ్వాసం వుండేది. అయినా ఆమె సంకోచించలేదు. పాకిస్తాన్ ఆ దెబ్బతో రెండు ముక్కలు కావటం, బంగ్లాదేశ్ ఏర్పడటం జరిగింది. ఆ యుద్ధంలో పాక్ సైన్యాలకు నాయకత్వం వహించిన జనరల్ నియాజీ మన సైనిక బలాలకు ఆ రంగంలో నాయకత్వం వహించిన జనరల్ అరోరా ముందు తాను లొంగిపోతున్నట్లు ప్రకటించి సంతకాలు చేశాడు. యుద్ధ సామగ్రితో సహా **90** వేల మంది పాక్ సైనికులను మనవారు యుద్ధ ఖైదీలుగా పట్టుకున్నారు. తరువాత వారందరినీ ప్రత్యేక రైళ్లలో భారతదేశానికి తరలించి, తరువాత వాళ్ల దేశానికి పంపేయటం ఇందిరాగాంధి రాజనీతికి నిదర్శనం. ఢాకాలో పాక్‌సైన్యాలు లొంగుబాటు భారత రక్షణ బలాల చరిత్రలో సువర్ణాక్ష రాలతో లిఖించదగిన సంఘటన. ఆ రోజు పాకిస్తాన్ పట్ల బంగ్లాదేశ్‌లో ఎంత వ్యతిరేకత వుందంటే, మనం కలుగ చేసికొని యుద్ధ ఖైదీలుగా తీసుకొని రక్షణ కల్పించకపోతే పాక్ సైనికులనందర్నీ స్థానిక ప్రజలు ఊచకోత కోసేవారు. నిజానికి ఈ విషయంలో పాక్‌ప్రభుత్వం, ప్రజలు, సైన్యం మనకు ఎప్పటికీ కృతజ్ఞులుగా వుండాలి.

## సిమ్లా ఒడంబడిక :

బంగ్లాదేశ్ విముక్తి పొంది రిపబ్లిక్‌గా అవతరించటంతోపాటు పాకిస్తాన్‌లో కూడ రాజకీయంగా అనేక మార్పులు వచ్చాయి. పాక్ నియంత జనరల్ యాహ్యాఖాన్ వైతొలగక తప్పలేదు. యాహ్యాఖాన్ ప్రభుత్వంలో విదేశాంగమంత్రిగా వున్న భుట్టో ప్రధాని అయ్యాడు. ఆయన ఇండియాకు వచ్చి ఇందిరాగాంధీతో సిమ్లాలో చర్చలు జరిపాడు. ఆయనతో ఆయన కుమార్తె బెనజీర్ భుట్టో వచ్చింది. ఆమే యిప్పుడు పాక్‌ప్రధానిగా వుంది. భుట్టో - గాంధీలు కలసి సంతకాలు చేసినదే చరిత్రాత్మకమైన సిమ్లా ఒప్పందం. ఆ విధంగా భారతదేశ గౌరవ ప్రతిష్ఠలను కాపాడిన ఖ్యాతి ఇందిరకు దక్కుతుంది. బంగ్లాదేశ్ యుద్ధం తరువాత ప్రజలు తమ ప్రేమాదరాలనూ, విశ్వాసాన్నీ ఇందిరపై అమితంగా వర్షించి, ఆమెను ఎంతో గాఢంగా అభిమానించారు. **1972**లో కాంగ్రెస్ సాధించిన అఖండవిజయం దాని ఫలితమే.

ఇందిరాగాంధీకి చెడ్డపేరు రావటానికి ఆమె రెండవకుమారుడు సంజయ్‌గాంధి చర్యలు కారణం. ఒక పరిస్థితిలో అతడు సైనిక సహాయంతో పాలిస్తామన్నట్లు మాట్లాడేవాడు. అదృష్టవశాత్తు మన రక్షణ బలాధిపతులు ప్రజాస్వామ్యంపై విశ్వాసం కలవారు. పాకిస్తాన్‌లో సైనిక పాలనవల్ల కలిగిన విషఫలితాలను గమనిస్తున్నవారు. పాక్ ప్రజలకు సైనిక నియంతృత్వం ఎంత అరిష్టంగా పరిణమించిందో, మన దేశంలో ప్రజా స్వామ్యం వర్ధిల్లటం, అందుకు రక్షణ బలాలు ఎప్పుడూ జోక్యం చేసికోకుండా క్రమశిక్షణతో ప్రజలెన్నుకున్న ప్రభుత్వానికి విధేయులుగా పనిచేస్తుండటం మన ప్రజలను అంత అదృష్టంగా వరించింది.

## అంతా సమానం :

మన దేశం పరిస్థితి వేరు. పాకిస్తాన్ పరిస్థితి వేరు. వారిది ఇస్లామిక్ దేశం. వారి రాజ్యాంగాన్ని కూడా ఇస్లామిక్ సూత్రాలపై నిర్మించుకొన్నారు. వారి రక్షణ బలాల్లో అంతా ముస్లింలే. వారు దేశాన్ని ఒక మత పిచ్చితో పాలిస్తున్నారు. మన దేశంలో రాజ్యాంగం దృష్టిలో అన్నికులాలవారూ, మతాలవారూ, ప్రాంతాలవారూ, భాషలవారూ సమానులే. మన రక్షణ దళాలలో కుల, మత, ప్రాంత, భాషా భేదాలకు అవకాశం లేదు. సైన్యంలో గాని, వైమానిక దళంలోగాని,

నావికాదళంలోగాని కులమత ప్రాంత భాషా వివక్షత లేకుండా అంతా చేరవచ్చు. ఎంత ఉన్నత పదవికైనా చేరుకోవచ్చు. సువిశాల భారత దేశంలో యిట్టి సమైక్యతా దృక్పథం వర్ధిల్లు తుండటం మన అదృష్టం.

## మత సహనం :

బంగ్లాదేశ్ చీలిపోయిన తరువాత మిగిలిన పాకీస్తాన్ చాల చిన్న దేశం. ప్రపంచంలో ఇండోనేషియా తరువాత మనదేశంలోనే ముస్లింల సంఖ్య అత్యధికం. పాకీస్థాన్‌లో వున్న ముస్లింల కన్న భారత దేశంలో వున్న ముస్లింల సంఖ్య ఎక్కువ. అంతేకాదు, ఒక్కొక్క దేశాన్ని పోల్చిచూస్తే ఇండోనేషియా తప్ప మరి యే ముస్లిం దేశంలో కన్నా కూడ మన దేశంలో ముస్లింల సంఖ్య ఎక్కువ. ఒక్క ముస్లింలే కాదు, యిక్కడ క్రైస్తవ, పార్సీ, బౌద్ధ, జైన, సిక్కు వంటి మతాలెన్నో వున్నాయి. అహింసను ప్రబోధించిన మహావీరుడు, బుద్ధుడు, గాంధి యిక్కడ జన్మించారు. వారందరి ప్రభావంవల్లనే మన సంస్కృతిలో పరమతసహనం, గౌరవం అంతర్భాగంగా వున్నాయి.

## ప్రజలు తెలివి తక్కువ వారు కాదు :

ప్రపంచంలో పెద్ద ప్రజాస్వామ్య దేశాలలో మనది అతిపెద్దది. ఇక్కడి ప్రజలకు నియంతృత్వమన్నా, దౌర్జన్యం అన్నా గిట్టదు. వారికి శాంతియుత సహజీవనం, సహకారంపై మక్కువ జాస్తి. అందు వల్లనే ఎమర్జన్సీలో పెద్ద నాయకులందర్నీ జైలులో వేస్తే చాలా మంది అను కున్నారు– ఈ దేశ ప్రజల్లో ఎక్కువ నిరక్షరాస్యులు. కనుక వారికి దేశంలో ఏం జరుగుతుందో తెలియదు అని. కాని 1977 ఎన్నికల్లో ప్రజలు తమ ఆగ్రహాన్ని అసందిగ్ధంగా వెల్లడి చేసేసరికి భారత ప్రజలకు ప్రజాస్వామ్యం పట్ల గల అభిమానం స్పష్టపడింది. కనుక యిక్కడ ప్రజాస్వామ్య వ్యవస్థను దెబ్బతీయాలని ఎవరయినా అనుకుంటే, 'ఇందిరాగాంధి వంటి సమర్థురాలు చేసిన దాన్నే ప్రజలు సహించలేదు, క్షమించలేదు' – అని గుర్తుంచుకోవడం మంచిది.

## గుణపాఠం :

స్వయంగా ఇందిరాగాంధి గారు కూడ యీ విషయాన్ని గ్రహించి గుణపాఠం నేర్చుకున్నారు. సంజయ్‌గాంధి వుండగా కాంగ్రెస్ వాదుల్లో తనకు

యిష్టం లేని వారిని దూరం చేసి కొన్నారు. మేము ఇందిరా గాంధితో విభేదించినా కూడ అప్పటి కర్నాటక ముఖ్యమంత్రి దేవరాజ్ అర్స్ ఇందిరకు అండగా నిలబడి కాంగ్రెస్‌ను చీల్చటంలో ఆమెకు తోడ్పడ్డాడు. ఇందిరాగాంధి పార్లమెంటుకు తిరిగి రావాలన్న కోరికతో చిక్‌మగలూర్‌లో ఎన్నికయిన వారిని రాజీనామా చేయమని, ఉప ఎన్నికల్లో పెద్ద మెజారిటీతో ఇందిరను గెలుపించిన వ్యక్తి అర్స్. అటువంటి అర్స్‌ను కూడ తనమాట వినటం లేదని సంజయ్‌గాంధి ఇందిర కాంగ్రెస్ నుండి సస్పెండ్ చేయించాడు. ముఖ్యమంత్రి పదవినుండి తొలగించాడు. సంజయ్ గాంధి కాలంలో యిలాటి పనుల వల్ల కాంగ్రెస్ ప్రతిష్ఠ దెబ్బ తిన్నది.

సంజయ్‌గాంధి మరణం తరువాత ఇందిరాగాంధిలో చాలా మార్పు వచ్చింది. అందర్నీ కలుపుకొని పోవాలన్న ధ్యాస కలిగింది. కాని అప్పటికే దేవరాజ్ అర్స్ చనిపోయాడు.

## నాదెండ్ల :

ఇందిరాగాంధి ప్రధానిగా వుండగానే ఆంధ్రలో విజయభాస్కరరెడ్డి ప్రభుత్వం ఓడిపోయి తెలుగు దేశం అధికారంలోకి వచ్చింది. నాదెండ్ల భాస్కరరావు, యన్.టి.రామారావు సన్నిహితులుగానే పనిచేశారు. కాని తరువాత వారిలో వారికి అభిప్రాయభేదాలు వచ్చాయి. యన్.టి.ఆర్. బైపాస్ సర్జరీకని అమెరికా వెళ్లి వచ్చేసరికి, నాదెండ్ల తెలుగు దేశంలోని మెజారిటీ శాసనసభ్యులను తనవేపు తిప్పుకొనే ప్రయత్నం చేశాడు. ఎవరినో పట్టుకొని ఇందిరాగాంధి దగ్గరకు వెళ్లి తనదగ్గర బాగా ధనం వుందనీ, మెజారిటీ సభ్యుల సహాయంతో తాను ముఖ్యమంత్రిని కాగలననీ ఆయన ఇందిరాగాంధీని నమ్మించాడు.

ఇందిరాగాంధి అసాధ్యపుమనిషి. అలాటి ఆమెనే భాస్కరరావు మోసంచేసి, గవర్నర్ రాంలాల్‌తో యన్.టి.ఆర్.ను బర్తరఫ్ చేయించి తాను ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేయగలిగాడు. అది రాష్ట్రంలోనే కాదు దేశంలోనూ, విదేశాలలో కూడ సంచలనం కల్గించింది. రాజకీయ చరిత్రలేనివాడు, యన్.టి.ఆర్. దయవల్ల ఆయన మంత్రి వర్గంలో చేరినవాడు అయిన భాస్కరరావు ఇందిరాగాంధీని ఎలా బోల్తా కొట్టించ గల్గాడో అనూహ్యం. అప్పుడున్న గవర్నర్‌గా వున్న రాంలాల్‌కు యన్.టి. ఆర్.ను బర్తరఫ్ చేయడం యిష్టం లేదు. ఇందిరాగాంధి చెప్పిన మాటమీద ప్రధాని కార్యాలయంలో పనిచేస్తున్న ఆర్.ఆర్.ధావన్ గవర్నర్‌కు ఆ రాత్రి ఫోన్ చేసి యన్.టి. ఆర్‌ను బర్తరఫ్ చేసి

భాస్కరరావును ముఖ్యమంత్రిగా ప్రమాణస్వీకారం చేయించమని చెప్పటం వల్ల ఆయన ఆ పనిచేయక తప్పలేదు. ఇది పూర్తిగ రాజ్యాంగ విరుద్ధమైన వ్యవహారం. ఈ మధ్య ఉత్తర ప్రదేశ్‌లో ములాయంసింగ్ యాదవ్ ప్రభుత్వాన్ని ప్రధాని పి.వి. నరసింహారావు బర్తరఫ్ చేయించి బహుజన సమాజ్‌వాది పార్టీ కార్యదర్శి మాయావతిని ముఖ్యమంత్రిగా గవర్నర్ మోతీలాల్‌వోరాతో ప్రమాణ స్వీకారం చేయించాడు. అదీ పూర్తిగా రాజ్యాంగ విరుద్ధమైనదే.

## బొమ్మయ్ బర్తరఫ్ :

రాజీవ్‌గాంధి ప్రధానిగా వుండగా నేను, ప్రస్తుత ప్రధాని పి.వి. నరసింహారావు యింకా కొందరం ఆయన మంత్రి వర్గంలో వుండే వాళ్లం. ఆ రోజుల్లో కర్నాటకలోని జనతా ముఖ్యమంత్రి బొమ్మయ్ మంత్రి వర్గాన్ని బర్తరఫ్ చేయాలని గవర్నర్ నుండి ఒక నివేదిక తెప్పించారు. ఆ నివేదికను మంత్రివర్గంలో యధాతథంగా ఆమోదింపచేయాలని రాజీవ్‌గాంధి అభిప్రాయం. అయినా ఆయన మంత్రివర్గ సమావేశంలో ఒక్కొక్క మంత్రి అభిప్రాయం అడుగుతూ వచ్చారు. అప్పటికే అందరికీ రాజీవ్‌గాంధి అభిప్రాయం తెలుసు. తాము ఆయన అభిప్రాయానికి భిన్నంగా చెబుతే, ప్రధానికి కోపం వచ్చి తమను తీసేస్తాడేమోనన్న భయంతో ఒకరి తరువాత ఒకరు బొమ్మయ్‌ని బర్తరఫ్ చేయాలన్న భావం వెల్లడిస్తూ వచ్చారు. నా దగ్గరకు వచ్చేసరికి నేను నిర్మొహమాటంగా యిలా చెప్పాను. 'కర్నాటక అసెంబ్లీ సమావేశాలు జరుగుతున్నాయి. ముఖ్యమంత్రికి శాసనసభలో బలం లేదని తేలితే, ఏం చేయాలన్నది గవర్నర్ బాధ్యత. అలా బలనిరూపణకు అవకాశం ముఖ్యమంత్రికి యివ్వకుండా శాసన సభను రద్దుచేసి, ముఖ్యమంత్రిని బర్తరఫ్ చేసి రాష్ట్రపతి పాలన పెట్టటం రాజ్యాంగ విరుద్ధం'.

నేనిలా మాట్లాడే సరికి రాజీవ్ నా తరవాత వున్న పి.వి.నరసింహా రావు అభిప్రాయం అడిగారు. ఆయన 'వెంగళరావుగారు చెప్పింది సబబుగానే వుంది. నా అభిప్రాయం అదే'!, అన్నారు. కాని రాజీవ్ గాంధి రాష్ట్రపతిపాలన పెట్టటానికే నిర్ణయించి, అలా కేంద్ర మంత్రివర్గ తీర్మానం చేయించి, రాష్ట్రపతి నుండి ఆమోదం పొందటం జరిగింది. ఆ విషయం సుప్రీంకోర్టులో రిట్ దాఖలయ్యే దాకా వెళ్లింది. సుప్రీంకోర్టు ఆలస్యంగా తీర్పుచెప్పినా, ఆ తీర్పులో గవర్నర్ చర్య రాజ్యాంగ విరుద్ధం అన్నారు. మేం ఏం చెప్పామో, దాదాపు ఆ మాటలతో కోర్టు గవర్నర్ చర్యను ఖండించింది.

ఈ తీర్పు వచ్చే సమయానికి రాజీవ్ గాంధి చనిపోయారు. అప్పటి కర్నాటక గవర్నర్ పెండేకంటి వెంకటసుబ్బయ్య కూడ పోయాడు. కేంద్ర మంత్రి వర్గ సభ్యులుగా వున్నవారు కూడ తమ అభిప్రాయాలను నిర్మొహమాటంగా చెబుతే తమ పదవి పోతుందేమోనని మనసులో వొకటి పైకొకటిగా మాట్లాడటం దేశ ప్రజాస్వామిక వ్యవస్థకు కళంకం తెస్తోంది.

## యన్.టి.ఆర్.కు మళ్లీ పదవి :

భాస్కరరావు ఎలాగో ఇందిరాగాంధీని నమ్మించినా గవర్నర్ మాత్రం భాస్కరరావును ముఖ్యమంత్రిగా నియమిస్తూ నెలలోగా తన బలం నిరూపించుకోవాలని షరతు పెట్టాడు. ఇది జరిగిన తరువాత రాంలాల్ తన పదవికి రాజీనామా చేసి రాష్ట్రం వదిలి వెళ్లిపోయాడు. ఆయన తరువాత డాక్టర్ శంకర్‌దయాళ్ శర్మను కేంద్రం ఆంధ్రప్రదేశ్ గవర్నర్‌గా నియమించింది. ఆయన దైవభక్తి కలిగిన వాడు. ధర్మంపై విశ్వాసముంచిన వాడు. న్యాయశాస్త్రకోవిదుడు. ఆయనతో నాకు చాలాకాలం నుండి పరిచయం వుంది. ఆయన గవర్నర్‌గా వచ్చిన తరువాత నేను మర్యాద పూర్వకంగా వెళ్లి కలిశాను. ఆయన అప్పుడు నాతో యిలా చెప్పారు : 'నేను నిష్పక్షపాతంగా వ్యవహరిస్తాను. నెలలోగా భాస్కరరావు మెజారిటీ ఋజువు చేసుకుంటే సరే, లేకపోతే గడువు ముగియగానే రామారావు చేత తిరిగి ముఖ్యమంత్రిగా ప్రమాణస్వీకారం చేయిస్తాను'.

భాస్కరరావు నా దగ్గరకు వస్తే నేను ఆయనతో గవర్నర్ చెప్పిన మాటలు చెప్పాను. తరువాత భాస్కరరావు శాసనసభాసమావేశాలు ఏర్పాటు చేశాడు కాని సభలో తన బలం రుజువు చేసుకోలేని పరిస్థితి వచ్చింది. తానొకసారి ముఖ్యమంత్రి అయితే పార్టీ సభ్యుల్లో మెజారిటీ తన వెంటపడి వస్తారని భాస్కరరావుకు ఒక పిచ్చి అభిప్రాయం వుండేది. కాని అది తప్పని తేలిపోయింది. అతడు ఒక్క నెల ముఖ్యమంత్రిగా చేసి, శాశ్వతంగా మాజీ ముఖ్యమంత్రుల జాబితాలోకి ఎక్కాడు. శంకర్ దయాళ్ శర్మగారు నాతోచెప్పినట్లే నెలకాగానే భాస్కర్‌రావు ప్రభుత్వం వైతొలగటం, రామారావును తిరిగి ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేయించటం జరిగాయి. రాష్ట్రంలో దానితో మామూలు పరిస్థితులు ఏర్పడ్డాయి.

## రాజీవ్ గాంధీ :

సంజయ్‌గాంధీ చనిపోయిన తరువాత ఇందిరాగాంధీ తన పెద్ద కొడుకు

రాజీవ్‌గాంధీని రాజకీయాల్లోకి తెచ్చింది. ఆయన పైలట్‌గా వున్నాడు. ఆయనకు రాజకీయాలపై ఆసక్తిలేదు. ఆయన భార్య సోనియాగాంధికి కూడ భర్త రాజకీయాలలోకి రావటం యిష్టం లేదు. అయినా ఇందిరా గాంధి ఆయనను బలవంతంగా రాజకీయాల్లోకి దింపింది. అప్పటి నుంచి ఆయన మరణం వరకూ చూస్తే ఆయన రాజకీయ జీవితమంతా కలిసి కేవలం ఎనిమిదేండ్లే. అంతటితోనే రాజీవ్ అధ్యాయం ముగిసింది.

సంజయ్‌మరణం తర్వాత ఇందిరాగాంధీకి కొంత పునరాలోచన కలిగింది. తనకు లోగడ సన్నిహితంగా వుండి తరువాత దూరం అయిన వారందరినీ తిరిగి దగ్గరకుతీయటానికి ఆమె ప్రయత్నాలు ప్రారంభించారు. ఆరు సంవత్సరాలుగా నేనొక సారి తప్ప ఆమెను కలవటం జరగలేదు. ఏ రకంగానైనా తన దగ్గరకు నన్ను తీసుకురావలసిందిగా ఆమె జి.కె. మూపనార్‌కు చెప్పింది. తరువాత ప్రణబ్ ముఖర్జీని కూడా పంపింది. ముఖర్జీ యిప్పుడు కేంద్రంలో విదేశాంగ శాఖమంత్రిగా వున్నారు. తరువాత ఒకసారి కృష్ణస్వామి రావుసాహెబ్‌ను పంపింది. (ఆయన లోగడ నాకు కార్యదర్శిగా వుండేవాడు. తరువాత, ఇందిరాగాంధి ప్రధానిగా వుండగా ఆయన క్యాబినెట్ సెక్రటరీగా వుండేవాడు.) లోగడ ఒకసారి ఆమె నన్ను పిలిచి మాట్లాడింది. తరువాత సంజయ్‌గాంధి వొత్తిడివల్ల, కొడుక్కు భయపడి 'నేను పిలవలేదు. వెంగళరావుగారే తనంతట తానుగా వచ్చి కలిశాడని', పత్రికలకు చెప్పింది. అది ఆమె స్థాయికి తగని పని. అలాటి వారిని వెళ్లి కలవాలని నాకనిపించలేదు. నాకు పదవి మీద వ్యామోహమూ లేదు. నన్ను ఆమె దగ్గరకు పిలుచుకొని పోవటానికి వచ్చేవారితో ఆ సంగతే నిర్మొహమాటంగా చెప్పాను. ఆమె యింకా మూడు నాలుగు నెలల్లో హత్య చేయబడుతుందనగా ఒకసారి ఆమె నాకు ఫోన్ చేసి స్వయంగా మాట్లాడింది. 'మీతో మాట్లాడి చాల రోజులయింది. ఒకసారి ఢిల్లీ వచ్చి కలవండి!' అన్నది. ఆమె దేశానికి ప్రధాని, నేను వొకప్పుడు ఆమెకు సన్నిహితంగా వుండి, నమ్మకమైన వాడిగా మెలగిన వాడిని. కనుక యిక బాగుండదని ఒకసారి ఢిల్లీ వెళ్లి నేను వచ్చినట్లు ఆమె పి.ఏ.కు ఫోన్‌చేసి తెలిపాను. ఆమెతో మాట్లాడి నేను వెంటనే తిరిగి హైద్రాబాదు పోవాలనుకుంటున్నానని చెప్పాను. అయితే ఆమెకు ఆనాడు **104** డిగ్రీల జ్వరం. కనుక వైద్యుల సలహాపై ఎపాయింట్‌మెంట్సు యివ్వడం లేదు. నేను ఆ పర్యాయం ఢిల్లీలో కె.యల్.యన్.ప్రసాద్ యింట్లోదిగాను. ఇందిరాగాంధీకి రాజకీయ సలహాదారయిన ఎమ్.ఎల్. ఫోతేధార్‌ను ఆమె నా వద్దకు పంపించింది. 'జ్వరం

కొంత తగ్గగానే కబురు చేస్తాను. అంతవరకు ఢిల్లీలో వుండవలసిందని' కోరేందుకు ఆమె ఫోతేదారును పంపింది. ఫోతేదార్ దర్శనం దొరకటం ఎంతకష్టమో ఢిల్లీలో అందరికీ తెలుసు. అటువంటి ఫోతేదారే స్వయంగా నేను బసచేసిన చోటికి నన్ను కలిసేందుకు రావటం చూసి అందరికీ ఆశ్చర్యం కలిగింది. 'మిమ్మల్ని కలుపుకొని పోవాలని ఆమె ఎంతో పట్టుదలతో వుందని దాని అర్థం' అని నా మిత్రులు వ్యాఖ్యానించారు. నేను ఫోతేదారును కలవటం కూడ అదే మొదటిసారి. నేను ముఖ్యమంత్రిగ వున్నప్పుడు అతనెవరో తెలియదు. అప్పుడతడు ఇందిరాగాంధి దగ్గర లేడు. రెండవరోజు రాత్రి పదిగంటల సమయంలో ప్రధానికి జ్వరం తగ్గి నార్మల్‌కు వచ్చింది. వెంటనే నన్ను రమ్మని ఫోన్ వచ్చింది. నేను వెళ్లి ఆమెను కలిశాను. ఆమె ఆరోగ్యం యింకా కుదుట పడలేదు. అయినా ఆమె సుమారు ఒక గంటసేపు నాతో మాట్లాడింది. 'ఆంధ్రప్రదేశ్‌లో కాంగ్రెస్ తిరిగి బలం పుంజుకోవటానికి మీ సాయం కావాలని' నాతో చెప్పింది. 'నేను మీకు వ్యతిరేకంగా లేను. కాని, నాభార్య చనిపోయిన తరువాత నేను రాజకీయాలకు దూరంగా వుంటున్నాను', అని నేను బదులు చెప్పాను. 'అయినప్పటికి మీరు నాకు మద్దతుగా వుండి సాయం చేయాలని ఆమె కోరింది. అప్పుడు నేను 'సరే' అన్నాను. 'ఇందిరా కాంగ్రెస్ సభ్యులుగా మీరు చేరాలి' అని ఆమె అడిగితే 'అలాగే, వుత్తరం ఏ.ఐ.సి.సి. కార్యాలయానికి పంపుతా'నన్నాను. కాని దానికి ఆమె వొప్పుకోలేదు. అప్పటికప్పుడు సభ్యత్వఫారాలు తెప్పించి నేను సభ్యునిగా చేరుతున్నట్లు తన ఎదుటే సంతకం చేయించుకొంది. ఆ కాగితం ఆమె తీసుకొంది. 'మీ మీద నాకు ఏవిధమైన ద్వేషం, కోపం లేవు. నేను మీరు చెప్పిన మాట ఎదిరించను', అంటూ 'నేను మరుసటి రోజు ఉదయం హైదరాబాదు పోతున్నా'నని చెప్పాను. దానికామె అంగీక రించింది. ఇందిరా కాంగ్రెస్ సభ్యత్వం కోసం ఎంతో మంది దరఖాస్తు చేసినా, ఆమె వాటిని పెండింగ్ పెట్టి ఆమోదించలేదు.

## ఇందిర హత్య :

నేను హైదరాబాదుకు తిరిగి వచ్చిన ఒక పక్షం రోజుల్లోనే ఆమె హైదరాబాదుకు వచ్చింది. ఆమె రాజభవన్‌లో బసచేస్తే నేను మర్యాద పూర్వకంగా కలవటానికి వెళ్లాను. గవర్నర్ వచ్చి ఆమెను కలిసి వెళ్లిన వెంటనే ఆమె బయటకు వచ్చి వెంగళరావుగారిని లోపలకు పంపమని చెప్పింది. వందలాది మంది ప్రముఖులు వేచి వుండగా నన్ను లోపలకు తీసుకొని వెళ్లి కూర్చోబెట్టి నాతో

మాట్లాడారు. 'తెలుగు దేశం పోయి, కాంగ్రెస్ వస్తుందని, అందుకు శాయశక్తులా పనిచేస్తానని' నేను చెప్పడం జరిగింది. ఇది జరిగినటువంటి నెలలోగానే ఆమె తన అంగరక్షకుల వల్లనే హత్య చేయబడింది. ఆనాడు దేశమంతా సమర్థు రాలయిన నాయకురాలిని కోల్పోయి నందులకు దుఃఖంలో మునిగి పోయింది. ఆమె మరణం వల్ల కలిగిన నష్టం అపారం, అది తీరనిదని అంతా విచారించారు.

ఇందిరాగాంధి మరణ సమయంలో రాజీవ్‌గాంధి కలకత్తాలో వున్నారు. ప్రధాని మరణాన్ని అధికారికంగా ప్రకటిస్తే. నూతన ప్రధానితో ప్రమాణ స్వీకారం చేయించి తీరాలి. అందుకని ఆమె శరీరాన్ని ఆసుపత్రి లోనే వుంచి, ఆమె ప్రాణాన్ని కాపాడేందుకు డాక్టర్లు యింకా శాయశక్తులా పోరాడుతున్నారనే వార్త రేడియో, టి.వి.లద్వారా ప్రచారం చేయించారు. బయటకు చెప్పకపోయినా తాత్కాలిక ప్రధానిగా ప్రమాణ స్వీకారం చేయటానికి పి.వి.నరసింహారావు, ప్రణబ్ ముఖర్జీ ప్రయత్నించడం జరిగింది. కాని అప్పటి రాష్ట్రపతి జ్ఞానీ జైలుసింగ్ వారి మాటలు పెడచెవిన పెట్టి, రాజీవ్‌గాంధీ ఢిల్లీ చేరిన వెంటనే ఇందిరాగాంధి మరణాన్ని అధికార పూర్వకంగా ప్రకటించటం, ఆ తరువాత కొద్ది సేపటికే రాజీవ్ గాంధీని ప్రధానిగా ప్రమాణస్వీకారం చేయించటం జరిపాడు.

## మారణహోమం :

ఇందిరాగాంధీని ఆమె అంగరక్షకులే హత్యచేసిన సంగతి తెలిసిన వెంటనే ఢిల్లీలో పెద్దయెత్తున మారణహోమం చెలరేగింది. ఉద్రిక్తులయిన జనం సిక్కులు ఎక్కువగా నివసించే ప్రాంతాలపై దాడిచేసి, వారి యిళ్లు తగలబెట్టి, దొరికిన వారినల్లా చంపేయటం జరిగింది. సిక్కులు నడిపే టాక్సీలు, వారి వ్యాపార సంస్థలూ, దుకాణాలు అన్నీ దగ్ధం కాసాగాయి. రాజీవ్ గాంధీ తన తల్లి శవం ఆసుపత్రిలో అలా వుండగానే, ప్రధానిగా తన బాధ్యతలను నెరవేర్చేందుకు ఢిల్లీలోనూ, పరిసర ప్రాంతాల్లోనూ శాంతిని స్థాపించేందుకు గట్టి ప్రయత్నం చేశారు. ఆయన ఆలస్యం లేకుండా సైన్యాన్ని పిలిపించి ఆయాప్రాంతాలలో నియమించారు. సైనికులకు కఠినంగా నిష్పక్షపాతంగా వ్యవహరించాలని ఆదేశించి తాను కూడా అంతటి దుఃఖంలోనూ స్వయంగా కల్లోలిత ప్రాంతాలు తిరుగుతూ ప్రజలకు ధైర్యం చెబుతూ పరిస్థితిని చాలావరకు అదుపులోకి తేగల్గారు. ఢిల్లీలో ప్రభుత్వ ఉద్యోగులలో సిక్కులు చాలామంది వున్నారు. అలాటివారినీ, యింక అనేక సిక్కు కుటుంబాలనూ అనేకమంది హిందువులు తమ యిండ్లలో దాచి

రక్షించారు. ఇందిరాగాంధి దహన సంస్కారాలు జరిగేలోగా రాజీవ్‌గాంధి శాంతి భద్రతలను పూర్తిగా నెలకొల్పగలిగారు. ఆమె అంతిమయాత్రలో లక్షలాది జనం పాల్గొన్నా, ఏసంఘటనా లేకుండా ప్రశాంతంగా జరిగి పోవటం దానికి నిదర్శనం.

## పెద్ద మెజారిటీ :

తాను ప్రధానిగా బాధ్యత తీసుకోగానే రెండు మాసాలలోగా రాజీవ్ గాంధి **1984**నవంబరులో లోక్‌సభకు ఎన్నికలు జరపాలని నిశ్చయించారు. ఇందిరాగాంధి హత్య వల్ల ప్రజల్లో ఉబికి వచ్చిన సానుభూతి వల్ల లోక్‌సభలో ఎన్నికలు జరిగిన **460** స్థానాలలో **415** స్థానాలలో కాంగ్రెస్ అభ్యర్థులనే ప్రజలు గెలిపించారు. కాంగ్రెస్‌కు యింత పెద్ద మెజారిటీ నెహ్రూ కాలంలోగాని, ఇందిర బ్రతికి వున్న కాలంలోగాని రాలేదు. ఆమె మరణానంతరం ప్రజల్లో కలిగిన సానుభూతి, అభిమానం వల్ల ప్రజలు యింత ఘనంగా కాంగ్రెస్‌కు పట్టం కట్టటం జరిగింది.

దేశమంతటా కాంగ్రెస్‌కు బ్రహ్మరథం పట్టినా రాష్ట్రంలో తెలుగు దేశం ప్రభావం తగ్గలేదు. ఆంధ్రలో కాంగ్రెస్ టిక్కెట్‌పై నాతోపాటు ఆరుగురు మాత్రం లోక్‌సభకు ఎన్నికైనారు. ఇప్పుడు ప్రధానిగా వున్న పి.వి.నరసింహారావు, గవర్నర్‌గా వున్న శివశంకర్‌లు అప్పుడు రాజీవ్‌గాంధి మంత్రివర్గంలో సభ్యులు. అయినా అనామకుల చేతుల్లో వారిద్దరూ వోడిపోయారు. కాని పి.వి.నరసింహారావు మహారాష్ట్రలోని రాంటెక్ నుండి కూడ పోటీ చేసి గెలవటం వల్ల లోక్‌సభలోకి ప్రవేశించగలిగారు. ఎన్నికలలో గెలిచిన రాజీవ్ గాంధీ తన నూతన మంత్రి వర్గంలో నాకు స్థానం యివ్వాలని సంకల్పించారు. అయితే నేను కాబినెట్‌లో వుంటే పి.వి., శివశంకర్‌ల ఆటలు సాగవని భయపడి, వారు విశ్వప్రయత్నం చేసి నా పేరు జాబితాలోకి రాకుండా చేశారని నాకు తెలిసింది. ఆంధ్రప్రదేశ్ నుంచి అంజయ్యను సహాయమంత్రిగా నియమించటం జరిగింది.

రాజీవ్‌గాంధీతో నాకు అంతకు ముందు పరిచయంలేదు. ఢిల్లీకి నేను ఇందిరాగాంధీ గారిని కలవటానికి వెళ్లినప్పుడు ఆమె రాజీవ్‌ని పిలచి నాకు పరిచయం చేశారు. ఎన్నికల్లో గెలిచినా, ఆయన దగ్గరకు పోయి నాకు పదవి యివ్వమని పి.వి.నరసింహారావు మాదిరిగా నేను అడుగలేదు. 'వెంగళరావుగారిని కాబినెట్‌లోకి తీసుకోకపోవడం పెద్దపొరపాటు. పి.వి.నరసింహారావు, శివశంకర్‌లకు స్వరాష్ట్రంలో పలుకుబడిలేదు. వారిని తీసుకోడం వల్ల చెడ్డపేరు

వచ్చింది' అని ఇతర రాష్ట్రాల వారుకూడా చాల మంది చెప్పారు. యన్.టి.ఆర్ ముఖ్యమంత్రిగా వుండగా యిక్కడ కాంగ్రెస్ జండా కట్టేవారు కూడ లేకుండా పోయారు. అట్లాంటి పరిస్థితిలో తెలుగుదేశాన్ని ఎదురించి, కాంగ్రెస్‌ను బ్రతికించగల వారెవరు అన్న సమస్య వచ్చింది. దానిపై ఆయన నాకు రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులుగా వుండమని కబురు చేస్తే, నేను వుండటానికి నిరాకరించి, తనకు యిష్టం వచ్చిన వారినెవరినయినా పెట్టుకోవలసిందని చెప్పడం జరిగింది. తరువాత అయిదారు నెలలు గడిచాయి. అప్పుడు 'ఎవరు మాట్లాడినా లాభం లేదు, నేను స్వయంగా మాట్లాడాలి' అని రాజీవ్ గాంధి ఒక నిర్ణయానికి వచ్చి పార్లమెంటు భవనంలో ఆయన ఛాంబర్‌కు వచ్చి కలవమని నాకు ప్రత్యేకంగా కబురు చేశారు. ఎన్నికయిన తరువాత నేను ఆయనను కలుసు కోడం అదే మొదటిసారి. ఆయన ముందు నాతో మాట్లాడటానికి కొంత మొహమాట పడ్డాడు. 'రాష్ట్రంలో కాంగ్రెస్ నామరూపాల్లేకుండా పోయింది. దానిని పునరుజ్జీవింప చేయటానికి నాకు మీ సలహాకావాలి', అన్నాడు. మేమిద్దరం మాట్లాడినంతసేపు ఎవర్నీ రానీయవద్దని ఆయన సిబ్బందిని ఆదేశించాడు. 'మీరు కాబినెట్ ఏర్పాటు చేసేటప్పుడు కనీసం నాతో మాట్లాడకుండా, యిప్పుడు కాంగ్రెస్‌ను ఎట్లా బాగుచేయాలని అడగటం ఆశ్చర్యంగా వుంది', అని నేను నిర్మొహమాటంగా జవాబు చెప్పాను. అప్పుడు ఆయన నాతో 'పి.వి.నరసింహారావు, శివశంకర్‌లు చెప్పిన మాటల వలన యీ పొరపాటు జరిగింది, ఆ పొరపాటును సవరించటానికి మీరు నాకు కొంత సమయం యివ్వాలి. ముందు మీరు రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులుగా వుండేందుకు అంగీకరించండి. మిమ్మల్ని తరువాత మంత్రి వర్గంలోకి తీసుకుంటాను', అని నేనడగక ముందే చెప్పారు. ఈ విషయాలన్నీ రహస్యంగా వుంచమని కోరారు. తరువాత నన్ను రాష్ట్రకాంగ్రెస్ (ఐ) అధ్యక్షులుగా నియమించటం, రాష్ట్రంలో మళ్లీ కాంగ్రెస్‌ను పటిష్ఠం చేసే బాధ్యతను నేను స్వీకరించటం జరిగాయి. ఆ సందర్భంలోనే ఆయనా, సోనియాగాంధి రాష్ట్రంలో పర్యటనకు రావటం జరిగింది. పర్యటన సమయంలో ఏర్పాటు చేసిన కార్యక్రమాలు విజయంకావటం చూసి ఆయన ఢిల్లీ వెళ్లగానే 'వెంగళ రావుగారికి రాష్ట్రంలో మంచిపలుకుబడి వుంది' అని అందరితో చెప్పేవాడు.

# కేంద్రపరిశ్రమల మంత్రిగా

తరువాత నేనాడో మీటింగ్‌కు హాజరయ్యేందుకు ఢిల్లీ వెళ్లాను. అప్పుడు ఉదయం పదిగంటలకు ఆయన ఫోన్ చేసి 'మిమ్మల్ని కాబినెట్ లోకి తీసుకుంటున్నాను. 12 గంటలకు రాష్ట్రపతి భవన్‌లో ప్రమాణ స్వీకారోత్సవానికి హాజరుకండి!' అని చెప్పారు. 'ప్రతిష్ఠాత్మకమైన పరిశ్రమల శాఖను నా కివ్వాలనుకుంటున్నట్లు' కూడా ఆయన అన్నారు. అప్పుడు జరిగిన మంత్రి వర్గ శాఖల కలగలుపులో అప్పటివరకు ముఖ్యమైన శాఖలను చూస్తున్న పి.వి.నరసింహారావు, శివశంకర్‌లను ఆ శాఖల నుండి తొలగించటం వారికి వేరే శాఖలు యివ్వటం జరిగింది.

నేను ముఖ్యమంత్రిగా వుండగా ఎందరినో పార్లమెంటుకు పంపాను. కాని నాకెప్పుడూ కేంద్ర మంత్రిగా వుండాలన్న కోరిక కలుగ లేదు. కాని 1984లో పార్లమెంటుకు పోటీ చేయాలని కాంగ్రెస్ అధిష్ఠాన వర్గం నన్ను కోరటం వల్ల నేను పోటీ చేయవలసివచ్చింది. ప్రధాని రాజీవ్ గాంధిగారి కోరికపై 1986 అక్టోబరు 22న కేంద్ర పరిశ్రమల శాఖ మంత్రిగా నేను రాజీవ్ మంత్రి వర్గంలో చేరాను. నా కన్న ముందు ఆ శాఖను చూసిన వారంతా హేమా హేమీలు. వారందరి కన్నా కష్టపడి పనిచేసి, వెంగళరావు గారి కాలంలో పారిశ్రామికాభివృద్ధి బాగా జరిగింది – అని రాష్ట్ర ముఖ్య మంత్రులతోనూ, పారిశ్రామిక వేత్తలతోను ప్రశంసలు పొందగలగటం నా అదృష్టం.

## విస్తారం :

కేంద్రంలో పరిశ్రమలశాఖ చాలా విస్తారంగా వుంటుంది. ఎంతో ప్రధానమైన మంత్రిత్వ శాఖలలో అదొకటి. అందులో పారిశ్రామికాభివృద్ధి విభాగం, ప్రభుత్వ రంగ సంస్థల విభాగం, కంపెనీ వ్యవహారాల విభాగం వుంటాయి. అందులో ప్రతిదీ దేనికదే చాలపెద్దదీ, ముఖ్యమైనదీ కూడ. నాకు తోడ్పడటానికి పరిశ్రమల శాఖలో ముగ్గురు సహాయ మంత్రు లుండేవారు.

అంతకు ముందు ప్రభుత్వ రంగ సంస్థలబోర్డు మొదలయిన సంస్థలు యితర శాఖల అజమాయిషీలో వుండేవి. కాని నా పరిపాలనా కాలంలో ఇవన్నీ పరిశ్రమల శాఖ ఓవరాల్ కంట్రోలు కిందే వుండేవి.

ఔషధాల తయారీ సంస్థలు ఉత్పత్తి చేసే మందుల ధరలను రెగ్యులేట్ చేసేఅవకాశం రసాయనాలు, పెట్రో కెమికల్స్ విభాగానికి వుండేది.

నా పరిపాలనా కాలంలో ఔషధాల ధరలను క్రమబద్ధం చేసే ప్రయత్నం చేశాను. ప్రజల ఆరోగ్య, వైద్యావసరాలనూ, పరిశ్రమల సాధక బాధకాలనూ కూడా దృష్టిలో వుంచుకుంటూ ఔషధాల ధరల క్రమబద్ధీకరణ జరిపే ఏర్పాటు చేశాము.

హైదరాబాదులో ఐ.డి.పి.యల్. ఔషధాల తయారీ సంస్థే, నిధుల కొరత వల్ల ఆ సంస్థ ప్రాణం కడబట్టిన పరిస్థితిలో వుండేది. ఆ సంస్థకు కావలసిన నిధులు సమకూర్చి తిరిగి ప్రాణం పోయటానికి నేను ప్రత్యేక శ్రద్ధ తీసికోటం జరిగింది. ఆ సంస్థ యిప్పుడు తిరిగి నిధుల కొరత మూలంగా ఇబ్బందులలో పడిందని తెలిసి నాకు విచారంగా వుంది. ఆ సంస్థలో పనిచేసిన శాస్త్రజ్ఞులూ, సాంకేతిక నిపుణులూ బయటికి వెళ్లిపోయి, సొంతంగా పరిశ్రమలు పెట్టుకొని చక్కగా సంపాదించు కొంటున్నారు. విదేశీ మారకాన్ని కోట్లలో ఆర్జిస్తున్నారు.

నేను పరిశ్రమల మంత్రిగా వుండగానే కంపెనీ లా యాక్టుకు అవసరమైన సవరణలను కొన్నిటిని తీసుకొనివచ్చాను. కంపెనీలకు సంబంధించిన నిబంధనలను సరళతరం చేయటం ఈ సవరణల లక్ష్యం.

## సరళీకరణ :

పారిశ్రామికాభివృద్ధి చట్టం దేశంలో పరిశ్రమల స్థాపనను ప్రోత్సహించటానికి ఉద్దేశించబడింది. అందులోని నిబంధనలను పరిశ్రమల స్థాపనకు ప్రోత్సాహం అందించేందుకు ఉపయోగించాలి కాని ఉత్సాహంగా ముందుకు వచ్చే పారిశ్రామిక వేత్తలకు ఎంటర్ ప్రెన్యుయర్సుకు కాళ్లకు బందం కాకూడదని నమ్మే వారిలో నేనొకడ్ని. ప్రభుత్వరంగ సంస్థలకు తగిన ప్రోత్సాహం యిచ్చి వాటిని సమర్ధవంతంగా నడపాలి. ప్రయివేటు రంగంలో పరిశ్రమల స్థాపనకు చేయూతనివ్వాలి. ముఖ్యంగా, చిన్నతరహా పరిశ్రమలకు జీవం పోయాలి. లైసెన్సింగ్ విధానం వల్ల కొన్ని చికాకులు కలుగుతున్నాయి నిజమే కాని ఏదో ఒక రకమైన పార్లమెంటరీ కంట్రోలు ఈ విషయంలో తప్పనిసరి. నిబంధనలను సరళతరం చేయాలి అన్నదే ఆది నుంచీ నా అభిప్రాయం. పెట్టుబడి ఏభైకోట్ల లోపల వుండే ఏ పరిశ్రమను స్థాపించటానికైనా ఏ లైసెన్సూ, ఏ పర్మిషన్

అక్కరలేదన్న నిర్ణయం నేనానాడే తీసికొనటం జరిగింది. (కోర్ ఏరియాలలో, పబ్లిక్‌సెక్టార్‌కు కానీ, చిన్నతరహా పరిశ్రమలకు కానీ రిజర్వు చేయబడ్డ రంగాలకు మాత్రం ఇది వర్తించదు.) మెమోరాండం దాఖలు చేస్తే చాలని చెప్పాము. అదికూడా కేవలం స్టాటిస్టిక్స్ కోసమే. ఇటీవల ప్రకటించిన లిబరలైజేషన్ విధానం కూడా ఇదే. కాకపోతే ఫెరా నిబంధనల క్రింద యిప్పుడు మరిన్ని రాయితీలు లభ్యమౌతున్నాయి. పెట్టుబడి పరిమితిని పట్టించుకోటల్లేదు.

## ఇంటికే శాంక్షన్లు :

పరిశ్రమల స్థాపనలో రెడ్ టేప్ అడ్డుతగలకుండా నేనెంతో శ్రద్ధతీసికొంటూ వచ్చాను. లెటర్స్ ఆఫ్ ఇన్‌టెన్ట్ జారీ చేయటం, వాటిని సంబంధితులకు పంపటం చక చకా జరిగిపోయేలా చూస్తుండేవాళ్లం. ఆ విధంగా చేయటం వల్ల మంచి ఫలితాలు కలిగాయి. కొంతమంది ఎంటర్ ప్రెన్యుయర్స్‌కు లెటర్స్ ఆఫ్ శాంక్షన్ ఏ ప్రయత్నం చేయకుండానే యింటికే వచ్చేసరికి ఆనందాశ్చర్యాలు కలిగేవి. వారా విషయాన్ని నాకుత్తరాల ద్వారా తెలియచేస్తూ అది తాము కలలో కూడ వూహించని సంగతని రాస్తుండే వారు. ఒకసారి ప్రముఖపారిశ్రామిక వేత్త జె.ఆర్.డి. టాటా, ఆయన మనుమడు రతన్‌టాటా నాదగ్గరకు వచ్చిన సంగతి నాకు బాగా గుర్తుంది. వారు నాతో మాట్లాడుతూ ఉద్యోగ భవన్ (పరిశ్రమల శాఖ కార్యాలయం)తో తమకు చిరకాలంగా పరిచయం వుందనీ, అయితే తాము వచ్చి 'కాగితాలను కదిలించకుండానే' తమ ప్రతిపాదనలను పరిశ్రమల శాఖ క్లియర్ చేయటం తమ అనుభవంలో యిదే మొదటి సారి' అని తమ ఆనందాన్ని వ్యక్తం చేశారు. అప్పుడు పరిశ్రమల శాఖ కార్యదర్శిగా వున్న శ్రీమతి ఒటిమాబోర్డియా, తదితర అధికారులకూ, సిబ్బందికీ ఎంతో శ్రద్ధతో చురుకుగా పనిచేసినందుకు న్యాయంగా ఈ కీర్తి దక్కాల్సి వుంది.

పరిశ్రమల శాఖలో పనిచేయటం తేలికకాదు. ఎన్నో రకాల వత్తిడులకు గురికావాల్సి వస్తుంది. 'పైనుంచి' కూడా కొన్ని వత్తిడులు వస్తాయి. దేశానికేది మంచిదో దానిని చేయాలంటే, ఈ రకరకాల వత్తిడులనూ తట్టుకోకతప్పదు.

కొంత మంది తమకు లైసెన్సులూ, పర్మిట్లూ కావాలని పైరవీ చేస్తుంటారు. అది సహజం. అయితే యింకా కొందరు ఫలానా వాడికి లైసెన్సూ, పర్మిట్లూ రాకుండా చేయాలని తిరుగుతుంటారు. ఇది చేసేది కూడా ఎవరో

అల్లాటప్పా మనుషులుకాదు. పెద్ద పెద్ద పారిశ్రామిక సంస్థలే ఈ పనికి దిగుతుంటాయి. తమ పలుకుబడినంతా వినియోగించి తంటాలు పడుతుంటాయి. రిలయన్స్ వాళ్ళూ, బాంబే డైయింగ్ వాళ్ళూ, సాఫ్ట్ డ్రింక్సు రంగంలో పార్లేస్ వాళ్ళూ, కోకాకోలా వాళ్ళూ, లెదర్ ఇండస్ట్రీలో బాటా, కరోనా వంటి సంస్థలూ, ఆటో మొబైల్సులో ప్రీమియర్, హిందుస్తాన్ మోటార్స్ వంటి వాళ్ళూ, రేజర్ బ్లేడు ఉత్పత్తి దారులు మల్హోత్రా గ్రూపూ తదితరులు - తమ రంగంలో మరొకరు తలెత్తకుండా చేసేందుకు పోటీపడుతుంటారు.

నేను పరిశ్రమల మంత్రి అయిన రోజుల్లో సిమెంట్, కాగితపు పరిశ్రమలు ప్రభుత్వం విధించిన కంట్రోళ్ల వల్ల చాల యిబ్బంది పడుతుండేవి. నేను వెంటనే ఆ కంట్రోళ్లను తొలగించటంతో ఆ పరిశ్రమలు ఊపిరి పీల్చుకోగలిగాయి.

చిన్నతరహా పరిశ్రమలకు ఎప్పుడూ నిధుల కొరత వెంటాడుతూనే వుండేది. ఐ.డి.బి.ఐ., ఐ.సి.ఐ.సి.ఐ., ఐ.యఫ్.సిఐ మొదలయిన సంస్థలన్నీ పెద్ద పరిశ్రమల సంగతి చూసేవి కాని చిన్నతరహా పరిశ్రమల సంగతి చూసేందుకు ఏ సంస్థా లేదు. అలాటి ఆర్థిక సంస్థ ఒకటి ప్రత్యేకంగా చిన్నతరహా పరిశ్రమల రంగానికి వుండాలని నేనెంతో కృషి చేశాను. దాని ఫలితమే (National Small Scale Industries Development Corporation) ఏర్పాటు కావడము.

ఇతర దేశాలతో పరిశ్రమల అభివృద్ధికి సంబంధించి, అగ్రిమెంట్లు చేసికొనేందుకు కమీషన్లుండేవి. (అప్పటి) తూర్పు జర్మనీ, పశ్చిమ జర్మనీ దేశాలతోనూ, హంగరీ, స్వీడెన్ దేశాలతోనూ ఎగ్రిమెంట్ల విషయంలో యివి చక్కగా పనిచేస్తుండేవి. ఈ కమీషన్లకు నేను కో-ఛైర్మన్‌గా వుండే వాడిని.

## ప్రభుత్వ వసతి :

నేను ప్రభుత్వ వసతి వ్యవహారాలు చూసే కేబినెట్ కమిటీకి అధ్యక్షుడుగా వుండే వాడిని. తమ తమ పదవీ కాలం పూర్తయిన తర్వాత కూడా ఏళ్ల తరబడి ప్రభుత్వ గృహాలలో వి.ఐ.పి.లు ఖాళీ చేయకుండా పట్టుకు వేళ్లాడటం విషయంలో నేను కఠినంగానే వ్యవహరించాను. చివరకు ఈ సంగతిని సుప్రీం కోర్టు చేపట్టాల్సిన పరిస్థితి వచ్చిన సంగతి ఈ మధ్య నేను పత్రికల ద్వారా తెలుసుకోటం జరిగింది.

## అచ్చికి రాదా ?

ఆ రోజుల్లో పరిశ్రమల శాఖమంత్రిగా ఎవరూ రెండేళ్ల కన్నా వుండలేదని చెప్పుకొనేవారు. కాబట్టి ఆ శాఖ తీసికోడానికే కొంత మందికి అది అచ్చికి రాదనే భయం సంకోచాలుండేవనుకుంటా. నేను మాత్రం అవేమీ పట్టించుకోకుండా నాకప్పగించిన పని చేసుకుంటూ వెళ్లాను. మూడేళ్లకు పైగా ఆ శాఖలో వుండి నా శాయశక్తులా సేవచేయ గలిగానని నాకు సంతృప్తిగా వుంది. ఆ రోజుల్లో తరచు కేంద్రమంత్రుల శాఖలు మారటమో, వారికిందవున్న సబ్జెక్ట్సును మార్చటమో జరుగు తుండేది. నా విషయంలో మాత్రం ఇవేవీ జరగలేదు. చాలమందికి అదో పెద్ద ఆశ్చర్యంగా వుండేది.

దేశ ప్రయోజనాలను పరిరక్షించే విధంగా సమర్థవంతమైన ప్రభుత్వరంగం, పోటీకి తట్టుకోగల్గిన చురుకైన ప్రయివేటు రంగం - ఈ రెండూ దేశపారిశ్రామికాభివృద్ధికి చాలా అవసరం అని నా అభిప్రాయం. ప్రయివేటు రంగం పోటీని తట్టుకొనేలా అభివృద్ధి కావాలనే నేను ఎప్పుడూ నిబంధనలను సరళతరం చేయటం కోసం ప్రయత్నిస్తూ వచ్చాను. ముఖ్యంగా దిగుమతులను ఉదారంగా అనుమతిస్తూ, తగినట్లుగా మాత్రమే దిగుమతి సుంకాలను విధించాలి - అని నేను కోరుతూ వచ్చాను. ముఖ్యంగా క్యాపిటల్ గూడ్స్‌కు సంబంధించి ఇది అవసరం.

## అమెరికాలో వెంకట్ :

**1984**లో నా చిన్నకుమారుడు వెంకట్ అమెరికా వెళ్లి చదువు కుంటానన్నాడు. నేను అందుకు అంగీకరించి వెంకట్‌రావును యు.యస్.ఏ. పంపించటమైనది. వెంకట్‌రావు అమెరికాకు బయలుదేరే సమయంలో నేను ఇంటిదగ్గర లేను. ఎన్నికల కార్యక్రమంపై ఖమ్మం జిల్లాలో వున్నాను. వెంకట్‌రావు ఖమ్మం వచ్చి నన్ను కలిసి వెళ్లాడు. ఎన్నికలయిన తరువాత నేను వీలు చూసుకొని **1985** ఆగస్టులో యు.యస్.ఏ. వెళ్లి అక్కడ వెంకట్ రావుకు కావలసిన సౌకర్యాలు ఏర్పాటు చేసి వచ్చాను. ఇది నేను కేంద్ర మంత్రి వర్గంలో చేరకముందే జరిగింది. అప్పుడే నేనొక నిర్ణయానికి వచ్చాను. 'వెంకట్‌రావు అమెరికా చదువు ముగించుకొని భారతదేశానికి తిరిగివచ్చి పెండ్లి చేసుకునే దాకా రాజకీయాల్లో నేను కొనసాగినా, ఆ తరువాత మాత్రం రాజకీయాలనుండి విరమించుకొని విశ్రాంతి తీసుకోవాలి' అనుకున్నాను.

## రాజీవ్ పొరపాట్లు :

రాజీవ్‌గాంధి చాలమంచివాడే కాని ఆయన చుట్టూ చేరినదుష్టశక్తుల ప్రభావంలో పడి ఆయన కొన్ని పొరపాట్లు చేశాడు. దాని వల్ల కాంగ్రెస్ 1984లో పెద్ద మెజారిటీతో గెలిచి కూడా 1989లో మెజారిటీ సంపాదించు కోలేక పోయింది. ఆయనకు రాజకీయాలలోకి రావాలని గాని ప్రధాన మంత్రి కావాలని గాని ఎప్పుడూ కోరిక లేదు. తల్లి బలవంతంపై ఆయన రాజకీయాలలోకి దిగవలసి వచ్చింది. ఆయన ఎక్కువగా అధికారులమాటపై ఆధారపడేవాడు. తన మంత్రి వర్గ సభ్యుల సలహాకన్న అధికారుల సలహాకు ఎక్కువ విలువ నిచ్చేవాడు. ఆయన ప్రతిష్ఠాత్మకమైన డూన్ (డెహ్రాడూన్) స్కూలు విద్యార్థి. కొంతకాలం ఇంగ్లాండులో చదివాడు. నెహ్రూగారి మనవడు అయినా, ఇందిరాగాంధి కుమారుడైనా ఆయనకు రాజకీయాలలో ఆసక్తి లేదు. అందువల్ల రాజకీయ పరిజ్ఞానాన్ని పెంపొందించుకోవాలన్న కోరిక రాజకీయాలలోకి దిగేంత వరకూ ఆయనకు లేకపోయింది. రాజీవ్‌గాంధి ఇటలీకి చెందిన సోనియా గాంధీని పెండ్లి చేసికున్నాడు. పైలట్‌గా ఉద్యోగం చేసేవాడు. ఇంగ్లీషుబాగా మాట్లాడగలిగేవాడు. పార్లమెంటులోగాని బయటగాని, లేక దేశ విదేశ పర్యటనల్లోగాని చుట్టూ వున్నవారు తయారు చేసిచ్చిన ఉపన్యాసాలను బాగా చదువుతుండేవాడు.

నేను ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా వుండగా వి.పి.సింగ్ ఇందిరా గాంధి మంత్రి వర్గంలో వాణిజ్య శాఖ సహాయ మంత్రిగా వుండేవాడు. ఆయన రఘురామయ్య గారితో కలిసి నా దగ్గరకు వస్తుండే వాడు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం బాగా పనిచేస్తోందని నాతో చెపుతుండే వాడు. నేనంటే చాల గౌరవభావంతో వుండేవాడు.

## బోఫోర్స్ :

ఆయన కొంతకాలం రాజీవ్‌గాంధి మంత్రివర్గంలో ఆర్థిక మంత్రిగా వున్నాడు. అప్పుడే బోఫోర్స్ శతఘ్నుల కొనుగోలు విషయంలో అవినీతి, అవకతవకలు జరిగాయని ఆయనకు అనుమానం కలిగింది. ఆ కొనుగోలు వ్యవహారంలో కోట్లరూపాయలుకు రాజీవ్ గాంధీకి, ఆయన మనుషులకు ముడుపులుగా ముట్టాయని ఆయన అభిప్రాయం. క్రమేణా ఆయనకు, రాజీవ్‌కు

అభిప్రాయ భేదాలు కలిగాయి. వి.పి.సింగ్‌ను ఆర్థిక మంత్రి పదవి నుండి తొలగించి రక్షణ శాఖమంత్రిగా వేశారు. అక్కడ కూడ బోఫార్స్ విషయంలో అభిప్రాయభేదాలు తీవ్రమైనాయి. దానితో వి.పి.సింగ్ రాజీవ్‌గాంధీతో విభేదించి, 90 మంది పార్లమెంట్ సభ్యులతో కాంగ్రెస్ నుండి బయటకు వచ్చారు. ఒకప్పుడు మంచి స్నేహితులుగా వున్నవారు అలా విడిపోయి ప్రతిపక్షంలో కూచోటం, రాజీవ్‌ని ఆయన తీవ్రంగా విమర్శిస్తుండటం జరుగుతుండేది. తరువాత ఆ తొంభయి మంది తమ పార్లమెంటు సభ్యత్వానికి రాజీనామా చేశారు.

## ప్రతిపక్షంలో రాజీవ్ :

1989లో తొమ్మిదవ లోక్‌సభకు సాధారణ ఎన్నికలు జరిగాయి. అందులో రాజీవ్ గాంధీకి తగిన మెజారిటీ రాలేదు. రాజీవ్‌కు వ్యతిరేకంగా వుండే ప్రతిపక్షాల మద్దతుతో వి.పి.సింగ్ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశాడు. సుమారు ఆరుమాసాల పాలన తరువాత బి.జె.పి. తన మద్దతును ఉప సంహరించుకోడంతో సింగ్ రాజీనామా చేశారు. అప్పుడు రాజీవ్‌గాంధి మద్దతుతో చంద్రశేఖర్ ప్రధాని అయ్యాడు. సంవత్సరకాలం చంద్రశేఖర్ ప్రభుత్వాన్ని బలపరుస్తామని రాజీవ్‌గాంధి రాష్ట్రపతికి రాసివ్వడం వల్ల, ఇతర పార్టీల మద్దతు కూడ వుండటం వల్ల మొత్తం మీద చంద్రశేఖర్ ప్రధాని అయ్యాడు. చంద్రశేఖర్ మంత్రివర్గం కొద్ది కాలం జరిగింది. అప్పుడు రాజీవ్‌గాంధి చుట్టూచేరిన పి.వి.నరసింహారావు, శివశంకర్, యింకా కొందరు దుష్టశక్తులు రాజీవ్‌గాంధీతో 'చంద్రశేఖర్ మన బలంపై ఆధారపడి రాజ్యం చేస్తున్నాడు. మీరు మద్దతును ఉపసంహరించుకొంటే, మీ దగ్గరకు వచ్చి బతిమిలాడి మిమ్మల్నే ప్రధానిగా వుండమని కోరతాడు,' అని తప్పుడు సలహా యిచ్చారు. తరువాత రాజీవ్‌గాంధి తాను ఒంటరిగా వున్నప్పుడు నాకు కబురు చేసి పిలిపించి నా సలహా అడిగాడు. అప్పుడు నేను ఆయనతో ''మీరు చంద్రశేఖర్‌ను బలపరుస్తామని రాష్ట్రపతికి రాసిచ్చారు. ఇప్పుడు మనం మద్దతును ఉపసంహరించుకోడం నైతికంగా మంచిది కాదు. అంతేకాదు. మీరు మద్దతు ఉపసంహరించు కోగానే, ఆయన మీ దగ్గరకు వచ్చి మిమ్మల్నే ప్రధానిగా వుండమని బతిమి లాడతాడనుకోవడం పొరపాటు. అది జరగదు. మీరు మద్దతు ఉప సంహరించుకోగానే చంద్రశేఖర్ రాష్ట్రపతిని కలిసి రాజీనామా సమర్పించి, లోక్‌సభను రద్దుచేసి ఎన్నికలు జరిపించమని కోరతాడు. అదే చివరకు జరిగేది', అని చెప్పాను. ఆయనకు నా సలహా రుచించలేదు. పార్లమెంట్ సమావేశాలు

జరుగుతుండగా కాంగ్రెస్ సభ్యులందర్నీ బయటకు వెళ్లి కూచోవున్నారు. ప్రతిపక్షాలు ఇదిగ్రహించి, అదే సమయంలో చంద్రశేఖర్‌కు మద్దతు యిచ్చి తీర్మానాన్ని గెలిపించారు. ఇది జరిగింది **1991** మార్చి **11**న. నేను రాజీవ్‌కు సూచించినట్లే చంద్రశేఖర్ రాజీనామాచేయటం, లోక్‌సభకు మధ్యంతర ఎన్నికలు రావటం జరిగింది.

నేను, అది జరగ్గానే రాజీవ్‌గాంధీని కలిశాను. 'నా సలహా మీరు వినలేదు. ఇప్పుడు ఎన్నికలొచ్చాయి. లోగడ వచ్చిన సీట్లకన్నా యీసారి తక్కువ సీట్లు వస్తాయి', అని చెప్పాను. ఆయన ఏమీ మాట్లాడకుండా వూరుకున్నాడు. రాజీవ్‌గాంధీని నేను కలవడం అదే ఆఖరుసారి.

ఈ సారి ఎన్నికల్లో నేను పోటీ చేయదలచుకోలేదు. రాజకీయాల నుంచి విరమించి విశ్రాంతి తీసుకోవాలని నిశ్చయించుకొన్నాను. అదే రోజు హైదరాబాదు తిరిగి వచ్చేశాను.

ఎన్నికలు ప్రకటించిన తరువాత బలరాంజాకర్ నన్ను తిరిగి పోటీ చేయమని కోరారు. 'చేయను!' అని స్పష్టంగా చెప్పాను.

ఎన్నికల మొదటిఘట్టం జరగ్గానే రాజీవ్‌గాంధి హత్య చేయబడ్డాడు. నేను చెప్పిన సలహా విని వుంటే ఆ దారుణం జరిగేది కాదేమో! చిన్న పిల్లవాడికి చెప్పినట్లు చెప్పినా ఆయన ఓపిక పట్టకుండా, తొందరపడి తెలిసీ తెలియని పనులు చేశాడు. లేకపోతే ఈ దుర్ఘటన తప్పేది.

కేంద్ర పరిశ్రమల మంత్రిగా శ్రీ జలగం వెంగళరావు ప్రమాణం.

కేంద్ర పరిశ్రమల మంత్రిగా విదేశీ ప్రముఖులతో పారిశ్రామిక చర్చల్లో భాగంగా...

ఎన్.టి.ఆర్. రాష్ట్రాధికారాన్ని చేపట్టిన క్లిష్ట తరుణంలో రాష్ట్ర కాంగ్రెసు సారథ్యాన్ని స్వీకరించిన వెంగళరావు గాంధీభవన్‌లో జరిగిన పి.సి.సి. సమావేశంలో పాల్గొన్నప్పటి దృశ్యం. ప్రసంగిస్తున్న వారు వెంగళరావుకు అప్పుడు, పి.సి.సి. ఉపాధ్యక్షుడు అయిన కీర్తిశేషులు కె.ఎల్.ఎన్. ప్రసాద్ (ఎం.పి.)

# అనుబంధం : 1

*(1970-71 బడ్జెట్ ప్రతిపాదనలలో హోంశాఖ గ్రాంట్స్ ఆమోదం గురించి జరిగిన చర్చకు సమాధానం చెబుతూ ఆంధ్రప్రదేశ్ శాసనసభలో 1970 మార్చి 4న హోంమంత్రి శ్రీ జలగం వెంగళరావు ప్రసంగం ఆధారంగా...)*

**శ్రీ జె.వెంగళరావు :-** అధ్యక్షా, పోలీసు డిమాండుమీద చాలమంది మిత్రులు మాట్లాడారు. భీమిరెడ్డి నరసింహారెడ్డిగారు, కొంతమందిమిత్రులు ఉద్రేకముగా మాట్లాడారు. కొంతమంది నిర్మాణాత్మకముగా, ఇవాళ్ల వున్న పరిస్థితులలో పోలీస్ డిపార్టుమెంటుకు ఎట్లా మోడరనైజుచేయాలి, వారికివున్న ఇబ్బందులు ఏమిటి అనేవి కన్‌స్ట్రక్టివ్‌గా చెప్పారు. పోలీసు డిపార్టుమెంటుచేసే పని కొంతమందికి కోపము కల్గిస్తుందని నాకు తెలుసు అయినా చేయకతప్పదు. తమకు తెలియని విషయము కాదు అధ్యక్షా, గత సంవత్సరకాలములో మన రాష్ట్రములో క్లిష్టపరిస్థితులు ఏర్పడినవి. ఒక ప్రక్క తెలంగాణా ఉద్యమము, రెండవప్రక్క నక్సలైట్సు ఉద్యమము, అనేక అరాచక పరిస్థితులు, ఈ సందర్భంలో ఈ రాష్ట్రములో పోలీసు డిపార్టుమెంటు తన బాధ్యతను నిర్వర్తించ వలసిన పరిస్థితులు ఏర్పడినవి. కొన్ని లోపాలు వున్నప్పటికి ఎంతో చక్కగా ఈ డిపార్టుమెంటు నిర్వహించిందని చెప్పకతప్పదు. పోలీసు డిపార్టుమెంటులో ఎన్నో లోపాలు వున్నవి, కరప్షన్ ఎక్కువగా వుంది, ఇన్ఎఫిషియన్సీవుంది. దానిని అంతా బాగుచేయాలని చెప్పారు. సంతోషము, ఈ డిపార్టుమెంటులో వున్నవారంతా దేవతలు, తప్పులేదు అని చెప్పటము లేదు. ఉన్న తప్పులను సవరించడానికి ప్రభుత్వము ప్రయత్నము చేస్తుందని. ఇంకా దానిని బాగు చేయడానికి ( ప్రయత్నము చేస్తుందని మనవి చేస్తున్నాను. మన రాష్ట్రములో పోలీసు డిపార్టుమెంటుపైన మనము ఎంత ఖర్చుపెట్టాలో అంత ఖర్చుపెట్టడములేదని సభ్యులదృష్టికి తీసుకొనివస్తున్నాను. 20 సంవత్సరాల క్రితము ఎన్నిపోలీసు స్టేషన్సు వున్నవో ఈనాడు కూడ అంతే వున్నవి. రాష్ట్రములో జనాభా పెరిగింది. పరిశ్రమలు ఎక్కువగా వచ్చినవి, కాలేజీలు స్కూల్సు ఎక్కువగా పెంచారు, దానితో పాటు అరాచకము, నేరాలు పెరిగినవి, దానిని అదుపులోకి తీసుకు రావడానికి, శాంతి భద్రతలను పరిరక్షించటానికి డిపార్టుమెంటు పెరగలేదు. పోలీసు స్టేషన్సు రాలేదు. ప్రతివారు చెబుతున్నారు. ఈనాడు భీమిరెడ్డి నరసింహారెడ్డిగారు, యితర మిత్రులు

చెప్పారు. మన రాష్ట్రములో 10 వేలమంది జనాభాకు 8మంది పోలీసులు వున్నారు. 100 స్క్వేర్ మైళ్లకు ఒక పోలీసు కానిస్టేబులు వున్నాడు. ఇతర రాష్ట్రాలతో పోల్చిచూడండి, కేరళలో 10వేలమంది జనాభాకు 7 మంది పోలీసులు వున్నారు. 100 స్క్వేర్ మైళ్లకు 30మంది పోలీసు కానిస్టేబుల్స్ వున్నారు. వెస్ట్‌బెంగాల్‌లో 45మంది వున్నారు. మనము అన్ని రాష్ట్రాలకన్న చాల తక్కువ పర్సంటేజి 4.07% బడ్జెటులో పోలీసు డిపార్టుమెంటు పైన ఖర్చు పెడుతున్నాము. బెంగాలులో చాల ఎక్కువగా వుంది. చెబితే గుండె పగులుతుంది. మిగతా రాష్ట్రాలు ఇంకా ఎక్కువ ఖర్చుపెడుతున్నవి. మనం చాలా తక్కువ ఖర్చు పెడుతున్నాము. శివయ్యగారు ఇది వెల్‌ఫేర్ స్టేటా పోలీస్ స్టేటా అని అడిగారు, వెల్‌ఫేర్ స్టేట్ కనుకనే పోలీస్ డిపార్టుమెంటుమీద ఎక్కువ ఖర్చుపెట్టడం లేదు. అనవసరంగా పోలీస్‌లమీద ఖర్చుపెట్టటంకన్న అభివృద్ధి కార్యక్రమాలమీద ఖర్చుపెట్టాలని అనుకొంటున్నాను. కాని ఈనాటి పరిస్థితుల బట్టి దానిని కొంత అభివృద్ధి చేయకతప్పదు. అభివృద్ధి చేయకపోతే అరాచక పరిస్థితులను అదుపులో పెట్టటం కష్టం.

అందువల్ల ఈ సంవత్సరం నుండి సంవత్సరానికి 50 లక్షలు ఖర్చుపెట్టి అభివృద్ధి పర్చాలనుకొంటున్నాము. వెహికల్స్ ఎక్కువగా ఇవ్వాలన్నారు. ఇవన్నీ ప్రభుత్వదృష్టిలో వున్నాయి. కానిస్టేబుల్స్ సబ్ ఇన్స్‌పెక్టర్లు మొదలైన వారికి జీతాలు తక్కువగా వున్నాయని చెప్పారు నేను అంగీకరిస్తున్నాను. కాని ఒక్కసారి చేయివేస్తే ఎన్నికోట్లకు వెడుతుంది ప్రభుత్వ ఆర్థిక పరిస్థితులబట్టి క్రమేణాచేయాలి. ప్రభుత్వం వీటన్నిటిని సానుభూతితో ఆలోచిస్తుందని మనవిచేస్తున్నాను. అదేవిధంగా పోలీసులకు ఇండ్ల విషయంలో మనరాష్ట్రం చాలా వెనుకబడింది. ఇతర రాష్ట్రాలలో 60%, 70% ఇండ్లు సమకూర్చగలిగితే మన లో పాతవాటితో కలిపితే 30% కూడా లేని పరిస్థితులున్నాయి. ఈ సంవత్సరం నుండి ప్రత్యేక శ్రద్ధతీసికొని 20 లక్షలలో ఈ సంవత్సరం హైదరాబాదు సిటీలో ఇండ్లు కట్టటానికి ఈ మధ్యనే శాంక్షన్ చేయటం జరిగింది. వచ్చే సంవత్సరం కేంద్రం నుండి లోన్ తీసికొని ప్రతిసంవత్సరం 25,30 లక్షలు ఖర్చుపెట్టి జిల్లాలలో కూడా గృహ వసతి కలుగచేయటానికి ప్రభుత్వం శ్రద్ధతీసికుంటుందని మనవి చేస్తున్నాను. పోలీస్ డిపార్టుమెంటు అన్యాయంగా ప్రవర్తిస్తున్నది, PD.Act తీసుకువచ్చి అణచిపారేయాలని చూస్తున్నారని నరసింహారెడ్డిగారు, ఇతరులు చెప్పారు. PD Actతో అణచాలని, అరెస్టులు చేయాలని దుర్మార్గంగా ప్రవర్తించాలని మా ఉద్దేశంకాదు. అది ప్రభుత్వానికి సంతోషకరమైన విషయముకాదు. దయచేసి ఆ పరిస్థితి కల్పించవద్దని మనవి చేస్తున్నాను. చాలామంది డెమోక్రసీగురించి

చెప్పారు. ఈనాడు కేంద్రహోంమంత్రి చవాన్‌గారు చెప్పినమాట గుర్తుపెట్టుకోవలసిందిగా కోరుతున్నాను. మనంకూడా అశ్రద్ధగావుంటే దేశం అరాచకంలోకి వెడుతుంది. వెస్ట్‌బెంగాల్‌లో నక్సలైట్లు పాకిస్థానుద్వారా చైనా ఆయుధాలు రావటం ఇవన్నీ గుర్తుపెట్టుకోవాలని వారు చెప్పారు. ఈనాడు డెమోక్రసీని రక్షించుకోవలసిన అవసరం వుంది. డెమోక్రసీ అంటే మెజారిటీ యొక్క అభిప్రాయానికి మైనారిటీ విలువ ఇవ్వనినాడు అది డెమోక్రసీ కాదు. దానిని గురించి మాట్లాడే అధికారంలేదని మనవిచేస్తున్నాను. నక్సలైట్ల ఉద్యమం కాని, ప్రత్యేక తెలంగాణా ఆందోళనకాని, మార్క్సిస్ట్ రైటుకమ్యూనిస్టుల భూమిపంపిణీ విధానం కాని ప్రశాంతంగా, చట్టబద్ధంగా, శాంతియుతంగా జరిపితే ఎవరికీ అభ్యంతరం లేదు. కాని ఈ ప్రభుత్వాన్ని స్తంభింపచేస్తాము, బస్సులు తగలబెడతాము, లేకపోతే యింకేదో చేస్తాము అని బెదిరిస్తే ప్రభుత్వం చూస్తూ ఊరుకోదు. అలా ఊరుకుంటే అది ప్రభుత్వంకాదని చెప్పేవారిలో నేను ఒకడిని. ఈనాడు మేము మైనారిటీలో వున్నాము, మా మాటలు వినకపోతే ఈ ప్రభుత్వాన్ని స్తంభింపచేస్తాము. అమాయకులైన ప్రజలను రెచ్చగొట్టి బజార్లలోకి పంపి బస్సులు తగలబెట్టించి ఏదో చేస్తాం అంటే అదినడవదు, నడవటానికి వీలులేదని మనవి చేస్తున్నాను. మీకు నిజంగా ప్రజాస్వామ్యం మీద విశ్వాసం వుండి, మీ సిద్ధాంతాలు చెప్పుకొని ఎన్నికలలో గెలవండి. మాకు సంతోషం. మీరు మెజారిటీ సంపాదించుకొని పరిపాలించండి. కాని ప్రజాస్వామ్యం పేరు చెబుతూ ప్రజల మెజారిటి వున్న దానిని వ్యతిరేకించి అది చేస్తాం; ఇది చేస్తాం అని భయపెట్టి, బెదిరిస్తే ఆ బెదిరింపులు నడవవు, వాటికి తలవంచము అని చెబుతున్నాను. మీరు ప్రజల దగ్గరకు వెళ్లండి, మేమూ వెడతాము. వారికి మీ అభిప్రాయాలు తెల్పి వారి అభిమానాన్ని పొందితే ఎవరికీ అభ్యంతరం లేదు. కాని వున్న పరిస్థితులకు చికాకు కల్పించి అరాచకాన్ని కల్గించి రాష్ట్రాన్ని నాశనం చేస్తాం, వారిని వెళ్లగొడతాం. వీరిని ఏదో చేస్తాం అని ఉపన్యాసాలు చెబితే ఆ కాలంపోయిందని చెబుతున్నాను. ఈనాడు తాడూ బొంగరం లేనివారికే అంత ధైర్యం వుంటే ఇంత బలం, ఇంత స్తోమత వున్న ప్రభుత్వానికి ఎంత ధైర్యం వుండాలి? నరసింహారెడ్డిగారికి ఒక విషయం చెబుతున్నాను. పోలీసు పక్షపాతంగా వ్యవహరించదు. అలా వ్యవహరించకుండా చూస్తామని హామీ ఇస్తున్నాను. వారు యెంపిటెని గురించి చెప్పారు. కాంగ్రెసుకు ఏమి సంబంధం? రైటుకమ్యూనిస్టులు, లెఫ్టుకమ్యూనిస్టు కార్యకర్తను మర్డర్ చేస్తే వీరు వెళ్లి వారి ఇల్లు తగులబెట్టారు. దానికి నేను ఏమి చేయాలి? పోలీసులు న్యాయంగా ప్రవర్తిస్తారు. నిష్పక్షపాతంగా వ్యవహరిస్తారని మనవిచేస్తున్నాను. ఈనాడు నక్సలైట్ల కార్యక్రమం వుంది. వారిగురించి సుబ్బయ్యగారు చాలా జాగ్రత్తగా

మాట్లాడారు. వారు కేరళలో ప్రభుత్వంలో వున్నారు. వారు కూడా నక్సలైట్స్‌ను కాల్చిపారేశారు. ఎన్‌కౌంటర్‌లో, ఇక్కడ ఉపన్యాసాలు చెబితే సరిపోదు. వారి కార్యక్రమం అన్ని జిల్లాలలోనూ అశాంతిని కలుగ చేసింది. దోపిడీలు చేసి హత్యలు చేసి ఈ రాష్ట్రంలో అరాచక పరిస్థితులు కల్పించాలని వారికి plan వుంది. మన దగ్గర వున్న పోలీసు సిబ్బంది. అధికారులు జాగ్రత్తగా పనిచేస్తూ ఎంతో శ్రమపడుతూ వారి plansను భంగపరచి రాష్ట్రములో ప్రశాంత పరిస్థితులు కలుగచేశారు. అందుకు వారిని అభినందించకతప్పదు. దానిని పరిష్కరించటానికి మార్గాలు వున్నాయి. ఆ ప్రాంతాలలోని అటవీ జాతి వారి ఆర్థిక పరిస్థితి బాగుచేయటానికి ప్రభుత్వం అనేక కార్యక్రమాలు తీసికొంటున్నది. నక్సలైట్స్ ప్రభావం అక్కడ లేకుండా చేయటానికి ప్రభుత్వం పూనుకొంటున్నది.

నేను వెళ్లాను గోవిందరావుగారు వెళ్లని చోట్లకు నేను వెళ్లాను. వున్న పరిస్థితులు ఆలోచించండి. ఎవరు రాజ్యం చేయనివ్వండి రేపు ప్రత్యేక రాష్ట్రం చేసుకొన్నా అభ్యంతరం లేదు. కాని దేనినైనా ప్రశాంత పరిస్థితుల్లో చట్టబద్ధంగా చేయకుండా అరాచకాన్ని సృష్టిస్తాం, బస్సులు పగులగొడతాం, తగలబెడతాం, దౌర్జన్యం చేస్తాం అని బెదిరిస్తే రేపు మనము సంపాదించుకొనే రాజ్యం కర్మం కూడా ఇట్లాగే కాలుతుందని చెబుతన్నాను. మనకు ఎన్ని అభిప్రాయబేధాలున్నా వాటిని ప్రజాస్వామ్యంగా పరిష్కరించుకోవాలి కాని అరాచకాన్ని పురిగొల్పే, ప్రోద్బలం చేసే పనులు ఏవీ చేయవద్దని మనవి చేస్తున్నాను.

ఈ పోలీసు డిపార్టుమెంటును పటిష్టం చేసి లోపాలు తొలగించి బాగా పని చేయడానికి సభ్యుల సూచనలను పాటిస్తాము. సిటీని గురించి కొంతమంది చెప్పారు. యీ సంవత్సరం కంట్రోలు రూమును అభివృద్ధి చేయడానికి 5లక్షల రూ.లు కేటాయించాము. మార్చి 3లోగా సిటీకంట్రోలు రూము అభివృద్ధి చేసి సిటీ నాలుగు మూలలా అవసరం అయినచోట్ల సిబ్బంది ఎక్కువ చేసి కార్లు ఎక్కువ చేసి వైర్‌లెస్ ఎక్కువ చేసి బాగా మాడర్నైజు చేసి బొంబాయి, ఢిల్లీ మాదిరిగా చేయాలనే కార్యక్రమం చేస్తాం. కొంతమంది యీ డైరక్టు రిక్రూటమెంటు యస్.ఐ.లు లేనందువలన ఎడ్మినిస్ట్రేషను దెబ్బతింటుందని అన్నారు. అది గవర్నమెంటు దృష్టిలో ఉంది. రాంకు ప్రమోషన్సు ఎక్కువయి నందువలన డిఫెక్టు ఉన్నమాట నిజం. అది కూడ అభివృద్ధి చేసి డైరక్టు రిక్రూట్ మెంటు చేయడానికి ప్రయత్నిస్తాం. ఇప్పుడు పెద్దలు గోపాలకృష్ణయ్యగారు చెప్పారు. యీ డి.ఎ. చాల తక్కువగా ఉందన్నారు. డి.ఎ. 1-75 పైసల నుంచి 2-27

పైసలకు యీ రివైజుడు రేట్సులో పెంచారు. ఇప్పుడు కొంత మెరుగు గానే ఉంది. పూర్తిగా వారి డి.ఎ. వారికి దొరుకుతుంది. స్నేహితులు ప్రశాంత పరిస్థితులు నెలకొల్పి నాతో పూర్తిగా సహకరించాలని మనవి చేస్తూ పోలీసు డిపార్టుమెంటులో ఉన్నలోపాలు సరిచేసి బాగా పనిచేసేటట్లు చేస్తామని మనవి చేస్తూ శలవు తీసుకుంటున్నాను.

ఇప్పుడు వారు చెప్పిన ఆఖరు Point, housing విషయముకూడా నేను చెప్పాను. ఇదివరకు మనము ఎంత తక్కువగా ఉన్నాము, ఇతర రాష్ట్రాలలో ఎట్లా ఖర్చుపెట్టారు, ఈ సంవత్సరం ఎంత ఖర్చుపెట్టాము, వచ్చే సంవత్సరము ఎంత ఖర్చుపెడుతున్నాము అని ఈశ్వరీబాయిగారు చెప్పారు. ప్రజాసమితివారుగాని, ఎవరుగాని Studentsను ను రెచ్చగొట్టలేదని అన్నారు. చాలా సంతోషము, Police Department రెచ్చగొట్టకుండా నేను చూస్తాను. ఇప్పుడు వారు రెచ్చగొట్టకుండా ఉంటే చాలు. పోలీసువాళ్లు అక్కడికి పోనేపోరు. తరువాత చాలామంది శ్రీకాకుళంజిల్లా headquarters విషయం చెప్పారు. నేను ఇందాకా చెప్పాను. అదికూడా ప్రభుత్వ ఆలోచనలో ఉన్నది. ఎంత త్వరగా డబ్బులు లభ్యమైతే, అంతత్వరగా చేయడానికి అభ్యంతరం లేదు. ఇంకా చాలామంది చెప్పారు. మధుసూధనరెడ్డిగారు వగైరా అసలు enquiry చేసి ఆ report తెప్పించి చూడకుండా ఎవరు చెప్పినప్పటికల్లా Sub-Inspector ను transfer చేస్తే, ఒక Sub-Inspector కూడా పనిచేయరు. అందువల్ల నిజంగా Sub-Inspector మీద నేరము ఉన్నదా లేదా అనేది చూడకుండా transfer జరగదు. ఆ report కోసం నేను wait చేస్తున్నాను. అది రావడంతోటే నేను చర్యతీసుకొంటాను. ఇప్పుడు మాణిక్యరావుగారు చెప్పారు. Welfare fund విషయంలో అది I.G.P. గారు చూస్తున్నారు. చాలా సక్రమంగా జరుగుతుంది. ఈ సంవత్సరం raffle లో 25లక్షల రూపాయలు ఒక Police Raffle కోసం tickets అమ్మి ఆ Raffleలోని డబ్బును అక్కడపెట్టి Police Department లో పనిని చేస్తున్నటువంటి బీదవాళ్లకు, వాళ్ల పిల్లల సౌకర్యం కొరకు లేకపోతే పిల్లలు చనిపోతే, వాళ్ల కుటుంబానికి సహాయం చేయానికి 25లక్షల రూపాయలు అట్లేపెట్టి దానిమీద వచ్చేటటువంటి ఆదాయం, దానితో చేయాలనేటటు వంటి సంకల్పము ఉన్నది. అది బాగా manage అయ్యేటట్లు చూస్తామని కూడా నేను చెప్పుతున్నాను.

★ ★ ★

# అనుబంధం : 2

***(గవర్నరుకు కృతజ్ఞతలు తెలిపే తీర్మానంపై జరిగిన చర్చకు సమాధానం చెబుతూ ఆంధ్రప్రదేశ్ శాసనసభలో 1974 జనవరి 24న ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు ప్రసంగం ఆధారంగా...)***

అధ్యక్షా, గౌరవసభ్యులు చాలా మంది ఈ నాలుగు రోజులు కూడా ఈ తీర్మానం మీద మాట్లాడారు. చాలామంది అనేక రకాల అభిప్రాయాలు వెల్లడించారు. మొత్తం మీద ఒక విషయం సంతోషించ వలసినది ఏమిటంటే మనం చాలాకాలం తరువాత మళ్లా యిక్కడ సమావేశం అయి. ప్రజా ప్రభుత్వం ఏర్పాటు చేసుకుని మన సమస్యలను చర్చించుకునే అవకాశం, పని చేసుకునే అవకాశం దొరికినందుకు చాలా సంతోషం. అందరూ పాల్గొన్నారు. ముఖ్యంగా అనేక మంది సభ్యులు - కొంతమంది ఏమి చెప్పినప్పటికీ కూడా రాష్ట్రంలో జనరల్‌గా చూస్తే 99 శాతము పై చిల్లర షట్సూత్రపథకాన్ని ఆమోదించడమో కాకుండా ఈ రాష్ట్రంలో యింక ముందు యిట్లాంటి అల్లకల్లోలాలు జరుగకుండా ప్రశాంత వాతావరణంలో రాష్ట్ర సమగ్రతను కాపాడడమే కాకుండా తెలుగు జాతి సమగ్రతను కాపాడడమే కాకుండా ఈ రాష్ట్రాన్ని అభివృద్ధి పథంలో తీసుకుపోయి చిక్కులు నష్టం కలుగకుండా జరిగిన నష్టం పూర్తిచేసుకుంటూ మళ్లా తిరిగి మనం ఈ రాష్ట్రాన్ని అభివృద్ధి పథంలోకి తీసుకుపోవాలి, సమస్యను పరిష్కారం చేసుకోవాలి, యువకులలో నిరుద్యోగ సమస్యను పరిష్కారం చేయాలి. వార్ ఫుట్టింగ్ మీద వెళ్లాలి అనే కోరిక అందరిలో కనిపించింది. అదే అభిప్రాయంలో నేను ముఖ్యమంత్రి బాధ్యత తీసుకున్న తరువాత చిత్తూరు జిల్లా దగ్గర నుంచి శ్రీకాకుళం జిల్లా వరకు అన్ని జిల్లాలు చూడడం జరిగింది. నిజామాబాదు జిల్లా హైదరాబాదు సిటీ యింకా అనేక ప్రాంతాలు తిరిగాను, ఎక్కడకు వెళ్లినా గాని ప్రజలలో అభిప్రాయం ఆకాంక్ష కనిపించింది. మన రాష్ట్ర సమగ్రతను కాపాడడానికి సంపూర్ణమైన సహకారం చేస్తాం: రాష్ట్రంలో యిప్పటివరకు కుంటుబడిన అభివృద్ధి కార్యక్రమాలను తిరిగి ప్రారంభం చేయాలి వెనకబడిన ఈ రాష్ట్రాన్ని ముందుకు తీసుకు వెళ్లడానికి సంపూర్ణ సహకారం యిస్తామని అన్ని రంగాలలో పనిచేస్తున్నటువంటి మేధావులు, లాయర్సు, డాక్టర్సు అన్ని రంగాల విద్యార్థులు నన్ను కలిసి సంపూర్ణంగా సహకారం యిస్తామని చెప్పారు. వారు చెప్పిన తరువాత ఎంతో ఉత్సాహం, ప్రోద్బలం ముఖ్యమంత్రిగా నాకు దొరికింది.

★ ★ ★ ★

దురదృష్టవశాత్తు తెలంగాణాలోను, ఆంధ్రలోను ఆందోళనలువచ్చాయి. దాని గురించి చర్చించదలచు కొనలేదు. అందరిని మరచి పొమ్మని మనవి చేస్తున్నాను. మన రాష్ట్రంలో నూతనాధ్యాయాన్ని సృష్టించవలసిన అవసరము వుంది. వెనుక ఎవరు సెపరేషను అన్నారు ఏమి చేశారనేది మరచిపోయి మన మందరం మన రాష్ట్రం యొక్క శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని శాశ్వతముగా సమగ్రతగా వుండేటట్లు, తెలుగు జాతి గౌరవ ప్రతిష్ఠలు పెంచే విధంగా ముందుకు తీసుకువెళ్లవలసిన అవసరం వుంది. లేకపోతే ముందు రాబోయే మన సంతానము మనలను నిందిస్తుంది. ఎన్నో పొరపాట్లు చేశాము. ఎంతో మంది నష్టపడ్డారు. తిరిగి రాజకీయాలలో ఆ పొరపాటు చేయవద్దు. స్వపక్షము, ప్రతిపక్షము అని మాట్లాడడములేదు. తెలుగు జాతి అంతా ఏకమై మన రాష్ట్రమును ముందుకు తీసుకుపోవలసిన అవసరము ఎంతైనా వుందని మనవిచేస్తున్నాను. నేను ఇండస్ట్రీ మంత్రిగా వున్నప్పుడు కూడ ఇదేమాట చెప్పాను. అందరి సహకారము ఉంటే చెడును ఎదుర్కొని మంచి పరిపాలనను ఏర్పాటు చేసుకొనవచ్చును. సంపూర్ణమయిన సహకారమివ్వాలని అందరిని కోరుతున్నాను. తప్పుచేస్తే మమ్ములను వదలిపెట్టవద్దు.

తెలంగాణా వారైనా, ఆంధ్రవారు అయినా సంపూర్ణమైన సానుభూతిని ప్రభుత్వము పక్షాన తెలియచేస్తున్నాను. దురదృష్ట వశాత్తు అమాయకులైన ప్రజలు నష్టపడినారు. ఇబ్బందులపాలైనారు. వంకా సత్యనారాయణ గారు చెప్పినట్లు ఇంటిగ్రేషన్ కోసము నిలబడినవారు యిబ్బంది పడ్డారు. అందరికీ నా సానుభూతిని తెలియచేస్తున్నాను. ఎప్పుడూ ఫైరింగ్స్‌లో లీడర్లు చనిపోరు. వారు చాటున కూర్చొంటారు. అమాయకులైన ప్రజలే చనిపోతారు. వారి యెడల ప్రభుత్వానికి సానుభూతి వుందని మనవిచేస్తున్నాను. ఇదివరకే మా మంత్రివర్గపు సభ్యులతో చర్చించాను. తెలంగాణాలోగాని, ఆంధ్రలోగాని ఇదివరకు యిచ్చిన సహాయం కాకుండా చనిపోయినవారి కుటుంబాలకు 4వేల రూ.ల సహాయం చేయాలని, వికలాంగులకు యివ్వాలని పభుత్వము మీద బరువు అయినా సానుభూతితో వ్యవహరించాలని నిర్ణయము తీసుకొన్నాము. సమాధులు, స్థూపాలు నిర్మించుకొనేదానికన్న త్యాగాలుచేసినవారి కుటుంబాలకు సహాయం చేయాలని నూతన ప్రభుత్వం అధికారంలోకి వచ్చినతరువాత చెప్పారు. ఏదో ఉద్రేకముతోనో, పొరపాటునో జరిగింది. ఆ మాటలు ఏమీ చెప్పడంలేదు. నష్టపడినవారిపట్ల సానుభూతివుంది. మనమీద గురుతరమైన బాధ్యత వుంది. ఆ బాధ్యతను సంతృప్తికరంగా నెరవేర్చాలి. లేకపోతే

రాబోయే సంతానము మనలను తప్పక నిందిస్తుంది. మొదటి బాధ్యత 6 సూత్రాల పథకమును అమలు చేయడము. దానిమీదనే మన రాష్ట్ర భవిష్యత్తు వుంది. ఉభయ ప్రాంతాలలో వచ్చిన అనుమానాలు, అపోహలు పోయేవిధంగా వాటికి ఎక్కడా తావులేకుండా అందిరికి న్యాయము కలుగచేసేవిధంగా ప్రయత్నము చేస్తాము. ఏ ప్రాంతమునకు వెళ్లినప్పటికి ఈశ్వరీబాయిగారి నిజామాబాదుజిల్లా ఎల్లారెడ్డి వెళ్లినప్పటికి బ్రహ్మాండంగా వేలకొలది ప్రజలు వచ్చి ఈ 6 సూత్రాల పతకమును అమలు చేయండి. దాని యందు మాకు విశ్వాసం వుంది. అని చెప్పడం జరిగింది. ఆమె అక్కడ వుండగానే చెప్పారు. ఆరు సూత్రాల పథకాన్ని అమలు చేయడానికి ప్రయత్నం చేస్తాము. అప్పుడే ఒక కార్యక్రమము ప్రారంభించడం జరిగింది. మన రాష్ట్రంలోని మూడు ప్రాంతాలలోని వెనుక బడిన ప్రాంతాల యందు, హైదరాబాదు, సికింద్రాబాదుల డెవలప్‌మెంటులో ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలని ఈ 6 సూత్రాలపథకంలో వుంది. దానిననుసరించి స్టేటు ప్లానింగు బోర్డు, మూడు ప్రాంతాలకు 3 డెవలప్‌మెంటు కౌన్సిల్స్ వేసి, వాటికి అధ్యక్షులను నియమిమంచడము కూడ జరిగింది. ఢిల్లీ మాదిరి మన రాజధాని అయిన హైదరాబాదు - సికింద్రాబాదుకు కూడ ఒక సిటీ డెవలపుమెంటు అథారిటీస్ తీసుకువచ్చి వీటిని సమగ్రముగా బాగు చేయాలని ఆలోచనవుంది. ఇదివరకే సిటీలోవున్న లెజిస్లేటర్సులోను, ప్రజలలోను ఒక గ్రీవెన్స్ వుంది. తెలంగాణా ఫండ్స్ తెలంగాణా జిల్లాలోనే ఖర్చుపెడుతున్నారు. సిటీకి ఖర్చు పెట్టడము లేదనే గ్రీవెన్స్ వుంది. మన రాష్ట్ర రాజధానిని ఇతర రాష్ట్రాల రాజధానులకంటె సుందరముగా తయారుచేయాలనే అభిప్రాయముతో ఈ కార్యక్రమాన్ని వెంటనే తీసుకొనడము జరిగింది. ప్రజల పతినిధులకు కూడ అవకాశము వుండాలనే ఉద్దేశ్యముతో నేను ముఖ్యమంత్రి అయిన తరువాత హైదరాబాదు - సికింద్రాబాదు సిటీలోని యమ్. యల్. ఏ. లు, యమ్‌యల్.సి.లు, యమ్.పి.లతో ఒక అడ్వైజరీ బోర్డును ఏర్పాటు చేయడం వారి సలహాలు తీసుకొని ప్రస్తుత కార్య క్రమాలను నడపాలని, డెవలప్‌మెంటు అథారిటీని వేయాలనే కార్యక్రమమును తీసుకున్నాము. అది ప్రారంభమైనది. ఇక్కడ ఒక సెంట్రల్ యూనివర్శిటీని పెట్టాలనే నిర్ణయాన్ని కేంద్ర ప్రభుత్వము తీసుకొన్నది.

★ ★ ★ ★

6 సూత్రాల పతకములో వున్న ఆ పాయింటు నెరవేరినది. వెనుక పడిన ప్రాంతాలను నిర్మాణం చేయవలసిన పనిని డెవలప్‌మెంటు కౌన్సిలుకి అప్ప గించాము. ప్లాను ప్రావిజన్సును బట్టి ఏ ప్రాంతాలలో ఏ కార్యక్రమం చేస్తే బాగుంటుందో సూచించే

అవకాశము వారికి ఇవ్వబడింది. 3 రీజినల్ డెవలపు మెంటు కౌన్సిల్ చైర్మన్లు, ఎక్స్ అఫీషియో మెంబర్సుగా స్టేటు బోర్డులో వుంటారు. వెనుకబడిన ప్రాంతాలలో వున్న ప్రతినిధులతో చర్చించి ఏ కార్యక్రమాలు చేయాలని చెప్పే అవకాశము వారికి యివ్వబడింది.

ఆరు సూత్రాలు రూపొందించక పూర్వమే స్పెషల్ అసిస్టెన్స్ అవుట్ సైడ్ ది ప్లాన్ ఎక్కువ ఇవ్వాలని ప్రధాన మంత్రిని కోరాము. ఈ రాష్ట్రం సమగ్రంగా వుండాలి, ప్రశాంతంగా వుండాలి, స్టేబుల్ గవర్నమెంట్ వుండాలి, ఈ రాష్ట్రానికి ఎంత కావాలన్నా ఇస్తాను అని ప్రధాన మంత్రిగారు వాగ్దానం చేశారు. ఇస్తారనే ఆశ నాకు వుంది. అవుట్ సైడ్ దిప్లాన్ సబ్‌స్టాన్షియల్ ఎమౌంట్ మనకు వస్తుందనే ఆశ నాకు వుంది. అలా పెద్ద మొత్తాన్ని పొందటానికి ప్రయత్నిస్తానని మనవి చేస్తున్నాను. అది ఎంత ఫిగర్ అవుతుందో మాత్రం నేనిప్పుడు చెప్పలేను.

ఆరు సూత్రాల పథకం అమలు చేసిన తరువాత వున్న పెద్ద ప్రోగ్రాం లాండ్ రిఫార్మ్స్. దానికి ఒక యాక్షను పాన్ చేసుకున్నాము. దానిని ఈ ప్రభుత్వం అశ్రద్ధ చేసి ఏదో చాప క్రింద పడవేయటానికి ప్రయత్నిస్తున్నదని కాదు. కొందరు ఉపన్యాసాల్లో చెబుతున్నారు. ప్రభుత్వానికి ఆచరణ చేయాలని లేదని నేరారోపణ చేస్తున్నారు. అది సరైనది కాదని మనవిచేస్తున్నాను. అది తప్పు కుండా అమలు చేసి తీరుతాము. ఎన్ని ఆటంకాలు వచ్చినా, ఎవరు అడ్డంకులు పెట్టినా అమలు చేస్తామని ఇంతకుముందు చెప్పాను, ఇప్పుడు కూడా చెబుతున్నాను.

ఇక ఆహారపరిస్థితి గురించి. అధికధరల గురించి మిత్రులు మాట్లాడారు. ఇప్పుడే వంకా సత్యనారాయణగారు చెప్పారు. చెక్‌పోస్టులు తీసేసిన తరువాత మార్పు రాలేదని. నేను ఒక్కటే మాట చెప్పదలచుకున్నాను. చెక్ పోస్టులు తీసేసినా ఒక్క లారీకి కూడా తోలుకుపోవటానికి పర్మిషన్ ఇవ్వలేదు. కొన్ని పత్రికలు వ్రాశాయి. వెంగళరావుగారు చెక్‌పోస్టులు తీసేసిన తరువాత లారీలు వెడుతున్నాయి అని. అది ఎవరో తెలియక చెప్పిన మాట. వ్యక్తిగతంగా నిందలు వేయటానికి చెబుతున్న మాట. అది నిజం కాదు. కేంద్ర ప్రభుత్వం పర్మిషన్ లేకుండా చేశాను. జోన్స్ తీసివేయాలంటే కేంద్రం వారి పర్మిషన్ తీసుకోవాలని ఆఫీసర్స్ చెబితే జోన్స్ అనే పదం వాడకుండా చెక్‌పోస్టులను రిమూవ్ చేశాను.

కన్స్యూమర్ మీద ఎక్కువ బరువు పడుతున్నది. అది తగ్గించాలి. మిల్లర్స్ గవర్నమెంటుకు లెవీ ఇవ్వకుండా రైస్ తీసుకు వెళ్లటానికి వీలులేదు. లెవి సర్టిఫికెట్ చూపిస్తేనే లారీ వెళ్లాలి. మిల్లర్స్ గవర్నమెంటుతో నాన్ కోపరేట్ చేస్తున్నారు. వారిని ఎట్లా కంట్రోల్ చేయాలో అట్లా కంట్రోల్ చేస్తాము. ఆహారపదార్థాల పరిస్థితి అన్ని రాష్ట్రాలకంటె మన రాష్ట్రంలో మెరుగ్గా వుంది. గత సంవత్సరం అన్ని ప్రాంతాలలో బాగా పంటలు పండాయి. ఇదివరకు కృష్ణా జిల్లానుండి ఖమ్మం జిల్లాకు ధాన్యం వస్తూవుండేది. ఇవేళ ఖమ్మం జిల్లానుండి, కోదాడనుండి కృష్ణాజిల్లాకు ధాన్యం వెడుతున్నాయి. అక్కడ ధాన్యం ధర ఎక్కువగా ఉంది. ధరల విషయంలో మిల్లర్స్‌కు, కేపిటలిస్ట్‌కు, పెట్టుబడిదార్లకు ప్రభుత్వానికి పడక వారు ప్రభుత్వానికి కొన్ని ఆటంకాలు కల్గించటానికి ప్రయత్నిస్తున్నారు. కాని వారి ఆటలు సాగవు. వారి దగ్గర వసూలు చేయవలసిన లెవి వసూలు చేసి ఈ రాష్ట్రంలో తప్ప ఇతర ప్రాంతాలకు వెళ్లటానికి ఈ ప్రభుత్వం ఎలౌ చేయదు. ఇక ధరలు పెరగటానికి అవకాశం లేదు. తగ్గటానికి అవకాశం వుంది. మామూలు కంటె ధరలు కాస్త పెరగటానికి మరో కారణం కూడా వుంది. గవర్నమెంటు ప్రొక్యూర్‌మెంట్ రేటు ఎక్కువ రేటు. క్వింటాల్ ధాన్యానికి 72 రూపాయలు యిస్తున్నాము, ఆ ధర, ఫుడ్ కార్పొరేషన్ ఓవర్‌హెడ్ ఛార్జెస్ కలిపితే మార్కెటులో కొంచెం హెచ్చుగా వుంది. ఇదివరకు ఈ రాష్ట్రంలో జనవరి నెలలో 4 లక్షల టన్నుల బియ్యం ప్రొక్యూర్ కాలేదు. ఈ సంవత్సరం నిన్నటి వరకూ 3లక్షల 75 వేల టన్నుల బియ్యం ప్రొక్యూర్ అయింది. మన టార్గెట్ 10 లక్షల టన్నులు. అవసరమైతే కంట్రోలు పెట్టటానికికూడా సిద్ధంగా వున్నాము. గవర్నమెంటు నీతి,నిజాయితీతో వుంటుంది, ఏ పరిస్థితులలోనైనాసరే ధరలను కంట్రోలు చేస్తుంది. గోధుమల విషయంలో కొంత ఇబ్బంది వుంది. నేను ఒప్పుకొంటున్నాను. మన రాష్ట్రానికి ప్రతి నెలా 30వేల టన్నుల గోధుమలు కావాలి. ఉత్తర హిందూస్థానంలో ప్రొక్యూర్ చేసి మనకు పంపాలి. మనకు గత నెల ఈ నెలా పదివేల టన్నులు మాత్రమే వచ్చింది. దీనిలో మేజర్ కన్జమ్షన్ విశాఖపట్నం, హైదరాబాదులో వుంటుంది. కొంత బేకరీలకు ఇవ్వాలి. జిల్లాలలో ఇబ్బందిగా వుంది. ఈ నెలాఖరుకు ఢిల్లీ వెళ్లి కేంద్ర ఆహారమంత్రితో మాట్లాడి ఎక్కువ సాధించటానికి ప్రయత్నించి ఇబ్బందిలేకుండా చేస్తాను. షుగర్‌కు రాబోయే కాలంలో పెద్ద ఇబ్బంది వుండదు. ధరలు పెరుగుతున్నమాట వాస్తవమే. నేను ఉత్తరకుమార ప్రజ్ఞలు చెప్పదలచుకోలేదు. మొత్తం దేశం ప్రభావం మన రాష్ట్రం మీద కూడా పడుతుంది. దానిని దృష్టిలో పెట్టుకొని ఆలోచించాలి. నూనెగింజల విషయంలో మనం స్టాప్ చేయడానికి వీలులేదు. అందుకు కేంద్ర ప్రభుత్వం ఒప్పుకోవడంలేదు. డాల్డా 75 పర్సంటు మనకుంచి 25 పర్సంటు ఎగుమతి చేస్తున్నారు. వేరు సెనగ ఎగుమతిని మనం కంట్రోల్ చేయడానికి వీలులేదు. గవర్నమెంట్ ఆఫ ఇండియా వారికి వ్రాస్తే వారు

ఒప్పుకోవడంలేదు. నూనె ధర గత పదిహేను రోజులనుండి కాస్త తగ్గింది. కొన్ని ఇంకా ఎక్కువగానే వున్నాయి. ఇవన్నీ దృష్టిలో పెట్టుకొని కంట్రోలు చేయడానికి ప్రయత్నిస్తాము. ఇక కల్తీ కార్యక్రమం చాలా ఎక్కువగా సాగుతోంది. ఎడల్ట్రేషన్ విషయంలో గట్టి చర్యలు తీసుకొంటున్నాము. కొంత మందిని జైళ్లకు పంపడం జరిగింది. ఎవరికీ మొహమాటపడి ఈ ప్రభుత్వం భయపడదు. ఉన్న రూల్స్‌ను ఖచ్చితంగా అమలు చేస్తుందని మనవి చేస్తున్నాను.

ఇక, ఎరువుల విషయం పెద్ద సమస్య అయింది. ఎక్కడకు పోయినా రైతులు ఇదేమాట చెబుతున్నారు. ఈ వ్యవహారాలలో అఫిషియల్స్, నాన్ అఫిషియల్స్ ... బుద్ధిమంతులు చాలామంది వున్నారు. బి.డి.వో.లు, సమితి ప్రెసిడెంట్లకు సంబంధం వుంది. దీనిని సమగ్రంగా ఆలోచించాలి. నేను మన ఉపముఖ్యమంత్రిగారికి చెప్పాను. క్యాబినెట్‌కు చెప్పాను స్ట్రిక్టుగా వుండాలని. మన ప్రభుత్వమునకు మంచి పేరు వచ్చినా, చెడ్డపేరు వచ్చినా అదిదీనిమీద ఆధారపడి వుంది. మీరు అడిగిన బియ్యం ఇస్తాను. మేము అడిగిన ఎరువులు యివ్వండి అని ఫక్రుద్దీన్ అలీ అహమ్మద్‌గారికి చెప్పాను. రైతులుకూడా వారికి పది బస్తాల ఎరువు యిచ్చి పదిబస్తాల బియ్యం యివ్వండి అని అడిగినా బాధపడరు. అందు చేత ఇంతవరకు జరిగినదాన్ని గురించి చెప్పలేనుగాని దానిపైన సమగ్రంగా ఆలోచించి దానికొరకు సమితిలెవల్‌లో జిల్లాలెవెల్‌లో ఎం. ఎల్. ఏస్., ఎం. ఎల్. సీస్.తో కలిపి ఒక కమిటీని వేసి సక్రమంగా వుండేట్లు చూస్తాను. దానికి కార్డుసిస్టమ్ పెట్టాలా ఎట్లా అనేది బాగా ఆలోచించి, అది చేసిన తరువాత ఎవరైనా దానికి వ్యతిరేకంగా పోయి బ్లాకు మార్కెటు చేస్తే వారి మీద చర్యతీసుకోడానికి ప్రభుత్వం వెనుకాడదు. మొన్న **36** మందిని ''మిసా'' ఆక్టుక్రింద డిటెన్‌సన్‌లో పెట్టడం జరిగింది. నెలరోజుల తరువాత హైకోర్టు **19**మందిని విడుదల చేసింది. యింకా కొంతమంది వున్నారు. రాష్ట్రంలో రైతాంగానికి యిది జీవన్మరణ సమస్య. మనకు దొరికి నటువంటి ఎరువులే తక్కువ, ఆ విషయము నిన్న డిప్యూటీ ఛీఫ్ మినిస్టరుగారు చెప్పారుకూడా. మనకు రావలసిన దానిలో మూడవ వంతో నాలుగవ వంతో వస్తున్నది. ఆ మూడవ వంతుకూడా రైతులకు సక్రమంగా ముట్టడంలేదు. రైతుకు అందవలసిన పది పౌన్లుకూడా అందడము లేదు. అర్ధరాత్రి ధనవంతులు లక్షాధికారులు అయిపోతున్నారు చాలా మంది, నాకు తెలుసు. అందువల్ల దీనిని కంట్రోలు చేయవలసిన అవసరం వుంది. వంకా సత్యనారాయణగారు ప్రైవేటు వారి నుండి ఎందుకు తీసుకోలేకపోతున్నారన్నారు, వారితో ఏకీభవిస్తాను. మైసూరు గవర్నమెంటు వారి నుండి తీసుకుంటున్నది. మనవారు తీసుకుంటే హైకోర్టు తీర్పు

యిచ్చింది మనకు అధికారము లేదని. అందువల్ల దానికొరకు అవసరమైతే ఏమైనా చేసి కంప్లీటు డిస్ట్రిబ్యూటింగ్ కంట్రోలు మన చేతిలో వుండేట్లు చూడాలి. స్టాకిస్టు వుంటే వాడొక రూపాయి లాభము తీసుకుంటే యిబ్బందిలేదు. కంప్లీటు కంట్రోలు మన చేతిలో పెట్టుకుని స్టేటు లెవల్‌లో, డిస్ట్రిక్టు లెవల్‌లో, బ్లాకు లెవల్‌లో కమిటీస్ ద్వారా డిస్ట్రిబ్యూట్ చేయించాలి, అప్పుడు కార్డు సిస్టం పెట్టడమా, ఏది అనేది ఆలోచించాలి. ఇప్పుడు కూడ ఒక పద్ధతి వుంది. కంప్లీటుగా హైహిల్డింగ్ వెరైటీకే యివ్వాలి తప్ప కమర్షియల్ క్రాప్సుకు యివ్వకూడదని. అది కూడా అంత రిజిడ్‌గా వుండడము మంచిది గాదు. షుగర్ కేన్, చిల్లీస్, టుబాకో యిలాంటి కమర్షియల్ క్రాప్సుకు 20 పర్సంటు యిచ్చి 80 పర్సంటు యింక్లూడింగ్ హైహిల్డింగ్ వెరైటీకి యిస్తే బాగుంటుందని ఆలోచనవుంది. కొద్దిరోజులలో నిర్ణయము తీసుకోవడం జరుగుతుంది బహుశః మీరు అందరు యింటికి వెళ్లే లోపలనే యీ నిర్ణయము ప్రకటిస్తాను. దానికి ప్రయత్నం చేస్తున్నాము. ఇప్పుడు దీనిలో తప్పులు వున్న మాట నిజము. ఫాల్స్ ప్రిస్టేజ్‌కి పోయి దీనిలో తప్పులు లేవని ఆర్గ్యూ చేయడము లేదు. వున్న మాట నిజమే. యీ తప్పులు సవరణ చేయబడాలి దొరికినంత వరకు అయినా రైతునకు సక్రమంగా ముట్టాలి దాని గురించి ప్రయత్నము చేస్తున్నాము. దానిలో ఎవరికి భేదాభిప్రాయం లేదు. మీ అందరి సంపూర్ణ సహకారము యివ్వమని మనవి చేస్తున్నాను. ఈశ్వరిబాయిగారు అడ్జర్న్‌మెంటు మోషన్ యిచ్చారు. రెవిన్యూ కలెక్షన్స్, లోన్ కలక్షన్స్ నిర్దాక్షిణ్యంగా వసూలు చేస్తున్నారని చెప్పారు. వసూలు చేయక తప్పదు. మీరు కూడా సహాయపడాలి. ఎందుకంటే పండనటువంటి వారిని నుండి వసూలు చేయమని నేను చెప్పలేదు. చేయరు ఈ వసూలుకూడా పై వారినుండి మొదలుపెట్టాలని ఆర్డర్సు యివ్వడం జరిగింది. పేదవారిని యిబ్బంది పెట్టడం జరగదు నాకు తెలిసినంతవరకు పేదవాడు బకాయి పెట్టడు, న్యాయంగా పేదవాడి నుండి పటేలు పట్వారీలు దబాయించి ఎప్పుడో వసూలు చేసి వుంటారు. జనగామ తాలూకా నుండి ఒక కంప్లెయింట్ వచ్చింది, ఎంక్వయిరీకి పంపించాను కరువు కాలములో రేమిషన్ యిచ్చినప్పటికి శిస్తులు వసూలు చేసి పట్వారి తిన్నాడట. అలాంటి కేసులు ఎన్నో వున్నవి. అందువల్ల న్యాయంగా బీదవారికి ఏదైనా యిబ్బంది వుంటే ప్రభుత్వము తప్పకుండా సానుభూతితో వ్యవహరిస్తుంది, నేను రిటెనుగా ఆర్డర్సు పంపించాను, కలెక్టర్సుకు; అట్లా హరాస్‌మెంటు జరుగదు. పెద్దవారు దయచేసి యివ్వాలి. అందులో దయాదాక్షిణ్యాలు వుండవు. ఎందుకంటే దీనిలో ప్రభుత్వము చాల లిబరల్‌గా వెళ్లింది. ల్యాండ్ రెవిన్యూ మీద యింటరెస్ట్ వుంది. లోన్స్‌మీద పీనల్ యింటరెస్టువుంది. ఒక్కొక్క లోను వేయి రూపాయలు తీసుకుంటే 3500 డిమాండు వచ్చింది. రైతుల పట్ల కటికవాడిలాగా

ప్రవర్తించకూడదనే వుద్దేశముతో కేబినెట్‌లో నిర్ణయము తీసుకోవడం జరిగింది. మార్చి 31లోగా లోన్స్ పేచేస్తే వాడిమీద విధించిన పీనల్ యింటరెస్టు తీసివేయబడుతుందని చెప్పడం జరిగింది. దానివల్ల ప్రభుత్వానికి కొన్ని కోట్ల రూపాయల నష్టము వస్తుంది. అయినా పర్వాలేదు. ఆ వచ్చే డబ్బు ఏదో వస్తే మిగతాది తీసివేయవచ్చు. ఊరకనే లెక్కల్లో 70 కోట్ల రూపాయల బకాయ్ అని మనము వ్రాసుకోవడము వారు యివ్వకపోవడము దేనికి పనిలేక. పెనాల్టీస్ విషయం మీకు తెలుసు. నాగార్జునసాగర్ క్రింద, కె.సి. కెనాల్ క్రింద, నిజాంసాగరు క్రింద, కృష్ణాగోదావరి డెల్టాలలో కూడా కొంత మంది, ఏదో నాట్లు వేసుకుంటే ప్రభుత్వం ఏమి చేస్తుంది అని చెప్పిన వారు కూడా వున్నారు. కాని పాపం బీదవారి మీద పది రెట్లు పడింది. ఒక్కొక్క రైతు నుండి నాలుగైదు వందలు వసూలు చేయడం మంచిది గాదు. ఎక్కడైనా కాలవ సోర్సెస్‌కు గట్టు కొట్టుకొని లా వారి చేతిలోకి తీసుకొని యిరిగేషన్ చేసుకుంటే వారి మీదనే మూడు వంతులు యీ పెనాల్టీస్ వేయడం జరిగింది. మార్చి 31 లాగా కడితే అవి కూడా తీసివేయాలని ప్రభుత్వం నిర్ణయము తీసుకోవడం జరిగింది. రైతుల క్షేమము కొరకు రైతులు యిబ్బంది పడకుండా వుండడము కొరకు యీ నిర్ణయం తీసుకున్నాము. దయచేసి న్యాయమైన కలక్షన్ కొరకు సహాయం చేయండి. ఆ డబ్బువస్తే అభివృద్ధి కార్యక్రమాల గురించి ఖర్చుపెట్టుకోవచ్చు. ఒక్క ల్యాండు రెవిన్యూ ఎరియర్స్ 27 కోట్లు వుండిపోయినాయి. ఈ డబ్బు అంతా మార్చిలోగా వస్తే నెక్స్ట్ యియర్ ప్లానులో గాకుండా మన చేతిలో పెట్టుకొని ఎన్నో పనులు పూర్తి చేసుకోడానికి వీలుంటుంది. మీరంతా సహాయం చేయండి. హార్డ్‌షిప్ వుంటే నా దృష్టికి తీసుకురండి నేను చూస్తాను అని మనవి చేస్తున్నాను. మన రాష్ట్రములో బాగాపండనటువంటి కొన్ని ప్రాంతాలు వున్నవి. ఈ సంవత్సరము కూడా కరువు కాటకాలు వున్నవి. ఒప్పుకోకతప్పదు. విశాఖ పట్టణములోని కొన్ని ప్రాంతాలు, శ్రీకాకుళంలో కొన్ని ప్రాంతాలు, ఈస్ట్ గోదావరిలో కొన్ని ప్రాంతాలు, విశాఖపట్టణమును ఆనుకొని వున్న కొన్ని ప్రాంతాలు, అక్కడక్కడ తెలంగాణాలో కొన్ని ప్రాంతాలు, చిత్తూరుజిల్లాలో సత్యవీడు ప్రాంతము, యీ ప్రాంతాలలో కొన్ని యిబ్బందులు వున్నమాట నిజము. అక్కడ కరువు పనులు చేయడానికి డబ్బు యివ్వాలి. మంచి నీటి వసతి కలుగచేయాలి. అక్కడ కూడ తక్కావి బకాయిలు ఆపుచేయాలని ప్రభుత్వము నిర్ణయము తీసుకుంది. పోతే యీ మధ్యనే, ప్రభుత్వము మీద పెద్ద భారము వున్నప్పటికీ, మన ఎన్.జి.ఓ.లకు సెంట్రల్ గవర్నమెంటు ఎంప్లాయీస్‌తో సమానంగా డి.ఏ. పెంచాలనే నిర్ణయము తీసుకున్నది. రు16, 18కోట్లు అవుతుంది అంటే శ్రీరాములుగారు 14 కోట్లు అని చెప్పారు. ఎంత అయినప్పటికీ అది భారమే. ఎందుకు

వారికి యివ్వాలి. యీ రాష్ట్రప్రభుత్వము తొందరపడి వారికి ఆ డబ్బు యిచ్చింది, బేరము పెడితే బాగుండేది అని చెప్పిన వారు వున్నారు. పన్నులు ఎందుకువేయాలి, వారికి ఎందుకు డబ్బు యివ్వాలి అని కొంత మంది అన్నారు. ఒక వుద్దేశముతో యీ ప్రభుత్వము ఆ పనిచేసింది. ఈ బేరాలు యీ వ్యవహారము దేనికి? ఇవ్వదలచుకున్నదేదో యిచ్చి బాగా పనిచేయండి అని చెబితే బాగుంటుందికదా. శ్రీరామయ్యగారికి మీ ద్వారా మనవిచేస్తున్నాను. వారు చెప్పారు. వారు ఒక సోప్‌ఫ్యాక్టరీ పెట్టమన్నారు యీ అడ్మినిస్ట్రేషన్‌ను కడగడానికి ఒకటి మనవి చేస్తున్నాను. ఆయన ఎన్. జి. ఓ. ల నాయకుడు, ప్రభుత్వము ఎంతో వుదారంగా చేసినందుకు ఎన్. జి. ఓ. లు బాగా కష్టపడి పనిచేయాలని వారు చెబితే బాగుంటుంది. మిగతావారిని నేను సోప్ పెట్టి కడుగుతాను, ముందు వారిని కడుగమని చెబుతున్నాను.

తెలంగాణాలో చనిపోయినవారికి ఆంధ్రలో చనిపోయినవారికి యిద్దరికీ సమానంగా యిచ్చారు. మాకు ఏమి భేదం లేదు. పోతే యిప్పుడు డెవలప్‌మెంటు ప్రాజక్టుల మీద ఎక్కువగా స్ట్రెస్ యివ్వాలి, మన భవిష్యత్తు అంతా వాటిమీద ఆధారపడి వుంది. అవసరమైతే ఎక్కడి నుండి అయినా – కేంద్రము నుండి పోరాడి అయినా డబ్బు తీసుకువచ్చి యిదివరకు ప్రారంభము చేసినటువంటి ప్రాజక్టులను పూర్తి చేసుకోకపోతే మన రాష్ట్రప్రజలు మనలను క్షమించరు.

శ్రీ వంకా సత్యనారాయణగారు కోడ్ ఆఫ్ కాండక్ట్ గురించి చెప్పారు. కొత్త పనులు ప్రారంభిస్తామని ఊరికే నేను వాగ్దానాలు చేయను. మనం ప్రారంభించిన ప్రాజక్టులు మాత్రం మనం ముందు పూర్తిచేయాలి. లేకపోతే రాష్ట్రం దెబ్బతింటుంది. నిజాంసాగరు ఉంది. అది మూడు లక్షల ఆయకట్టు. మన అశ్రద్ధవలన అది దెబ్బతింది. సుమారు ఆరు కోట్ల రూపాయలు నష్టం కలిగింది. ప్రతిసంవత్సరం రెండు లక్షల రూపాయల లాభం వచ్చే నిజాం షుగరు ఫ్యాక్టరీ మూతపడింది. అందువలన ఒక మూడు కోట్ల రూపాయలు ఖర్చు చేస్తే ఆ ప్రాజక్టు సమస్య సాల్వ్ అవుతుంది. దానివలన నిజాంబాదు జిల్లా పరిస్థితి తారుమారు అయిపోయింది. నేను ముఖ్యమంత్రి అయిన తరువాత అక్కడకు వెళ్లాను. అక్కడ ఛీఫ్ ఇంజనీరుతో, రాజారాంగారుకూడా అప్పుడు న్నారు, తలతాకట్టుపెట్టి అయినసారే మూడుకోట్ల రూపాయలు ఖర్చుచేసి ఆపని పూర్తిచేయాలని చెప్పాను. లాంటు అక్విజషనుకు డబ్బు యిచ్చి ఆయకట్టు పొటెన్‌షియాలిటి పెంచాలని నిర్ణయించారు. జూను **1975** కల్లా ఆ పని చేసి ఆయకట్టు పొటెన్షియాలిటి పెంచాలనే నిర్ణయం చేశారు.

నాగార్జున సాగరు ప్రాజక్టు ఒకటి మనకు వైట్ ఎలిఫెంట్ మాదిరిగా వుంది. ఇప్పటికి రు.100 కోట్లవరకూ ఖర్చుచేశారు. అయిదవ ప్రణాళికలో 67 కోట్ల రూపాయలు కావాలని అడిగారు ఇంజనీర్సు. ఈ రోజు స్టీలు, సిమెంటు మొదలయిన వాటి ధర చూస్తే ఖర్చు 68 కోట్లు నుంచి 83 కోట్లు రూపాయలకు పెరుగుతుంది. డాము తయారయింది, నీరు రడీగా ఉంది. కాలువల నిమిత్తం డబ్బులేదు. దాని వలన 10లక్షల 20వేల ఎకరాలవరకూ ఇరిగేట్ కావచ్చును. దాని వలన ఉద్యోగావకాశాలు కలుగుతాయి, షుగర్ ఫ్యాక్టరీస్ రావడానికి అవకాశం ఉంది. మనం విదేశాలనుంచి దిగుమతి చేసుకునే రైస్ ప్రయిజ్ చార్జెస్ దీనికి ఖర్చుచేస్తే బాగుంటుంది. అవుట్ సైడ్ ది ప్లాన్ అయినా మనం ఒక అయిదు సంవత్సరాలలో యీ కెనాలు పూర్తిచేస్తే బాగుంటుంది. అలాగ చేయాలి అని ఉంది. పోచంపాడు ప్రాజక్టు అయిదవ ప్రణాళిక చివరకు పూర్తిచేస్తారు. తరుత వంశధార ప్రాజక్టు శ్రీకాకుళం జిల్లావారికి ఆశాజ్యోతి, ఎంతో కాలంనుంచి దీనికోసం వారు కలలుకంటున్నారు. ఇది అయిదవ ప్రణాళికలో ఇంక్లుడ్ చేస్తే బాగుంటుందనేది ఉంది. దీనివలన శ్రీకాకుళం జిల్లాలో ఉన్నవెనుకబడిన ప్రాంతాలకు మేలుకలుగుతుంది.

తరువాత గోదావరి బారేజు విషయం. ఇది కాటన్ దొర 125 సంవత్సరాల క్రితం పూర్తిచేశారు. సుమారు 11 లక్షల ఎకరాలకు దీనివలన సౌకర్యం కలుగుతుంది. సుభిక్షమయిన డెల్టా అవుతుంది. మూడుకోట్ల రూపాయల వరకు బెటర్‌మెంట్‌లెవి వసూలుచేశారు, అయిదు సంవత్సరములలో ఇది పూర్తి చేయాలి. డబ్బులేనప్పటికి దీనిని అయిదవ ప్రణాళికలో ఇంక్లుడ్ చేశారు. 27 కోట్ల రూపాయలకు ఎస్టిమేట్ వేశారు. అది 37 కోట్ల వరకూ ఖర్చు పెరగవచ్చు. కేంద్రప్రభుత్వంతో సంప్రదించాము. వారు 27 కోట్ల రూపాయలు ఇచ్చారు. ఇది పూర్తిచేస్తామని రాజమండ్రిలో కూడ చెప్పాను. తరువాత మీడియం మైనరు ఇరిగేషను ప్రాజక్టు ఉన్నాయి. ఈ సంవత్సరం వీటిపైన పెద్దగా ఖర్చుచేయలేదు. మహారాష్ట్ర ప్రభుత్వంతో కూడ ఆలోచించాలి. వారు ఒక కార్యక్రమం సూచించారు. మన పి. డబ్ల్యు.డి సెక్రటరీని చీఫ్ ఇంజనీరును ఆలోచించమని చెప్పాను. ఇరిగేషన్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ వారు వీటికి ఫ్లోట్ చేశారు. ప్రభుత్వం వద్ద డబ్బులేదు. కాబట్టి అగ్రికల్చర్ ఫైనాన్స్ కార్పొరేషను వరల్డ్ బ్యాంక్సు ద్వారా డబ్బుతీసుకుని చిన్న చిన్న ప్రాజక్టులు పెట్టి లిఫ్ట్ ఇరిగేషను డెవలప్ చేయాలని అన్నారు. అప్పుడు గోదావరి రివర్ పయిన లిఫ్ట్ ఇరిగేషను స్కీము పెట్టుకోవచ్చు. నీరు దుర్వినియోగం చేయకూడదు. అగ్రికల్చరల్ రి ఫైనాన్సు కార్పొరేషను ద్వారా వరల్డు బ్యాంకు నుంచి డబ్బు తీసుకుని ఇవన్నీ అభివృద్ధిచేయాలని ఉంది.

తరువాత పవరు ప్రాజక్ట్సుపైన మన రాష్ట్ర అభివృద్ధి ఆధారపడి ఉంది. ఏ రాష్ట్రమైనా అభివృద్ధి చెందాలంటే పవరు ఉండాలి. మనకు హైడల్ పవరులో ఉన్న పొటెన్షియాలిటి మరే రాష్ట్రమునకూ లేదు. మనకు సింగరేణి కాలరీస్ వరప్రసాదమయినటువంటివి. ఇక్కడ ప్రతి సంవత్సరం 5 మిలియన్స్ టన్నులు కోల్ ప్రొడ్యూస్ అవుతోంది. 5వ ప్రణాళికలో ఇది 12 మిలియన్సుకు వెళ్లాలి. సుమారు 60 కోట్లు రూపాయలు కేంద్రంవారు క్లియరెన్సు ఇచ్చారు. నేను ఒక మాట అంటె అది పేపరులలో తప్పుగా ప్రకటించారు. నేను ముఖ్యమంత్రి అయినప్పుడు ఆ మాట చెప్పలేదు. సంవత్సరం క్రితం చెప్పాను. ప్రభుత్వ ఉద్యోగాలకోసం పోట్లాడితే వచ్చేది సున్న, ఇండస్ట్రీస్ డెవలప్ అయితే ఉద్యోగాలు ఎక్కువగా వస్తాయని చెప్పాను. అంటే నాలుగు సంవత్సరాలవరకూ ఉద్యోగాలు లేవు అన్నానని పడింది. నేను అట్లాగ చెప్పలేదు. ఇప్పుడు వేయవద్దని బాన్ చేశాము. వచ్చే సంవత్సరం వెయ్యిగాని 1500 కాని వస్తే అప్పుడు పరిష్కారం చేయవచ్చు అన్నాను. సింగరేణికాలరీస్‌లో 30 వేలమందికి ఉద్యోగావకాశాలు చూడాలి. ఇప్పుడు 12 మిలియన్స్‌కు వెడితే 60 కోట్ల రూపాయలు ఖర్చుచేస్తే 50 వేలమందికి ఎంప్లాయిమెంటు సదుపాయాలు కలిగించవచ్చు.

తరువాత పవరు జనరేషను విషయంలో – ఇక్కడ నుంచి కోల్ హండ్రడ్స్ ఆఫ టన్స్, తౌజెండ్స్ ఆఫ టన్స్ మద్రాసు తీసుకునిపోయేకంటె పిట్‌హెడ్ పైన కోల్ మైనువద్ద కన్వేయరు బెల్ట్‌తో కోల్ తీసుకుని పవరు హవుస్‌లోకి వేస్తే చీప్ పవరు జనరేట్ అవుతుంది. ఈ రోజు కొత్తగూడెం రామగుండంలో మనం జనరేట్ చేసే సెట్స్ కంటె నేను కె.సి.పంత్‌గారితో మాట్లాడాను . సూపర్ థర్మల్ స్టేషను కమిటి వేస్తే అక్కడ పొటెన్షియాలిటి ఉంటుందని రికమెండ్ చేశారు. 2000 మెగావాట్స్ ప్లాంట్ రామగుండంలో పెట్టాలని మా దగ్గర పొటెన్షి యాలిటి ఉందని వ్రాశాము. మన బొగ్గు ఎగుమతి చేసి ఇక్కడ పవరు జనరేషను చేసే పద్ధతి కాకుండా మనకు చీప్‌గా జనరేట్ అయే అవకాశాలున్నాయి. అది ప్రభుత్వం ప్రయత్నం చేస్తున్నది. ఆ బాధ్యత ప్రభుత్వం పైన ఉంది. తరువాత కొత్తగూడెంలో బి స్టేషను పూర్తచేయాలి. అయిదవ ప్లానులో సి స్టేషను కూడా ఇంక్లుడ్ కావాలి. లోయరు సీలేరు కూడ అయిదవ ప్లానులో పూర్తిచేయాలని ఉంది. శ్రీశైలం ప్రాజెక్టుకు కొంత డబ్బు కేటాయించాము. ఇంకా కొంత డబ్బు ఎక్కువ కావాలి. దానికోసం ప్రయత్నం చేస్తున్నాము. విజయవాడది కొత్తగా 400 మెగావాట్లతో థర్మల్ స్టేషన్ ఫిఫ్త ప్లానులో పెట్టాలని ప్లానింగు కమీషను క్లియర్ చేసింది. ఏమైనా ప్రమాదం వస్తే తరువాత లేదని అంటారని అవసరం అయితే మనడబ్బు ఖర్చు పెడతామని

గవర్నమెంటు నుంచి ఇంత ఇబ్బంది ఉన్నా ఒక కోటి రూపాయలు ఖర్చుపెట్టడం జరిగింది. విజయవాడలో పెడితే ఆ జిల్లాలన్నింటికి బాగా సప్లయి చేయడానికి అవకాశం ఉంటుంది. అందుచేత ఆ కార్యక్రమం సాధించడానికి ప్రయత్నం చేస్తున్నాము. ముఖ్యంగా ఎలక్ట్రిసిటి బోర్డు మీద మన సభ్యులు అంతా చెప్పారు. మన ఎలక్ట్రిసిటి బోర్డు పని అంత సంతృప్తిగా లేదు. ఎక్యుమ్యులేటెడ్ లాసెస్‌తో కలుపుకుంటే 35 కోట్లు నష్టం ఉంది. రైతులమీద రేటు పెంచక తప్పలేదు. దానికి ఫిల్ఫరేజ్ చూస్తే 27% ట్రాన్స్మిషను లాస్ వచ్చింది. ఇట్ ఈజ్ ది హయ్యస్టు ఇన్‌ది కంట్రీ. ట్రాన్స్ మిషన్ లైన్సు లేవని అన్నారు. టెక్నికల్‌గా నాకు అవన్నీ తెలియవు. ఎలక్ట్రిసిటీ బోర్డును రీ ఆర్గనైజ్ చేయాలి. ఒక హయ్యస్టు టెక్నికల్ మాన్‌ను తీసుకొని వచ్చి అక్కడ వేసి దానిని బాగా పనిచేయించాలనే ప్రయత్నం చేస్తున్నాము. అది కూడా అవుతుందని మనవిచేస్తున్నాను. ఇక రేటు విషయం చాలామంది సభ్యులు చెప్పారు. రేట్సు తగ్గించడానికి అవకాశం లేదు. మీరెవరూ కోపపడవద్దని మనవి చేస్తున్నాను. ఈ రేట్సు తీసుకున్నా గిట్టుబాటు లేదు. అందువల్ల మీరంతా సహాయపడాలి. మన స్టేటును ఇంకా అభివృద్ధి చేయాలి. మన రాష్ట్రంయొక్క భవిష్యత్తు నిరుద్యోగ సమస్య పరిష్కారం చేయడానికి ఇండస్ట్రీసుని స్థాపించడం ఒకటే సరైన మార్గము. ఆ విషయం మీకందరికి తెలుసు. మన డబ్బు అంతా 1,2,3,4 ప్రణాళికలలో మేజర్ ఇరిగేషన్ ప్రాజక్టులమీద పెట్టేశాము. పవరు ప్రాజక్టు మీద తక్కువ పెట్టాము. ఇండస్ట్రీసుమీద మరి తక్కువ పెర్సంటేజి పెట్టాము. త్రూఅవుట్ కంట్రీలో సెంట్రల్ సెక్టారులో పెట్టినటువంటి ఇన్వెస్టిమెంటుతో పోల్చిచూస్తే మన రాష్ట్రానికి చాలా అన్యాయం జరిగిందని శ్రీ కృష్ణగారు చెప్పారు. నేను దానితో పూర్తిగా ఏకీభవిస్తాను. జనాభా లెక్క ప్రకారం చూసినా మనకు ఎక్కువ పెర్సంటేజి రావలసింది. మా స్టేటులో సెంట్రల్ ప్రాజక్టు ఎక్కువ పెట్టినట్లయితే ఎంప్లాయిమెంటు పొటన్షియాలటీ ఎక్కువ అవుతుందని మనవి చేసినప్పుడు తప్పకుండా చేస్తామని చెప్పారు. ఇప్పుడు అటామిక్ ఎనర్జీ తాలూకు రెండు పాజెక్టులు ఉన్నాయి. ఇక్కడ సింథటిక్ డ్రగ్సు ఉంది. భారత హెవీ ఎలక్ట్రికల్సు ఉంది. సింథటిక్ డ్రగ్సు ఎక్స్‌పాన్షనుకు 40 కోట్ల రూపాయలు శాంక్షన్ అయింది. ఇంకో స్పెషల్ ఎలాయోస్ ప్లాంటుకు 25 కోట్లు శాంక్షను అయింది. ఇండస్ట్రీసుకు ఇంకా ఎన్నో అవకాశాలు ఉన్నాయి. మన గవర్నమెంటు సెంట్రల్ ప్రాజక్టుకు 10 వేల ఎకరాలు ఫ్రీ ఆఫ్ కాస్టుమీద ఇచ్చింది. ఇలా ఇక ఏ స్టేటు గవర్నమెంటూ ఇవ్వలేదు. మనం వచ్చిన వాళ్లకు ఇన్‌సెంటీవ్సు ఇచ్చి ఎంకరేజి చేస్తున్నాము. మన దగ్గర లాండు ఉంది. వాటర్ ఉంది, పవర్ ఉంది. వచ్చిన వాళ్లకు ఇవన్నీ కలుగచేస్తున్నాము. వారిని కాంట్రాక్ట్ చేయడానికి ప్రయత్నం చేస్తున్నాము. ఇక స్టీల్ ప్లాంటు విషయం ఉంది. దీని విషయంలో ఈ

నెలాఖరుకు స్టీల్ అడ్ మైన్సు సెక్రటరిని ఇక్కడకు పిలుస్తున్నాము. ప్లానులో కొంత ప్రొవిజను వచ్చింది. కాని ఆ డబ్బు సరిపోదు. ఆ డబ్బు వల్ల స్టీల్ ప్లాంటు సిక్స్తు ప్లానుకు పోతుంది. డబ్బు ఇంకా ఎక్కువ కేటాయించాలి. లాండు ఎక్విజిషను కార్యక్రమాలన్నీ 5,6 నెలలలో పూర్తి చేసి లాండు తీసుకోవాలి. అప్పుడప్పుడు సన్యాసిరావుగారు రిహాబిలిటేషను గురించి చెబుతూ ఉంటారు. ఈ స్టీల్ప్లాంటుగురించి 9 గ్రామాల వారు పోతున్నారు. ఆ గ్రామస్థులకు సౌకర్యం కలుగ చేయాలి. వారికి న్యాయంగా కంపెన్సేషన్ ఇవ్వాలి. దానిలో నష్టపడిన ప్రతికుటుంబానికి ఒక ఉద్యోగం దానిలో కల్పించాలనే కార్యక్రమం నేను ఇండస్ట్రీస్ మినిస్టరుగా ఉన్నప్పుడు చేశాము. అది అమలు జరుగుతుంది. స్టీల్ప్లాంటు పని కూడా త్వరలో ప్రారంభించడానికి అన్ని ప్రయత్నాలు చేస్తాము. దానిని గురించి గోదావరి వాటర్ డైవర్షన్ స్కీము ఉంది. సుమారు 11 కోట్లరూపాయలు దానికి ఎస్టిమేటు అయింది. దానికి కొంత డబ్బు అడిగాము. ఆ కార్యక్రమాన్ని కూడా మొదలుపెట్టాలని ప్రభుత్వం చాలా ఆత్రుతతో ఉంది. తరువాత జింకు ప్లాంటుకు సంబంధించి ఇబ్బంది ఏమీలేదు. సివిల్ కన్స్ట్రక్షను అంతా అయిపోతున్నది. మెషినరీకి పోలెండుకు ఆర్డరు ఇచ్చారు. అదికూడా వస్తుంది. ఆ కార్యక్రమం కూడా త్వరలో ప్రారంభం అవుతుందని మనవి చేస్తున్నాను. రామగుండంలోని ఫెర్టిలైజరు ఫ్యాక్టరీ అనుకున్నదానికి 5, 6 మాసాలు అటో ఇటో ప్రొడక్షనుకు వస్తుంది. కాస్ట ఆఫ కనస్ట్రక్షను సుమారుగా రు.100, 120 కోట్ల దాకా పోతుంది. అది కూడా అవుతుందని మనవి చేస్తున్నాను కాకినాడలో ఫెర్టిలైజరు ఫ్యాక్టరీ కావాలి. అది ఇవ్వడం జరిగింది. అది ఫ్యూయల్ ఆయిల్ బేస్డు. అందువల్ల అదికూడా త్వరలోనే కార్యక్రమం అవుతుంది. వాళ్లకు కూడా లాండు, వ్యవహారమంతా కలుగచేస్తున్నాము. కోల్ బేస్డు ఫ్యాక్టరీకి ఇంకొకటి మన రాష్ట్రంలో రావాలి. మనకు సఫిషియంటు కోల్ ఉంది. అందు వల్లకోల్ ఫెర్టిలైజర్ ఫ్యాక్టరీకికూడా అవకాశం వుంది. అది ఎంతవరకు అవుతుందో చెప్పలేను గాని ప్రయత్నం చేస్తున్నామని మనవి చేస్తున్నాను. కోల్ బేస్డు ఫెర్టిలైజర్ ఫ్యాక్టరీవల్ల కాకినాడ పోర్టు డెవలప్మెంటుకు అవకాశం ఉంది. కాకినాడ పోర్టు డెవలప్మెంటు లేకపోతే ఈ ఫెర్టిలైజరు ఫ్యాక్టరీరాదు. దానికోసం షిప్పింగు మినిస్ట్రీవారు కూడా ఒక ప్రపోజలు ఇవ్వడం జరిగింది. అది టోటల్గా రు.25కోట్లు ప్రాజెక్టు. పోర్టు ఫస్టు ఫేజు డెవలప్మెంటు కావడానికిముందు రు.8కోట్లు ఖర్చుపెడితే కొన్ని షిప్పు అక్కడికి రావడానికి అవకాశం ఉంటుంది. దానికి కూడా గవర్నమెంటు ఆఫ ఇండియా ట్రాన్స్పోర్టు మినిస్ట్రీ వారితో ప్రయత్నం జరుగుతున్నదని మనవి చేస్తున్నాను. నేను ఇప్పుడు సింగరేణి కాలరీస్ గురించి చెప్పాను. అది కాకుండా సిమెంటు కార్పొరేషన్వారికి 3 సిమెంటు ఫ్యాక్టరీల కొరకు

లైసెన్సు ఇవ్వడం జరిగింది. వారు ఈ మధ్యనే వచ్చారు. సైటు సెలక్షను ఈ కార్యక్రమమంతా కూడా జరిగింది. అవి ఆదిలాబాద్ జిల్లాలో ఒకటి, తాండూరులో ఒకటి. కడప జిల్లాలోని ఎర్రగుంటలో ఒకటి. దీనికికూడా కార్యక్రమాలన్నీ పూర్తి అవుతున్నాయి. దానికి క్లియరెన్సు అయిపోయింది. వర్కుకూడా స్టార్టు అవుతుంది. నాల్గవది ప్రయివేటు సెక్టారులో అనంతపూర్ జిల్లా తాడిపత్రిలో – వాళ్లకు కూడా లైసెన్సు యివ్వడం జరిగింది. వాళ్లకుకూడా లాండు ఇవ్వడానికి ప్రభుత్వం అన్ని ప్రయత్నాలు చేస్తున్నది. 5వ సిమెంటు ఫ్యాక్టరీ వైట్ సిమెంటు ఫ్యాక్టరీ. దీనిని ఎమ్.జి. బ్రదర్సు నెల్లూరు జిల్లాలో పులికాట్ల వద్ద నిర్మిస్తున్నారు. సముద్రంలో ఆలిచిప్పల మాదిరివి దొరుకుతాయి. ఇది దానిద్వారా చేయాలి. దానివల్ల తౌజండ్సు ఆఫ్ ఫిషర్‌మెన్‌కు ఉద్యోగాలు దొరుకుతాయి. దానివల్ల డైరక్టు ఎంప్లాయిమెంటు ఒక వెయ్యి మందికి దొరుకుతుంది. దానికి కూడా లెటర్ ఆఫ్ ఇండెంటు వచ్చింది. లీజుకూడా ఇవ్వడానికి ప్రయత్నం జరుగుతున్నది. ఆ రకంగా తెలంగాణాలో, రాయల సీమలో, సర్కాలు జిల్లాలలో శ్రీకాకుళం, విశాఖపట్టణం జిల్లాలలో వెనుకబడి ఉన్న ప్రాంతాలలో ఇండస్ట్రీసు నిర్మించాలనే ప్రయత్నం జరుగుతున్నది. అదృష్టవశాత్తు గతరెండు సంవత్సరాలుగా గుంటూరు, ప్రకాశం జిల్లాలలో కాటన్ గ్రోయింగ్ ఏరియా 3 లక్షల ఎకరాలు అయినది. ఆ ఏరియా నుంచి సుపీరియర్ కాటన్ ఎక్కువగా ఉత్పత్తి అవుతున్నది. అది బొంబాయి ఎగుమతి చేస్తున్నారు. అది బొంబాయి ఎగుమతి చేసేకన్నా మనమే స్పిన్నింగు మిల్సు, టెక్‌టైల్ మిల్సు నెలకొల్పుకుంటే ఎక్కువ వుద్యోగాలు కల్పించడానికి అవకాశాలు కలుగుతాయి. ఆ ఇండస్ట్రీస్‌ని స్టార్టు చేయాలనే కార్యక్రమంలో నేను గుంటూరు వెళ్లివచ్చిన తరువాత ఇండస్ట్రీయల్ డెవలప్‌మెంటు కార్పొరేషనువారు వెళ్లిప్లాన్సు తయారు చేశారు. ఈ ప్రోజక్ట్సు అన్నీ జాయింటు వెంచర్‌లో పెట్టాలనేటటువంటి ఆలోచన వుంది. ఈ పని చాలా త్వరగా జరుగుతుందని మనవి చేస్తున్నాను. మనకు చాలా పెద్ద సీ కోస్టు ఉన్నది. ఇక్కడ సాల్టు బేస్డ్ ఇండస్ట్రీస్, మెరిన్ బేస్డ్ ఇండస్ట్రీస్ పెట్టడానికి అవకాశం ఎక్కువుంది. మెరిన్ బేస్డ్ ఇండస్ట్రీసులో యూనియన్ కార్బయిడ్ వాళ్లకు వైజాగ్‌లో లైసెన్సుకూడా క్లియరు చేశాము. చేపలు, రొయ్యలు పట్టిఫారిన్ కంట్రీసుకు ఎగుమతి చేస్తే ఫారిన్ ఎక్స్చేంజి కూడా బాగా వస్తుంది. దానికి కూడా పర్మిషను ఇవ్వడం జరిగింది. ఇంకా ఎక్కువమందికి ప్రోత్సాహం ఇవ్వాలి. సాల్టు బేసిస్ కాస్టిక్ సోడా, సోడాయాస్ ప్రాజక్ట్సును కూడా ఎక్కువగా చేస్తే ఉప్పు తయారుచేసే వాళ్లకు బాగా లాభం కలుగుతుంది. దానివల్ల సాల్టు బేస్డ్ ఇండస్ట్రీసు రావాలని నేను ఈ మధ్యన ఢిల్లీ వెళ్లినప్పుడు బారువాగారితో మాట్లాడినాను. అప్పుడు మన రాష్ట్రానికి ఒక కాస్టికు సోడా ప్లాంటుకు లైసెన్సు ఇస్తామని చెప్పారు. బహుశా అది కూడా వస్తుంది. మనకు ఆస్‌బెస్టాస్, బెరైట్సు వంటి మంచి మినరల్సు ఉన్నాయి.

వీటితో ఇండస్ట్రీస్ చేయాలి. దానికి ఫర్దర్ రిపోర్ట్సు తయారు అవుతున్నాయి. ఇదివరకు ఉన్న ప్రోజక్ట్సు అన్నీ వచ్చే ఫిబ్రవరి నెలలో పని ప్రారంభించడానికి ప్రయత్నం చేస్తున్నాము. మంగళగిరిలో టైర్స్ ఫ్యాక్టరీ, కొత్తగూడెం దగ్గర మినీ స్టీల్ ప్లాంటు, విజయవాడలో ప్రింటింగు మెషినరీ ప్లాంటు-ఇవన్నీ కూడా అగ్రిమెంటు అయిపోయినాయి. ఈ ఇండస్ట్రీస్‌ని ఎంకరేజి చేయడానికి మన రాష్ట్రంలో అనేక ప్రాంతాలను డిక్లేర్ చేయడం జరిగింది. దానివల్ల అక్కడ ఇండస్ట్రీస్ పెడితే సెంట్రల్ సబ్సిడీ వస్తుంది. జాయింటు వెంచర్‌లో ఇండస్ట్రీస్ పెడితే గవర్నమెంటుకు కంట్రోల్ వుంటుంది. తరువాత స్మాల్ స్కేల్ ఇండస్ట్రీస్‌ను కూడా బాగా డెవలప్ చేయాలి. ప్రయివేటు వాళ్ళు కూడా ఇన్‌వెస్టిమెంటు పెడతాము అంటే మనం డిస్కరేజి చేయకుండా వాళ్లకు కూడా సహాయం చేస్తాము. వారు ముందుకు వస్తే వారం, పదిరోజులలో వారికి సహాయం చేయాలి. వారు లైసెన్సుకోసం 30 డిపార్టుమెంట్సు దగ్గరకుపోవాలి. నేను ఇండస్ట్రీస్ మినిస్టరుకు చెప్పాను. అదివరకే ఆ విధంగా చేయాలని అనుకొన్నాను. కాని అప్పుడు జరగలేదు. జిల్లా కలెక్టరును ఛెయిర్మెన్‌గా వేసి ఈ డిపార్టుమెంట్సు అన్నీదానిలో వేసి ఈ లైసెన్సు ప్రొసీజరు సింప్లిఫై చేసి వారము రోజులలో దొరికేటట్లు చేయాలని డిసిషన్ తీసుకోవడం జరిగింది. అది అమలు జరుగుతుందని మనవి చేస్తున్నాను.

తరువాత సెల్ఫ్ ఎంప్లాయిమెంటు స్కీము గురించి నిరుత్సాహము ఉన్నది. ఈ బ్యాంక్సు, కో ఆపరేటివ్సు సక్రమంగా వ్యవహరించడంలేదు. కొంతమంది చెప్పుతున్నారు. ఈ బ్యాంక్సు తాలూకాఫీసులు మాదిరి తయారైనాయి, వాళ్లకు వ్యవహారము లేకపోతే ఊరికే తిప్పిస్తూ ఉంటారు అని, నేను ఈ బ్యాంక్సు హెడ్సు అందరినీ పిలిచి వారితో మాట్లాడి దానికి తగినవిధంగా ఆ ప్రొసీజర్ మార్చాలని, ఈ సెల్ఫ్, ఎంప్లాయిమెంటు స్కీము బాగుచేయాలనే ఆలోచన ఉన్నది. ఈ బ్యాంక్సునుంచి సరియైన సహాయము రాకపోవడము వలన రైతులకు, చిన్న చిన్న పరిశ్రమవాళ్లకు ఇబ్బందిగా ఉన్నది. ఈ విషయం గురించి నేను ఫైనాన్సు మినిస్టరుకు వ్రాయడం జరిగింది. దానిని రిలాక్సు చేస్తే బాగుంటుందని, బహుశః త్వరలోనే చేస్తారు.

హాండ్‌లూము గురించి, దానిలో లక్షలమంది పనిచేస్తున్నారు, వారి విషయంలో ఏమైనా చేయాలని ప్రభుత్వ ఆలోచనలో ఉన్నది.

తరువాత, అన్నిటికంటే ముఖ్యమైన వెల్‌ఫేర్ యాక్టివిటీస్, బ్యాక్‌వర్డు క్లాసెస్. హరిజనులు, గిరిజనులు వీరందరి విషయంలో ప్రభుత్వము వట్టి ఉపన్యాసములు

చెప్పుతున్నది, ఏమి చేయడంలేదు. అనేటటువంటిది చాలామంది చెప్పారు. నేను ఒకటి చేస్తున్నాను. ప్రభుత్వం ఏమాట చెప్పినా, మీ క్షేమం కోసం తప్పకుండా చేస్తుందని నా విశ్వాసము. లక్ష్మణబాపూజీగారు వారికెవరికి రిజర్వేషన్ ప్రకారము ఉద్యోగాలు ఇవ్వడంలేదు, ఆఫీసులో ఉద్యోగాలు ఫిలప్ చేయడంలేదు అని చెప్పారు. దానికి అవసరమైతే ఒక సెల్ వేసి ప్రతి డిపార్టుమెంటులోను వారి రిజర్వేషన్ పర్సెంటేజ్ ప్రకారము ఎంప్లాయిమెంటు ఇస్తున్నారా లేదా అనేది చూచి ఆవిధంగా ఇచ్చేటట్లు చేస్తామని, అది అమలు జరపతామనే విశ్వాసము నాకు ఉన్నది. గిరిజన సంక్షేమం గురించి రత్నాబాయి మాట్లాడారు; వెంకటేశంగారు మాట్లాడారు. గిరిజన కార్పొరేషన్ ఎట్లా పనిచేస్తున్నదో చూసి ఉంటారు. అది బాగా పనిచేస్తున్నది, దాంట్లో కమిటెడ్ ఆఫీసర్సు ఉన్నారు. నేను హోం మినిస్టరుగా ఉన్నప్పుడు కూడా దాని రీ- ఆర్గనైజ్ చేసి ట్రయిబల్స్‌కు సహాయము కలుగచేయాలనే ఉద్దేశము ఉండినది. ఎక్కడైనా తప్పులే చేసే వాళ్లు ఉంటారు. కాని అందరు అట్లే ఉంటారా ఉండరు. ఈ గిరిజన కార్పొరేషన్ విధానము మార్చాలనే ఉద్దేశముతో వాళ్లకు పరపతి సౌకర్యము ఈ గిరిజన కార్పొరేషన్ కలుగచేయాలని, వారు పండించేటటువంటి వస్తువులను మార్కెట్ రేటుకు కొనాలని, వారికి కావలసిన వస్తువులు కూడ న్యాయమైన ధరలకు ఇవ్వాలని ఉన్నది. ఎక్కడైనా కొన్ని లోపాలు ఉంటే ఉండ వచ్చు. మీరు సలహాలు చెప్పండి, వాటిని సరిచేయడానికి ఇబ్బంది ఉండదు. మీరు సలహాలు చెప్పాలి. ప్రతి డిపార్టుమెంటు గురించి. అందువల్ల ఈ గిరిజన కార్పొరేషన్ బాగా పనిచేస్తుంది, వీరి స్కీమును ఇంకా విస్తారము చేసి ఇంతకంటే రెట్టింపు నెక్స్ట్ ప్లానులో చేసి గిరిజనులకు ఉచితంగా విద్య చెప్పించి, వారికి భోజన సౌకర్యము కల్పించి వారికింకా అనేకమైన సౌకర్యాలు కలుగచేసేందుకు ప్రభుత్వము ప్రత్యేకమైన శ్రద్ధ వహిస్తున్నది. ఆ విధంగానే హరిజనులకు ఇళ్ల స్థలాలు విషయం ఉన్నది. దాంట్లో కొంతతప్పు జరిగినమాట ఒప్పుకొంటున్నాను. ఈ లాండ్ రిఫార్మ్స్, సీలింగు యాక్టు వచ్చినప్పుడు లాండు దొరుకుతుంది, అప్పటి వరకు ఆగండి, అక్వయిర్ చేయవద్దు అంటే అర్థంలేని విషయం. అందుకని, అప్పటి వరకు కళ్లుమూసుకొని కూర్చోకుండా, ఒక క్రాష్ ప్రోగ్రాము తీసుకొని రాబోయే 2,3 సంవత్సరాలలో రాష్ట్రములో ఇళ్ల స్థలాలు పెద్ద ఎత్తున వారికి కలుగచేయాలనే ఆలోచన ఉన్నది. తప్పకుండా అది జరుగుతుంది. హరిజన హాస్టల్సు నిర్వహణ విషయం చెప్పారు. హరిజన హాస్టల్సు ప్రభుత్వము తీసుకోవడం దేశములో ఉత్తమమైన పని. కొంతమందికి కోపమువస్తే రావచ్చు. ఈనాడు ప్రభుత్వము హాస్టల్సు తీసుకొనిన తరువాత ఇబ్బందులు జరిగినాయని ఎంతో మంది చెప్పారు. కొంతమందికి అడ్మిషన్సు దొరకలేదని చెప్పారు. ఉంటే ఉండవచ్చు. కాని ఈనాడు ఈ

హాస్టల్సులో ఉన్నవారికి 40 రూపాయలు ఇవ్వాలని ఉన్నది. కాలేజీ స్టూడెంట్స్‌కు 50రూ ఇవ్వడం జరిగింది. ఇందాక అడిగారు, గవర్నమెంటు హాస్టల్సు కాకముందు, సబ్సిడైజ్ హాస్టల్సులో మన రాష్ట్రములో 44,292 మంది ఉండేవాళ్లు, మనము ఈ హాస్టల్సు నిర్వహణ తీసుకొనిన తరువాత ఏమి చేశారని? 21 వేలమందికి అవకాశము ఇవ్వబడింది. దాంట్లో, ఆ తరువాత కూడ చాలదంటే ఇంకొక 5 వేలమందికి ఇచ్చారు. ఇప్పుడు 26,713 మంది ఉన్నారు, నేను ఇందాక కాల్ అటెన్షన్ మోషన్‌లో చెప్పాను, జిల్లా కలెక్టర్లు ఇంకా 4,5 రెట్లు సీట్లు పెంచితే సరిపోతుంది అంటే ఇప్పుడు ఉన్న ఆర్థిక ఇబ్బందులలో అది సాధ్యం కాదు అని చెప్పాను. కాని ఎక్కడైనా కావలసి ఉంటే కొన్ని సీట్లు పెంచడానికి గవర్నమెంటు ప్రయత్నం చేస్తుంది. గవర్నమెంటుద్వారా చాలా ప్రొవైడ్ చేయడం మంచిదికాదు. మరి హాస్టల్సు కాకుండా ఇతరపూర్ హోమ్స్‌అని ఇంకేవో అని బోగస్‌గా వందల హోమ్స్‌కు డబ్బులు తీసుకొనేవాళ్లు ఉన్నారు. కొంతమంది ఆ విధంగా ఈస్టు గోదావరి, వెస్టుగోదావరి జిల్లాలోను కొంతమంది ఉన్నారు. ఆ డబ్బు హాస్టల్సుమీద పెట్టడంలేదు. గ్రాంటు తీసుకొని జేబులో వేసుకోవడం జరుగుతుంది. ఈ విధంగా బీదవారి పేరుతో, హరిజనులు, గిరిజనులు పేరుతో వాళ్లకు ద్రోహము చేయడం మంచిది కాదు. కొంత ప్రభుత్వము ఈ కార్యక్రమంలో వెనుకకు వెళ్లినతరువాత ఈ పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్తులు కూడ వారికి కేటాయించిన డబ్బు ఖర్చుపెట్టలేదనే విషయము ఉన్నది. నిజంగా వారు ఖర్చుపెట్టాలి. వారికి కేటాయించిన 15 పర్సెంటు 4 పర్సెంటు షెడ్యూల్డు కాస్ట్సుకు ట్రయిబల్సుకు, డెఫినెట్‌గా ఖర్చు పెట్టాలి లేకపోతే వెనుకటినుంచికూడ వసూలు చేయాలి. కృష్ణాజిల్లా కలెక్టరు ఇది జరిగేటట్లు చేస్తున్నాడు. ఆ కార్యక్రమం తప్పకుండా అమలు చేస్తాను. ఆ విధంగా డైరెక్టుగా ఈ పంచాయతీరాజ్ ఇన్‌స్టిట్యూషన్సుకు ఆర్డర్సు జారీ అవుతాయి. తరువాత మన రాష్ట్రములో చర్మకారులకు సంబంధించి, మన రాష్ట్రములో చర్మాలు సుమారు రు.15కోట్లు దాకా ఇప్పుడు మద్రాసుకు ఎగుమతి అవుతున్నాయి. ఆ విధంగా కాకుండా, ఇక్కడ వారికి వృత్తి కల్పించాలని నేను ఇండస్ట్రీస్ మినిస్టరుగా ఉన్నప్పుడు ఒక లెదర్ కార్పొరేషన్ పెట్టాలని చెప్పాను. దాని ద్వారా అవి బయటికి పోకుండా ఇక్కడ మనవాళ్లకు వాటి ద్వారా వృత్తి కల్పించే విధంగా చేయాలని. అది వెంటనే అమలు జరపడానికి ప్రయత్నం చేస్తున్నాము. తరువాత, ఓల్డ్ ఏజ్ పెన్షన్స్ గురించి చెప్పారు. నేను సోషియల్ వెల్ఫేర్ మినిస్టర్‌తో చెప్పాను. ఇవి లిబరల్‌గా ఇవ్వవలెనని, డబ్బు కలెక్టరు చేతిలో పెట్టి అది వారికి అందుబాటులో పెట్టే ఆలోచన ఉన్నది. ఏప్రిల్ నుంచి అది అమలులో పెట్టడానికి ప్రయత్నం చేస్తాము. తరువాత హరిజనులు, వీకర్ సెక్షన్స్‌మీద అత్యాచారాలు చేస్తున్నారు

అనేటటువంటి నేరము ఆల్ ఇండియా లెవెల్‌లోను మన రాష్ట్రములోను వస్తున్నది. అట్లాంటి విషయాలలో కఠినమైన చర్య తీసుకోవాలని కలెక్టర్సుకు ఆదేశాలు ఇవ్వడం జరిగింది. అది వారు పర్సనల్‌గా చూడాలి, దానికోసం ఒక సెల్ పెట్టి అది డైరెక్ట్‌గా ఛీఫ్ మినిష్టరు క్రింద ఉండాలనే ఆలోచన ఉన్నది. ఈ పంచాయతీ రాజ్ వ్యవస్థగురించి చాలామంది మాట్లాడారు దీనిలో మార్పులు తీసుకురావాలని, 1975లో వీటికి ఎన్నికలు వస్తున్నాయని యీ ఎన్నికలు వచ్చేలోపల దానికి అమెండ్ మెంట్ తీసుకువచ్చి ఎన్నికల విధానాన్ని మార్పు చేయాలని చెప్పారు. సరపంచ్, సమితిప్రెసిడెంట్, జిల్లా పరిషత్ ఛైర్మన్ – ఎన్నికలు సైమల్‌టేనియస్‌గా ఒకేసారి జరగాలని నేను రిపోర్టు ఇచ్చాను. దానిని అమలుజరిపి. ఎన్నికల సమయంలో కేంప్స పెట్టటం డబ్బుపెట్టి కొనటం, ఎత్తుకు పోవటం – ఇట్లాంటి కార్యక్రమాలు లేకుండా చేస్తామని, దీనిని క్షాళనచేసి తీరతామని మనవి చేస్తున్నాను. ఈ పంచాయితీరాజ్ ఇన్‌స్టిట్యూషన్ ఆర్థిక పరిస్థితి ఎలా బాగుచేయాలి, వాటికి ఆర్థిక వనరులు ఎట్లా సమకూర్చాలి, ఎట్లా స్ట్రింగ్‌దెన్ చేయాలి అన్నది ఆలోచిస్తున్నాము. ఇందులో ఉన్నవారందరు చెడువారని మీరు అనుకోవద్దు. నేను అనుకోవటంలేదు. అందులో చాలామంది మంచివారు ఉన్నారు. అయితే వారి పరువు పాడు చేయటానికి 10 మంది చెడువారు ఉండ వచ్చును. ఆ పదిమంది కొంత చెడు చేసినంత మాత్రాన ఆ ఇన్‌స్టిట్యూషన్స్‌నే సమూలంగా తీసివేయటం అన్నది జరగదు. అవి ఉంచి, బాగా పనిచేయించటం జరుగుతుంది. అయితే పంచాయతీరాజ్ సంస్థలలో స్టాఫ్ పెరిగిపోయింది. వారికి ఇచ్చే డబ్బు అంతా స్టాఫ్ జీతాలు ఇవ్వటానికే సరిపోతున్నది. వాటిని ఎట్లా స్ట్రింగ్‌దెన్ చేయాలన్నది ఆలోచన చేద్దాము. ఇక, మునిసిపాలిటీస్ స్థితి కూడ చాలా అధ్వాన్యంగా ఉంది. మనం వీటిని ఎట్లా బాగుచేయాలి? పన్నులు వసూలుచేస్తే మనకు పలుకుబడి తగ్గిపోతుంది. అనే భయం ఉంది. ప్రజాప్రతి నిధులు పన్నులు వసూలు చేయకూడదు, అరియర్స్ అట్లాగే ఉంచాలి అంటే నడవదు. పన్నులు వసూలుచేయాలి. వసూలుచేసిన డబ్బును సక్రమంగా ఖర్చుపెట్టాలి. ఈ మునిసిపాలిటీలకు వచ్చే ఆదాయం వాటి స్టాఫ్ జీతాలకే సరిపోతున్నది. విపరీతమైన స్టాఫ్‌ను, అక్కరలేని సిబ్బందిని కూడ వేశారు. ఇకముందు మునిసిపాలిటీలలో, పంచాయతీరాజ్‌లో స్టాఫ్‌ని వేసే అవసరం ఉండదు. ఇపుడు ఉన్న స్టాఫ్‌తో పని చేయించుకొంటే సరిపోతుంది. మునిసి పాలిటీలకు వచ్చేతమ ఆదాయం అంతా స్టాఫ్ జీతాలకే ఖర్చుపెడితే – ఇక వారు రోడ్స్ ఎట్లా వేస్తారు. డ్రయినేజ్ ఎట్లా వేస్తారు. ప్రజలకు సౌకర్యాలు ఏమి కలుగచేస్తారు? ఆంధ్రలో ఉన్న మునిసిపాలిటీలపై ఎడ్యుకేషన్ బర్డెన్ 50 పర్సెంట్ వారి నెత్తిన పడుతోంది. నరసింహంగారి కమిటీ రిపోర్టు ఉన్నది. దాని

విషయంలో త్వరలో నిర్ణయం తీసుకొని కొంత బరువు వారిమీదనుంచి తగ్గించి, మునిసిపాలిటీలు ఆ డబ్బును ఆ మునిసిపల్ ఏరియాస్‌ను డెవలప్ చేయుటానికి ఉపయోగించేటట్లు చేయాలనే ఆలోచన ప్రభుత్వానికి ఉంది. ఆ విధంగా చేస్తుంది. విద్య ఉన్నది. ఇది పెద్ద సముద్రము. ఎంతో డబ్బు ఖర్చుపెడుతున్నాము. సక్రమంగా ఖర్చు అయితే నాకు ఇబ్బందిలేదు. కొన్నాళ్లు స్టూడెంట్స్ స్ట్రయిక్, కొన్నాళ్లు లెక్చరర్స్ స్ట్రయిక్, సగంకాలం వీరిద్దరి స్ట్రయిక్‌తో గడచిపోతుంది. విద్యార్థులలో ఇండిసిప్లెన్ ఎక్కువ అయింది. పరీక్ష కాపీలు కొట్టనిస్తే వ్రాస్తాము. లేకపోతే వ్రాయము అని స్టూడెంట్సు చెప్పే దుస్థితి వచ్చింది. ఆ విషయంలో విద్యార్థుల తల్లిదండ్రులు కూడ కృషిచేసి ఆ ఇన్‌స్టిట్యూషన్స్ బాగా పనిచేసేటట్లు చూడాలి. కొత్త కాలేజీలు పెట్టి నడుపుతామనే ఆశనాకు లేదు. ఉన్న కాలేజీలను స్ట్రెంగ్ దెన్‌చేయాలి. బాగా పనిచేయాలి కావలసిన స్టాఫ్‌ను ఇవ్వాలి. పలుకుబడికోసం రోజుకో కాలేజి బొప్పున 4 కాలేజీలు పెట్టుకొంటే గవర్నమెంట్ మీద పెద్ద బర్డెన్ అవుతుంది. నలుగురు కలిసి ఒక కాలేజీ పెట్టటం, రెండు సంవత్సరాలు నడపటం, తర్వాత దానిని గవర్నమెంట్ నెత్తి మీద పడేయుటం జరుగుతున్నది. కొత్త కాలేజీలు పెట్టకుండా ఉన్న కాలేజీలు స్ట్రెంగ్ దెన్‌చేసి బాగా స్టాఫ్ వేసి బాగా చదువుచెప్పించి మన పిల్లవాళ్లను బాగా అభివృద్ధిచేయాలన్నదే మన ప్రభుత్వ ప్రయత్నం. వైద్యశాఖమీద కూడ మనం బాగానే ఖర్చుపెడుతున్నాము. అది కూడా బాగా ఫంక్షన్ చేయించటానికి మనం ప్రయత్నం చేస్తున్నాము. దీనిలో ఏమైనా లోపాలు ఉంటే - నిర్దాక్షిణ్యంగా యాక్షన్ తీసుకొనటానికి ప్రభుత్వం వెనుకాడదు. అడ్మిషన్స్ విషయంలో బోగస్ అడ్మిషన్స్ జరిగాయి. దానిమీద కఠినమైన చర్యలు తీసుకోబడుతున్నాయి. నేను ఒకటే మనవి చేస్తున్నాను. దీనిలో ప్రతిపక్షము, అధికారపక్షము అనే సమస్య ఉండకూడదు. ఎక్కడ లోపం జరిగినా, దానిని అరికట్టటానికి మన మందరం ఏకంగా ఉండాలని మనవిచేస్తున్నాను. ఆహారం కల్తీ విషయం చెప్పాను. ప్రతిదానిలో కల్తీలేకుండా ఎక్కడా నడవటంలేదు. స్పెషల్‌గా ఎడల్టరేషన్ చెకింగ్ కోసం మహారాష్ట్రలో మాదిరిగా ఒక డైరెక్టరేట్‌ను వేసి, దానిని అరికట్టే ప్రయత్నం చేయాలనేది ప్రభుత్వ ఉద్దేశ్యము. అందుకు ప్రయత్నం జరుగుతున్నది. కొంతమందిపైన యాక్షన్ తీసుకోవటం జరిగింది. అదిఅవసరము. డెల్టా ఏరియానుంచి వచ్చిన స్నేహితులు గౌ.సభ్యులు చాలామంది అక్కడ రోడ్స్ పరిస్థితి చాలా అధ్వాన్యంగా ఉన్నదని చెప్పారు. మనం రోడ్స్ మీద ఖర్చుపెట్టే డబ్బు చాలా తక్కువ అయిపోయింది. ఈ సంవత్సరం నేషనల్ హైవేస్ మీద మనం ఖర్చు పెట్టవలసిన డబ్బు తక్కువ అయి, కొంత పని ఆగిపోయింది. రాబోయే యీ ఐదవ ప్రణాళికలో మన స్టేట్ రోడ్స్ పరిస్థితి బాగుచేయాలనే ఆలోచన ఉంది. ఐదవ ప్రణాళికలో

1500, వెయ్యిమంది జనాభా కలిగిన ప్రతి ఊరు రోడ్‌తో కనెక్ట్ చేయాలని ప్లానింగ్ కమీషన్‌వారు చెప్పారు. అందుకు వారు మన ప్లానులో ఎంత డబ్బు ఇస్తారో చూసిన తర్వాత మనం కొత్త రోడ్స్ వేయకపోయినా ఉన్న రోడ్స్‌ను, సమితులు జిల్లా పరిషత్ వేసిన రోడ్స్ పరిస్థితిని బాగుచేయాలనే ఆలోచన ఉంది. మన దగ్గర ఆర్.టి.సి. పెద్ద కార్యక్రమం తీసుకొన్నది. నేషనలైజేషన్ కార్యక్రమం తీసుకొన్న దానిలో మనం వెనక్కు వెళ్లేసమస్య లేదు. ఇక్కడ ఆర్.టి.సి. బాగా పనిచేస్తున్నది. లాభాలు వస్తున్నాయి. విస్తృతంగా ఆ కార్యక్రమాన్ని ముందుకు తీసుకువెళ్లతామని మనవి చేస్తున్నాను. ప్రొటెక్టడ్ వాటర్ సప్లయిగురించి చాలామంది స్నేహితులు చెప్పారు. వసంత నాగేశ్వరరావుగారు నందిగామ తాలూకాలో ఫ్లోరిన్ వాటర్‌ఉన్న గ్రామాలు కొన్ని ఉన్నాయని చెప్పారు. మన రాష్ట్రంలో అట్లాంటి గ్రామాలు ఎన్ని ఉన్నవో సర్వేచేయించి ఎస్టిమేట్స్ వేసి, అవసరమైతే ఎల్. ఐ. సి. నుంచి లోన్ తీసుకువచ్చి అట్లాంటి గ్రామాలకు ప్రొటెక్టెడ్ వాటర్ సప్లయి చేయించటానికి ప్రభుత్వం ప్రయత్నం చేస్తుందని మనవి చేస్తున్నాను. ఈ విషయంలో నేను సర్వే చేయించవలసింది అని ఛీఫ్ ఇంజనీర్ పంచాయతీరాజ్‌కు చెప్పాను. ఆ ప్రయత్నం జరుగుతుంది. కృష్ణానదీ జలాల విషయంలో ఎవార్డ్ గురించి చెప్పారు. ఇది చాలా సున్నితమైన విషయము. దీనిని స్టడీ చేస్తున్నాము. స్టడీ చేయకుండా చెప్పలేము నేను ఒక హామీ ఇస్తున్నాను. మన రాష్ట్రానికి నష్టం జరగకుండా, అవసరమైనపుడు కావలసిన క్లారిఫికేషన్స్ అన్నీ కోరి మన రాష్ట్ర హక్కులను ప్రొటెక్టుచేయడానికి రాష్ట్రప్రభుత్వం ఎప్పుడూ ప్రయత్నం చేస్తుందని మనవి చేస్తున్నాను. పాగా పుల్లారెడ్డిగారు, రంగదాస్‌గారు మహబూబ్‌నగర్ జిల్లాలో కొత్తగా జూరాలా ప్రాజెక్టు కట్టుకోని 18 టి. ఎం. సి. వాటర్‌దాకా వాడుకొనే అవకాశం యీ ఎవార్డ్ వల్ల వచ్చిందని, ఆ కొత్త ప్రాజెక్టు కట్టాలని చెప్పారు. ఈ ఎవార్డ్ పార్లమెంట్ ముందు పెట్టనిదే దాని మీద మనం చర్చించటానికి వీలులేదు. వారు రాబోయే పార్లమెంట్ ముందు పెట్టిన తర్వాత, మనం యాక్షన్ తీసుకొన్నప్పుడు ఆ ప్రాజెక్టును వెంటనే ఇన్‌వెస్టిగేట్ చేయించి ఏదైతే ఆ ప్రాజెక్టువల్ల మహబూబ్‌నగర్ జిల్లాలో అలంపూర్, గద్వాలు తాలూకాల లో 2లక్షల ఎకరాలపై చిల్లరకు లాభం కలుగుతుందో, ఆ లాభం కలుగ చేయుటానికి ప్రభుత్వం సత్వర చర్యలు తీసుకొంటుందని మనవి చేస్తున్నాను. మనకు వచ్చిన నదీ జలాలను సద్వినియోగం చేయుటానికి నేను ఇందాక చెప్పిన ప్రాజెక్టులన్నీ పూర్తిచేయుటానికి రాష్ట్ర ప్రభుత్వం తప్పకుండా కృషిచేస్తుందని మనవి చేస్తున్నాను. అయితే అవన్నీ చేయాలంటే డబ్బు చాలా అవసరము. అయితే మీరు రెండు విషయాలలో నాతో ఏకీభవించటంలేదు. ఒకటి - పన్నులు వసూలు చేయటానికి - రెండు-పన్నులు వేయటానికి మీరునాతో ఏకీభవించటం

లేదు. ఈ రెండింటి విషయంలో మీరంతా నాతో ఏకీభవించాలి. ఈ పనులు చేసుకోవాలంటే పన్నులువసూలు చేయటానికి మీరు సహకరించండి. మనం మన రీసోర్సెస్ పెంచుకోవాలి. మన ఐదవ ప్రణాళిక పూర్తి చేసుకొనటానికి యీ ఐదేళ్లలో ఏడాదికి రు.50కోట్లు చొప్పున 250 కోట్లు సమకూర్చుకోవాలని ప్లానింగ్ కమీషన్ వారు మనకు అడ్వైజ్ చేశారు. అంత బరువు మన ప్రజలు రైతులు మోసేటట్లు లేదు. దానిలో కొంత అయినా మన రిసోర్సెస్ పెంచుకొని మన రాష్ట్ర ప్రజలు ఎంతో కాలం నుంచి వాంఛిస్తున్న యీ కార్యక్రమాలు పూర్తి చేసుకోవాలి. అందుకు మీరంతా సహకరించాలని, సహాయం చేయాలని కోరుతున్నాను. ప్రతి టాక్సేషన్ మీ ముందుకు వచ్చి. మీ ఆమోదం పొందిన తర్వాతనే అమలు జరుగుతుంది. టాక్స్ ఎవేజన్ కూడ బాగా ఉంది. ముఖ్యంగా సేల్స్‌టాక్స్‌లో ఎవేజన్ బాగా ఉంది. దానిని ఎట్లా టైటెన్ చేయాలనేది ఫైనాన్స్ డిపార్ట్‌మెంట్ ఆలోచిస్తున్నారు. మద్రాసు వారు 130 కోట్లు వసూలు చేస్తుంటే – మనం 70 కోట్లు వసూలు చేస్తున్నాము. వారికి మద్రాసు సిటీ ఉన్నది కాబట్టి – అక్కడ ఎక్కువ వస్తుందనేది తీసివేసినా – కనీసం 100 కోట్ల రూపాయలైనా మనం టైటెన్ చేసి తీసుకురాకపోతే మనకు ఫైనాన్షియల్‌గా ఇబ్బంది ఉంది. ప్రభుత్వ ఉద్యోగాలను ఫిలప్ చేయటానికి వీలులేకుండా చేశారు. బేన్ పెట్టారని గౌ,సభ్యులు అన్నారు. ఇప్పుడు మనకు ఉన్న ఆర్థిక పరిస్థితి చూడాలి. ఇప్పటికే ఎస్టాబ్లిష్‌మెంట్‌కు హెవీ బర్డెన్ భరిస్తున్నాము. ఉన్న ఉద్యోగస్థులతో పని చేయించుకొంటూ అవసరమైన చోట్ల కొద్దిగా వేసుకొని సాధ్యమైనంతవరకు బరువు లేకుండా చేద్దాము. ఆర్థిక పరిస్థితి బాగైనప్పుడు అవికూడ పూర్తిచేసు కొనటానికి ప్రయత్నం జరుగుతుందని మనవి చేస్తున్నాను. ముందు ఉన్నదానిలో దుబారా తగ్గించుకోవాలి. పెట్రోలు ధర పెరగటంవల్ల మనమీద చాలా ఖర్చు బరువు ఎక్కువ పడిపోయింది. అది తగ్గటానికి ఒకటే మార్గం ఉంది. పంచాయతీ సమితులలో ఉన్న జీప్సు విత్‌డ్రా చేయండి. ప్రాజెక్టులలో అసిస్టెంట్ ఇంజనీర్స్ దగ్గర ఉన్న జీప్సు విత్‌డ్రా చేయండి. ఒక డిపార్టుమెంట్‌లో ఒక ఆఫీసర్ దగ్గర ఒక జీప్ మాత్రమే పెట్టుకోండి; ఆఫీసర్స్ కూడ కార్లలో వెళ్లవద్దు. ఖర్చు తగ్గించాలి – అని ఇన్‌స్ట్రక్షన్స్ ఇవ్వటం జరిగింది. మంత్రులుకూడ ప్రయాణం చేసేటపుడు కార్లలో వెళ్లేదానికన్నా ట్రయిన్‌లో వెడితే మంచిదని భావించటం జరిగింది. సాధ్యమైనంతవరకు మనం పొదుపు వహించకపోతే లాభం లేదు; మనం జాగ్రత్తగా వెళ్ళాలి అని ఆర్డర్ ఇవ్వటం జరిగింది. వెహికల్స్‌పై, వాటి మెయిన్ టెనెన్స్‌పై వృధాగా చాలా ఎక్కువ ఖర్చు అవుతున్నది. అందువలన, దానిలో కూడా మనం కొంత పొదుపు చేయుడానికి అవకాశమున్నది. ఆఫీసర్స్ ట్రెయిన్‌లో రావచ్చును. మంత్రులకంటె వారు దీనిని పాటించడానికి అవకాశమున్నది. మీకు తెలుసు –

అడ్మినిస్ట్రేటివ్ సైడ్‌న రిఫార్మ్స్ చేయనిదే మనమేమి చేయలేము; అడ్మినిస్ట్రేటివ్ సైడ్‌న గనుక మనం రిఫార్మ్స్ చేయగలిగితే తక్కినవి కూడా చక్కగా చేయడానికి వీలుంటుంది. కాని, యిది ఒక్క అర్ధరాత్రి జరిగేదికాదు; ఒకటి రెండు నెలలలో చేయలేము అందువలన, ప్రప్రథమంగా సెక్రటేరియట్ రి ఆర్గనైజ్ చేయడం జరుగుతున్నది. సెక్రటేరియట్‌లో ప్లానింగ్ అండ్ ఫినాన్స్ కలుపు తున్నాము. గౌరవ సభ్యులను మంచి సలహాలను యివ్వమని నేను కోరుతున్నాను. ఎక్కడ అవసరమైతే అక్కడ రిఫారమ్స్ చేసి, సత్వరమే చర్యలు తీసుకోవటానికి ప్రయత్నించడం జరుగుతుంది. గవర్నమెంటు సరిగా ఫంక్షన్ చేయాలి, గవర్నమెంటు సరిగా ఫంక్షన్ చేసినప్పుడే ప్రజలకు విశ్వాసం ఏర్పడుతుంది. ప్రజలకు గవర్నమెంటులో విశ్వాసం లేనప్పుడే యిటువంటి ఉద్యమాలన్నీ వస్తాయి. నీతిపరులున్నారు. వారు తప్పక పనిచేస్తారు. అనే విశ్వాసం ఉంటే అప్పుడు యిటువంటి ఉద్యమాలు రావు. అటువంటి విశ్వాసం కల్పించడానికి నేను ప్రయత్నిస్తున్నాను.

తరువాత, గౌరవ సభ్యులు చెప్పిన విషయాలన్నింటికీ, దాదాపుగా చాలావరకు నేను జనరల్‌గా సమాధానం చెప్పాను. గౌరవసభ్యులు కరప్షన్ - లంచగొండితనం - గురించి చాలా చెప్పారు. ఇది ఒక్క అర్ధరాత్రిలో తీసివేసేది కాదు. ముందు ఇల్లు చక్కబెట్టుకోవాలి. నేను ముఖ్యమంత్రిగా బాగా వుండాలి; మంత్రులు బాగా ఉండాలి; శాసన సభ్యులు బాగా వుండాలి; అది జరిగితే 50 పర్సెంట్ బాగుపడుతుంది; మనం బాగా వుంటే ఉద్యోగులు బాగా వుంటారు. అందుచేత, మనం దానికొరకు కృషి చేయాలి. అందుకు అనుగుణంగా మనదృక్పథంలో మార్పురావాలి. జిల్లాలకు పోయినప్పుడు ఈ టీపార్టీలు దండలతో టైమ్ చాలా వేస్ట్ అవుతున్నది. మొదటిసారి ఫర్వాలేదు, వెళ్లినప్పుడల్లా దీనివలన టైమ్ వేస్ట్ అవుతుంది. అది గమనించాలి. ఆయా జిల్లాలో ఎం.ఎల్. ఎస్., ఎం. ఎల్. సిస్, ఎం.పి.లతో ఒక కమిటీని ఏర్పాటు చేస్తే వారు ఆ జిల్లాలోని పరిస్థితులను ఎప్పటికప్పుడు సమీక్షించడానికి అవకాశం ఉంటుంది. అక్కడనే ఆఫీసర్సును ధైర్యంగా పరిస్థితుల గురించి అడగడానికి అవకాశ ముంటుంది. వెంటనే పరిస్థితులను సెట్‌రైట్ చేయడానికి అవకాశం వుంటుంది. శాసనసభ్యులకు రెస్పెక్టు వారు యివ్వాలని నా ఉద్దేశం. ఆ విధంగా ప్రతిజిల్లాలోను కూడా పరిస్థితులను ఎప్పటికప్పుడు సమీక్షచేస్తూ సెట్‌రైట్ చేస్తూవుంటే ఆఫీసర్సు కూడా జాగ్రత్తగా వుంటారు. గవర్నమెంటు టోనప్ అవుతుంది. నేను దేవుడినికాదు దేవతనుకాదు, మంచి అడ్మినిస్ట్రేషనుకు ప్రయత్నం చేస్తాను. అందుకు సహాయం చేయమని గౌరవ సభ్యులను కోరుతున్నాను. వారు కనుక సహాయం చేస్తే యీ ప్రయత్నంలో మనం తప్పకుండా సఫలీకృత మవుతామని, పరిస్థితులను కంట్రోలు

చేయగలమనే నమ్మకం నాకు వున్నది. ఆ విధంగా ఆయాజిల్లాలో కమిటీలను వెయ్యాలని నేను అనుకుంటు న్నాను. అట్లా పని చేస్తే ప్రజలలో విశ్వాసం కలుగుతుంది. ఈనాడు శాసన సభ్యులపై. శాసనమండలి సభ్యులపై, మంత్రులపై, ముఖ్యమంత్రిపై ప్రజలకు ఎంతో ఆశ వుంది. మన శక్తిని వృధాగా పాడుచేసుకోకుండా, నిర్మాణాత్మకంగా ఆలోచించి, రాష్ట్ర అభివృద్ధికి, రాష్ట్ర సమగ్రతకు, మంచి అడ్మినిస్ట్రేషన్ యివ్వడానికి మీరంతా సహాయం చేయవలసిందిగా కోరుతూ, దీనిని సంపూర్ణంగా బలపరచవలసినదిగా అధ్యక్షులవారి ద్వారా ప్రార్థిస్తూ సెలవు తీసుకుంటున్నాను.

# అనుబంధం : 3

*(ఆంధ్రప్రదేశ్ శాసనసభలో 1974-75 సంవత్సరం బడ్జెటు ప్రతిపాదనలపై జరిగిన చర్చకు సమాధానం చెబుతూ 1974 జూన్ 29న ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు చేసిన ప్రసంగం ఆధారంగా...)*

అధ్యక్షా, బడ్జెటు మీద గత 4,5 రోజులుగా వంకా సత్యనారాయణ గారితో సహా 71 మంది మాట్లాడినారు. అందరూ కూడ జనరల్‌గా రాష్ట్రమును ఎదుర్కొంటున్న సమస్యల మీద, వారి వారి నియోజక వర్గాలలో వున్న యిబ్బందులను గురించి తమద్వారా ప్రభుత్వ దృష్టికి తీసుకు వచ్చారు. నేను ప్రతి సమస్యను గురించి వివరముగా చెప్పకపోయినా స్థూలముగా అన్నింటికి జవాబులు చెప్పి సాధ్యమైనంతవరకు సభ్యులకు తృప్తి కల్గించి ఈ బడ్జెటును ఏకగ్రీవముగా అమోదించ వలసినదిగా కోరడానికి ప్రయత్నము చేస్తాను. రాష్ట్రమును ఎదుర్కొంటున్న అతిముఖ్యమైన సమస్యల గురించి గౌరవసభ్యులు చెప్పారు. ఒక ప్రక్క ధరలు విపరీతముగా పెరగడమువల్ల ప్రజలకు కలిగిన యిబ్బంది, మన అభివృద్ధికార్యక్రమాలు ప్రారంభించినవి తొందరగా పూర్తి చేయాలని, కేంద్రము నుంచి ఇప్పుడు తెచ్చుకొన్నది కాకుండా ఇంకా ఎక్కువ తెచ్చుకోవాలని చెప్పారు. నేను అందరి అభిప్రాయాలతో ఏకీభవిస్తున్నాను. రాష్ట్రమును అభివృద్ధిచేసే విషయములోను, ప్రభుత్వ యంత్రాంగమును బాగు చేసే కార్యక్రమములోను ప్రభుత్వ పక్షము, ప్రతిపక్షము అనేది కాదు అందరికి ఇంటరెస్టు వుంది. రాష్ట్రములో మంచి ప్రభుత్వము వుండాలి. ప్రభుత్వ యంత్రాంగము ప్రజలకు అందుబాటులో వుండేటట్లు చేయాలి.

శ్రీ సి.వి.కె.రావు :- ప్రతిపక్షము వుంటేనే మంచి ప్రభుత్వము వస్తుంది.

శ్రీ. జె. వెంగళరావు :- ఈ సమస్యలన్నిటిని మనము ఒక కుటుంబ సభ్యులుగా కలిసి పరిష్కారము చేయాలి. రాష్ట్రమును మంచి దశకు తీసుకు వెళ్లాలి. ఈ విషయములో ప్రభుత్వముతో సహకరించవలసినదిగా గౌరవ సభ్యులకు మనవి చేస్తున్నాను. ప్రభుత్వం ఏర్పడిన తరువాత 6 మాసాలుగా జరిగిన కార్యక్రమాలు, ముందు ప్రభుత్వము ఏమి చేస్తుందనే దానిపైన కొన్ని మాటలు చెప్పక తప్పదు. కేంద్ర సహాయము, కేంద్ర విశ్వవిద్యాలయము ఆరు సూత్రాల పథకము అమలు విషయములో కొన్ని మాటలు చెప్పక తప్పదు. 'ఇవన్నీ సరిగా అమలుకావు. కేంద్ర ప్రభుత్వము ఒక్క రూపాయి కూడ

ఇవ్వదు' అని ప్రచారము చేసిన మిత్రులు వున్నారు. నిజముగా ఎప్పుడూ విమర్శించేవారు వుంటారు కదా. ప్రధాన మంత్రిగారు చెప్పినమాటలు అమలుపరచే సందర్భములో 90 కోట్ల రూపాయలు వెనుకబడిన ప్రాంతాలకు, హైదరాబాదు, సికింద్రాబాద్ నగరముల అభివృద్ధికి కొంత డబ్బు, ప్రత్యేకించి యివ్వడానికి నిర్ణయించడం సంతోషించదగిన విషయము. ఆ మాటే రాకపోతే రంగదాస్ వంటివారు ఇంకా గట్టి ఉపన్యాసము చెప్పేవారు. రాకపోతే రాలేదని చెబుతారు. వస్తే వచ్చినది చాలదని చెబుతూనే ఉంటారు. ఇది రాదని, వట్టి అబద్ధమని కొన్ని పత్రికలు కూడ వ్రాశాయి. కేంద్ర విశ్వవిద్యాలయము రాదని చెబుతున్నారు. కాని మనము ఆశావాదులుగా బ్రతుకవలసి వుంటుంది. సాధించి తీరుతాము. కేంద్ర ప్రభుత్వము చేసిన వాగ్దానాలను అక్షరాల అమలుచేసి రాష్ట్రమును ముందుకు తీసుకుపోవడములో ప్రభుత్వము వెనుకాడదు. తప్పకుండా సాధిస్తుందని మనవిచేస్తున్నాను. ఆరు సూత్రాల పథకములోని అంశాలను అమలుచేయుడానికి ప్రభుత్వము సంకల్పించినది. 5 : 3 : 2 మొదలైన చిన్న విషయాల జోలికి పోవద్దని మనవి చేస్తున్నాను. రాష్ట్రమును అభివృద్ధి మార్గములోకి తీసుకువెళ్లడానికి విశాల హృదయముతో ఆలోచించాలని కోరుతున్నాను. ఈ వచ్చిన రూ. 90 కోట్లతో నేను తృప్తిపడ్డాను అని అనుకోవద్దు. నేను నా ఉపన్యాసమును కూడ చాల క్లుప్తముగా యిచ్చాను. శాసనసభ చరిత్రలో బడ్జెటు ఉపన్యాసము చిన్నదిగా వున్నది ఇదే అనుకుంటాను. తక్కువగా మాట్లాడి ఎక్కువగా పని చేయాలి. వృధా మాటలు మాట్లాడకూడదు అనే సిద్ధాంతము ప్రకారము నా ఉపన్యాసము చిన్నదిగా వుంది. ఈనాడు రూ.90 కోట్లతోనే అయిపోయింది. కేంద్ర ప్రభుత్వము ఇంక ఎక్కువ డబ్బు యివ్వదు అని విమర్శ చేసే దానికన్న రూ.90కోట్లు వృధా కాకుండా చక్కగా సద్వినియోగము చేసుకొనే ఏర్పాటు చేసుకోవాలి. ఊరికే రూ.200 కోట్లు భిక్షమెత్తుకోవలసిన అవసరములేదు. మన దగ్గర సమృద్ధిగా వనరులున్నవి. వాటిని సద్వినియోగము చేసుకొనడానికి ప్లాను తయారు చేసుకొని డబ్బు ఎక్కువగా వచ్చే ప్రయత్నము చేస్తే కేంద్ర ప్రభుత్వము ఎక్కువ యిచ్చితీరాలి. దానికోసము ప్రయత్నము చేస్తున్నాను. 90కోట్లతో తృప్తిపడలేదు. ఇదే కాకుండా ఔట్ సైడ్ ది ప్లాన్ క్రింద కూడ అనేక కార్యక్రమాలను ఎక్కువగా తీసుకురావాలి. ఎక్కువగా ఇన్వెస్టుమెంటు పరిశ్రమల రూపములోగాని, ఇతర కార్యక్రమాల రూపములోగాని కేంద్రము చేత పెట్టించడానికి ప్రయత్నము చేస్తున్నాము. నిరుత్సాహపడవలసిన అవసరములేదు. 5 : 3 : 2 రేషియో అంటే అన్యాయము జరిగిందని కొందరు అంటున్నారు. ఏదీ తూకము వేసి చేయలేము. బాక్‌వర్డ్‌నెస్ అటు ఇటు వుండవచ్చు. నాగార్జున సాగర్ మీద రు.200 కోట్లు పెట్టుబడి పెట్టారు. మాకు

ఏమి లాభము? అని రాయలసీమ వారు అంటారు. పోచంపాడు మీద ఇంత పెడుతున్నారు. మాకు ఏమి లాభం అని ఇంకొక ప్రాంతమువారు అంటారు. గోదావరిబ్యారేజిపైన ఇంత పెడుతున్నారు మాకు ఏమి లాభము అని ఇంకొక ప్రాంతమువారు వాదిస్తున్నారు. కాని ఇవి నేషనల్ ప్రాజెక్టులు, రాష్ట్రంమొత్తానికి లాభమును కల్గించేవి ఎక్కడ ఏ వనరులున్నా పెట్టుబడిపెట్టి ఆ ప్రాంతాన్ని అభివృద్ధి చేయవలసిన అవసరము వుంది. దానికోసము ప్రయత్నం చేస్తున్నాము. ఇప్పటికే మన రాష్ట్రము అనేక చిన్న ఇష్యూలవల్ల విపరీతముగా నష్టపడింది. రాష్ట్రానికి దెబ్బ తగిలే ఆలోచన చేయవద్దని, ప్రభుత్వముతో సహకరించాలని అందరి సభ్యులను కోరుతున్నాను. అన్ని ప్రాంతాలకు సమానమైన న్యాయమును కల్గించే 6 సూత్రాల పథకమును అమలుచేసే కార్యక్రమములోను. కేంద్రమునుంచి అదనముగా డబ్బు సంపాదించి రాష్ట్రమును అభివృద్ధిలోకి తీసుకొనే కార్యక్రమములోను సహకారము చేయండి. రాష్ట్రములో మంచి వాతావరణమును సృష్టిస్తే పారిశ్రామికముగాను, ఇతర రంగాలలోను తప్పకుండా ఇంతకంటే పదిరెట్లు లాభము కలుగుతుంది. ఆ వాతావరణము ఈనాడు వుంది. కేంద్రప్రభుత్వానికి మన రాష్ట్రము మీద మంచి అభిప్రాయము వుంది. దానిని ఆ రకముగా కొనసాగించుకొని ఎక్కువగా లాభమును పొందడానికి ప్రయత్నము చేయడములో అందరు సహకరించాలని అతి వినమయముగా కోరుతున్నాను. అన్ని ప్రాజెక్టులు ఒకేసారి మొదలుపెట్టారు. అక్కడ కాస్త, ఇక్కడ కాస్త తిరుపతి క్షవరము మాదిరి ఖర్చు పెడుతున్నారని శ్రీమతి ఈశ్వరీబాయిగారు చెప్పారు. పొరపాటో, గ్రహపాటో మొదలుపెట్టాము. దానిమీద కొంత ఖర్చుపెట్టాము. కొన్ని వందల కోట్ల రూపాయలు ఖర్చు పెట్టాము. దాని ఫలితము ప్రజలకు అందలేదు. అందువల్లనే కొత్త ప్రాజెక్టులకు శంకుస్థాపన చేయకుండా ఈనాడు మొదలుపెట్టిన ప్రాజెక్టులను ప్లానులో వున్న డబ్బేకాకుండా ఔట్‌సైడ్ ది ప్లాన్ నుంచి కూడ డబ్బు తీసుకువచ్చి పూర్తి చేయాలని, వాటి ఫలితాలను 5వ ప్రణాళికా కాలములోనే ప్రజలకు అందుబాటు చేయాలని ఉత్పత్తిని పెంచాలని, రాష్ట్రప్రజల తలసరి ఆదాయమును పెంచాలని రాష్ట్రప్రభుత్వ సంకల్పముగా వున్నది. దానిని అమలుచేయడానికి ప్రభుత్వము ప్రయత్నం చేస్తున్నది. ఒక్కొక్క ప్రాజెక్టు సంగతి చెప్పవలసిన అవసరము వుంది. నాగార్జున సాగర్ ప్రాజెక్టుకు సంబంధించిన కాలింగ్ అటెన్షన్ నోటీసుపైన నేను కూడ మాట్లాడాను. ఈ ప్రాజెక్టుపైన సుమారు **200** కోట్ల రూపాయల వరకు ఖర్చుపెట్టాము. రోజూ పెరిగే ఈ ధరలలో ఇంకా రు.**83** కోట్లు కావాలని అంటున్నారు. కాని అది పూర్తి అయ్యేసరికి **100** కోట్ల రూపాయల వరకు కావలసివుంటుందని నా అభిప్రాయము. ఈ డబ్బును గురించి మనము కేంద్ర ప్రభుత్వానికి నచ్చ చెప్పగలిగాము. మీకు తెలుసు. కొంతమంది

విమర్శించారు. నోట్ ఆన్ ఏకౌంట్‌లో పదికోట్లు అదనంగా వస్తుందన్నారు రాలేదని. ఆనాడు ప్లానింగు కమీషన్ అంగీకరించింది. కొద్దిగా ఆలస్యం అయినప్పటికి కూడా కేంద్ర ప్రభుత్వము ఒకమాట గుర్తించిందని మనవిచేస్తున్నాను. నేను ప్రధానమంత్రి గారికి చెప్పాను. రు.200 కోట్లు ఖర్చుపెట్టి యీ ప్రాజక్టు నిర్మాణము చేశాము, దానిలో నుండి నీరు తీసుకువచ్చి రైతుల పొలాలకు యివ్వడానికి కాలవలు త్రవ్వడానికి డబ్బు లేనటువంటి దుర్భర పరిస్థితుల్లో రాష్ట్రము వుంది. అది రాష్ట్రానికే గాదు దేశానికి కూడా నష్టము అని చెప్పినప్పుడు వారు కూడా ఇట్ యీజ్ వేరి అన్‌పార్చునేట్ అన్నారు. ప్లానింగు మినిస్టరు, ఫైనాన్స్ మినిస్టరుకు కూడా చెప్పడం జరిగింది. ఆంధ్రప్రదేశ్‌కు సహాయము చేయాలని. నేను చెప్పాను. కొత్త పనులు కావు నాగార్జునసాగర్, పోచంపాడు, గోదావరి బరాజ్, వంశధార ప్రాజక్టులు పూర్తిచేయడానికి మీరు డబ్బు యివ్వండి. సంవత్సరానికి పది లక్షల టన్నులు బియ్యం కేంద్రానికి యిస్తామని చెప్పాను. బియ్యానికి గోధుమలకు ఖర్చుపెట్టే ఓడ చార్జీలలో సగము నాకు యివ్వండి నేను యిస్తాను అని చెప్పాను. కేంద్ర ప్రభుత్వము శ్రద్ధ తీసుకుంటున్నది. ఈ మధ్యన ప్లానింగ్ కమీషను టీమ్ వచ్చి చూశారు. మనము ఎంత డబ్బు యిస్తే ఖర్చు పెట్టగలుగుతాము సంవత్సరానికి అని అంచనా వేయడానికి వారువచ్చారు. బహుశః సహాయం దొరుకుతుంది అనుకుంటున్నాను. ఒకటవ తేదీన శ్రీ కె.సి.పంత్‌గారు మన రాష్ట్రానికి వస్తున్నారు. తిరుపతిలో వుంటారు, వారిని నేను నాగార్జునసాగరు చూడమని కోరాను. వారు నాగార్జున సాగరు వెళ్లబోతున్నారు. బహుశః దానికి సంపూర్ణమైన సహాయం, అది పూర్తి చేయడానికి సరిపోయే డబ్బు దొరకే అవకాశము వుంది. అయినా యీ సంవత్సరం కూడా కార్యక్రమము కుంటుపడనివ్వడం లేదు. మన స్టేటు బడ్జెటు నుండి కొంతయిచ్చి యీ సంవత్సరం లెఫ్టు కెనాల్ జూలై 15 వరకు పాలేరు దాకా నీరు యిచ్చి వచ్చే సంవత్సరము లెఫ్టు కెనాల్‌ను మునేరుదాకా తీసుకువెళ్లి ఖమ్మం, కృష్ణా జిల్లాలలోని జగ్గయ్యపేట, ఇతర ప్రాంతాలకు దాని ఫలితము అంద చేయాలని, రైటు కెనాల్‌నుకూడా అగ్ని గుండాలవరకు తీసుకువెళ్లే కార్యక్రమం వుంది. ఆ ప్రకారం అప్పుడే ఎస్టిమేట్ తయారై ఆ కార్యక్రమము చేస్తున్నాము. పోచంపాడు ప్రాజక్టుకు సరిపడే డబ్బు వుంది. దానికి వరల్డ్ బ్యాంకు సహాయం దొరికింది. పోచంపాడు ఆ డబ్బును ఖర్చుపెట్టి చేయాలనే నిర్ణయం వుంది. కాలువలు కడుతున్నారు. ఇందాక వంకా సత్యనారాయణగారు చెప్పారు. యీ ప్రాజెక్టులు కడుతున్నారు. ఆయకట్టు సక్రమంగా కావడములేదు అని. దానికొరకు, ఈనాడు, ఒక ప్రత్యేక కార్యక్రమము చేసే మనిషి లేడనే వుద్దేశముతో, రాష్ట్ర ప్రభుత్వం కమాండ్ ఏరియా డెవలప్‌మెంట్ అథారిటి అని ఒక డిపార్టు మెంటును పెట్టింది. రెవిన్యూ బోర్డు హోదా కలిగిన సభ్యుడిని వేసి కొంతమంది

యింజినీర్లను అగ్రికల్చర్ డిపార్టుమెంటు వారిని యితరులను ఆయన కంట్రోలులో పెట్టి యీ ఆయకట్టు డెవలప్‌మెంట్ వ్యవహారము చూడడం జరుగుతున్నది. వాటర్ మేనేజ్‌మెంటు సక్రమంగా చేయాలి. మన రైతులు పుష్కలంగా నీరు ఉన్నప్పుడు వృధాగా వదలి వేయడం, లేనప్పుడు గోల చేయడం జరుగుతుంది. నీటిని వృధాచేయకుండా సక్రమంగా వినియోగము చేయాలి. దాని సత్ఫలితాలు సాధ్యమైనంతవరకు ఎక్కువలో ఎక్కువ మందికి లాభము కలిగించే కార్యక్రమము చేయాలనే వుద్దేశముతో యిది చేస్తున్నాము. గోదావరి బరాజ్ విషయము. వంకా సత్యనారాయణగారు – వారి నియోజకవర్గము – నేను మొన్న ఏ వూరు వెళ్లినా అదే అడిగినారు. దానికికూడా ప్లానులో తక్కువ ప్రొవిజన్ వున్నప్పటికి, వారు నాతో అంగీకరిస్తారనుకుంటాను. యింతవరకు రెండు కోట్ల పదిలక్షలరూపాయిలు యిచ్చిన సంవత్సరం ఏది లేదు. ఈ సంవత్సరం యివ్వబడింది. దానికి కూడా సత్వరంగా వరల్డ్ బ్యాంకు సహాయము తీసుకొని పూర్తి చేయాలని ప్రభుత్వ సంకల్పం. వంశధార ప్రాజెక్టుకొరకు శ్రీకాకుళం జిల్లా ప్రజలు వంద సంవత్సరాల నుండి ఎదురు చూస్తున్నారు. దానికి కూడా అదనంగా డబ్బు కేటాయించి మొదటి స్టేజి పూర్తిచేయాలని, దాని లాభము వారికి కలిగించాలని రాష్ట్ర ప్రభుత్వ సంకల్పమని మనవి చేస్తున్నాను. అట్లాగే తుంగభద్ర హై లెవెల్ కెనాల్‌కు యీ సంవత్సరం డబ్బు యివ్వబడింది. దీనిలో మైలవరం ప్రాజక్టుకూడా వుంది. ఇక మైనర్ అండ్ మీడియం యిరిగేషన్ ప్రాజక్టు విషయము, ఏ నదీ జలాలు పొందడానికి అవకాశము లేనటువంటి వెనుకబడిన ప్రాంతాలలో మైనరు యిరిగేషన్ మీడియం యిరిగేషన్ ప్రాజక్టు యివ్వాలనే వుద్దేశముతో యీ సంవత్సరము జూన్ నెలాఖరువరకు ఎన్ని కంప్లీటు చేయగలిగితే అన్నింటికి డబ్బు యివ్వగలిగాము. ఈనాడు మనకు వస్తున్న స్పెషల్ అసిస్టెన్స్ నుండికూడా ఎక్కువడబ్బు వెనుకబడిన ప్రాంతాలలో ప్రారంభం చేసినటువంటి మైనర్ అండ్ మీడియం ఇరిగేషన్ ప్రాజెక్టును పూర్తిచేయడానికి ఖర్చుపెట్టి చేయాలనే ఉద్దేశం ప్రభుత్వానికి ఉంది. అంతే కాకుండా ఇప్పటి వరకు ప్రారంభం చేయనటువంటిచోట కొత్తగా మైనర్ అండ్ మీడియం ఇరిగేషన్ ప్రాజక్టు ప్రారంభంచేసి ఎక్కువ లాభాలు వెనుకబడిన ప్రాంతాలకు కలుగ చేయాలని ప్రభుత్వము యొక్క సంకల్పం. ఇందాక చెప్పాను, యీ **90** కోట్లలో సంవత్సరానికి **18** కోట్లు యిస్తే (డ్రాట్ వర్క్సు), రోడ్డుమీద ఖర్చుపెట్టి వృధా చేయాలని లేదు. యీ డబ్బుతో ఎసెట్స్ క్రియేట్ చేసుకోవాలి. రోడ్లు కావాలన్నా, యితర కార్యక్రమాలు కావాలన్నా, నాన్ ప్రొడక్టివ్ స్కీము కావాలంటే మన బడ్జెటు నుండి చేసుకోవచ్చును, యీ డబ్బును ప్రొడక్టివ్ స్కీమ్సు మీద ఖర్చుపెట్టాలి. ఈ డబ్బును, వెనుకబడిన ప్రాంతాలలో పరిశ్రమలు పెట్టడానికి మైనర్ అండ్ మీడియం

యిరిగేషన్ ప్రాజక్టు పనులు పూర్తి చేయడానికి, క్రొత్తవి ప్రారంభం చేయడానికి వినియోగించాలి. కాస్తో కూస్తో రూరల్ ఎలక్ట్రిఫికేషన్ చేయడానికి, డేరీ డెవలప్‌మెంట్ ప్రాజక్టుకు, కాస్తో కూస్తో ప్రొటెక్టెడ్ వాటర్ సప్లయి చేయడానికి, యీ నాలుగైదు కార్యక్రమాల మీద ఎక్కువగా ఖర్చుపెట్టి దాని లాభము పొందాలి. శాశ్వతంగా కొన్ని ఎసెట్స్ క్రియేట్ చేసుకోవాలని ప్రభుత్వ వుద్దేశ్యము. గౌరవ సభ్యులు ఆమోదిస్తారనుకుంటాను. యీ మైనర్ అండ్ మీడియం యిరిగేషన్ ప్రాజక్టుకు ఎక్కువ ప్రాధాన్యం యిచ్చి అవి పూర్తి చేయాలనేది ప్రభుత్వ సంకల్పం. తప్పకుండా జరుగుతుందని గౌరవ సభ్యులకు మనవిచేస్తున్నాను. చాలామంది గౌరవ సభ్యులు, మా నియోజక వర్గములో ఆ యిరిగేషన్ ప్రాజక్టు పూర్తికాలేదు. యిది పూర్తికాలేదు, అక్కడ పని మొదలు పెట్టారు. ఆపుచేశారు అని ఎన్నో పేర్లు చెప్పారు. ఆ పేర్లు అన్ని నేను చెప్పదలచు కోలేదు. కాని రాబోయే ఒకటి రెండు సంవత్సరాలలో యీ ప్రాజక్టులు పూర్తి చేయడానికి ప్రభుత్వం సంకల్పిస్తున్నది. అవి పూర్తి అవుతాయని మనవిచేస్తున్నాను. అన్నింటికంటె ముఖ్యమైనటువంటి రాష్ట్రాభివృద్ధికి ప్రాణప్రదమైనటువంటి పవరు జనరేషన్ దానిలో కొంత లోపం జరిగింది యీనాడు, కొంత మంది మిత్రులు నిరుత్సాహం ప్రకటించారు. వారి వుపన్యాసాలలో, ధరలు పెరుగుతున్నాయి, ఎలక్ట్రిసిటీ సక్రమంగా రావడంలేదు. యిండస్ట్రీస్ పెట్టడం లేదు, డబ్బు కరువుగా వుంది, యీ పరిస్థితులలో ఏమి చేయగలము అని. అలాంటి పరిస్థితులలోనే చేయాలి. బాగా వున్నప్పుడు మనలను ఎవరు అడిగేది, యిన్ని కష్టాలు వున్నప్పుడు కూడా ఎదుర్కొని చేయగలిగితేనే చేయగలిగిన వారము అవుతాము. పిరికితనముతో పారిపోయే అలవాటు నాకు లేదు. ఈ క్లిష్ట సమయములో సమస్యలను పరిష్కరించి రాష్ట్రాన్ని ముందుకు తీసుకుపోయే బాధ్యత వుంది. తమరందరు పట్టుదలతో సహాయం చేయాలి. పవరు విషయములో కొంత డిఫెక్ట్ వుంది. ఉదయం రాజారాంగారు చెప్పారు. భారత్ హెవీ ఎలక్ట్రికల్స్ వారు మనకు యిచ్చినటువుంటి సెట్ అనుకున్న టైముకు ఫలితం యివ్వలేదు. జనరేటర్‌లో కొన్ని డిఫెక్ట్స్‌వల్ల యిబ్బంది కలిగింది. నిన్ననే నేను రాజారాంగారు రామచంద్రాపురం వెళ్లినప్పుడు జనరల్ మేనేజరుతో మాట్లాడాము. ఆయన చెప్పాడు, యిది మేము ఛాలెంజింగ్ టాస్క్‌గా తీసుకొని త్వరగా చేయడానికి మా స్టాఫ్‌ను అంతా పంపిస్తున్నాము. త్వరగా అవుతుంది అని చెప్పారు. రెండవది – ముఖ్యంగా వున్నటువంటి యిబ్బంది – మనకు మృగశిర కార్తెలో వర్షాలు పడక పోవటం. మన హైడల్ ప్రాజక్టు బలిమెల, మాచ్‌ఖండ్‌లలో వాటర్ లెవెల్స్ పడిపోవడం వల్ల కొంత యిబ్బంది గలిగింది. బాగా వర్షాలు కురిస్తే యిబ్బందులు తొలుగుతాయి. అయితే మీరు అడగవచ్చు. యిన్ని వుపన్యాసాలు చెబుతున్నారే. పరిశ్రమలు అన్నారు. మరొకటి అన్నారు. పవరు

లేకుండా పరిశ్రమలు ఎట్లా వస్తాయి అని. అందుకొరకే కొత్తగూడెం, లోయరు సీలేరుకు కావలసిన డబ్బు ప్లానులో యిచ్చారు. ఈ రెండు ప్రాజక్టులు పూర్తి చేసుకొని రాబోయో రెండు మూడు సంవత్సరాలలో పవరు యిబ్బంది లేకుండా తప్పించుకొని తరువాత శ్రీశైలం ప్రాజెక్టుకు ప్లానుకు అవుట్‌సైడ్ డబ్బుతీసికొని దానిని పూర్తిచేస్తే మనకు 770 మెగావాట్సు పవరు దీనిలో వస్తుంది. అందువల్ల యీ యిబ్బంది తొలగించ డానికి కేంద్రప్రభుత్వము మీద వత్తిడి తెస్తున్నాము. బహుశః యీ అయిదారు నెలలలో యీ యిబ్బంది నుండి బయటపడుతామనే నమ్మకం వుంది. అందువల్ల కొత్తగా వచ్చే పరిశ్రమలకు యిబ్బంది లేకుండా చేయగలుగు తామనే విశ్వాసం వుంది. పవరు ప్రాజక్టు విషయములో వుదయం గౌరవ సభ్యులు చాలా మంది మాట్లాడారు. దక్షిణ భారత దేశంలో సింగరేణి కాలరీస్ మన రాష్ట్రములో వుండడం మన అదృష్టం. అక్కడ వున్నటువంటి కోల్ డిపాజిట్సు చాలా హయ్యెస్టు డిపాజిట్సు. ఇప్పటివరకు 5 మిలియన్ల టన్స్ వుత్పత్తి చేస్తూ వుంటే, రాబోయే 5 సంవత్సరాలలో 12 మిలియన్ల టన్స్ వుత్పత్తి చేయటానికి మనము ప్లాను వేసుకున్నాము. కేంద్ర ప్రభుత్వము దీనికి కావలసిన రూ. 60కోట్ల డబ్బు యివ్వడానికి అంగీకరించింది. ఈ మధ్యనే అగ్రిమెంటు కూడా సైన్ అయింది. ఎక్స్‌ప్యాన్షన్ ప్రోగ్రాం ఎక్కువగా వెడుతుంది.

సూపర్ థర్మల్ స్టేషన్సు పూర్తిగా కేంద్రప్రభుత్వ పెట్టుబడితో ఏర్పాటు చేస్తారు. తరువాత రూరల్ ఎలక్ట్రిఫికేషను విషయంలో ఇబ్బందులున్నాయి. మనకు పవరు సప్లయి తక్కువగా ఉన్నందువలన కొత్తకనక్షన్సు కావాలంటే వాలంటరీ కంట్రిబ్యూషన్స్ కట్టాలని అన్నాము. ముఖ్యమయిన వ్యవసాయ మునకు, ఇండస్ట్రీస్‌కు కనక్షన్సు యివ్వాలని దీనికి కొంత కేటాయించాలని ప్రభుత్వం నిర్ణయించారు. ఈ రూరల్ ఎలక్ట్రిఫికేషనుకు కేంద్ర ప్రభుత్వం కూడా మన రాష్ట్రంలో క్లష్టర్ స్కీము శాంక్షను చేశారు. కొంత డబ్బు ఖర్చుచేసి ఇదివరకు అసలు లేని ప్రాంతాలకు శాంక్షను చేయాలని ఉంది. మనరాష్ట్రంలో ఇండస్ట్రీస్ పెట్టుకోడానికి ముందుకు వస్తున్నవారికి ఇన్‌సెంటివ్ ఇవ్వడానికి ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ కార్పొరేషనుద్వారా వారికి లాండు చూపించి యితర సౌకర్యాలు కల్పిస్తే బాగుంటుందని అనుకున్నాము. చాలా చోట్లనుంచి ఇతర రాష్ట్రాలనుంచి చాలా మంది ముందుకు వచ్చారు. ఇండస్ట్రీస్ హెచ్చుగా వస్తే మాకు లాభం కలుగు తుంది. చదువుకున్నవారికి చదువులేనివారికి కూడా ఎంప్లాయిమెంటు దొరుకుతుంది. సింగరేణి కాలరీస్ డెవలప్ అయినట్లయితే సుమారు 40 వేలమందికి ఉద్యోగావకాశాలు కలుగవచ్చు. సింగరేణి కాలరీస్ అధ్వర్యంలో, కేంద్రప్రభుత్వ ఆధ్వర్యంలో బెల్లంపల్లివద్ద పదికోట్ల రూపాయల ఖర్చుతో ప్రాజెక్టు

ప్రారంభిస్తున్నారు. కో-ఆపరేటివ్ సుగర్ ఫ్యాక్టరీ నిజాం సుగర్ ఫ్యాక్టరీ ఆధ్వర్యంలో ఏర్పాటు చేయాలని ఉంది. ఇప్పుడు గుంటూరు, ఒంగోలు లాంటి ప్రాంతాలలో ప్రత్తి ఎక్కువగా దొరికేచోట్ల టెక్స్‌టయిల్స్ మిల్సు ఏర్పాటు చేయాలనే ఉద్దేశం ఉంది. పేపరుమిల్లు కర్నూలులో పెట్టాలని లెటర్ ఆఫ్ ఇండెంటు వచ్చింది. భద్రాచలంలో ఒక ప్లాంటు ఏర్పాటు చేయడానికి లెటర్ ఆఫ్ ఇండెంటు వచ్చింది. మన తలసరి ఆదాయము మిగిలిన రాష్ట్రాలతో పోల్చిచూస్తే చాలా తక్కువ. మన రాష్ట్రప్రజలు ఎక్కువగా వ్యవసాయముపైననే ఆధారపడి వున్నారు. హరియానా, పంజాబు, మద్రాసు రాష్ట్రాలమాదిరిగా మనం వ్యవసాయముపయిన ఆధారపడి ఉన్న జనాభాలో **40** శాతం మందిని పరిశ్రమలవైపు వారి దృష్టి మళ్లించాలి. అప్పుడుకాని తలసరి ఆదాయం పెరగదు. చదువుకున్న వారికి చదువులేని వారికి అందరకూ ఉద్యోగావకాశాలు కల్పించాలి. తరువాత సెల్ఫ్ ఎంప్లాయిమెంటు విషయం చెప్పారు. సరీను గారు సర్టిఫికెట్సు ఇచ్చారు అన్నారు. బ్యాంకు వ్యవస్థలో మార్పులు ఇంకా రాలేదు. ఇల్లుకాని తలకాని తాకట్టుపెడితే గాని బ్యాంకు డబ్బు ఇవ్వడంలేదు. బ్యాంక్సు జాతీయం చేసినప్పటికివారి తత్వంలో ఇంకా మార్పురావాలి. సెల్ఫ్ ఎంప్లాయిమెంటు విషయంలో నాలుగువేలవరకూ లెటర్స్‌కు శాంక్షను ఇస్తే యీ రోజుకు రెండువేల పరిశ్రమలు స్థాపించి పని ప్రారంభిస్తారు. అప్పుడప్పుడు బ్యాంక్సుతో మాట్లాడి నిరుద్యోగులకు అప్పులు మంజూరు చేయాలనేవిషయం స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా ప్రసిడెంటుగారికి చెప్పాను. వారుకూడా సహకారం చేస్తామని అన్నారు. ఇబ్బందులున్నప్పటికి యీ కార్యక్రమం చేపడుతున్నాము. తరువాత కృష్ణాగోదావరి నీటి విషయంలో రాయలసీమ సభ్యులు చెప్పారు. శ్రీకృష్ణగారు కూడా చెప్పారు. ఆ విషయం ఇప్పుడు నేను చెప్పలేను. కృష్ణా అవార్డు, బచావత్ అవార్డు గురించి క్లారిఫికేషన్సు వచ్చినతరువాత అది పార్లమెంటులో టేబిలుపయిన పెట్టాలి. అంతవరకూ మనం ఏమీ చెప్పలేము. అది అయిన తరువాత ఏమి చేయాలో చూస్తాము. ముఖ్యమంత్రిగారు దీనిపయిన ఏమీ చెప్పలేదు అనవచ్చు సభ్యులు. పార్లమెంటులో టేబులుపయిన పెట్టేవరకూ ఏమీ చెప్పలేను. రాయలసీమకు కాని తెలంగాణాకు కాని ఎంతవరకూ లాభం చేకూరడానికి అవసరముందో అంతవరకై ప్రభుత్వం చేస్తూనే ఉంది. ఇందులో పక్షపాత వైఖరి ఏమాత్రం లేదు. శ్రీశైలము ఎక్కువగా ఉన్న నీరు కరువు కాటకాలున్న రాయలసీమ ప్రాంతాలకు తరలించాలని చెప్పారు. అలాగ హెచ్చుగా నీరు ఉంటె ఎస్టిమేటువేసుకుని చేసుకోవచ్చు. ఏమీ అన్యాయం జరగదు వరంగల్లుపట్టణమునకు చాలినంత మంచి నీరు లేదు అని చెప్పారు. వరంగల్లు తెలంగాణాకు ముఖ్యమైన పట్టణాలలో రెండవస్థానం ఉన్న పట్టణం. అచట మంచి నీరు సప్లయికాకపోతే భవిష్యత్తు

లేదన్నారు. ఈ ప్లానులో లోయరు మానేరు ప్రాజక్టుకు ఎనిమిది కోట్లు రూపాయలు ఖర్చు చేయాలని. యీ సంవత్సరము 50 లక్షలు రూ. లు శాంక్షను చేశారు. నాలుగయిదు సంవత్సరాలలో యీ ప్రాజక్టు పూర్తి చేసి వరంగల్లుకు సౌకర్యం కలుగచేయాలని నిర్ణయం తీసుకున్నాము.

శ్రీ యం. ఓంకార్ :- లోయరు మానేరు ప్రాజెక్టు సర్వే డివిజను వైండప్ అయినదని....

శ్రీ జె.వెంగళరావు :- నన్ను చెప్పనివ్వండి. ఆ కార్యక్రమం చేయాలని చూస్తున్నాము. లాండు రిఫారమ్సు విషయం చెప్పారు. ప్రభుత్వం వెనక్కి పోతోందన్నారు. ప్రభుత్వం ముందుకే పోతున్నది. కొంతమంది బడ్జెటు చదవకుండా చెప్పారు. క్రితం సంవత్సరం బడ్జెటులో ఉంది యీ సంవత్సరం లేదు అన్నారు. వోట్ ఆన్ అకౌంటులో ఒకకోటి రూపాయలు కేటాయించారు. అది ఇప్పుడుకూడా ఉంది. టోకెన్ గ్రాంట్ ఉంది. భూసంస్కరణల చట్టము అమలుచేయడానికి అమెండమెంటు కేంద్రప్రభుత్వమునకు పంపించారు. తొమ్మిదవ షెడ్యూలులో ఇంక్లూడుచేయాలని కేంద్రప్రభుత్వమునకు పంపించారు. క్రితంసారి కేంద్రప్రభుత్వం వారి ఎసెంటురాలేదు. నో కాన్ఫిడెన్సు మోషనువలన రాలేదు. అది రాగానే పరిశీలిస్తారు. మేము ముందుకంటె పదిమైళ్లు ముందుకు పోతున్నాము కాని వెనక్కుపోవడంలేదు. తరువాత ఎసైన్‌మెంట్ ఆఫ్ హరిజన్ సైటుసు అండ్ బంజరులాండ్సు గురించి చెప్పాలి. హరిజన సైట్స్ విషయంలో గత రెండు సంవత్సరాలుగా ఉన్నటువంటి ఇబ్బందులను తొలగించి ఈ సంవత్సరం ఓట్ ఆన్ అకౌంటు అప్పుడే బడ్జెటులో ఒక కోటి యాభై లక్షల రూపాయలు కేటాయించి సుమారు 40 లక్షల రూపాయలు వివిధ జిల్లా కలెక్టరులకు పంపించి ఈ కార్యక్రమం క్రాష్ ప్రోగ్రాంగా మొదలు పెట్టాలని చెప్పాను. అది అక్షరాల అమలు చేస్తున్నామని మనవిచేస్తున్నాను. చాలా జిల్లాలలో కలెక్టర్లు అప్పుడే డబ్బు ఖర్చుపెట్టి కొంత అడిగారు. ఇప్పుడే అప్పుడుదొరగారు ఒకమాట చెప్పారు. హరిజనులకు ఇళ్ల స్థలాలు ఇచ్చారు. అవి పంపిణీ చేయ లేదు. ఇళ్లు కట్టుకోడానికి డబ్బు యివ్వలేదని చెప్పారు. ముందు ఇళ్ల స్థలాలు ఇచ్చి వారికి ఎల్.ఐ.సి. నుంచి అప్పు తెచ్చి కొంత సహాయం చేయాలి. అందువల్ల ఈ సంవత్సరం, వచ్చే సంవత్సరం రాష్ట్రంలో హరిజనుల ఇళ్ల స్థలాల విషయంలో ప్రత్యేకమైన ప్రాముఖ్యత ఇచ్చి సాధ్యమైనంవతరకు ప్రతిపక్షాలకు మాట్లాడడానికి అవకాశం లేకుండా చేయాలని రాష్ట్రప్రభుత్వం పనిచేస్తుందని మనవిచేస్తున్నాను. బంజరు భూముల

పంపిణీ విషయంలో కూడా మనవి చేస్తున్నాను. బంజరు భూములు పంచి పెట్టనటు వంటి ప్రభుత్వం భూసంస్కరణలు ఎట్లా అమలు చేస్తుంది. వీరి దగ్గర భూముల ఎట్లా తీసుకుంటుందని చెబుతున్నారు కొంతమంది ప్రతిపక్ష సభ్యులు. సుమారు ఐదు లక్షల ఎకరాలు ఉన్నటువంటి బంజరు భూములన్నీ కూడా వివిధ జిల్లాలలో ప్రత్యేక సిబ్బందిని ఇచ్చి 5,6 మాసాలలోగా పంపిణీ చేసి పట్టాలు ఇవ్వాలనే నిర్ణయం తీసుకొన్నాము. అప్పుడే ఈ కార్యక్రమం జరుగుతున్నదని మనవిచేస్తున్నాను. మీరు ఒంకొక మాట మాట్లాడకుండా ఉండడానికి నేను జులై రెండవ తేదీనుంచి అన్ని జిల్లాల ఎమ్. ఎల్. ఏ.లను ఒక్కొక్క రోజున పిలచి ఆ జిల్లా కలెక్టరును ఇక్కడికి పిలిపించి డిపార్టుమెంటును కూర్చోపెట్టి ఏమి చేస్తున్నారో లేదో మీ ఎదుట అడగడానికి నేను ప్రోగ్రాం పెట్టాను. దయచేసి మీరు ఆ రోజున రండి. ఈ బంజరు భూముల పంపిణీ విషయంలో కాని, హరిజనుల ఇళ్ల స్థలాల విషయంలో కాని ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నది. ఇది అక్షరాల పనిచేసి చూపించాలనే ఉద్దేశ్యంతో రాష్ట్రప్రభుత్వం పని చేస్తున్నదని మనవి చేస్తున్నాను. ఫెర్టిలైజర్సు డిస్ట్రిబ్యూషను విషయం గౌరవసభ్యులు చాలామంది చెప్పారు. దీనివల్ల ఇబ్బందులు ఉన్న మాట నిజమే. బ్లాక్ మార్కెట్ జరిగిన మాట నిజమే. ఇప్పుడు గౌరవసభ్యులు శ్రీ వంకా సత్యనారాయణ గారు చెప్పినట్లు కొన్ని డిస్ట్రిక్టు మార్కెటింగు ఫెడరేషన్సు తప్పు చేసిన మాట నిజం. వీటన్నింటి మీద ఎంక్వయిరీ వేయడం జరిగింది. ఎవరైనా తప్పు చేస్తే వారిని వదలిపెట్టమని నేను మనవి చేస్తున్నాను. అందుకోసమే ఈ కో- ఆపరేటివ్ ఇన్‌స్టిట్యూషన్సు అన్నీ ఓవర్ ఆల్ చేయాలనే ఉద్దేశంతోనే వాటికి టైమ్ ఎక్స్టెన్షను ఇవ్వకుండా ఆఫీసరు ఇన్‌ఛార్జి వేసి గవర్నమెంటు కంట్రోలులోకి తీసుకొంది. దీనిని ప్రత్యేకంగా ప్రక్షాళన చేసి ఒక సంవత్సరం సరిచేసిన తరువాతనే ఎలక్షన్సు పెట్టాలని నిర్ణయం తీసుకొన్నది. ఈ రకంగా ప్రభుత్వం చేసిందని నేను మనవి చేస్తున్నాను. దీనిలో ఎప్పుడూ వెనుకాడలేదని కూడా నేను మనవి చేస్తున్నాను. ఇప్పుడు డిస్ట్రిబ్యూషన్ ఆఫ్ ఫెర్టిలైజర్సు గురించి మీకందరికి తెలుసు. మనకు అధికారం లేకపోయినా డిఫెన్సు ఆఫ్ ఇండియా రూల్సు ప్రకారం అధికారం తీసుకొని, కేంద్ర ప్రభుత్వం ఒప్పుకోనప్పటికి రాష్ట్ర ప్రభుత్వం ధైర్యం చేసి జూన్ ఒకటవతేదీనుంచి ప్రయివేటు డీలర్సు దగ్గరకూడా 100% తీసుకొనడానికి నిర్ణయం చేసి, కమిటీలు వేసి వివిధ స్థాయిలలో స్రక్రమంగా పంపిణీ చేయడానికి ప్రయత్నం చేస్తున్నాము. తప్పులు ఉంటే మీరు చెప్పండి. సరిచేసుకొనడానికి అభ్యంతరం లేదు. అది బాగా నడిచేటట్లు ప్రయత్నం చేద్దాము, మీరంతా సహాయం చేయాలని మనవి చేస్తున్నాను. కొంత మంది సభ్యులు వ్యవసాయాన్ని అభివృద్ధి చేయడానికి రాష్ట్రప్రభుత్వం ఏమీ కృషి చేయడం లేదని చెప్పారు. ఎక్స్టెన్షను సర్వీసుతో రైతులకు

రిస్టోర్ చేశారు. బందరులోను విజయవాడలోను రిస్టోర్ చేశారు. బందరులో జనరేటరుతో రిస్టోర్ చేసారు. ఎలక్ట్రిసిటీ బోర్డువారు ఇంత నష్టపడి కూడా బాగా పనిచేశారని మనవి చేస్తున్నాను. చాలా మంది రైతుల గురించి మాట్లాడారు. రైతులంటే మాకు చాలా సానుభూతి ఉంది. మేము వారిలో నుంచి వచ్చినవారమే. ఎఫెక్టెడ్ తాలూకాల్లకు రిమిషన్ వెంటనే డిక్లేర్ చేయడం జరిగింది. అంతమాత్రంచేత మిగతా చోట్ల రిమిషన్ కాదని కాదు. కమీషనర్లకు పవర్స్ ఇచ్చాము. కలెక్టర్లనుండి రిపోర్టులు వచ్చిన తరువాత ఏ తాలూకాలకు ఎట్లా చేయాలో కలెక్టర్లకు పవర్స్ ఇవ్వబడుతాయి. రిలీఫ్ ఆపరేషన్సు ఐపోయి నప్పటికి వారిని రిహాబిలిటేట్ చేయవలసిన పెద్ద బాధ్యత మనపై ఉంది. ముందు టెంపరరీ షెల్టర్లు చూపించాలి. తరువాత పర్మనెంటుగా రిహాబిలిటేట్ చేయాలి. ఈ కార్యక్రమాల్లో ప్రభుత్వం నిమగ్నమై ఉంది. టెంపరరీ షెల్టర్లు వేయడానికి సుమారు 27 లక్షల వెదుళ్లు ట్రాన్స్‌పోర్టు చేయడం జరిగింది. తాటాకులు ఇవ్వడం జరిగింది. ఆ ప్రాంతంలో సఫరైన విద్యార్థులకు స్కూలు ఫీజు, స్పెషల్ ఫీజు, ఎగ్జామినేషన్ ఫీజు, ప్రభుత్వానికి 50, 60 లక్షలు వచ్చేది పోయినప్పటికి, వారికి ఎగ్జెంప్షన్ ఇవ్వడం జరిగింది. అటువంటి నిర్ణయం తీసుకున్నామని మనవి చేస్తున్నాను. ఇందాక లక్ష్మణరావుగారు మాట్లాడినట్లు. ఇందులో ఎక్కువగా నష్టపడినవారు పేదవారు, పల్లెవారు, వీవర్స్ హరిజనులు, యాదవులు –

వీరందరి విషయంలో ప్రభుత్వం లీనియంట్ వ్యూ తీసుకున్నారు. రాష్ట్రప్రభుత్వం నష్టాన్ని భరించి నప్పటికి టైడల్ వేవ్ వచ్చిన ప్రాంతాలలో ఫిషర్మెన్‌కు బోట్లు, కాటమరాన్స్, నైలాన్ సెట్స్ ఏర్పాటు చేయాలని కార్యక్రమం చేసాము. 75 శాతం సబ్సిడీగాను మిగిలిన 25 శాతం లోన్‌గాను ఇచ్చివారికి ఈ సదుపాయము కలిగించాలనే ఉద్దేశంతో పిషరీస్ డెవలప్‌మెంట్ కార్పోరేషనువారిని కోరడం జరిగింది. బందరు, అవనిగడ్డ, చీరాల ప్రాంతాలలో వారికే ఈ పని అప్పగిస్తే ఈ లోపల వారికి కూలి దొరుకుతుందనే ఆలోచన ఉంది. దీనికి రెండు కోట్లు పైచిలుకు కర్చు అవుతుంది. ఐనప్పటికి నిర్ణయం తీసుకున్నాము. ఫిషర్మెన్‌లో ఎఫెక్టు ఐనవారు 40 వేలమంది వరకు ఉన్నారు, వీవర్స్‌లో 65 వేల మంది లూమ్సు పోగొట్టుకున్నారు. అటువంటి వారికి లూం రిపేర్‌కు రూ. 150లు, నూలుకు రూ. 100లు ఇవ్వాలని ప్రభుత్వ నిర్ణయం తీసుకున్నది. కరప్షన్ రాకుండా ఉండడానికి జిల్లా కలెక్టరుకే స్వయంగా ఇచ్చాం. లూమ్సు ఎఫెక్టు ఐన కేసులు ఎన్యుమరేట్ చేసి డిస్ట్రిబ్యూట్ చేయాలని నిర్ణయం తీసుకున్నాం. టైడల్ వేవ్ వచ్చిన ప్రాంతంలో 75 శాతం సబ్సిడీ, 25 శాతం లోన్, మిగతా చోట్ల 50 శాతం సబ్సిడీ, 50

శాతం లోన్ ఇవ్వాలని నిర్ణయం చేశాము. శ్రీ కృష్ణగారు మిగతావారు మాస్టర్ వీవర్స్ గురించి చెప్పారు. దానికీ కూడా ఒక స్కీము తయారు చేస్తున్నాము. హాండ్‌లూం డైరక్టరు ఆ కార్యక్రమం చేపట్టాలని చెప్పడం జరిగింది. అది తయారైన తరువాత అమలు చేయడం జరుగుతుంది. కమ్మరి, కుమ్మరి, వడ్రంగం, కాబ్లర్స్ వంటి ఆర్టిజాన్స్ ఉన్నారు. వారందరు పనిముట్లు కోల్పోయి వృత్తులు కోల్పోయినవారున్నారు. వారికి ఖాదీబోర్డు నుంచి లోన్స్ ఇస్తున్నారు అందుకు ఒక 50 లక్షలు ఇచ్చినారు. వారికి రూ.500 గ్రాంటుగాను 500 రూ.లు లోన్‌గాను దీర్ఘకాలిక వాయిదాలలో తీర్చుకునే పద్దతిలో రూ.1000లు అప్పు వారికి డిస్ట్రిబ్యూట్ చేయడం జరుగుతుంది.

అగ్రికల్చరిస్టుకి ఇప్పుడు యిచ్చిన లోన్స్ సరిపోలేదని చెప్పారు. దానికి కావలసిన డబ్బు యిచ్చే ఏర్పాటు చేయబడుతుంది. $33\ ^{1}/_{3}$, 25 పెర్సంటు సబ్సిడీ మీద మార్జినల్ ఫార్మర్స్‌కి లోను యివ్వాలని నిర్ణయము చేశాము. ఐ.యం.యస్. లోన్స్‌కూ కో ఆపరేటివ్ సెక్టారు సెంట్రల్ బ్యాంకు నుంచి యివ్వాలని నిర్ణయము తీసుకొన్నాము. అరటి తోటలు, తమలపాకుల తోటలవారికి యివ్వడానికి ఏర్పాటు చేశాము. బ్యారన్స్ కట్టుకొనడానికి, ఇల్లు కట్టుకొనడానికి, గొడ్లశాలలు కట్టుకొనడానికి. మామిడి తోటలు, నిమ్మతోటలు వేసుకొనడానికి అగ్రికల్చర్ డెవలప్‌మెంట్ బ్యాంకు నుంచి లాంగ్ టరమ్స్ లోన్స్ ఋప్పించడానికి ఏర్పాటు చేశాము. చవుడు వేసిన భూములు, ఇసుక మేట వేసిన భూములకు కొంత సబ్సిడీ యిచ్చి కొంత లోను క్రింద యివ్వాలని నిర్ణయము చేశాము.

కేంద్ర ప్రభుత్వము యిచ్చిన డబ్బు దేనికి ఎంత కేటాయించినది మనవి చేస్తాను.

Restoration of roads and bridges Rs. 10 crores ;

Restoraion of Public buildings Rs. 5 crores;

Restoration of Aided Schools and other Educational institutions 1.93 Crores, Reconstruction of irrigation works - Rs. 5 Crores; Reconstruction of Tidal Banks Rs. 6 Crores.

Restoration of Electrical installations of A P.S.E.B. Rs. 10 crores;

Restoration of Drinking water Rs.75 lacks;

Restoration of Municipal Property Rs. 1 1/2 Crores.

There is also provision for rehabilitation of weavers, artisans and handy capped fishermen; Construction of link roads. Rs. 50 lakhs; there is every detail here;

కాలువలకు పడిన గండ్లను పూడ్చి నీరు సప్లయి చేయడం జరిగింది. టైడల్ వేవ్‌ని దృష్టిలో పెట్టుకొని టైడల్ బ్యాంకు వేయవలసినదే. సి.పి.డబ్ల్యు.సి. సలహా తీసుకొని చేయాలని చెప్పడం జరిగింది. టెండర్సు పిలిచి చేస్తే ఆలస్య మవుతుంది. యిబ్బంది అవుతుందనే ఉద్దేశ్యంతో 5 లక్షల వరకు నామినేషన్ అధికారము చీఫ్ ఇంజనీర్లకు యివ్వడం జరిగింది. ఎలక్ట్రిసిటీ డిపార్టుమెంటుకి 20 కోట్లు నష్టము వచ్చినా 10 కోట్లు వారికి యిచ్చాము. రెస్టోరేషన్ ఆఫ్ డ్రింకింగ్ వాటర్ వెల్స్ 75 లక్షలు. రిపేర్స్ అండ్ రెస్టోరేషన్ ఆఫ్ మునిసిపల్ ప్రాపర్టీ డేమేజ్ దానికి ఒకటిన్నర కోట్లు యిచ్చాము. వీవర్స్‌కి ఏమిచేసినది ఇందాక మనవిచేసాను. ఆర్టిజాన్స్ చేతివృత్తుల వారికి కొంత చేశాము. ఫిషర్‌మన్‌కి ఏమి చేస్తున్నామో ఇందాక చెప్పాను. కన్‌స్ట్రక్షన్ ఆఫ్ లింక్ రోడ్స్ ఫర్ కోస్టల్ విలేజెస్ 50 లక్షలు. ఇది తక్కువే. దీనిపైన ఎక్కువ ఖర్చు పెట్టవలసిన అవసరం వుంది. పక్కా రోడ్స్ వేయవలసిన అవసరం వుంది. మనకు సీ కోస్టు ఎక్కువ వుంది. ఎంత చేసినా తక్కువే అవుతుంది. గ్రేసన్‌రిలీఫ్ క్రింద 6 కోట్లు యిచ్చాము. ఇప్పటికి 14 కోట్లు అయినది. 20 కోట్లు దాటిపోయింది. ఈ మొత్తము సరిపోదు అని మనవిచేస్తున్నాను. బందరు పోర్టుదగ్గర ఓపెన్ గోడౌన్స్ ఉన్నాయి. వాటి రిపేరుకు 50 లక్షలు ఇస్తున్నారు, ఆర్ఫనేజెస్ పెట్టాలని అన్నారు చాలామంది తల్లి తండ్రులను పోగొట్టుకోకుండా చూడాలనే ఉద్దేశ్యముతోనే అవనిగడ్డ దగ్గర వున్న పులిగడ్డ అక్విడెక్ట్ దగ్గర ఇర్రిగేషన్ డిపార్టుమెంటు లాండ్ వుంది. అక్కడ 20 లక్షలు ఖర్చుపెట్టి రెసిడెన్షియల్ స్కూల్ లాంటిది పెట్టి, భోజనము పెట్టి చదువు చెప్పించాలని చెప్పాము. ఆ విషయంలో ప్రొసీడ్ కావాలని చెప్పాము. పబ్లిక్ హెల్త్ వారికి కోటి రూపాయలు యివ్వడం జరిగింది. స్మాల్ ఫార్మర్సు వెజిటబుల్స్ అవి పెంచుకొనేవారికి, ప్రత్తి, చిల్లీస్ అవి వేసేవారికి ఫెర్టిలైజర్స్ సప్లయి చేయడానికి 2 కోట్లు యిచ్చాము. సీడ్స్ ఫర్ ప్యాడ్ అండ్ ఫాడర్, పల్సెస్‌కి 10 లక్షలు యివ్వడం జరిగింది. Subsidy for the Second Crop there is 25% Subsidy for Sec-

ond Crop Paddy and to Small and marginal farmers Reclamation to 50,000 acres and 50% help to Small mariginal farmers.

కేంద్రము యిచ్చిన 75 కోట్లలో 56 కోట్ల 5 లక్షలు క్యాష్ రూపములో వచ్చింది. 45 వేల టన్నుల రైస్, 45 వేల టన్నుల వీట్ వచ్చింది. అక్కడ నుంచి వచ్చిన డబ్బు ముందు ఖర్చుచేసి తరువాత అవసరమైతే కేంద్ర ప్రభుత్వాన్ని అడగాలనేది నిర్ణయం. కేంద్ర ప్రభుత్వము అడ్వాన్స్ ప్లాన్ అసిస్టెన్స్ పేరుతో యిచ్చారు. ఇచ్చినది తీసుకుని తరువాత మాట్లాడుదామని అనుకొన్నాము. లోన్‌ని అడిషనల్ అసిస్టెన్స్ క్రింద కన్వర్టు చేయాలని అడగడం జరిగింది. లాంగ్ టరమ్ మెజర్ క్రింద పక్కా ఇళ్లు కట్టాలని చాల ఫిలాంత్రిఫిక్ ఆర్గనైజేషన్స్ ముందుకు వస్తున్నవి. రామకృష్ణ మిషన్‌వారు 1000 ఇళ్లుకట్టాలని 25 లక్షలు యిస్తామన్నారు. మరొక 25 లక్షలు ముఖ్యమంత్రి రిలీఫ్ పండ్‌నుంచి మేచింగ్ గ్రాంట్ క్రింద యిస్తున్నాము. కాంక్రీట్ రూఫింగ్‌తో ఒక్కొక్క యిల్లు 5000 రూపాయలు ఖర్చుతో 1000 యిళ్లు కడతామని అన్నారు. వారికి 5 గ్రామాలు ఇచ్చాము. దానికి ఒక మాష్టర్ ప్లాన్ తయారుచేశాము. ఎవరైనా ఇళ్లు కడతా మంటే పలానా విలేజి యిచ్చాము అని చెబుతాము. తాతాస్ వచ్చారు ఒక విలేజి కడతామంటే సంగమేశ్వరం విలేజిని వారికి యిచ్చాము. ఒక షెల్టర్ కూడ కట్టడానికి ఒప్పుకున్నారు. అప్పుడే తాతాస్ ఇంజినీర్స్ అక్కడకు వెళ్లి పనిచేస్తున్నారు. సోమానిగారు ఒక విలేజి అడిగారు. వారికి యిచ్చాము. ఇండియన్ డిటొనేటర్స్ ఒక విలేజి అడాప్టు చేసుకొంటామన్నారు. బందరు, దివిలోనే కాకుండా బాపట్ల, రేపల్లే, చీరాల, ప్రాంతాలలోకూడా కొన్ని విలేజస్ వారిచేత కన్‌స్ట్రక్స్ చేయించాలని ఉద్దేశ్యము వుంది. తిరుపతి దేవస్థానము వారు 30 లక్షలు చీఫ్ మినిష్టరు రిలీఫ్ ఫండ్‌కి యిస్తామంటే రిలీఫ్ ఫండ్‌కి అక్కర్లేదు. 30 గ్రామాలలో వారి ఇంజనీర్స్‌చేత కళ్యాణ మండపాలు కట్టాలని చెప్పాము. 30 గ్రామాలలో కట్టడానికి వారిచేత ఒప్పించాము. దీవిలో 10 గ్రామాలు 5 గ్రామాలు బందరు ప్రాంతములో, 5 గ్రామాలు రేపల్లె ప్రాంతం, 5 గ్రామాలు బాపట్ల ప్రాంతం, 5 గ్రామాలు చీరాల ప్రాంతంలోను కట్టాలని నిర్ణయం తీసు కొన్నారు. వారి యింజనీర్లతో కట్టిస్తారు. ఇప్పటికి చీఫ్ మినిష్టరు రిలీఫ్ ఫండ్ 3 కోట్ల రూపాయలు దాటినది. ఇంటర్నేషనల్ రెడ్‌క్రాస్‌వారు 2 కోట్ల రూపాయలతో ఇండ్లు కట్టటానికి పర్మెనెంట్ రిహాబిలిటేషన్ ఖర్చు పెడతామని చెప్పారు. అయితే వారొక మాట చెప్పారు. మేము ఎంత ఖర్చు పెడతామో అంత అమౌంట్ మీరు చీఫ్ మినిష్టర్ రిలీఫ్ ఫండ్ నుండి మ్యాచింగ్ గ్రాంట్‌గా ఇవ్వవలసిందని కోరారు. మేము ఇవ్వటానికి అంగీకరించాము. మొత్తం 4 కోట్ల రూపాయలతో వారు కొన్ని గ్రామాలు

తీసుకొని ఒక్క దివి తాలూకాలోనే కాకుండా బందరు తాలూకాలో రేపల్లె తాలూకాలో, బాపట్ల తాలూకాలో, చీరాల తాలూకాల్లో సీకోస్ట్ వెంటవున్న గ్రామాలలో పర్మనెంట్ రిహాబిలిటేషన్‌గా పక్కా హౌసెస్ విత్ కాంక్రీట్ రూఫ్ అండ్ వాల్స్ వారి డిజైన్‌తో, వారి ఇంజనీర్స్‌తో కట్టిస్తున్నారు. వారికి ఒక మాస్టర్ ప్లాన్ తయారు చేసి, వారికి కో ఆర్డినేషన్‌గా ఒక స్పెషల్ కమీషనర్‌ను వేసి ఏ ఏ గ్రామాలు చేయాలో తెలిపాము. అప్పుడే రామకృష్ణమిషన్‌వారు ప్రారంభించారు. మిగిలినవారు ప్రారంభించ బోతున్నారు. కేర్ సంస్థ వారు బాగా సహాయము చేశారు. ఇతర సంస్థలు, యునిసెఫ్‌వారు బాగా సహాయము చేశారు. సలైన్ వచ్చిన భూములను సైంటిస్ట్‌కు అప్పగించాము. 50 వేల ఎకరాల వరకు వుంటుందని అంచనా వేశాము. సాండ్ కాస్ట్ లాండ్స్‌ను బుల్‌డోజర్స్‌తో బాగు చేసి రైతులకు రెండో పంటకు నీరు ఇచ్చి, ఇన్‌పుట్స్ ఇచ్చి వారిని మళ్లీ ఎట్లా మనుష్యులుగా చేయాలో అన్ని విధాలా ప్రభుత్వము శ్రద్ధ తీసుకొని చేస్తుంది. ఆపద సమయములో ప్రభుత్వం మా వెంట వుంది. ప్రభుత్వం మమ్మలను మరచిపోలేదు అనే ఆత్మ విశ్వాసం వారిలో కలుగచేయాలి. మీకు చాలా నష్టం కలిగింది. చనిపోయినవారిని ఎలాగూ బ్రతికించలేము కాని ప్రభుత్వం మీకు కావలసిన సహాయం చేయటానికి సిద్ధంగా వుంది. ప్రభుత్వం మీ వెంట వుంది, అనే హామీ వారికి నేను ఇచ్చాను. ప్రభుత్వం శక్తి వంచన లేకుండా, నిజాయితీతో ఈ సమస్యను ఎదుర్కోవడమే కాకుండా శాశ్వత పరిష్కారమార్గం చూచి వారిని తిరిగి మనుష్యులుగా చేసి వారి కుటుంబాలకు సహాయము చేయాలని కృతనిశ్చయముతో ప్రభుత్వం వుందని మనవి చేస్తున్నాను. ప్రధానమంత్రి మొరార్జీగారికి కొంతమంది రిపోర్టు చేశారు. స్టేటు గవర్నమెంటు పాపులారిటి కోసం, ఎన్నికలు దగ్గర పడుతున్నాయని బాగా ఖర్చు పెడుతున్నది అని వారికి కంప్లయింట్ చేశారు. మొరార్జీగారు నన్ను అడిగారు. ఒక ప్రక్క డబ్బు సరిగా ఇవ్వలేదంటున్నారు, మరొక ప్రక్క ఎక్కువ ఇస్తున్నారని కంప్లయింట్ చేస్తున్నారు. ఇది కరెక్ట్ కాదు. మీ ఇష్టం వచ్చిన వారిని పంపి ఎంక్వయిరీ చేయించండి అని వారికి నేను చెప్పాను. వారి మీద నాకు విశ్వాసం వుంది. మనసులో ఏదీ వున్నా ముఖం మీద అడిగే మనిషి వారు. వారు నన్ను అడిగినప్పుడు మీకు ఫాల్స్ ఇంప్రెషన్ కలుగచేయడానికి అట్లా చెప్పివుండ వచ్చును. మీరు నమ్మవద్దు అని నేను చెపితే వారు అంగీకరించారు. మన రాష్ట్ర ప్రభుత్వం ఫెయిల్ కాలేదు, మన మెషినరి ఫెయిల్ కాలేదు. నా డ్యూటీని నేను సక్రమంగా సకాలంలో నెరవేర్చాను. విమర్శ చేసేవారు ఎప్పుడూ ఉంటారు కనుక వారి గురించి నేను ఏమీ చెప్పలేనని మనవిచేస్తూ సెలవు తీసుకుంటున్నాను.

# అనుబంధం : 4

## STATEMENT ON
## THE BREACH TO THE GODAVARI ANICUT
## AT DOWLAISWARAM

***Story of the Existing Anicut :***

The existing anicut across Godavari at Dowlaiswaram was constructed in 1847-1852 by Sir Arthur Cotton. Before the construction of the anicut, irrigation to a limited extent was carried out through channels taking off directly from the river Naturally, due to wide situations in the river levels and the absence of proper regulation, the supplies of water were not dependable and the commanded area was limited This area was subject to disastrous famines and precarious living. In the wake of one such famine, the East India Company directed Sir Arthur Cotton to suggest permanent measures to stop these recurrent famines. After examining various alternatives, he proposed the construction of the anicut at the present location which facilitates irrigation of the central delta also The East India Company approved the proposals and authorised Sir Arthur Cotton to proceed with the work in 1846 The anicut was built in 4 different sections spinning across the islands (Bobbar Lanka, Pitchika Lanka, and Maddur Lanka) The total length of the anicut is $2^1/_2$ miles as against 4 miles of river width at this place from bank to bank including the islands.

***The Existing Structure :***

The structure is founded on two rows of wells 6'-0' diameter 6'-0 apart constructed in brick wedge shaped in clay and taken down 10+17.25 and + 16.00 respectively in 3 anicuts, Dowliswaram, Maddur and Visveswaram In the case of Ralli anicut however, the wells are stopped at + 22 00 over dumped rubble

The body wall of the anicut is built to a level of + 38 00 front row of wells are 6'-0 high with their top at + 23.25' and above thaht rubble masonry wall is constructed to the bottom of the anicut body wall The body wall of the anicut proper consists of rubble masonry 5-0 thick finished off with 3'-00 thick cutstons masonry The slooping glacis consists of 5'-0 thick rubble masonry finished off with 1'-00 thick cutstone. Rear toe of the body wall rests on a row of well 6'-0" deep and the glacis level at the end of the apron varies between +29.20' to + 29.87' in the 4 anicuts

***Improvement to the Anicut :***

In course of time, the area under irrigation went on increasing and it was found that with the existing pond level of +38.00', sufficient water could not be drawn into the canals. The anicut crest was raised to + 38 75' and 2'-0 falling shutters were installed Even this was found later to be inadequate to meet the growing demands and finally, 3 ft. high shutters were installed in 1936 thus bringing the pond level to +41.75'. The anicut was also used till recently as a highway for limited traffic during summer months when the river stops overflowing With the construction of a bridge for the National Highway across Godavari this practice is no longer in vogue

***Present condition of the Anicut :***

Owing to the increase in the pond level from +38.00' to +41.75' the structure had been subjected to increased uplift pressure and steeper exist gradients than those originally contemplated.

The structure was constructed over 120 years ago and the gradual decay and deterioration coupled with the extra strain owing to the increase in pond level, have conspicuously weakened the anicut The model experiments conducted by P W D., Poondy, Madrps, several years back, revealed that the downstream flooor levels are inadequate for the formation of the hydraulic jump and therefore shooting flows are persisting. This has led to heavy scours and movements of the supporting material below the anicut. Formation of cavities was also suspected. This was established by the electrical resistivity tests conducted by the Director, CW & PC (Central Water and Power Commission) in the year 1961. These activities have been verified by actually breaking open the suspected spots in the body walls. The structure was found to be unsafe against the existing gradients now prevailing which are as steep as 1/3 5 against the normally permissible exist gradient of 1/5

***Damage in 1963:***

After the floods in 1963, gabs as wide as 1'-6" were observed between the walls at the downstream end of the anicut. This resulted in the load being transmitted directly to the wells as the supporting subsoil had been washed out. There are also extensive scours in the aprons of Ralli anicut which had become the weakest portion in the whole anicut Some of the wells have also bucked and the crushing of brick masonry was clearly observed. These damages were, however, patched up and repaired and an additional row of sheet piles driven to the maximum scour depth for temporary relief A detailed analysis of the damages in 1963 revealed a grim picture as given below and shows that the failure of the anicut at one place or the other had become imminent

1 Downstream cut-off has ineffective due to wide gaps existing between the wells.

2. A repetition of the damage in 1963 very near the body wall may lead to the ultimate collapse of the structure.

3. The walls constructed in brick-in-mud, due to prolonged submersion have lost their strength and have started buckling and threatening to collapse

***Measures taken to meet the situation - Mitra Commitee :***

In view of the above, the Government of India constituted in 1965 an expert committee to go into all aspects and suggest measures to protect and ensure the existing extensive irrigation under the Godavari Anicut

After detailed examination, the expert committee headed by Sri A C Mitra, gave its report in 1965. It categorically ruled out the possibility of repairing the existing structure as a permanent solution for the following reasons ·

(a) The structure is over 120 years old and has started showing signs of decay and deterioration and cavities have formed and the brick masonry of the wells has buckled and is even getting crushed There is no possibility of repairing this damage and the present structure should be deemed to have outlived its utility and may fail any time.

(b) The hydraulic jump does not form within the impervious apron and the apron lengths are inadequate for the dissipation of energy Hence, shooting flows exist and re-

curring scours have become regular, the structure in its present stage cannot be improved as a lasting solution

(c) Apart from this, owing to the increase in irrigated area to 10,00,000 acres, the present pond level is found inadequate for supply of water in the transplantation period resulting in late transplantation and poor crop yields There is no prospect of building up the pond level further with the present structure already on the verge of collapse. It was therefore felt imperative to have a separate safe and independent structure to cater to the present day requirements

Originally the anicut was expected to serve an irrigable area of 1,61,874 hectares (4,00,000 acres) in the adjoining silt - laden deltaic tracts, The scheme proved so successful that by 1936 the ayacut under this system expanded beyond all expectations to 4,04,686 hectares (10,00,000 acres) Except for about 20,000 hectares (50,000 acres) of ayacut utilised for growing sugar-cane, the rest of the ayacut is used for growing paddy. In addition, a second crop of paddy is also raised in 1,42,000 hectares (3,50,000 acres) and the total annual cropped area is 5,46,000 hectares (13,50,000 acres) without counting minor yield on catch crops or green pastures of short duration in the Rabi Season In order to sustain this ayacut, there has been a continued trend to maintain higher pond levels by the installation of shutters which, incourse of time, undermined the structure.

A new Godavari Barrage was, therefore, suggested by the expert committee (Mitra Committee) in place of this existing very old structure which has been showing signs of distress (as mentioned earlier) just upstream of the present line of the anicut, to continue to sevar to the needs of 4,00,000 hectares (10,00,000 acres) of irrigable area which would otherwise go dry in the event of the total failure of the anicut

***The New Barrage Project :***

In the light of the above plans were drawn up for the construction of a new Barrage, The Project was santioned by the Government of Andhra Pradesh in December, 1969 at an estimated cost of Rs 26.89 crores The project envisages the construction of a Barrage with four arms corresponding to the four arms of the existing anicut The Barrage is to be located *24 metres upstream of the old weir and will use the existing weir as its downstream protective apron The barrage will be about 3,600 metres long and will be divided into 175 bays, each equippped with a spilway gate as detailed below

| | Metres | No of Bays |
|---|---|---|
| Dowlaishwaram Section | 1,438 | 70 |
| Ralli Section | 884 | 43 |
| Maddur Section | 470 | 23 |
| Vizzeswaram Section | 801 | 39 |
| | 3,593 | 175 |

**Financing of the New Project-Betterment Levy :**

The new Godavari Barrage Project could not be fully accommodated in the IV Five-Year Plan of the State In December, 1971, the Planning commission gave clearance to the Project They also suggested that the State Government may raise rural debentures / Advance Betterment Levy from the area benefited It was further suggested that both the resources and the outlay may be matched and shown in the Plan as no other resources would be available for this project

Technically speaking, the central line of the New Barrage is 40 54 metres from the front face of the existing anicut.

The ryots in the area offered to give Advance Betterment Contribution. A notification was issued by the Government for collection of Advance Betterment Contribution from the beneficiaries of the Godavari Barrage Project at the rate of Rs.50 per acre collectable in five equal and consecutive annual instalments. while issuing the notification, it was assumed that a sum of Rs.5 crores could be realised from the beneficiaries in the ayacut of about 10 lakh acres under the Project in five instalments. An amount of Rs 4.06 crores has been realised from the beneficieries to the end of June, 1976

**Execution of Godavari Barrage Pro ect-Early Phase :**

It was originally programmed to complete the entire Barrage in the four arms in seven seasons Accordingly, a programme was prepared As the ralli arm of Godavari Anicut was considered to be the weakest of the four anicuts, the work on this branch was taken up first in 1970-71

Tenders were called for seperately for the main work and coffer dam and they were awarded to M/s Pioneer Engineering syndicate for the following amounts -

| Name of work | | Control amount |
|---|---|---|
| | | Rs |
| Ralli Barrage Works | .. | 2,36,46,260 |
| Coffer Dam | .. | 28,99,800 |

The tender specified completion of work in 6 quarters, commencing from the date of handing over the site. The site was handed over to the contractor in December, 1971 Before finalising the tenders, as well as after finalisation of tenders, certain changes were found necessary and were made by the Central Water and Power Commission. The contractor did part of the work The contract was terminated in 1975 and the balance work has been entrusted to M/s National projects Construction Corporation,

***World Bank Assistance :***

At a meeting in April, 1974 by the officers of the Central Water and Power Commission and the Government of India with the officials of the International Bank for Reconstruction and Development (BRD) at New Delhi, the question of posing the Godavari Barrage project for World Bank assistance was considered Following that meeting Mr. Campbell of the World Bank visited the Godavari Barrage Project in May, 1974 A meeting of the world Bank Misson on Godavari Barrage was also held at Delhi in June, 1974. The Mission also arrived at Hyderabad on 11th June, 1974 and proceeded to Dowlaiswaram for inspection on the 13th and 14th. The officials of the Mission held preliminary discussions with the State officials of the Public Works Department After negotiotions and after a full appreciation of the position, the International Development Association (World Bank) agreed to give loan assistance of 45 Million U S Dollars for the Project and the agreement in this regard was signed on 7th March, 1975

***Execution of the Godavari Barrage Project - Later Phase :***

According to the time schedule contemplated by the World Bank the entire Project was to be completed in 4-5 working seasons Following the signing of the agreement with the World Bank and in accordance with the normal proceedure for World Bank assisted

projects global tenders were invited in June 1975 for the civil works comprising : the construction of a barrage across three branches of the Godavari river, namely, the Dowlaishwaram, Maddur, and Vizzeswaram branches and the completion of the construction of a barrage on the fourth branch, viz,the Ralli including road bridge across the entire barrage. In consultation with the World Bank and the Government of India, the contract for civil works and awarded to the National Projects Construction Corporation Ltd , New Delhi, it being the lowest confirming bidder, at a contract value of Rs.1821.82 lakhs, Work on the Barrage was commenced from December 1975 by the National Projects Construction Corporation.

Besides the Civil Works Tender, a seperate Global Tender was floated for manufacture, supply and erection of crest gates etc, for the four branches of the Godavari Barrage covering the following item of work .-

(i) Fabrication and erection of embedded metal parts in 132 bays (excluding Ralli Section)

(ii) Fabrication and erection of 175 Nos. fixed wheel spillway gates 18.39 m x 3.45 m (60' x 11').

(iii) Fabrication and Erection of power operated suitable hoists for operation of 175 gates.

(iv) Fabrication and erection of embedded metal parts for stoplog gates 18 39m x 3 65 m (60' x 11')

(v) The manufacture and erection of gates etc, should synchronise with the civil works in progress from time to time and completed within a period of $3^1/_2$ years i e, before June. 1979

The contract was eventually awarded to M/s, Jessops & Co, Ltd, Calcutta.

The work done so far on the Godavari Barrage Project may be summed up as follows :

Dowlaiswaram Arm Out of 70 spans, 9 spans were completed so far leaving a balance of 61 spans to be completed

Ralli Arm The work is nearing completion,

Vizzeswaram Arm · Only a part of the left aboutment could be done

Maddur Arm . Work on this arm is yet to be started.

Expenditure incurred on Godavari Barrage Project - Yearwise

The Yearly expenditure incurred on the Project so far is indicated below .

1969-70-Rs 11.813 lakhs,

1970-71-Rs.75 044 lakhs,

1971-72-Rs.95 434 lakhs

1972-73-Rs 69 939 lakhs

1973-74-Rs 93.417 lakhs

1974-75-Rs 213 550 lakhs

1975-76-Rs. 638.898 lakhs

Total · Rs 1265 013 lakhs

1976-77 Provision in Plan - Rs.11.00 crores

The project has been included in the State V Plan and in 1975-76 the State Government was able to secure additional Central atsistance over and above the Plan provision for the Project.

***Dowlaiswaram Breach :***

On the night between 8th and 9th July, 1976 the Dowlaiswaram arm of the old anicut had breached. The breach is 490 wide The First member, Board of Revenue, was requested to proceed to the site immediately, take charge of the situation and to take all necessary effective steps in respect of attending to the immediate repair to the breach at Dowlaiswaram He was given full powers by the government to take all necessary action in this regard

The Chief Minister visited the site on the morning of 10th July, 1976 and personnaly supervised the arrangements initiated for containing the breach during the next two days

The engineers of the Central Water Commission and Members of the Experts Committee, formed earlier to advice on the construction of the new Godavari Barrage Project, also rushed, to the spot and inspected the site for three to four days and gave their valuable advise and help in the supervision of the operation Dr K L.Rao former Union Minister, Irrigation and Power also visited the site and gave his valuable suggestions The army, the Navy and the Air Force have also responded readily to our call for assistance

In the first few days the effect of the breach reduced the pond level and while the flow into the western delta and the central delta was some what reduced, in so far as the eastern delta was concerned, no water was flowing into the canal.

Government action, therefore, centered on achieving two major objectives viz

(a) Containment of the breach and its closure : and

(b) Safeguarding of the cultivation

**Breach Closing Operation :**

The operations in connection with the breach comprise .

(i) Strengthening the eastern and western lips of the breach in Dowlaiswaram Anicut by bumping stones of sufficient weight to prevent its widening. This is possible whenever the anicut does not overflow

(ii) Filling up the breach, which is estimated, as per soundings taken a few days ago, about 40 feet deep in certain places, Various measures have been considered and will be implemented as soon as the floods recede.

Government have rushed to site the required tippers, lorries and cranes and also made arrangements to quary stones from nearby quarries. Government also arranged with the help of Railways to rush stones through special goods-trains from Visakhapatnām where these were readily available. Operations were started from both ends and the right and left lips of the breach were strengthened by dumping huge quantities, of stone and rubble.

Following the arrival of heavy floods and the consequent overflowing over the

Dowlaiswaram anicut, breach-closing operations had to be suspended on the 14th July, but with the subsequent fall in the water level, the work has been resumed - It has been observed that the strengthened lips of the breach have been able to withstand the first floods

***Safeguarding of cultivation :***

Experience so far leads to the assessment that inspite of the breach it may be possible to maintain more or less adequate flows to the western and central deltas. curtailment of flows may, however, be expected to the eastern delta Even here while there is no flow immediately after the breach following the removal of certain rock obstruction at the mouth of the channel and the rise in the pond level following the receipt of floods, the canal feeding the eastern delta began to draw about 1000 cusees The strategy for safeguarding the cultivation particularly in the eastern delta comprises -

(a) pumping of river water into the main irrigation canals feeding the eastern delta

(b) adoption of turn system by farmers for irrigation

(c) Supplementation of canal water by pumping water from drains and exploitation of ground water through filter points.

In pursuance of the above objectives the following action has been taken

(a) A massive mobilisation of heavy duty pump sets has been organised Pumps with a total capacity of over 500 cusecs have been diverted to the site from other areas and are being installed close to the left abutment of the Dowlaiswaram anicut to pump water into the main canal feeding the eastern delta as and when the natural flows in the river go down in the next four months Steps to augment further the pumping capacity have also been taken and it is expected that the Departmnt would b able to deploy a total pumping capacity of around 1000 cusecs for pumping water into the irrigation canals Simultaneously, the Electricity Board has taken steps for installation of a substation for supply of the needed power to operate the pump sets

(b) The Collector of East godavari has already initiated arrangement for introducing a turn system in the use of water for irrigation in the eastern delta

(c) Government have issued orders permitting the farmers freely to pump out water from the drains for the purpose of irrigating their fields and have made it clear that prior permission from the Irrigation Department Authorities need not be taken for this purpose The Government have also dinected the Electricity Board to take Immediate steps for the supply of Power wherever technically feasible to such pump sets without insisting on any voluntary contribution and at 50 percent of the normal tariff rates during the current season There are already a large number of filter points in the Godavari delta and there is great scope for exploiting ground water availability to supplement surface flows Authorisation has been given for the grant of loans at the rate of Rs 3500 per farmer under taccavi for purchase of 5 HP Diesel electric motor pump sets for sinking new filter point wells and an amount of Rs 5 lakhs has been released for this purpose by the Board of Revenue in favour of the Collector, East Godavari, as a first instalment The electricity tariff rate in respect of filter point will also be reduced by 50 percent in the Godavari delta during the current season.

About one lakh acres has been transplanted in the Eastern delta so far. Transplantation in the central and western deltas is also progressing well in view of the good rains received during the last ten days Following the receipt of floods and the rise in the

pond level the canal feeding the eastern delta has been drawing around 1000 cusecs while supplies to the Central and Western deltas have been near normal.

**Acceleration of the completion of the Godavari Barrage:**

While all necessary steps would be taken for the closure of the breach in the Godavari anicut the greatest importance will now have to be attached to accelerating the completion of the Godavari Barrage Project, so that the risk to the estensive cultivation in the Godavari delta is once for all eliminated The Government have accordingly decided that all steps should be taken for ensuring that the bulk of the Project is completed by June 1977 and full protection to irrigation accorded by then Towards this end a special committee has been set up headed by the Chief Secretary to recommend all such measures as may be necessary for completing the work in accordance with the accelerate time-schedule

**J.VENGALA RAO,**

Chief Minister.

**శ్రీ జె.వెంగళరావు :-** అధ్యక్షా, గోదావరి ఆనకట్టకు గండి పడిన సందర్భముగా జరిగిన చర్చలో గౌరవ సభ్యులు తమ ఆందోళనను వ్యక్తము చేశారు. సభ్యులు ఎంత ఆందోళనతో వున్నారో అంత కంటె ఎక్కువ ఆందోళన ప్రభుత్వానికి వుందని మనవి చేస్తున్నాను. దీనిని సర్ ఆర్థర్ కాటన్ 130 సం.ల క్రితము కట్టారు. కాటన్ ప్రభుత్వ ఉద్యోగి, గొప్ప ఏమీ లేదు అని సి.వి.కే రావుగారు చెప్పినప్పటికి కాటన్ దొరకు ఆంధ్రులు ఎంతో ఋణపడివున్నారని చెప్పకతప్పదు, మహానుభావుడు అప్పటిగవర్నమెంటుని వ్యతిరేకించి సాహసముతో ఈ నిర్మాణమును చేశారు. మనము ఎప్పటికి మరచిపోలేము, మరచిపోతే కృతఘ్నుల మవుతాము. కృష్ణా, గోదావరి ఆనకట్టలే ఆంధ్రదేశము పచ్చగా వుండడానికి కారణమయినవి. నాగార్జునసాగర్, పోచంపాడు ప్రాజక్టులను మనము ఇప్పుడు కడుతున్నాము. దాని ఫలితాలు రావలసివున్నాయి. గోదావరి, కృష్ణా నదులకు ఆనకట్టను కట్టి తద్వారా 25 లక్షల ఎకరాలకు అస్యూర్డ్ వాటర్ సప్లయి వుండుటవల్లనే మన రాష్ట్రము ఈ మాత్రము నిలువగలిగినది. గోదావరి డెల్టాచాల రిచ్ డెల్టా, కృష్ణా డెల్టా కన్న గోదావరి డెల్టా చాల పండించే డెల్టా. దేశములోనే పెద్ద ధాన్యాగార ప్రాంతము అది. అటువంటి ఆనకట్టకు గండి పడడము అంటే నేషనల్ కెలామిటిగా ట్రీట్ చేయవలసిన అవసరం వుంది. ఈ విషయంలో ప్రభుత్వం ఏ మాత్రం అశ్రద్ధతో లేదు. ఎక్కడ లోపము వున్నదో ఎంక్వయిరీ చేయాలని చాలా మందిచెప్పారు. ఎవరి మీద ఎంక్వయిరీ చేస్తాము? ప్రభుత్వము మీదనే ఎంక్వయిరీ చేయాలి. ఆఫీసర్స్ తమ రిపోర్టులు యిస్తున్నారు. రాష్ట్ర ఆర్థిక పరిస్థితి బాగా లేక మనము దానిపైన ఎక్కువ డబ్బు ఖర్చుపెట్టలేక పోయాము. ఈ ప్రాజెక్టుపైన ఎంత డబ్బు అయినదీ స్టేటుమెంటులో యిచ్చాను. రైతులనుంచి ఎంత వసూలు చేశారు? ఎంత ఖర్చు పెట్టాము అంటే కొన్ని సంవత్సరముల వరకు కోటి రూపాయలు యింకా ఎక్కువ ఖర్చు పెట్టాము. మన రాష్ట్ర వార్షిక ప్రణాళిక బాగా లేక, ఆర్థిక పరిస్థితి బాగా లేక కట్టవలసిన టైములో కట్టలేదు. ఎంక్వయిరీ కమిటీ ఎందుకు? కామన్‌సెన్స్ వున్న ప్రతివారు చెబుతారు. నేను కూడా ఇక్కడ చెప్పాను. రికార్డు తెప్పించి చూడండి. ఎప్పుడైనా బ్రీచ్ అయ్యే ప్రమాదము వుంది. గోదావరి డెల్టా దెబ్బ తింటుంది. వరల్డ్ బ్యాంక్ ఎయిడ్ తీసుకొనడానికి ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకొంటున్నామని చెప్పాను. మిత్రా కమిటి కాని ఎక్స్‌పర్ట్ కమిటీ కాని అక్కర్లేదు, కామన్ సెన్స్ వున్న ప్రతి వారు చెబుతారు. దాని లైఫ్ 100 సంవత్సరాలు అన్నప్పుడు 130 సం.లు అయిపోతే ఎప్పుడో అప్పుడు బ్రీచ్ కాకుండా ఎట్లా వుంటుంది? ఎన్ని చేసినా ప్రయోజనము వుండదు అని మిత్రా కమిటి వారు చెప్పారు. వరల్డ్ బ్యాంకు అప్రైజల్ కమిటీలో చెప్పారు. ఎవరు పడితే వారు చెప్పారు. ఇంజనీర్లు కావాలా దీనిని చెప్పడానికి . కామన్ సెన్స్ వున్నవారు

చెబుతారు. గండిపడిన చోటకు వెళ్లి చూస్తే ఇన్ని సంవత్సరములు ఎట్లా వుంది అనే ఆశ్చర్యము కలుగుతుంది. ఇన్ని సంవత్సరములు ఎట్లా నీరు సప్లయి చేసినది అనే ఆలోచన వస్తుంది. దీనికి ఎక్స్‌పర్ట్సు కమిటి అక్కర్లేదు. దాని లైఫ్ **100** సం.లు అంటే **130** సం.లు వుంది. దానిపైన మనం రూపాయి ఖర్చు పెట్లేదు. మన రాష్ట్ర ఆర్థికపరిస్థితే దానికి కారణం. వ్యక్తులమీద నింద వేస్తే లాభాం లేదు. ఇది 5వ ప్రణాళికలో ఇన్‌క్లూడ్ కాలేదు. నేను ముఖ్యమంత్రి బాధ్యతను తీసుకొన్న తరువాత కేంద్రములో ప్లానింగు మంత్రిగా వున్న డి.పి. ధార్ గారితో చెప్పి ఇన్‌క్లూడ్ చేయించాను. వరల్డుబ్యాంక్ ఎయిడ్ రాకపోతే క్రితం సంవత్సరం బడ్జెటులో రు.7 కోట్లు యిచ్చాము. వరల్డు బ్యాంకు ఎయిడ్ వచ్చిన తరువాత ఈ సంవత్సరం ఎక్కువ డబ్బును ఖర్చు పెడుతున్నాము. ఈ ప్రాజెక్టు ఆంధ్రదేశానికే కాదు, భారతదేశానికి ప్రాణ ప్రదమైనది. ఈ ప్రాజెక్టును కట్టితీరాలనే పట్టుదలతో ప్రభుత్వం కృషి చేస్తున్నది. కుడిపూడి ప్రభాకరరావుగారు డౌట్ వెలిబుచ్చారు. నేను కూడ అక్కడకు వెళ్లి చూశాను. నాకుకూడా ఈ డౌట్ వచ్చింది. ఆఫీసర్లతో మాట్లాడాను. కాఫర్ డాం ఒక్క చోట కట్ చేయడం వల్ల, ఇంజనీర్స్ శ్రద్ధ తీసుకొనకపోవడం వల్ల బ్రీచ్ అయినదని ప్రభాకరరావుగారు చెప్పినది సరియైనది కాదు. సూపరింటెండింగు ఇంజనీరు రాజుగారు వున్నారు, కట్ చేసినప్పుడు పాండ్ లెవెల్ పూర్తిగా వుంది. గేట్స్ మీద 3 అంగుళాల వాటరు ఓవర్ ఫ్లో అవుతున్నది. ప్రభాకరరావుగారు చెప్పినది కరక్టు కాదు. రాష్ట్ర ప్రభుత్వ అశక్తత తప్ప ఉద్యోగులను బలిచేయడానికి ఒప్పుకొనలేము. ఉద్యోగులు డబ్బు యిస్తే కట్టి ఉండేవారే. ఇది చాల పాత ఆనకట్ట. గండి పడింది. ఆలోచనలతో కాలాన్ని వృధా చేయకూడదు. **10** లక్షల ఎకరాల ఆయకట్టును కాపాడాలి. ఈ బ్రీచ్ వైడెన్ కాకుండా చూడాలి. డీపెన్ కాకుండా వుండడానికి బోర్డు ఫస్టు మెంబరు, ఛీఫ్ ఇంజనీర్సు, నేను అక్కడకు వెళ్లి తగిన చర్య తీసుకొనడం జరిగింది. ప్రకృతితో ఫైట్ చేస్తున్నాము. నేచరుకు మనకు పోటీ పడింది. వారం రోజులు టైం అనుకూలంగా వుంటే పూర్తి అయిపోయి వుండేది. రైల్వేస్, నేవీ, మిలిటరీ వారు ఎంతో సహకరిస్తు న్నారు. వారం రోజులు వరదలు రాకుండా వుంటే ఈ బ్రీచ్ రిపేరు అయి పోయి వుండేది. ఐనప్పటికి చాలావరకు చేశాము. నేచరుతో ఫైట్ చేస్తున్నాము. గోదావరి ఆగస్టు, సెప్టెంబరు రెండు నెలలు ఫ్లడ్స్‌లో వుంటుంది. ఈ **2** నెలలు ఫైట్ చేయకతప్పదు, బ్రీచ్ ఇక వైడెన్ కాకుండా వుండడానికి డెల్టా దెబ్బతినకుండా చూడడానికి రాష్ట్ర ప్రభుత్వము, ఆఫీసర్స్, ఇంజనీర్స్ ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకొంటున్నారు. గోదావరిలో **16** లక్షల క్యూసెక్కుల వాటర్ స్టోర్ అవుతున్నది. ఈస్టరన్ డెల్టాలో **3** వేల క్యూసెక్కుల నీరు సెంట్రల్ డెల్టాకు **3,100** క్యూసెక్కుల

సహాయం ఇచ్చి వ్యవసాయాభివృద్ధిని మెరుగు పరచడానికి రాష్ట్రప్రభుత్వం అనేక కార్యక్రమాలు తీసుకొంటుంది. దీనిలో అశ్రద్ధ చెయ్యడం లేదని మనవి చేస్తున్నాను. ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధిగారు చేసినటువంటి వాగ్దానాలను అమలుచేయడానికి రాష్ట్రప్రభుత్వము పూనుకొన్నదని, ముందుకు వెళుతున్నదని మనవి చేస్తున్నాను. హరిజనుల సంక్షేమం కోసం హరిజన ఫైనాన్సు కార్పొరేషను కూడా అమలుచేస్తున్నాము వచ్చింది. దానికి కొంత డబ్బు కేటాయించి ఈనాడు భూములు యిచ్చేటటువంటి వారికి వ్యవసాయం చేసుకోడానికి పెట్టుబడులకు యిచ్చి, పశువులు కొనుక్కోనడానికి పెట్టుబడి ఇచ్చి, వారిని మనం కాపాడాలి. అందువల్ల వాళ్లకు సహాయం చేయాలనే ఉద్దేశంతో ఈ కార్పొరేషను పెట్టడం జరిగింది. బ్యాక్‌వర్డ్‌క్లాసెస్ విషయంలోకూడా శ్రీ రంగదాసు గారు నాతో అంగీకరిస్తారని ఆశిస్తాను. వారికి కార్పొరేషను పెడుతున్నాము. దానిలో కూడా నిర్లక్ష్యం చేయడం లేదు. ప్రభుత్వోద్యోగాలలోకాని లోకల్‌బాడీసులోకాని వారికి ఇచ్చినటువంటి రక్షణలు **25** శాతము, **14** శాతము, **4** శాతము ఏవైతే ఉన్నాయో అవి అక్షరాలా పాటించడానికి చర్యలు తీసుకుంటున్నాము. వాటిని అమలు చేయడంలో ఎక్కడయినా లోపాలు ఉంటే వారిపై చర్యకూడా తీసుకుంటామని చెప్పాము. ఇదివరకు ఇచ్చేటటువంటి బోర్డింగు గ్రాంటుకు కాకుండా అదనంగా **6** వేల బోర్డింగు గ్రాంటును శాంక్షను చేసి పిల్లలు ఇంకా ఎక్కువ చదువుకొనడానికి అవకాశం కల్పించామని మనవి చేస్తున్నాను. మన రాష్ట్రంలో **6** జిల్లాలలో ఏజెన్సీ ప్రాంతం ఉన్నది. అక్కడ ట్రయిబల్సు ఎక్కువగా జీవిస్తున్నారు. వారి ఆర్థిక పరిస్థితికూడా బాగుచేయాలి. అక్కడ రోడ్సు కమ్యూనికేషన్సు సదుపాయాలు చేయడానికి ఎక్కువ డబ్బు ఖర్చుపెట్టాలి. మైనర్ ఇరిగేషను పథకాలుకూడా ఎక్కువచేయాలి. అంతే గాకుండా ఆ ఏరియాలను ఎల్క్ట్రిఫై చేయాలి. గిరిజన కార్పొరేషనుద్వారా కొన్ని మంచి కార్యక్రమాలు చేసి వారికి రక్షణ కల్పించాలనే ఉద్దేశంతో ప్రయత్నం చేస్తున్నాము. ఎస్టిమేట్సు కమిటీవారికి బాగాతెలుసు. మన రాష్ట్రంలో ట్రయిబలు వెల్‌ఫేర్ డిపార్టుమెంటు ఎట్లా పనిచేస్తున్నది వీరు చూసి వచ్చారు. బహుశా వారు ఒక మంచి మాట చెబుతారని అనుకొంటున్నాను. రాష్ట్రంలో వ్యవసాయంతోబాటుగా ఈ డెయిరీ డెవలప్‌మెంటు మీద కూడా రాష్ట్ర ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ తీసుకొంటున్నది. ఒక సంవత్సరం కరువు వస్తే గ్రామాలలో ఉన్నటువంటి చిన్న రైతులు తట్టుకోలేని పరిస్థితులలో ఉన్నారు. అందువల్ల వారికి వేరే ఆదాయం వచ్చే మార్గాన్ని కూడా మనం కల్పించాలనే ఉద్దేశంతోనే ఈ డెయిరీ డెవలప్‌మెంటు, పౌల్ట్రీ డెవలప్ మెంటు మీద ఎక్కువగా శ్రద్ధ తీసుకొని డెయిరీ డెవలప్‌మెంటు కార్పొరేషను పెట్టి చేయాలని రాష్ట్రప్రభుత్వం ముందుకు వెళ్లుతుందని మనవిచేస్తున్నాను. మన

రాష్ట్రములో సముద్ర తీర ప్రాంతం శ్రీకాకుళం జిల్లానుంచి నెల్లూరు వరకు ఎంతో తీర ప్రాంతం ఉంది. సముద్ర తీరంలో ఉన్న వనర్లను మనం అభివృద్ధి చేసుకొనడానికి ఒక ఫిషరీ డెవలప్‌మెంటు కార్పొరేషను పెట్టి పల్లెవారందరికీ ఉద్యోగాలు కల్పించాలనేటటువంటి పెద్ద కార్యక్రమం పెట్టుకున్నాము అని మనవిచేస్తున్నాను. రెయిజింగు ప్రయిసెస్ గురించి ఒక మాట చెబుతాను. శ్రీ వంకా సత్యనారాయణగారు ఒక విషయం చెప్పారు. వారి మొదటి ఉపన్యాసంలో ఇది అంతా రాష్ట్రప్రభుత్వానిదే బాధ్యత, తొలగడానికి వీలులేదని చెప్పారు. కేరళ మాట వచ్చేటప్పటికి ఏమి చెప్పారంటె - రాష్ట్రప్రభుత్వాలు ఒక పెద్ద మునిసిపాలిటీలు అన్నారు. రెండు మాటలూ ఆయనే చెప్పారు. బహుశా మరచిపోయి ఉంటారనుకుంటాను. ఎక్కడ ఏ గవర్నమెంటు ఉన్నా దేశంలో ఉన్నటువంటి పరిస్థితుల ప్రభావం ప్రతి రాష్ట్రం మీద ఉంటుందని గుర్తుచేసుకోమని మనవి చేస్తున్నాను. ఈ ధరలను అదుపులో పెట్టడానికి ఒట్టి ఉపన్యాసాలు పనికిరావు. ఒట్టి మాటలతో ధరలను అదుపులో పెట్టలేము. మీరు బ్లాక్ మనీ గురించి చెప్పారు. అది కేంద్ర ప్రభుత్వం చేయాలి. మన చేతులలో లేదు. ప్రయిజస్ విషయం చెప్పారు. ఈ రేట్సు ఏ విధంగా పెరిగాయో వాటి పర్సెంటేజస్ మన ఆంధ్ర ప్రదేశ్‌లోను, ఆల్ ఇండియా లెవెల్‌లోను ఏ విధంగా ఉన్నాయో చెప్పుతున్నాను - ఆంధ్రప్రదేశ్ : **17.1** శాతము, ఆల్ ఇండియా లెవెల్‌లో **28** పర్సెంటు, ఫుడ్ ఇన్‌క్రీజ్‌లో మనది **13.6**, ఆల్ ఇండియా లెవెల్‌లో **29.2** పర్సెంటు. కమ్యూనిస్టు చీఫ్ మినిష్టరు ఉన్నటువంటి కేరళలో **38.8** పర్సెంటు. మనకంటే వాళ్లది సెంట్ పర్సెంటు ఎక్కువ. అందువల్ల వంకా సత్యనారాయణగారు చెప్పినట్లుగా రాష్ట్ర ప్రభుత్వము అశ్రద్ధ చేసే విషయం కాదు. ఉద్యమాలు చేస్తే ఈ ధరలు తగ్గవు. ఇంకా పెరుగుతాయి. కనుక ఉద్యమాలు చేయడం ఎవరికి మంచిది కాదని చెప్పుతున్నాను. మీకు ఆశ్రమ కలుగకుండా చేస్తాను సాధ్యమైనంతవరకు.

శ్రీ సి.వి.కె.రావు :- ఈ ధరల కంట్రోలుకు ఎటువంటి చర్యలు తీసుకొంటారు?

శ్రీ జె.వెంగళరావు :- దానికి **2,3** మార్గాలు ఉన్నాయి. మన దగ్గర పుష్కలంగా రైసువున్నది. రేపు **1**వ తారీఖునుంచి అన్ని జిల్లాలలోను ఫెయిర్ ప్రయిజ్ షాపు ఎక్కడ అవసరం ఉంటే అక్కడ, ముఖ్యంగా కార్మికులు, వ్యవసాయ కూలీలు లేబర్ ఉన్న చోట్ల ఈ షాపు ఎన్ని కావాలంటే అన్ని పెట్టించి వాటికి కావలసిన రైస్ సప్లయిచేసి వారికి ముతక

బియ్యము రూ.1-40 పైసలుకు అమ్మకము చేయడానికి ప్రభుత్వం నిర్ణయం చేసింది, ఈనాడు పెరుగుతన్నటు వంటి 2,3 రూపాయల ధరను ఆ విధంగా వెళ్లనివ్వకూడదు. వెస్టు గోదావరిలో నేను రెండు రోజులు పర్యటించినప్పుడు వంకా సత్యానారయణగారు నా వెంటనే తిరిగారు. అక్కడ వారేమీ మాట్లాడలేదు. ఇప్పుడు చెప్పుతున్నారు. అక్కడ నేను చెప్పాను, హోర్డర్సును వార్న్ చేశాను. మీరు దాచుకొన్న సరుకును బయట పెట్టకపోతే బలవంతంగా లాగుకొంటామని చెప్పాను. వారు చెప్పినట్లుగా హోర్డింగు వల్ల ఈ ధరలు పెరిగిపోతున్నాయి. కనుక అటువంటివాళ్లమీద రెయిడ్ చేసి సరుకు బయట పెట్టి సక్రమమైన ధరలకు ఇవ్వడానికి రాష్ట్ర ప్రభుత్వము పనిచేస్తుంది. బియ్యము విషయంలో ఇబ్బంది లేకుండా ఎక్కడెక్కడ ఫెయిర్ ప్రయిజ్ షాపు పెట్టవలసిన అవసరము ఉన్నదో అక్కడక్కడంతా పెట్టించే ఏర్పాటు చేస్తాము. మన ప్రజలకు జులై, ఆగస్టు, సెప్టెంబరు, అక్టోబరు, ఈ నాలుగు మాసాలు గడ్డు కాలము. ఈ నాలుగు మాసాలు పుష్కలంగా రైస్ మార్కెట్‌లో పెట్టగలిగితే, దానికి ప్రభుత్వము తయారుగా ఉన్నది. ఈ సంవత్సరం వర్షాలు, భగవంతుని దయవలన, బాగా వస్తే మనము ఈ ఆపదనుంచి బయటపడతాము. తప్పకుండా ఈ గడ్డుకాలమునుంచి బయటపడడానికి అవకాశము ఉన్నది, భయపడనవసరంలేదు. రెండవది. నిన్న శ్రీ కృష్ణగారు చెప్పారు; మన దగ్గర ఈ డెవలప్‌మెంటు ఎక్స్‌పెండిచరు కంటే నాన్-డెవలప్‌మెంటు ఎక్స్‌పెండిచరు ఎక్కువగా ఉన్నదని. అది సరికాదు. మన దగ్గర ఉన్నటువంటి లెక్కల ప్రకారం, డెవలప్మెంటు ఎక్స్‌పెండిచరు 53.4 ఆల్ ఇండియా లెవెల్‌లో ఉంటే 54.1 ఆంధ్రలో ఉన్నది. ఈ సంవత్సరం 74-75లో 68 పర్సెంటు ఉన్నది. నాన్-డెవలప్‌మెంటు ఎక్స్పెండిచర్ జరగడానికి కొన్ని కారణాలు ఉన్నాయి. ఎంప్లాయీస్‌కు డి.ఎ. పెంచడం, డ్రాట్ ఏరియాస్‌లో ఎక్కువగా డబ్బు ఖర్చుపెట్టడం ఇటువంటివి వున్నాయి. ఈ నాన్-డెవలప్మెంటు ఎక్స్పెండిచర్, దానికి ఖర్చుపెట్టడం కంటె రాష్ట్రాభివృద్ధి కార్యక్రమాలకు ఎక్కువగా పెట్టడం మంచిదని శ్రీ కృష్ణగారు చెప్పింది మంచిదే. అదికూడ ఆలోచిస్తున్నాము. ఇప్పటివరకు వెనుకాడడంలేదు. రెండవది, ఈ పబ్లిక్ డెట్ బాగా పెరిగిపోయిందని శ్రీరాములుగారు, వెంకటరత్నంగారు చెప్పారు. 909 కోట్ల రూపాయలు పబ్లిక్ డెట్ ఉన్నది. దాంట్లో 726 కోట్లు కేంద్ర ప్రభుత్వము యిచ్చింది మనకు. మిగతాది, సుమారు 200 కోట్లు పబ్లిక్ డెట్‌కు మనము వెళ్లాము. అది మనకు అవసరమైంది. ఈ విషయంగురించి ఫైనాన్స్ కమీషన్ వాళ్లుకూడ ఈ విధంగా చెప్పారు. ఈనాడు పెద్దపెద్ద ప్రాజెక్టు అప్పులెచ్చి పూర్తిచేయకపోతే అవి ఎట్లా పూర్తి అవుతాయి? కనుక దానికిగాను ప్రయత్నం చేస్తున్నాము.

## ANNEXURE VI

*Statement showing the List of Schemes in Godavari Basin in Andhra Pradesh which can be taken up consequent to the Recent Agreements*

| Sl No | Name of the Project | District | Utilisation in T M C | Area irrigated in Acres | Remarks |
|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
| A | ABOVE NIZAMSAGAR<br>1 Singur Project | Medak | 4 00<br>(excluding evaporation losses) | | Water-Supply to Twin Cities |
| B | ABOVE POCHAMPAD | | | | |
| | 2 Lendi Project (Joint Project with Maharashtra) | Nizamabad | 3 50 | 25,000 | |
| | Pochampad Project (Extension) | Nizamabad & Adilabad | Existing 86 00<br>Kaddam 12 00 | 5,70,000<br>67,000 | Power 4 x 9 M W Benefits Adilabad, Nizamabad, Karimnagar, Warangal, Nalgonda and Khammam Districts |
| | | | 98 00 | 6,37,000 | |
| | | Extension 90 00 | 90 00 | 7,68,000 | 7,68,000 |
| | | Lower Manair vide item 13 below | 12.00 | 95,000 | |
| | | | 200 00 | 15,00,000 | |
| C | BELOW POCHAMPAD | | | | |
| | 3 Penganga Project (Joint Project with Maharashtra) | Adilabad | 14 60 | 58,000 | |
| | 4 Satnala (Priority) | Adilabad | 2 00 | 19,200 | |
| | 5 Peddavagu at Ada | Adilabad | 8 49 | 33,000 | |
| | 6 Vattivagu (priority) | Adilabad | 2 15 | 21,000 | |
| | 7 Chikkilivagu at Konetigudem (V) | Adilabad | 1 20 | 5,000 | |
| | 8 Kuntala Hydel Scheme | Adilabad | 0 70 | H E Scheme | Power 1 x 15 M W |
| | 9 Peddavagu at Dasnapur, | Adilabad | 1 93 | 9,000 | |
| | 10 Reservior Across Branch of Peddavagu Wandham (V) | Adilabad | 1 32 | 5,500 | |
| | 11 Chalamvagu | Adilabad | 1 20 | 5,000 | |
| | 12 Kappalavagu Project | Nizamabad | 2 35 | 8,000 | |
| | 13 Lower Manair (Priority Project) | Karimnagar | 14 50 | 95,000 | Includes water Supply to Warangal Town |
| | 14 Pranhita Project (Joint Project with Maharashtra) | Adilabad | 93 70 | 2,50,000 | Power 4 x47 M W |
| | 15 Boggulavagu (Priority) | Karimnagar | 0 60 | 5,200 | |

| | | | | |
|---|---|---|---|---|
| 16 Reservoir Across Gandham Chakkalavagu | Karimnagar | 1 08 | 4,000 | |
| 17 Peddavagu Project Sangampalli (V) | Karimnagar | 1 29 | 4,530 | |
| 18 Inchmapalli (Joint Project with Andhra Pradesh, Maharashtra and Madhya Pradesh) | karimnagar | 192 57 | 4,50,000 (I Phase) 32,000 (II Phase) | Power 10 Units of 100 M W Benefits Warangal & Khammam Dists |
| 19 Gundlavagu (Priority) | Khammam | 0 30 | 2,000 | |
| 20 Modikuntavagu | Khammam | 1 56 | 7,400 | |
| 21 Cherukupalli Project | Khammam | 1 80 | 8,500 | |
| 22 Malluruvagu (Priority) | Warangal | 0 52 | 7,500 | |
| 23 Taliperu (Priority) | Khammam | 5 00 | 20,000 | |
| 24 Mukkamamidi (Priority) | Khammam | 0 36 | 2,300 | |
| 25 Reservior Across Kalperu | Khammam | 1 08 | 4,000 | |
| 26 Reservoir Across Aluguvagu, Mallavaram | Khammam | 1 00 | 4,600 | |
| 27 Peddavagu at Gummadapalli (Priority) | Khammam | 1 46 | 16,000 | |
| 28 Lower Machkund H E Scheme | Vizag | 0 40 | H E Scheme | Power 30 M W |
| 29 Polavaram Barrage | East & West Godavari | 405 00 | 16,76,000 | Benefits East & West Godavari & Vizag Districts |
| 30 Mandamari Project | Adilabad | 1 70 | 6,000 | |
| 31 Lower Sileru Irrigation Project | Khammam | 15 00 | 51,000 | |
| 32 Minore Irrigation Works | | 15 00 | 90,000 | |
| | | 789 86 | 28,99,730 | |
| | Restricted to | 300 00 | | |

Grand Total A+B+C=4 00+93 5+300 00=397 5 or 398

Note - Our of 30 Projects under 'C', items 3 to 7,9 to 13, 15 to 17, 19 to 27 and 30 to 32 irrigate about 5 lakh acres utilising about 98 T M C

Items 8 and 28 are purely Hydro Electric Projects and utilise about 1 1 T M C

Items 14, 18 and 29 will be suitably restricted to utilise the balance out of 300 T M C now agreed upon for new projects below Pochampad to irrigate about 10 lakh acres

# అనుబంధం : 6

## AGREEMENT AMONG THE GOVERNMENTS OF ANDHRA PRADESH, KARNATAKA AND MAHARASHTRA FOR SUPPLY OF 5 TMC EACH OF KRISHNA WATERS TO TAMILNADU

Considering the acute scarcity of drinking water for the Metropolitan City of Madras in Tamil Nadu and the limited water resources available to the State of Tamil Nadu to meet such requirement,

The Governments of Maharashtra, Karnataka and Andhra Pradesh hereby agree to spare 5 TMC each out of their respective shares of the Krishna Waters, that may be allocated finally by the Krishna Water Disputes Tribunal, to enable the Government of Tamil Nadu to draw 15 TMC of Krishna Waters per annum from a convenient location, for water supply to Madras City.

The Officers of the Department of Irrigation, Government of India, the Irrigation Engineers of the Three States and the concerned officers of the Government of Tamil Nadu shall meet to decide the location from and the manner in which the Govoernment of Tamil Nadu would draw waters for Madras City.

The expenditure to be borne by the Government of Tamil Nadu towards construction, maintenance and operation of storage works and conveyance system leading upto the point from where Tamil Nadu would draw 15 TMC of waters shall be decided between the State Governments concerned under guidance of the officers of the Govoernment of India where necessary

Subject to the reservation<br>made in my Lr. D O No.1914<br>Irr V (1) / 75 -13 dt 17-4-76.

Sd/- xx<br>(B J Khatal)<br>Minister of Irrigation<br>Law & Judiciary,<br>Maharashtra 14-4-76

Sd/- xx<br>14-4-76<br>(Subash Astuhe)<br>Minister of State<br>of Major Irrigation<br>Karnataka.

Sd/- xx xx<br>17-4-76<br>(J. Vengala Rao)<br>Chief Minister<br>Andhra Pradesh

Sd/- xx<br>14-4-76<br>(K.K. Shah)<br>Governor of Tamil Nadu

Sd/- xx<br>14-4-76<br>(Jagjivan Ram)<br>Minister of Agriculture<br>& Irrigation G O I.

## ANNEXURE - I (a)

**Copy of D.O.Lr. No. 1914/Irr. V(1)/75-13 dt.17-4-76 from Chief Minister of A.P. addressed to Sri Jagjivan Ramji, Union Minister for Agriculture and Irrigation, Government of India, New Delhi.**

Dear Shri Jagjivan Ramji,

I am in receipt of your D.O.Lr.No 5/25/73-WD dated the 14th April, 1976 regarding the water supply to Madras City utilising Krishna Waters.

I am returning the Agreement after appending my signature subject however to the following reservation which I have found it necessary to make after a careful consideration of its provisions. The decision referred to in clause (3) of the Agreement should relate only as to from which state the water has to be supplied to Tamil Nadu When once the State from which the supply of water is to be made is decided upon, thereafter only that state from which the supplyu is to be made and the state of Tamilnadu would be concerned with the details. The exact point within that state from which the water has to be supplied or the manner in which it has to be supplied, will have to be decided only between that State and the State of Tamilnadu, to the best advantage of both the States and no other States should be concerned with the matter I have signed this Agreement subject to this reservation.

With kind regards,

Yours Sincerely,

Sd/-

(J. Vengala Rao)

# అనుబంధం : 7

**శ్రీ జె. వెంగళరావు :–** అధ్యక్షా, గత నెల 19వ తేదీ రాత్రి జరిగినటు వంటి తుఫాను ఘోర విపత్తు గురించి చర్చించాలనే వుద్దేశంతోనే అసెంబ్లీని సమావేశ పరచడం జరిగింది. బయట ప్రకటనలు చేయడంకంటే, అసెంబ్లీని సమావేశపరచి, గౌరవసభ్యులకు వారి అభిప్రాయాలు చెప్పుకోవడానికి అవకాశం కల్పించి, వున్న యదార్థాన్ని కూడా చెబితే బాగుంటుందనే వుద్దేశంతో, బహుశా యిది మన చివరి సెషన్ అయినప్పటికీ కూడా, సమావేశపరచి యదార్థాన్ని చెప్పాలని అనుకోవడం జరిగింది. నాకు తెలుసు – యిది ఆఖరి సెషన్, ఎన్నికల ముందు జరిగే సెషను, ఉపన్యాసాలు ఎన్నికలకు వుపయోగపడే విధంగా జోరుగా వుంటాయని నాకు తెలుసు అయినప్పటికి, దీనిని ఫేస్ చెయ్యాలనే వుద్దేశంతోనే యీ అసెంబ్లీని సమావేశపరచడం జరిగింది.

గత రెండు రోజులుగా గౌరవ సభ్యులు చాలామంది మాట్లాడారు, సరే, కొంతమంది సైక్లోన్ విషయం మరచిపోయి, వ్యక్తిగత దూషణ మొదలు పెట్టారు. కొంతమంది గవర్నమెంటును క్రిటిసైజ్ చేసి, గవర్నమెంటును డిస్మిస్ చేయాలని, ప్రెసిడెంట్ రూల్ ప్రవేశపెట్టాలని అన్నారు. అసలు న్యాయంగా, సైక్లోన్‌వలన జరిగిన నష్టమెంత? ఎంతమంది బాధపడ్డారు? వారికి లాంగ్ రేంజ్‌లో ఏమి చెయ్యాలి? ఇమ్మీడియేట్ రిలీఫ్‌కు ఏమి చెయ్యాలి? వీటికి సంబంధించిన సజెషన్స్‌కంటే, రాజకీయంగా చర్చనుసాగించడం, చర్చను ఆ విధంగా వుపయో గించుకోవడానికి ప్రయత్నించడం చాలా విచారించవలసిన విషయం. తమకు తెలుసు – యిది ఎవరో మనిషి చేసినది కాదు ప్రకృతిసిద్ధమైనది. ఆపడం ఎవరి తరమూ కానటువంటిది, ఎవరిచేతిలోనూ లేనటువంటిది. 113 సంవత్సరాల తర్వాత యీ పెనుతుఫాను ఆంధ్రకోస్తాను దెబ్బకొట్టింది. అనేక వేలమంది ప్రాణాలుకోల్పోయారు. అనేక కుటుంబాలు నాశనమైపోయినవి. మన ఆంధ్ర రైతాంగం బాగా దెబ్బతిన్నది. ఇందులో సందేహమేమీ లేదు. ప్రభుత్వం దీనిని ఎంతమాత్రం తక్కువ అంచనా వెయ్యడం లేదు. పెద్ద యెత్తుననే అంచనా వేసింది. కొంతమంది చీఫ్ మినిష్టరు 18వ తేదీన ఢిల్లీలో కూర్చున్నారు అన్నారు. తమకు తెలుసు యిక్కడవున్న చీఫ్ మినిష్టర్సులో అందరిలోకీ తక్కువగా ఢిల్లీకి వెళ్లే వాడిని నేను ఒక్కడినే. మిగతా వారు నెలకు 20రోజులు అక్కడనే వుంటారు. నేను అక్కడికి పనిలేక వెళ్లలేదు. 18వ తేదీనాడు ఫైనాన్స్ మినిష్టర్ రిసోర్సెస్ గురించి డిస్కషన్‌కు పిలిస్తే నేను వెళ్లాను. 19వ తేదీన బిజూపట్నాయక్‌తో మీటింగు

వుండడంవలన వుండిపోయాను. 19వ తారీఖునాడు నాకు యిక్కడ చీఫ్ సెక్రటరీనుంచి కమ్యూనికేషన్ వచ్చింది; సైక్లోన్ వార్నింగ్స్ యిట్లా వచ్చాయి - అని. నేను వెంటనే చెప్పా. వెంటనే కలెక్టర్సును ఎలర్ట్‌చేసి, సెక్రటరియేట్‌లో ఒక సెల్‌ను ఏర్పాటు చేసి, ఎలర్ట్‌గా వుంచమని చెప్పడం జరిగింది. శ్రీరాములు గారు ఎడ్మినిస్ట్రేషన్ గురించి మాట్లాడారు. మా ఎడ్మినిస్ట్రేషన్ చాలా ఎఫెక్టివ్‌గా పని చేసిందని నేను మనవిచేస్తున్నాను. ఏ గవర్నమెంటుకంటే కూడా బాగా పని చేసిందని నేను ప్రూవ్ చేయగలను. ఎప్పుడూ కూడ చేయనటువంటిది వారు అదృష్టవశాత్తూ ఎలర్ట్‌గా వుండి పనిచేశారు. టైడల్ వేవ్ ఎక్కడ తగులుతుందో భగవంతునికి కూడా తెలియదు. నెల్లూరు నుంచి కాకినాడవరకు తగులుతుందని వారు చెబితే - దివి తాలూకాలో తగిలింది; నిజానికి రేపల్లె తాలూకా కూడా పోయిందని అనుకుంటే, దగ్గరనే వున్న ఎదురుమండ అనే గ్రామం దెబ్బతినలేదు. నేను ఆ ప్రాంతాలన్నీ స్వయంగా వెళ్లి చూశాను. స్వయంగా తెలుసుకోవడం కోసం హెలికాప్టర్లో వెళ్లాను. సంగమేశ్వరం అనే గ్రామంలో నేను దిగాను. పైలట్ బురదగా ఉంది దిగిపోతుందని అన్నా సరే ఫరవాలేదని చెప్పి అక్కడ దిగాము. ఆ గ్రామములో ఉన్న 300 జనాభాలో సుమారు 80 మంది చనిపోయారు. ఎవరయినా ఈ గ్రామానికి వచ్చారా అని నేను వారిని అడిగాను. అప్పుడే అక్కడికి పోలీసులు వచ్చి 70 శవాలను తీసేసారని చెప్పారు. అక్కడ ఉన్న మిగతా వారు నాగాయలంక కాంపుకు వెళ్లారు. అప్పుడు ఆ గ్రామంలో ఒక స్త్రీ, 9 మంది మగవారు మొత్తము 10 మంది ఉన్నారు. మీరు ఇంకా ఇక్కడే ఎందుకు ఉన్నారని అడిగితే మేము ప్రాణము పోయినా సరే మా ఇళ్లు వదలి వెళ్లమన్నారు. అక్కడ ఇళ్లూ లేవు ఏమీ లేవు. రెండు తాటాకులు వేసుకుని వారు ఉన్నారు. ఈ టైడల్ వేవ్ ఎట్లా వచ్చిందని నేను వారిని అడిగాను. నా వెంట కొన్ని బట్టలు గిట్టలూ తీసుకువెళ్లాను. రెవిన్యూ మినిష్టరు గారు కూడా నాతో ఉన్నారు. అయ్యా మేము ఇటువంటిది ఎప్పుడూ చూడలేదు సాయంకాలం సుమారు అయిదున్నర గంటల సమీపంలో సముద్రంలో ఒక పెద్ద అగ్నిగుండములా కనపడింది. ఆ మెరుపు కనపడ్డాక ఒక పెద్ద నీటి కెరటము వచ్చింది. దానితో మేము తాటిచెట్లు ఎక్కామని వారు చెప్పారు. మిగతా వారు చనిపోయారు. అక్కడ ఉన్న స్త్రీని నీ వెట్లా బ్రతికావని అడిగాను. నేను కూడా తాటి చెట్టు ఎక్కాను. తాటి చెట్టుపైకి కూడా నీళ్లు వచ్చాయి. తరువాత ఆ కెరటము రెండు గంటలకి వెళ్లిపోయింది అని వారు చెప్పిన విషాద గాథ నేను విన్నాను. తమకు తెలుసు. ఇది చాలా విచారకరమైన విషయము. రాజకీయాలకు దీనిని ముడి పెట్టకూడదు. ఎంతో మంది పిల్లలు తల్లులను కోల్పోయారు. ఎంతో మంది తల్లులు వారి బిడ్డలను కోల్పోయారు. ఎంతో మంది వారి కళ్లెదుటే భార్యాబిడ్డలను

కోల్పోయారు. ఎన్నోబాధలు, ఇబ్బందులు పడిన ప్రజలు ఉన్నారు. వారి నందరిని ఈనాడు మనము ఆదుకోవలసిన సమయంలో ప్రభుత్వం ఏమాత్రము వెనుకాడదని నేను మనవి చేస్తున్నాను. నిజంగా ఎవరయినా ఈసమయంలో ప్రభుత్వము అశ్రద్ధ వహించిందని చెపితే నేను వారిని బాగా ఒకసారి ఆలోచించు కొని చెప్పమంటున్నాను. శ్రీరాములుగారు చెప్పారు గవర్నమెంటుకు ఏరోప్లేను ఉన్నా పైలటే నడపాలి, దానిని ముఖ్యమంత్రి నడపలేడు. 20వ తారీఖు ఉదయం నేను ఛీఫ్ సెక్రటరీతో ఫోన్‌లో వెంటనే కమీషనర్సును అందరిని మధ్యాహ్నానికల్లా బయలుదేరి సాయంకాలానికి పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు, తూర్పు గోదావరి జిల్లాలకు వెళ్లేలా చూడమని చెప్పాను. వారికి రూల్సు రెగ్యులేషన్సు తీసేసి ఎంత అవసరమైతే అంత డబ్బు ఖర్చుపెట్టడానికీ ఫుల్ పవర్సు ఇచ్చాము. 21 తారీఖు సాయంకాలానికి గుంటూరు, పశ్చిమగోదావరి జిల్లాలకు కమీషనర్లు వెళ్లారు. రెవిన్యూ సెక్రటరీని అవసరమయితే రెవిన్యూ మినిష్టరు, ఇద్దరినీ కూడా ఏరియల్ సర్వే చేయమని చెప్పాను. నాకు 20వ తారీఖున తుఫాను గురించి వైర్‌లెస్ మెసేజి వచ్చింది. నేను రావడానికి అప్పటికే మార్నింగ్ ప్లేన్ వెళ్లిపోయింది. ఆ మెసేజిలో పెద్ద తుఫాను వచ్చింది. దీని గురించి కరక్టు ఇన్‌ఫరుమేషను రాలేదు. సుమారుగా 450 మంది గుంటూరు, బందరులలో చనిపోయారు. ఇంకా పెద్ద సంఖ్యలో మరణాల సంఖ్య పెరగవచ్చు అని ఉంది. నాకు అప్పుడు ఈవినింగు ప్లేన్ ఉంది. నేను వెంటనే హనుమయ్యగారిని వారి వారి జిల్లాలకు ఎలాగైనా సౌకర్యాలు బస్సుగాని, ప్లేనుగాని - లేకపోయినా సరే ఎలాగైనా చేరుకోమని ఫోనులో చెప్పాను. హిందూలో పడిన ప్రకటనను సభ్యులు శ్రీరాములు గారు చదివారు. అది కృష్ణాజిల్లా గురించి, ఇటీజ్ ఎ వెరీ అన్ చారిటబుల్ రిపోర్టు. జిల్లా కలక్టరు, సూపరింటెండెంటు ఆఫ్ పోలీసు, ఆర్.డి.వోలు తెల్లవార్లు నిద్రలేకుండా ఉన్నారు. వారికి పడుకోవాలన్నా పడుకోడానికి వీలులేదు. గాలికి తలుపులన్నీ పగిలిపోయాయి. జిల్లా కలక్టరు ఇంటి చుట్టూ గుడిసెలలో ఉన్న వారు కలక్టరు ఇంట్లో క్రింద ఉంటే కలక్టరు తెల్లవార్లూ నిద్రలేకుండా పైన ఉన్నారు. నేను స్వయముగా చూశాను.

రంగనాయకుల పేట దగ్గర ఉంది. మన లక్షణరావుగారికి బాగా తెలుసు. ఎవరైనా నిజముగా చూసి ఉంటేనే వారికి యదార్థము తెలుస్తుంది. వారు బాధపడిన వారు. సీకోస్ట్‌లో లేకుండా హైదరాబాదులో కూర్చొని గవర్నమెంటునువిమర్శించాలి అన్నవారికి పాయింట్సు

చాలా ఎక్కువగా తెలుస్తాయి. అసలు ఇబ్బంది పడిన వారికి చాలా తక్కువ తెలుస్తాయి. నేను ఒకటి మనవి చేస్తున్నాను. రంగనాయకుల పేట బందరుకు దగ్గరలోనే ఉంది. అక్కడ **200** మంది చనిపోయారు. వారిని తీసుకురావడం కోసం ఎవరూ వెళ్లలేని పరిస్థితి. కలెక్టరు వెంటనే ఆపరేషన్ బిగిన్ చేశారని మనవి చేస్తున్నాను. భాను ప్రతాప్ సింగ్ గారు రాజ్యసభలో మాట్లాడుతూ **47** గంటల ముందు వార్నింగ్ ఇచ్చాము. మిలటరీనిపిలచి జనాన్ని ఎవేక్యూట్ చేసింటే వారంతా బ్రతికేవారని స్టేట్‌మెంటు ఇచ్చారు. ఆయన ఎప్పుడూ సముద్రం చూసి ఉండరు. ఉత్తర హిందూస్తానములో సముద్రం వారికి కనిపించదు. మన దగ్గర సముద్రము నెల్లూరు జిల్లాలో తడ దగ్గర నుంచి శ్రీకాకుళము జిల్లాలో కళింగపట్నము దాకా ఉంది. ఎన్ని కోట్ల మందిని ఎవేక్యూట్ చేయాలి? ఎన్ని వెహికిల్సు? ఎన్ని బెటాలియన్లు కావాలని నేను అడుగుతున్నాను. గుంటూరు టౌనులో ఎవేక్యూట్ చేయాలి. అక్కడ సముద్రము లేదు. టౌను సీ కోస్టులో లేదు. **50** మైళ్ల దూరములో ఉంది. విపరీతంగా కురిసిన వాన వల్ల అక్కడ గుడిసెలన్నీ కూలిపోయాయి. వాటిలో వున్నవారు చనిపోయారు. పెద పెద్ద భవనాలు కూడా కూలిపోయాయి. ఇట్లాంటి చోట్ల ఎట్లా ఎవేక్యూట్ చేయించ గలుగుతాము. బాపట్ల దగ్గర కర్లపాలెంలో కాంక్రీట్‌తో కట్టిన భవనాలు పెళ పెళా పగిలిపోయాయి. అది సీ కోస్టుకు దగ్గరలో ఉంది. బందరులో దెబ్బతినని పొగాకు కంపెనీగాని ఇండస్ట్రీగాని లేదు. గౌరవసభ్యులు రత్తయ్యగారిని అడగండి. వారు **10** లక్షలు ఖర్చుపెట్టి టొబాకో క్యూరింగు ఫ్యాక్టరీ కడితే అది గోడ కూలిపోయినట్లు కూలిపోయింది. అక్కడ ఈ గేల్ విపరీతంగా వచ్చింది: **100** సంవత్సరాలుగా ఉన్న మర్రిచెట్లు, ఇతర చెట్లు రోడ్డుకు అడ్డంగా పడిపోయాయి. ఎలక్ట్రిక్ పోల్స్ అన్నీ రిమ్మ తిరిగినట్లు తిరిగాయి. వాటిని క్లియర్ చేసి, కమ్యూనికేషన్సు రెస్టోర్ చేయడం ఎంత కష్టమో ఆలోచించండి. కూలివారు దొరకరు. వాళ్ల ఇళ్లు పాడయిపోయి గోల పెడుతున్నారు. పి.డబ్ల్యు.డి. వారే వేరేచోట మనుష్యులనుతీసుకువచ్చి రంపాలుతెచ్చి రెండురోజుల్లో కమ్యూనికేషన్సు రెస్టోర్ చేస్తే గవర్నమెంటు మెషినరీ చేసినప్పటికి ఒక్కమాట కూడ చెప్పకుండా ఇది అంతా వరస్టు మెషినరీ అని చెబితే ఇది వాల్యుబుల్ వర్డ్సు కాదని రెస్పాన్సి బులిటీ ఉన్నవారు అనేవి కాదని అంటున్నారు. ఇది ప్రజలకు బాగా తెలుసు. నాకు అదే సంతోషం. ఎంతమంది సైక్లోన్ విషయంలో వివరించినా ఈ సారి సైక్లోన్‌లో ప్రభుత్వం వెంటనే నిర్ణయాలు తీసుకుంది. సత్వరమైన పనులు చేసిందని ప్రజలు అంటున్నారు. సహాయము చేయడానికి ప్రభుత్వం నిలవడిందని ప్రజలు సంతోషపడుతున్నారు. నాకు అదే సర్టిఫికేటు తప్ప మిగతా సర్టిఫికేట్సు అక్కరలేదని కోరుతున్నాను. ప్రజలే తీర్పు ఇచ్చేవారు. వారి క్షేమం కోసం పనిచేయడం ప్రభుత్వం

యొక్క డ్యూటి. మా ప్రభుత్వం సిన్సియర్‌గా పని చేసిందని నేను గర్వముతో మనవి చేస్తున్నాను. సిన్సియారిటీని ఎవరు శంకించ లేదు. నేను ఇంకో మాట చెబుతున్నాను. నేను 20 తారీఖు రాత్రి వచ్చాను. 21వ తారీఖున ప్రెస్‌కాన్ఫరెన్సులో మనీ ఈజ్ నాట్ ది క్రయిటీరియా అని చెప్పాను. గవర్నమెంటు ఆఫ్ ఇండియా ఇస్తుందో లేదో అన్నది అప్పటికి నేను ఆలోచించలేదు. స్టేటు గవర్నమెంటు ఎంత డబ్బయినా ఖర్చుపెట్టి ఈ విపత్తులో ప్రజల తరపున నిలబడాలని ఆర్డరు జారీ చేయడం జరిగింది. 21 తారీఖు ఉదయం ఏడుగంటల కల్లా నేను ప్లేను రెడీగా పెట్టమన్నాను. నేను ఎయిర్ ఫోర్టుకు వచ్చేటప్పటికి గన్నవరంలో వెదర్ కండిషన్సు బాగాలేవని ఎయిర్ ఫోర్స్‌వారు చెప్పారు. 15 నిమిషాలలో ప్లేను సిద్ధము చేయలేకపోతే నేను కారులో వెడతానని ఎయిర్ ఫోర్స్ కమేండరుకు చెప్పాను. ఆయన పదిహేను నిమిషాలలో ప్లేన్ రెడీ చేశారు. నా వెంట ఎయిర్‌ఫోర్స్ కమాండర్, మిలటరీ సబ్ ఏరియా కమాండర్, రెవెన్యూ మినిస్టర్, ఇతర మినిస్టర్లు, చీప్ సెక్రటరి వున్నారు. మేమంతపోయి, ఒంగోలు దగ్గర నుండి వెస్టుగోదావరి కొల్లేరుదాకా సర్వేచేసి, అవసరమైతే వెస్ట్‌గోదావరి, వైజాగ్ వరకూ పోదామనుకుంటే వెదర్ బాగాలేదని ప్లేన్ రిటర్ను చేశారు. గన్నవరం ఎయిర్‌పోర్టుకు రావడం జరిగింది. ఆ రోజు భోజనం కూడా చెయ్యకుండా గన్నవరం నుండి బయల్దేరి హెలికాప్టర్లో మచిలీపట్నంలో దిగి, అక్కడ కలెక్టరును కలిసి, ఎక్కడెక్కడ ఏమి చేస్తున్నారో ఆ ప్రాంతాలలో చూడడం జరిగింది. 21 ఉదయం దాకా కూడా ఆ జిల్లాలోగాని, దివిసీమలోగాని ఎక్కడ ఏమి జరిగిందో తెలియదు. అప్పుడు ఎడ్యుకేషన్ మినిష్టర్‌గారు అవనిగడ్డలోనే వున్నారు. ఆయన అదృష్టవశాత్తు బ్రతికాడు. ఆయన అక్కడ ఎంతో చేశారు. పిల్లలుకొట్టుకు పోతుంటే వారిని తీసుకొచ్చి తెల్లవార్లూ అక్కడనే పెట్టుకున్నారు. తమ కుటుంబసభ్యులు, తమ్ముడు కూడా ఎలావున్నారో తెలియదు. ఎంతో పోవడం జరిగింది. 21వ తేదీన చెట్లను కొట్టుకుంటూ, ఎంతో ప్రయాసపడి, ఎంతో బాధభరించి గన్నవరం ఎయిర్ పోర్టుకువచ్చి కౌగిలించుకుని ఎంతో దుఃఖంతో సుమారు ఏడువేల వరకు దివి ఐలెండ్‌లో పోయి వుంటారని చెప్పేవరకూ ఎంత విపత్తు జరిగిందో ఎవరికి తెలియదు. అంతవరకూ గుంటూరులో 400, మరొకచోట 300 ఈ విధంగా పోయివుంటారేమో ననుకున్నాంగాని, తుఫాను వుధృతం యీ స్థాయిలో వున్నదని యింత మంది పోయారని ఆయన వచ్చి చెప్పేవరకూ తెలియలేదు. అక్కడ వైర్‌లెస్ లేదు. ఏ కమ్యూనికేషనూ లేదు. అంతా స్తంభించిపోయింది. ఎక్కడికి వెళ్లినా ఎటు చూసినా అన్నీ మానవ శవాలు. జంతు కళేబరాలు. అంతా స్మశాన దృశ్యం కనబడింది. మానవ శవాలు డి కంపోజ్ అయిపోతున్నాయి. వేలకొలది జంతు కళేబరాలు వున్నాయి. వీటన్నింటిని రిమూవ్

చెయ్యాలి. ఎవరూ తీసుకుపోయే స్థితిలో లేరు. ఇది ఒక పెద్దసమస్యగా తయారయింది. పొరపాటున మేము ఒక మాట అన్నందుకు మిలిటరీ వారికి కోపం వచ్చింది. ఇక్కడ కాంట్రొవర్సీ లేదు. వారు చేస్తామన్న సహాయ మంతా తీసుకున్నాము. మిలిటరీ, ఎయిర్‌ఫోర్స్, నావీ, విశాఖపట్నంలో వారు సహాయం చేశారు. ఎక్కడా కాంట్రోవర్సీ లేదు. తరువాత కొంత మంది కాంట్రవర్సీ తీసుకొచ్చారు తప్ప ఎక్కడా లేదు. డెడ్‌బాడీస్ రిమూవ్ చేయడం విషయంలో మిలిటరీ వారు అది మాపని కాదు అన్నారు. దానిపై వెంటనే ప్రభుత్వం నిర్ణయం తీసుకున్నది. కాకినాడ నుంచి పోలీసు బెటాలియన్‌ను పిలిపించాము. విజయవాడలో శ్కావెంజర్స్ యీ పని చేసేవారు, శవాలను పాతిపెట్టడం, దహనం చేయడంచేసే వారిని పంపించ మన్నాము. రాజమండ్రి సెంట్రల్ జెయిల్ నుంచి యాభైమంది ప్రిజనర్స్ వస్తామన్నారు పంపించమన్నాం, అయితే, ఈ పశువుల కళేబరాలను, మానవ శవాలను ఎక్కడ పాతిపెట్టాలి. ఎట్లా దహనం చెయ్యాలి? ఎక్కడ పాతిపెట్టాలి అనేది ఒక పెద్ద సమస్య అయింది. అన్నీ వుబ్బిపోయి వున్నాయి, నేను అక్కడనే కూర్చుని నిర్ణయం తీసుకున్నాను. వెంటనే సింగరేణి కాలరీస్ మేనేజింగ్ డైరెక్టర్‌కు అవనిగడ్డనుంచి వైర్‌లెస్ మెసేజ్ యిచ్చి, **200** లారీల కోల్, **200** మంది మనుషులను, వర్కర్సును పంపించి యీ కార్యక్రమం టేకప్ చేయమని చెప్పాను. తెల్లవారేటప్పటికీ **30** లారీల కోల్, **200** మంది వర్కర్సు వచ్చి పని మొదలు పెట్టారు. వారందరి సేవను మనం మరచిపోకూడదు. నిజానికి ఆ వాసన భరించలేము. అటువంటి పరిస్థితిలో వారు రాత్రింబవళ్లు అక్కడనే వుండి పనిచేశారు. పోలీసు బెటాలియన్, ప్రిజనర్స్, కాలరీస్ వారు ఆ విధంగా పదిహేను రోజులు అక్కడనే వుండి పనిచేశారు. ఇతర వాలంటరి ఆర్గనైజేషన్సు కూడా వచ్చాయి. వారంతా ఎంతో కష్టపడి సేవ చేశారు. కృష్ణారావుగారి రాజీనామా గనుక రాజకీయ వుద్దేశంతో కూడి వున్నట్లయితే అయిదు నిముషములలో దానిని నేను యాక్సెప్ట్ చేసేవాడిని. నేను అటు వంటివాటికి భయపడను. ఆయన మానసికంగా దెబ్బతిన్నాడు, **20** సంవత్సరాలుగా ఆ దివి తాలూకా అభివృద్ధి కొరకు కృషి చేసాడు, ఎంతో త్యాగం చేసి పనిచేశాడు, డెవలప్ చేశాడు. అయిదు నిముషాలలో అంతా కొట్టుకుపోయింది. ఎంతోమంది ఆప్తులు చనిపోయారు. ఆ మానసిక పరిస్థితిలో ఆయన రిజైన్ చేశారు. నేను చెప్పాను – యిటువంటి టైములో మనం అధైర్యపడకూడదు. ఇప్పుడే ధైర్యంగా మనం నిలబడాలి. ఈ శవాలను, యీ పరిస్థితిని చూసి పారిపోకూడదు. పారిపోతే మనం అడ్మినిస్ట్రేటర్స్ అనిపించుకోము. ఆపదలో ధైర్యం వహించి నిలబడి పనిచేసి, వాళ్లందరిని మామూలు మనుషులుగా చేసేవరకూ మనం నిద్రపోకూడదు. ఆయన లేకపోతే, నేను వెళ్లి రెండు మూడు రోజులు అక్కడనే కూర్చున్నాను, హెలికాప్టర్లో వెళ్లి స్వయంగా

పనులన్నీ పర్యవేక్షించాను. ఎందుకంటే ఆపద సమయంలో పారిపోయే అలవాటు నాకు లేదు, నేను ఎప్పుడూ పారిపోను. ఇంకొక విషయం కూడా చెప్పాలి. తిరిగివచ్చి, 21వ తేదీ రాత్రి నేను ప్రధానమంత్రిగారికి వెంటనే మెసేజ్ పంపించాను. సుమారుగా మూడు వేలమందివరకు చనిపోయినట్లు అప్పటికి వున్న వార్తలు. లాసెస్ విపరీతంగా వుంటాయని ప్రధానమంత్రికి చెప్పడం జరిగింది. ఆ తెల్లవారి మన రాష్ట్రపతి సంజీవరెడ్డిగారు ఫోన్ చేసి మాట్లాడారు. మన రాష్ట్రంలో ఇంతమంది చనిపోయి, యింత బాధలో వుంటే నేను రాష్ట్రపతి భవన్‌లో కూర్చోడం నాకు యిష్టం లేదు, నేను రావాలనుకుంటున్నాను అని అంటే తప్పకుండా దయచేయండి అనిఅంటే వారు 23వ తేదీన రావడం, విజయవాడకు, అవనిగడ్డకు యితర ప్రాంతాలకు వెళ్లి స్వయంగా చూసి రాష్ట్రప్రభుత్వం చేస్తున్న పని గూర్చి ఒకటి రెండు మాటలు రాష్ట్రప్రభుత్వానికి ధైర్యం యిచ్చే మాటలు చెప్పారు - బాగా పనిచేస్తున్నారని. అది కూడా తప్పు అయిపోయింది. ఆయనను కూడా బహిరంగసభలో విమర్శించే పరిస్థితి వచ్చింది. రాష్ట్రపతి వొచ్చి ముఖ్యమంత్రిని పొగిడాడు అని, ఆయన ఏ పార్టీకి చెందిన వాడుకాదు.

శ్రీ ఇ. అయ్యపురెడ్డి :- ఎక్కడ విమర్శించారు. ?

శ్రీ జె.వెంగళరావు :- పుచ్చలపల్లి సుందరయ్యగారు తవ్మారెడ్డి సత్యనారాయణగారు వారంతా వున్నారు బెజవాడ ఆల్ పార్టీస్ మీటింగులో రికార్డు అయింది. పెద్ద మనుషులు వున్నారు, వారిని అడిగితే చెబుతారు. అందువలన యీ కార్యక్రమమంతా చూసి, ఆయన ధైర్యం చెప్పి వెళ్లారు. ఈ కార్య క్రమమంతా వార్‌పుటింగ్ స్థాయిలో చేయడం జరిగింది. స్టేట్ గవర్నమెంటు చెయ్యలేదు అని అంటే మరి ఎవరు చేశారు? ఢిల్లీ నుంచి ఎవరయిన వచ్చి చేశారా? లేక విమర్శించే వారు వచ్చి అక్కడ చేశారా? కారులో వెళ్లడం స్టేట్‌మెంట్స్ యివ్వడం, యిదీ పద్ధతి. స్టేట్‌గవర్నమెంట్ అఫీషియల్స్, రాత్రింబగళ్లు నిద్రలేకుండా పని చేశారు, వారిని విమర్శించడం కాదు. అభినందించాలి. విమర్శించడం తేలిక, అది చాలా సులువు. అడిగే వాడికి చెప్పేవాడు లోకువ అంటారు. ఇది చాలా పెద్ద బాధ్యత. ఇది నాచురల్ కెలామిటీ. ఎవరూ తీసు కొచ్చింది కాదు. దురదృష్టవశాత్తూ మన రాష్ట్రాన్ని పెద్ద దెబ్బకొట్టింది. మన రాష్ట్రం నాలుగు సంవత్సరాలుగా ఆర్థికంగా పటిష్టవంతమై అభివృద్ధి పథంలోకి అడుగు పెట్టింది. ఈ సమయంలో వచ్చి పెద్ద దెబ్బ కొట్టింది. ఈ దెబ్బను భయపడకుండా ఎదుర్కోవలసిన అవసరం ఉన్నది. ఎదుర్కొంటాము అని మనవి చేస్తున్నాను. శ్రీరాములుగారు రికమెండేషన్స్ ఆఫ్-ది

సైక్లోన్ డిస్ట్రెస్ మిటిగేషన్ కమిటి అని కోటేశ్వరన్‌గారు అధ్యక్షులుగా **1971**లో వారు వ్రాసిన రిపోర్టు చదివి వివరించారు. కోటేశ్వరన్‌గారి దగ్గరనుంచి నిన్ననే నాకు ఉత్తరం వచ్చినది. వారు రిటైర్ అయి ఇరాన్‌లో పనిచేస్తున్నారు. ఇప్పుడున్నటువంటి ఎక్విప్‌మెంట్ అవుట్ డేటెడ్ అని చెప్పారు. మాడరన్ ఎక్విప్‌మెంట్ ఎంతవరకు అయితే మెటలర్జికల్ డిపార్టుమెంట్ సీకోస్టులో ఇన్‌స్టాల్ చేయరో అంతవరకు కరెక్టు రీడింగ్స్ రావు అని చెప్పారు. ఈ రికమెండేషన్స్ ఎక్కువగా యింప్లిమెంట్ చేయవలసిన బాధ్యత గవర్నమెంట్ ఆఫ్ ఇండియాది. స్టేట్ గవర్నమెంట్ బాధ్యతకాదు. క్లాజ్ **49** ఒకసారి చదవమని అడుగుతున్నాను. స్టేట్ గవర్నమెంట్ దగ్గర డబ్బు లేకపోతే ఆ డబ్బు కూడ సెంట్రల్ గవర్నమెంట్ యిచ్చి అమలు చేయవలసిందని క్లాజ్ **49**లో వ్రాసి వున్నది. స్టేట్ గవర్నమెంట్ రెస్పాన్సిబిలిటి కాదు. ఊరికే రిపోర్టు చదివేస్తే కాదు.

మెటిరియలాజికల్ డిపార్టుమెంట్‌లో ఉన్న ఆఫీసర్ నా దగ్గరకు ఈ సైక్లోన్ వచ్చిన తరువాత. వచ్చి చెప్పారు. ఆయన చెప్పినమాట తమతో మనవి చేస్తున్నాను. డెవలప్డు మెషినరి లేదు. అందుచేత యాక్యురేట్‌గా చెప్పడానికి వీలు లేదని అన్నారు. ఇక్కడ టైడల్ వేవ్ వచ్చినప్పుడు అమెరికాలో సెటిలైట్స్ ద్వారా టైడల్ వేవ్ చూశారు. వారు సైంటిఫిక్‌గా అంత డెవలపు అయ్యారు. మనం కాలేదు. ఆ ఒక్కటి టైడల్ వేవ్ అమెరికాలో టెలివిజన్‌లో చూపించారు. ఇవ్వాళ వారితో పోల్చుకుంటే ఎట్లా కుదురుతుంది? మద్రాసులో మెటిరియాలాజికల్ సర్వేలో ఉన్న ఆయన జపాన్‌లో ఉన్నాడు. మన ఆంధ్రుడు. ఆయన చెప్పారు. సైక్లోన్ వచ్చినపుడు జపాన్‌లో కూడ ఎటు మూవ్ అవుతున్నది. టైడల్‌వేవ్ ఎక్కడ వస్తున్నది. యాక్చువల్‌గా ఏ పాయింట్‌లో కొడుతుంది టెలివిజన్‌లో చూపిస్తారు వారు. మన దగ్గర అంత డెవలప్‌మెంట్ ఎక్కడ ఉన్నది? అసలు గ్రామాలకు పోవడానికి రోడ్లులేవు. వారు ఉండడానికి యిళ్లు లేవు. మనం వారితో పోల్చిచూసుకుంటే ఈ కార్యక్రమం ఎట్లా అవుతుంది? దివి తాలూకాలో మంచి కమ్యూనికేషన్స్ ఉన్నాయని చెప్పారు. ఎక్కడ ఉన్నాయో నాకు తెలియదు. నాగాయలంక కోడూరు దాకానే ఉన్నాయి. స్వర్ణగండి దగ్గర ఎక్కడ కమ్యూనికేషన్ వున్నది? సంగమేశ్వరం దగ్గర ఏమి కమ్యూనికేషన్ వున్నది? ఏ లారీ పోతుంది? ఏ జీపు పోతుంది? రోడ్స్ వేయాల్సిన అవసరం వున్నది. అంత డబ్బు మన దగ్గర ఎక్కడ వున్నది? ఎక్కడా లేదు. ఈ ఈ సైక్లోన్ సందర్భంలో ప్రభుత్వం అతి త్వరగా అన్ని కార్యక్రమాలు వెంట వెంటనే

నిర్ణయాలు తీసుకొని రెడ్ టేపిజమ్ లేకుండా స్పాట్‌లోనే డెసిషన్ తీసుకొని బీదవారికి లాభం కలిగేటట్లు చేసినది. కొన్ని పొరపాట్లు జరిగినాయని కంప్లెయింట్ వచ్చినది. ఎక్కడో కొంత మంది ఆఫీసర్స్ మిస్ ఇది వరకు మన దగ్గర ఉన్న రూల్స్ ప్రకారం కుటుంబంలో ఎర్నింగ్ మెంబర్ చనిపోతే ఎర్నింగ్ మెంబర్ అని సర్టిఫికెట్ ప్రొడ్యూస్ చేస్తేనే ఎక్స్‌గ్రేషియా పేమెంట్ 1000 రూపాయలు యివ్వాలి. మిగతా ఎవరు చనిపోయినా ఒక్క రూపాయి యిచ్చే అలవాటు లేదు. ఇప్పుడు అది తీసివేసి కుటుంబంలో ఎంతమంది చనిపోతే అంతమందికి వెయ్యి రూపాయలు యివ్వమని చెప్పాము. 5 సంవత్సరాల వయస్సు పిల్లలు పోయినా 500 రూపాయలు యివ్వాలని రూల్స్ త్రోసివేసి యిచ్చాము. ఎందుకంటే వారు చాల బాధ పడ్డారు. గౌరవ సభ్యులు చెప్పారు. ఈ డబ్బు అంతా ఎవరో కొట్టేస్తారని. నేను కలెక్టరుకు చెప్పాను. డబ్బు యిస్తే మధ్య వాళ్లు కొట్టేస్తారు కనుక బ్యాంక్‌లో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేసి ఆ పాస్ బుక్స్ అప్పచెప్పమని చెప్పాను. టైడల్ వేవ్ విషయంలో, సైక్లోన్ సందర్భంలో 150 రూపాయలు యిస్తే సరిపోదని శ్రీరాములుగారు, యితర మిత్రులు చెప్పారు. తమకు తెలుసు. ఇదివరకు 50 రూపాయులు ఉండేది. అది 100 రూపాయలు చేశాము. క్రితం సంవత్సరం నెల్లూరు జిల్లాలో, చిత్తూరు జిల్లాలో సైక్లోన్ వస్తే 150 రూపాయలు చేశాము. ఇప్పుడు 150 రూపాయలు యివ్వడమే కాకుండా టైడల్ వేవ్ ఏరియాలో ఉన్న వారికి 100 వాసాలు, 250 తాటాకు, 50 రూపాయల యుటెన్‌సెల్స్ యిస్తున్నాము. చీర, ధోవతి, బట్టలు యిస్తున్నాం. ఇదంతా 500 రూపాయుల వరకు వెళ్లింది. ఇవ్వాల్టి వరకు దీనిమీద అయిన ఖర్చు రూ.14,33,00.000లు. సెంట్రల్ గవర్నమెంట్ నుంచి వచ్చినది 57 కోట్ల రూపాయలు. దీని కోసం ఎలాట్ చేసినది 6 కోట్ల రూపాయలు. అది కూడ లోన్. మనం యిచ్చేది ఉచితం. ఇంకా చనిపోయిన వారందరికి యివ్వలేదు. అది కూడ కలిపితే రూ.20 కోట్లు దాటిపోవచ్చు. రాష్ట్ర ప్రభుత్వం మీద ఈ బరువు పడినా సరే, ఈ బరువు భరించి ఆపదతో ఉన్నవారికి సహాయం చేయాలనే ఉద్దేశ్యంతో ఈ కార్యక్రమం చేశాము. వారికి 15 రోజులు, నెల రోజులు ఉచితంగా భోజనం కొన్ని కాంప్స్‌లో పెట్టడం జరిగింది. 5,600 టన్నుల బియ్యం పంచి పెట్టడం జరిగింది. సుమారు 2,68,550 ధోవతులు, చీరలు. యితరమైనవి పంచిపెట్టడం జరిగింది. ఇది గవర్నమెంట్ సైడ్ నుంచి ఈ సైక్లోన్ బాధమన దేశంలోనే కాకుండా ప్రపంచం కూడా గుర్తించినారు. మన దేశంలోని చాల రాష్ట్రాలనుంచి, బొంబాయిలోని షోలాపూర్ నుంచి ఒరిస్సా నుంచి, కలకత్తా నుంచి బట్టలు వగైరా ప్రోగు చేసుకొని, యుటెన్‌సెల్స్ మొదలైనవి తీసుకువచ్చి స్వయంగా పంచిపెట్టిన సందర్భాలు ఉన్నాయి. లక్ష్మణరావుగారు చెప్పినట్లు అందిన గ్రామాలకే అంది, కొన్ని

గ్రామాలకు అందకుండాపోతే కో ఆర్డినేట్ ఏజెన్సీ పెట్టి, విజయవాడలో దీనికి ప్రత్యేకంగా ఆఫీసర్స్‌ను పెట్టి, అవనిగడ్డలో పెట్టి ఏ గ్రామాలకు వెళ్లాలో ఆ గ్రామాలకు వెళ్లి వారిని స్వయంగా డిస్ట్రిబ్యూట్ చేసుకొనే అవకాశం యిచ్చాను. వారంతా కష్టపడి వచ్చినప్పుడు ఆ అవకాశం వారికి యివ్వడం జరిగింది. మెరూన్డు విలేజెస్‌లో వారం, పదిరోజులు హెలికాప్టర్స్ నుంచి కుక్‌డ్‌ఫుడ్, ఫుడ్‌పాకెట్స్, రైస్ యివ్వడం జరిగింది. నీళ్లు యివ్వలేదు అని చెప్పారు. జర్రీ కేన్లతో క్లోరినేటెడ్ వాటర్ సప్లయి చేయడం జరిగింది. మిలిటరినుంచి హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్ నుంచి, తదితర కార్పొరేషన్స్ నుంచి, తదితర కార్పొరేషన్స్ నుంచి, ప్రాజెక్టు నుంచి టాంకర్స్‌ను కొనివెళ్లి టాంక్సుద్వారా ప్యూరిఫైడ్‌వాటర్ ఇవ్వడం జరిగింది. ఈ కెలామిటీలో సుమారు **40, 14, 354** మందికి ఇనాక్యులేషన్ ఇవ్వడం జరిగింది. ఈ ప్రాంతంలో కొంతమంది ఒక స్టేట్ మెంటు ఇచ్చారు. ఐదుమంది కలరావల్ల చచ్చిపోయా రంటూ. ఒక్క మనిషికూడా చనిపోలేదు. మన హెల్తు, మెడికల్ డిపార్టుమెంటు ఎంత బాగాపనిచేసిందో అనడానికి ఒక్కటే నిదర్శనం – ఇంత పెద్ద కెలామిటీలో ఎక్కడా ఎపిడమిక్ రాకుండా చేసారంటే ఇదొక్కటే వారి ఏఫిషియన్సీకి నిదర్శనం. అనేక వాలంటరీ ఆర్గనైజేషన్స్ కూడా సహాయానికి వచ్చాయని చెబుతున్నారు.

డెడ్ బాడీస్ డిస్పోజల్ విషయంలో యానిమల్ కార్‌కాస్ డిస్పోజల్ విషయంలో పోలీసులు, సింగరేణి కాలరీస్ వారు, ఇతర వాలంటరీ ఆర్గనైజేషన్స్ వారు, ప్రిజనర్స్ బాగా పనిచేశారు. ప్రిజనర్స్ చేసిన పనికి వారికి పారితోషికంగా వారిలో ఐదు సంవత్సరాల శిక్ష అనుభవించిన వారందరిని రేపు ఒకటవ తారీఖున క్రొత్త సంవత్సరంనాడు వదిలిపెట్టడానికి కాబినెటు నిర్ణయించింది. వారు కష్టపడి పనిచేసారు. శవాలకు డిస్పోజ్ చేయడానికి సంబంధించి ఇతర డిపార్టుమెంటులలో వారిని కూడా ప్రభుత్వం పర్మనెంటు చేస్తూకాబినెటు నిర్ణయం చేసింది. ఎలక్ట్రిసిటీ విషయమే తీసుకోండి. దాదాపు ఎలక్ట్రిక్ పోల్స్ అన్ని అప్‌రూట్ ఐపోయాయి. వంకరలు తిరిగిపోయాయి. విజయవాడ వద్ద కడుతున్న థర్మల్ స్టేషన్‌కు కోటి రూపాయలు నష్టం వచ్చింది. ఎన్నాళ్లకు ఎలక్ట్రిసిటీ రిస్టోర్ చేయగలుగుతారనే అధైర్యం కలిగింది. ఎలక్ట్రిసిటీ బోర్డుకు మొత్తం **20** కోట్లు నష్టం వచ్చింది. ఐనప్పటికి వారు వార్ ఫుటింగ్ మీద పనిచేశారు. రాష్ట్రంలో ఉండే మెటీరియల్ తెచ్చారు. పశ్చిమగోదాషరి జిల్లాలో ఏలూరులో **21** నాటికే వాటర్ సప్లయి

నీరు వెడుతున్నది. వెస్టరన్ డెల్టాకు 8,600 క్యూసెక్కుల నీరు వెడుతున్నది. ఈ రెండు నెలలలోను ఎప్పుడైనా ప్రమాదం వస్తే ఈస్టరన్ డెల్టాను కాపాడడానికి రాష్ట్రములో వున్న పంపుసెట్లను, ఇతర రాష్ట్రాల నుంచి పంపులను తెప్పించి ఇన్‌స్టాల్ చేసి రెడీగా పెట్టాము. ఎక్కడైతే హైలెవెల్ కెనాలు వున్నదో అక్కడ పంప్ చేయాలి. పంపింగ్ చాలా ఖరీదుతో కూడిన పని. రు.60 లక్షలు అవుతుంది. అయినాసరే ఫరవాలేదు. చేయాలన్నాను. రు.75 కోట్ల విలువ గల పంటపోతుంది. ఎలక్ట్రిసిటీ సప్లయికి రు.70లక్షలు అవుతుంది. అయినా ఫరవాలేదు. చేయాలన్నాను. పంటలు కాపాడడానికే ప్రయత్నము చేస్తున్నాము. కేంద్ర ప్రభుత్వము సహాయము చేసినా చేయకపోయినా ఈ ప్రాజక్టుని కడతాము. వచ్చే సంవత్సరం. ఇతరచోట్ల కేటాయింపును కట్ చేసి అయినా సరే దీనిని పూర్తిచేయాలనే ప్రయత్నము చేస్తున్నాము. కేంద్ర ప్రభుత్వ సహాయము వస్తుంది. ప్రధానమంత్రిగారికి, జగజ్జీవన్‌రామ్‌గారికి పరిస్థితిని వివరిస్తూ పెర్సనల్‌గా డి. ఓ. లెటర్స్ వ్రాశాను. మన ఆఫీసర్లు, నేవల్ ఆఫీసర్స్, ఎయిర్ ఫోర్స్‌వారు వున్నారు. సి.పి.డబ్లుయు.సి.కి. సంబంధించిన ఇంజనీర్స్ వచ్చారు. వరల్డ్ బ్యాంకు అధికారులు వచ్చి మేము తీసుకున్న చర్యలు బాగున్నాయని ఒప్పుకున్నారు. ఈ సంవత్సరం వరదలు ఎక్కువగా వచ్చాయి. 1959 తరువాత ఇంత వరద ఎప్పుడూ రాలేదు. అయినప్పటికీ ధైర్యంగా ఎదుర్కోటానికి ప్రభుత్వం సిద్దంగా వుంది. వరల్డ్ బ్యాంకు ఎప్రైజల్ రిపోర్టు పెట్టటానికి వీలులేదు. ఈ స్పాట్‌లో అవుతుందని అయినా చెప్పలేదు. అవుతుందని ఆయన చెప్పారు. ఆ సంగతి నేనూ చెప్పాను. 137 సంవత్సరాల తర్వా త ఎప్పుడో ఒకప్పుడు బ్రీచ్ కాకుండా ఎలా వుంటుంది? ఇంజనీర్ల పొరబాటు వల్ల బ్రీచ్ కాలేదు. ఎంక్వయిరీ కమిటీ వేసి ఇంజనీర్స్‌ను డిమోరలైజ్ చేయడం మంచిది కాదు. వారి ఎటెన్షన్, కాన్‌సన్ ట్రేషన్ దెబ్బతింటుంది. అవసరమైతే వరల్డ్ బ్యాంకు సహాయం గవర్నమెంట్ ఆఫ్ ఇండియా సహాయం ఎక్కువగా తీసుకుని అయినా సరే పని చేస్తాము. నలుగురి ఎమినెంట్ కంట్రాక్టర్స్‌కు ఇవి నాలుగు డామ్స్ విజ్జేశ్వరం, ధవళేశ్వరం, మద్దూరు, ర్యాలి ఇచ్చి పని చేయిస్తాము. ఛీఫ్ ఇంజనీర్ ఆధ్వర్యంలో కమిటి వేశాను. వారికి కావలసినన్ని సదుపాయాలన్నీ కలుగచేస్తాము. క్వారి, మెటల్ ఏది కావాలన్నా అదంతా రెండు నెలల ముందే రావడానికి, వారికి అవసరమైన కావలసిన మెషినరి అంతా కంట్రాక్టర్ల మీద ఆధారపడకుండా ఇప్పుడే ప్రభుత్వం కొని వుంచుకుంది. ఛీఫ్ ఇంజనీర్, బోర్డ్ ఫస్ట్ మెంబర్ శ్రద్ధ తీసుకుంటున్నారు. వచ్చే సంవత్సరం 1977 మే 31 వరకల్లా క్రెస్ట్ లెవెల్ వరకూ కావటానికి ప్రభుత్వం కృషి చేస్తుంది. కట్టి తీరుతుందని మనవి చేస్తున్నాను. ఈ సంవత్సరం బడ్జెటులో 11 కోట్లరూపాయలు పెట్టాము. వచ్చే సంవత్సరం బడ్జెటులో ఎంత మొత్తం అవసరం అయితే అంత మొత్తం

కావాలంటే ఇతర ప్రాజెక్టుల నుండి అయినా సరే డబ్బును డైవర్ట్ చేసి ఇవ్వాలి. ఇప్పుడు డబ్బు సమస్యకాదు, ఎంత డబ్బు ఖర్చు అయినా సరే గోదావరి ఆనకట్టను రక్షించాలి. పంట పోకుండ కాపాడాలి. అది చేస్తామని మనవి చేస్తున్నాను. ఈ కష్టం అంతా అక్టోబరు వరకే, నవంబర్‌కు కాఫర్ డ్యామ్ నిర్మాణం కావలసిందే. ఆ ఉద్దేశంతోనే పనిచేస్తున్నాము. ఈ ప్రాజెక్టు క్రింద ఫస్ట్ క్రాప్ 10 లక్షల ఎకరాలు సెకండ్ క్రాప్ మూడున్నర లక్షల ఎకరాలు వుంది. ఈ పంటలు కాపాడటానికి ప్రభుత్వం సర్వ చర్యలు తీసుకుంటుంది. భగవంతుడు సహాయపడతాడనే విశ్వాసం వుంది. తెగిపోతుందని అందరకూ తెలుసు. దీనిపై ఎంక్వయిరీ కమిటీ వేయవలసిన అవసరం లేదు. ఇందులో ఆఫీసర్స్ తప్పులేదు. ఏదైనా వుంటే ప్రభుత్వ తప్పేవుండాలి. డబ్బు సరిగా ఇవ్వక, ఆర్థిక పరిస్థితి సరిగా లేక ఆలస్యం అయితే అది ప్రభుత్వ తప్పుగా తీసుకోటానికి నేను సిద్ధంగా వున్నాను. ప్రభాకరరావుగార్కి హామీ ఇస్తున్నాను. ఎలక్ట్రిసిటి డిపార్టుమెంటు ఏమీ అడ్డురాదు. ఇప్పటికే ఫిల్టర్ పాయింట్స్ చేయడానికి కలెక్టరు మూడు లక్షలు డ్రా చేశారు. పని మొదలైంది. ఎన్ని చర్యలు అవసరమైతే అన్ని చర్యలు ప్రభుత్వం తీసుకుంటుంది. ఇందులో ప్రభుత్వం వెనుకాడదు. అవసరమైతే మిమ్మల్ని తీసుకువెళ్లి చూపటానికి ఏర్పాట్లు చేస్తాను. ఇప్పుడే వెళ్లి ప్రయోజనం లేదు. వరద వున్నప్పుడు ప్రయోజనం వుండదు కనుక నేనే 24, 25 తేదీలలో వెళ్లాలని అనుకుంటున్నాను. ఈ నెలాఖరు కో. ఎసంబ్లీ అయ్యే లోపు వరద తగ్గితే మీ అందరనూ తీసుకువెళ్లి జరుగుతున్న పనిని మీ అందరూ చూసి విశ్వాసం కల్గించాలని అనుకుంటున్నాను బ్రీచ్ అయిన వెంటనే నేను వెళ్లాను, ఎమ్. ఎల్. ఏ. లు రాకముందే నేను రైలు దిగాను. సి.వి.కె. రావుగారు రాలేదు. పిలువలేదని చెప్పారు. ఎవరింట్లో పెళ్లి అని పిలవాలి. దేశానికే ప్రమాదం వచ్చినప్పుడు రావాలి. ఈస్ట్ గోదావరి వెస్ట్ గోదావరి ఎమ్. ఎల్. ఏ.లు వచ్చి పరిశీలించి ప్రభుత్వం చేస్తున్న పనులు చూసి సంతృప్తి వెల్లడించారు. గౌరవసభ్యులకు హామీ ఇస్తున్నాను. ఈ విషయంలో ప్రభుత్వం అశ్రద్ధ చేయదు. పంటలు కాపాడటానికి ఎంత డబ్బు అయినా సరే ఖర్చు పెడుతుంది. డ్యామ్ క్రెస్ట్ లెవెల్ వరకు తీసుకు వస్తాము. అని మనవి చేస్తూ సెలవు తీసుకుంటున్నాను.

★ ★ ★

# అనుబంధం : 8

## STATEMENT BY THE CHIEF MINISTER

RE . PLACING ON THE TABLE OF HOUSE THE COPIES OF THE COPIES OF THE CORRESPONDENCE BETWEEN THE PRIME MINISTER AND THE CHIEF MINISTER

*          *          *          *

Copy of D.O. Letter No 151-PMO/78, dated January 23, 1978 from Sri Morarji Desai, Prime Minister of India addressed to Sri J.Vengala Rao, Chief Minister of Andhra Pradesh.

***My Dear Vengal Rao,***

I have received a representation from Challapalli Sugars Limited about their farm land in Divi Taluka in Krishna District measurement about 3,000 acres which forms an integral part of their sugar complex but has been subjected to the ceiling law of Andhra Pradesh in accordance with the provision of the Andhra Pradesh Land Reforms (Ceiling on Agricultural Hondings) Act, 1961, as amended by the Act of 1973 If appears that in 1961, sugar farms operated by their factories were exempted but this exemption was withdrawn in 1973 even theough tea., coffee, cocoa, cardamom and rubber plantations continued to enjoy exemption. Under the Constitution (Thirty-fourth Amendment) Act the Amending Act of 1973 was included in the Ninth Schedule of the constitution so that judicial redress is barred In April 1977 the Ceiling Act appears to have been further amended with retrospective effect to provide for exemption of farmlands used for the agricultural purposes connected with an industry It further appears that the company sought redress through the courts and the Madras High Court has given an order of stay so that the factory continues to enjoy the benefit of the farm

While constitutionally and legally redress thourhg courts has been barred because of the inclusion of the amending Act in the Ninth Schedule, I feel that we must look at the equities of the case The sugarcane farms of the factory enjoyed exemption from the Ceiling Act been 1961 and 1973 It cannot be sustained that the circumstances be change in 1973 that a different approach to the question of exemption farms bacame necessary It is now another four years during which the farms have continued to remain with the factory The judicial process is also on The farm is an adjunct to the factory and even though it is not essential that the sugar factory shoudl necessarily have a farm adjacent to it, it makes for convenience and helps the factory to get an assured supply of sugarcane even though not to the extent of its full requirements In these circustances I feel that it would not be equitable to withdraw the exemption The use of the Ninth Schedule to debar the party or parties from seeking judicial redress for this purpose seems to me to be difficult to justify I also understand that the distinction between the memorialist company and the Nizam Sugar

Factory Limited, which is a Government company and has been exemted, cannot be constitutionally justified I suggest therefore that you reconsider the matter in all its aspects and see whether the request of the memorialist for exempting his farms can be conceded. Thereby not only would further litigation be avoided but the apparent discrimination which may be difficult to justify in the eyes of the law would also disappear.

With kind regards,

Yours sincerely,
Sd/- Morarji Desai

Copy of D O. Letter No. 210-Rev. G/78-1, dated 12th February 1971 from Sri J Vengala Rao, Chief Minister of Andhra Pradesh addressed to the Prime Minister.

***Dear Sri Morarji Desaiji,***

I have received your letter dated 23rd January regarding representation of Messrs Challapalli Sugars Private Limited I thank you very much for the kind suggestions conveyed through the letter

It appears Messrs. Challapalli Sugar have sought your intervention in their favour on both legal and equitable grounds. I am setting forth in a separate note attached, the legal position concerning a Ceiling Law vis a vis this company and I may assure you that legal by we are in an unassailable position and no discrimination has been sought to be made against this company for whatever reason. As you have your-self mentioned, the company took the extraordinary action of getting a stay from the High Court of Madras in the Tamil Nadu State availing themselves of the legal ground, that the registered office of the company is in the city of Madras, although the factory and the entire properties includ ing the farm now under discussion are situated in the State of Andhra Pradesh They have started the legal batle and we are confident that Government will succeed in courts of law. Realising probably that their success in the court of law is now remote, they are obviously resorting to the present tactics of appealing to you on grounds of equity

I am not quite sure whether you are aware of the background of this sugar factory and for your benefit I am enclosing a short not about the sugar factory, its origin, growth and the way it has been functioning all these years

Challapalli Zamindari is one of the biggest estates in the erstwhile State of Madras taken over under the Estates abolition legislation. The Zamindar was one of the biggest land holders in the State besides being a proprietor of a big Estate and in his individual capacity he was owner of thousands of acres of land The Estate the scene of many agrarian troubles and the 1947-48 Communist agitation against landed peasantry first started in

a very violent manner in this area It was with the view to preserve their control out vast extants of land having been aware of the committed policy of the Government in regard to ceiling on land holdings and land legislation that this farm was conceived and this factory was established. It would be highly retrograde step if any concession is shown to this farm. Such action will lead to severe criticism not only at State level but also at National level

With best regards.

Yours Sincerely.
Sd/-
J.Vengal Rao